శ్రీరస్తు.



ఇహ లోకంబునంగల ధర్మార్థకామరూపంబు లగు
సకలైహికప్రయోజనంబులకును హేతుభూతంబ
గునది-రాజనీతియగుంగానట్టి రాజనీతియందలి
ముఖ్యసారభూతంబును నాద్యులును రాజశాస్త్ర
సర్వస్వవేత్తలునునగుభీష్మాదులచే శాంతి పర్వా
దులం గొనియాడం బడినదియును నగు-

# కామందకంబను రాజశాస్త్ర సంగ్రహము-

సకలైహికలౌకిక ప్రయోజనకరంబగుట దీనంగల లేఖక
ప్రమాదజనిత దోషంబుల దొలంగించి పండిత పామర
సాధారణ బోధకొరకుశ్రీమహైశ్వర్యవిణీపుర ప్రతినిధి
తిరువళ్లిక్కేణిపుర నివాసియగు.
మ-రా-శ్రీ-తడకమళ్ల వెంకటకృష్ణరావుగారి చే
నాంధ్రభాషటీక రచియింపంబడి

........................................

వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాల యందు
పువ్వాడ వెంకటరావుగారి వలన
అచ్చువేయించి ప్రచురపరుపం
బడియె.



రౌద్రిసంవత్సరకార్తీక-బ-౧౩-సోమవారము.

౧౮౬౦ సం॥ డిసెంబరు ౧౦ తేది.



కామందకసవ్యాఖ్యానప్రారంభః.



విధయేవిశ్వరపిసదామృత్యో రపిమృత్యవేపినాక
ధృతే। ఉశనాబృహస్పతిభ్యాంనమోస్తు దైత్యా
మరగురుభ్యాం॥.. ..............................౧

శ్రీయఃపతిచేనీవిచిత్రప్రపంచనిర్మాణచాతురీధురీణుండగు నాదిదేవుండగు బ్రహ్మదేవునిసరస్వతీభర్తయగు వాగీశుండనునగుట గ్రంథారంభమునందువిచిత్రపదచాతుర్యాదిస్ఫురణా రూపకనిర్విఘ్నపరిసమాప్తికొరకును,మృత్యువునకుమృత్యువగునీశ్వరునివిఘ్నహరణ పూర్వకసాధన సామగ్రీస్ఫురణముకొరకును, వక్ష్యమాణనీతిశాస్త్రాచార్యులగు దేవతాదైత్యగురులగుబృహస్పతిశుక్రులకునునమస్కారము జేసి గ్రంథారంభము జేయుట...... ......౧

ఎస్య ప్రసాదాద్భువనం శాశ్వతేపథితిష్ఠతి। దేవ
స్సజయతిశ్రీమాన్దండధారోమహీపతిః॥......౨

శ్రీయఃపతిచేసృష్టంబగునీచరాచరాత్మకంబగు లోకంబునందుమనుష్యసామాన్యంబునకు - లోకయాత్రయనగాలౌకికవ్యవహారరూపంబగు జీవనోపాయముప్రధానమగుటంజేసియు, నట్టిలౌకిక వ్యవహారంబునకు దండధరుండగు రాజునీతిశాస్త్రానుసారంబున ప్రజాపాలనము జేయుట వలననేవర్ణాశ్రమాదిన్యాయంబులతిక్రమించకుండు గావున నట్టిరాజుసర్వోత్కర్షంబుగాశాశ్వతస్థితిచే ప్రకాశించు గావుతయనికవిశ్రేష్ఠుండునునీతిశాస్త్రాభిజ్ఞాగ్రేసరుండునునగు కామందకిస్వప్రారంభితనీతిశాస్త్రనిర్విఘ్నపరిసమాప్తికొరకు మంగళము జేయుచున్నారు...... ......

మరియుమహీపతిస్వరూపము। అత్ర ప్రతిపాదితశ్లోకాః॥

అగ్నివాయుయమార్కాణామింద్రస్యవరుణస్యచ।
చంద్రవిశ్వేశయోశ్చైవమాత్రానిర్హృత్య శాశ్వతీః । యస్మాదేషాసురేంద్రాణాంబ్రహ్మణా రచితాకృతిః। బాలోఽపినావమంతవ్యోమనుష్య ఇతిపార్థివః। మహతీదేవతాహ్యేషా నరరూపేణ తిష్ఠతి॥...................... .............. ............

అగ్న్యంశచే తైక్ష్ణ్యంబును, వాయ్వంశచేబలంబును, యమాంశచేదండంబును, సూర్యాంశచే తేజంబును, ఇంద్రాంశచేభోగంబును, వరుణాంశచేసరసతయు, చంద్రాంశచేచల్లదనంబును, నీశ్వరాంశచేప్రభుత్వంబును, నగుముఖ్యాంశంబులగ్రహించిబ్రహ్మచే రాజు నిర్మించబడినవాడగుటంజేసి రాజు చిన్నవాడేనియు నవమర్యాదచేయదగడనియు, మనుష్యరూపంబగు ప్రబలదేవుండగుటవిశేషప్రూజార్హుండనియు, అట్టి రాజవమతుండగునేని దైవతులచేదండింపబడునని యు-నట్టిరాజుచేనగుదండనీతియథాక్రమంబున నుండనియడనీటియందుండుమత్స్యంబులవలెబలవంతులచేదుర్బలులాక్రమించబడుదురనియు, పూర్వఋషులచే వైవస్వతమనువు రాజుగా నేర్పరింపబడియతని రాజకార్యములునిర్వహించుకొఱకు ప్రజలచే నార్జితంబులగు ధాన్యంబులయం దాఱవపాలును- పుణ్యంబులయందుపదియవపాలును- సమస్తవస్తువిశేషంబులననుభవించెడునట్టి ప్రభావవిశేషంబును గల్పించుటచే ధర్మంబున ప్రజాపాలనము జేయుటవలననరణ్యంబునందుండు ఋషులును స్వకీయ పుణ్యంబునం దాఱవపాలొసంగుచుండిరిగావున నఖిలభూతంబులకధికుండగు భూపతియనమస్కారార్హుండనుట- అట్టిరాజు ఇంద్రియపరవశుండయ్యేనేని దండనీతియథారీతిన్నెరవేరకుండుటజేసి ఇంద్రియనిగ్రహరూపంబగు నభ్యంతరజయంబును శాస్త్రంబుచేనగు బాహ్యశత్రుజయంబునుంగావించిసర్వోత్కర్షంబున వెలుంగు గావుతయనియాశీర్వచనము- మరియునిచ్చట ఆశీర్వచన నమస్కా

రంబులును వక్ష్యమాణంబగువిషయము రాజనీతియగుటం జేసిమం
గళమునందువస్తునిర్దేశము. సూచింపబడియెననియు విచారించ
వలెను.............................................

ఇట్లు దేవతామంగళానంతరంబున నీశాస్త్రప్రవర్తకుం
డగు నాచార్యప్రస్తుతి,

వంశే విశాలం వంశ్యానామృషీణా మివభూయ
సాం। అప్రతిగ్రాహకాణాంయోబభూవ భువి విశ్రు
తః। జాతవేదా ఇవార్చిష్మా న్వేదా న్వేదవిదాం
వరః। యో౽ధీతవాన్ సుచతురశ్చతురో౽ప్యేక వే
దవత్। యస్యాభిచారవజ్రేణ వజ్రజ్వలన తేజ
సః। పపాత మూలతశ్శ్రీమాన్ సుపర్వా నందప
ర్వతః। ఏకాకీమంత్రశక్త్యాయః శక్త్యా శక్తిధరోప
మః। ఆజహార నృచంద్రాయ చంద్రగుప్తాయ మేది
నీం।నీతిశాస్త్రామృతంశ్రీమానర్థశాస్త్రమహో
దధేః। య ఉద్దధ్రే నమస్తస్మై విష్ణుగుప్తాయ వేధసే..

ఇచ్చటనీగ్రంథకరణప్రతిపాద్యుండగు విష్ణుగుప్తుండనునర్థ శాస్త్ర వేద వేదాంగ వేదియగు బ్రాహ్మణశ్రేష్ఠుండు నందుడను రాజు చేన గ్రాసనమునుండి తనను లేపుటచే నవమతుండగుచు నా సభయందు నందుని నాశము జేయుదునని ప్రతిజ్ఞయొనర్చి చంద్రగుప్తుం డను రాజు నాశ్రయించి యతనికి నందరాజ్యం బిచ్చెదనను ప్రతిజ్ఞ చేసి తనయభిచార హోమంబను వజ్రాయుధముచేన తని మృతుండుగా నొనర్చెనని ఇతిహాసము - మఱియు నితనికి చాణక్యుం డనియు కౌటిల్యుండనియు నామాంతరంబులుగలవనియు విష్ణుగుప్తుండనుట ప్రతిష్ఠావాచకంబనియు విచారించవలెను..........

రాజశ్రేష్ఠుండగుచంద్రగుప్తుండనుమహారాజెవ్వనినీతిశాస్త్ర బలమువలన శత్రుండగునంద భూపాలునినిర్మూలించి రాజ్యము చేకొనియెనో ఎవ్వనివజ్రజ్వాలనమున బడ బొగ్గి గాపునట్టిశ

ప్రకృతయత్నముచే నాశము వొందనియభిచారాగ్ని ప్రభావ
ముచేసంతోషముచే నిభృతుండగునందుండను రాజునశించుటచే
నైశ్వర్యముచంద్రగుప్తునియనుసరించెనో అట్టిసమస్తవేదవేదాం
గార్థశాస్త్రపరిజ్ఞాననిపుణుండును లోకప్రసిద్ధంబులగు- న్యాయ
శాస్త్రము - కౌటిల్యమనగానర్థశాస్త్రము వాత్స్యాయనసూ
త్రము- గౌతమీయసూత్రము వ్యాససూత్రములను- నాల్గుభాష్య
ములయందుప్రసిద్ధంబగు- ధర్మ - అర్థ- కామ- మోక్షంబులగు
చతుర్విధపురుషార్థవిషయంబులయందును ప్రసిద్ధుండును- మఱి
యు- బ్రహ్మసృష్టంబగుప్రపంచవ్యవహారార్థముబ్రహ్మచేనిర్మితం
బగులక్షాధ్యాయరూపంబగునీతిశాస్త్రమహోదధియందుస్వా
యంభువమనుబృహస్పతి- శుక్రుడు మొదలుగాగలవారిచే యథో
చితముగసంగ్రహింపబడినదనునతివిస్తారంబగు దాని సంగ్రహము జేసి
నీతిశాస్త్రామృతమును ప్రకటింపజేసిన విష్ణుగుప్తులకొరకు నమ
స్కారమనుట..........................................

ఇట్లునమస్కారమొనర్చి మహాకావ్యరూపంబగునీతిశాస్త్ర
ప్రయోజనము దెలుపుటకుపక్రమించునెడ తొలుత నాచార్య సం
బంధప్రకటనము.

దర్శనాత్తస్యసుదృశో విద్యానాంపారదృశ్వనః ।
రాజవిద్యాప్రియతయాసంక్షిప్తంగ్రంథమర్థవత్ ॥

అట్టినీతిశాస్త్రసర్వస్వవేత్తయగువిష్ణుగుప్తునిప్రత్యక్షదర్శ
నమసంభావితంబయినసుజ్ఞానదృష్టి సాక్షాత్కారాను గ్రహం
బువలనబ్రహ్మాదులచే విస్తృతంబగునీతిశాస్త్రంబును సంకోచింప
బడినయనుక్రమణికా.........................................

బ్రహ్మాధ్యాయసహస్రాణాం శతంచక్రేస్వబు
ద్ధిజం । తన్నారదేనశక్రేణ గురుణా భార్గవేణ
చ । భారద్వాజవిశాలాక్ష భీష్మపారాశరైస్తథా।
సంక్షిప్తం మనునా చైవతథాచాన్యైర్మహర్షిభిః ।

ప్రజానామాయుషో హ్రాసం విజ్ఞాయశమహా
త్మనా। సంక్షిప్తంవిష్ణుగుప్తేన నృపాణామర్థసి
ద్ధయే ॥..........................................౬

అనుక్రమంబున బ్రహ్మాదులచే నిర్మితంబగుచు కాలానుసా
రముగా ప్రజలయొక్క-ఆయుర్బలముల ననుసరించిసంకుచిత మొ
నర్చుచువచ్చిన విష్ణుగుప్తప్రణీతార్థశాస్త్రము కామందకియను
నామముగల నాచేతసంగ్రహించబడుననియు - ఆన్వీక్షికియు -
త్రయీవిద్యయు - వార్త్తా విషయమునుదండనీతియునగు రాజ
శాస్త్రంబుల నామూలముగా దెలియుటవలన రాజవిద్యయందు
లి ప్రీత్యతిశయముచే రాజవిద్యయగుదండనీత్యాదులయందును
వ్యూహాద్యులగు యుద్ధశాస్త్రములయందును సులభోపాయము
ను గల్పించుటవలన లోకోపకారంబగుట నీగ్రంథము ప్రక్రమించ
బడియెననుట ॥..........................................౭

ఉపార్జనేరక్షణేచ భూమేర్భూమీశ్వరంప్రతి।
యత్కించిదుపదేక్ష్యామో రాజవిద్యావిదాం
మతం ॥..........................................౮

ఉపార్జనంబనగా.సంపాదించుట.యది దేవతానుగ్రహపూ
ర్వకంబగుయుద్ధములచేసంపాదించుట.పూర్వముతనచేసంపాదిం
చియుండుట-పిత్ర్యముగా సంభవించియుండుట-నను భేదములుచే
మూడుదెరంగులు-రక్షణము-స్వీయజనులచేనన్యాయప్రవర్త్తనము
లేకరక్షించుట- శత్రువులచేనాక్రాంతముగాకుండునట్లురక్షించు
టయని రెండు తెరంగులు- అందు రాజశాస్త్రప్రవర్తకుల తాత్పర్య
మునకన్న విష్ణుగుప్తగ్రథితంబగుకౌంటిల్యమతము- కించిద్భిన్నము-
అందు ఉపధాశుద్ధిప్రకరణభాష్య విషయంబున - అనాగామరిశు
ద్ధతావిషయమునుట - అదిమూడువిధంబులు - పట్లన - సభికుల
తాత్పర్యమునందు ప్రకృతకాలీనరడగు రాజుఅధార్మికుండుగా
వుననితనినిగ్రహించి యన్యునినేర్పరుపవలయునన్న విషయము -

ఇంచు - పృథుచక్రవర్తితండ్రియగు వేనమహారాజునాస్తికుండగు టవలన నతనినిగ్రహించి పృథుచక్రవర్తిబుట్టించిరని భాగవతాదు లయందు దృష్టాంతంబగుట- నిదిధర్మోపథయనుట - ప్రాడ్వివాక మొదలగు అధికారస్థులమండలము ద్రవ్యాపేక్షచేనధర్మప్రవర్తకులగు నెడలను మరియు ద్రవ్యాపేక్షచే రాజభృత్యాదులన్యాయము జేయుటయునను నెడలనిగ్రహించుట అర్థోపధయనుట- రాజభార్యాదుల న్యపురుషులకామించుటయు- రాజదారలనన్యులు కామించుట మొదలగు విషయంబులయందున్నిగ్రహించుటయునుట- కామోపధయని పారిశుద్ధ్యపరీక్షలు మూడు తెరంగులు అందు కౌటిల్యమతము విషయంబుల నామూలాగ్రము పరీక్షించ కహితాతుగా నిగ్రహించుటయుచితము గాదనుటగావున విష్ణుగుప్త శిష్యులగు వారు ప్రజారంజనమతమును నయ్యవస్థానంబును దానిక్రమంబు నుపదేశింతురనుట ||...... ......... ....... ..౮

రాజాస్యజగతో హేతు ర్వృద్ధేర్వృద్ధాభిసంమ
తః। నయనానందజననః శశాంక ఇవతోయధేః॥౯

విద్యాభిజనవయోజ్ఞానవృద్ధులగు పండితుల కభిమతుండగు రాజుసముద్రమునకు చంద్రోదయము తెరంగున లోకజనంబులకు నేత్రానందకరుండగుననుట ||........................ .... ....౯

యదినస్యాన్నరపతిస్సమ్యఙ్నేతాతతఃప్రజాః। అ
కర్ణధారాబలవద్విప్లవేతే హనౌరివ ||......౧౦

శాస్త్రోపదేశవిధానంబున దండనీతియనుష్ఠింప నిరాజువలనకర్ణధారుడు లేని యోడవలె జనంబులు హింసనొందుదు రనుటవలన శాస్త్రదృష్టంబగు న్యాయంబున ప్రజాపాలనమొనర్పిన రాజు ఇహపరములయందు కీర్తిస్వర్గముల ననుభవించునని యర్థము ..........................................................౧౦

ధార్మికం పాలనపరం సమ్యక్పరపురంజయం।

రాజానమభినన్యంతే ప్రజాపతిమివ ప్రజాః ॥......
రాజ్ఞో హి వ్రతముత్థానం యజ్ఞకార్యానుశాసనం।
ప్రజాసుఖే సుఖం రాజ్ఞః ప్రజానాంచ హితం హి
తం। నాత్మ ప్రియం హితం రాజ్ఞః ప్రజానాంచ ప్రి
యం హితం ॥............................ ౧౧

రాజశాస్త్రోక్తంబగు ధర్మస్వరూపంబెట్టిదనిన- అహింసయ
నగా నక్రమహింస జేయకుండుట - సత్యము బలుకుట - అసహ్యాప
డకుండుట- యనగా ఓర్పుగలిగియుండుట - పాపములు జేయకుం
డుట - ఆచారము దేవతాతిథిపూజయొనర్చుట - భృత్యులకొసం
గుట - భోజనంబనగా భోగించుట మొదలగు ననుష్ఠానంబులచే
నుండుట..........................................

అనుక్రమంబున రాజ్యంబునందలి జనంబులసుఖమాత్మ సు
ఖంబనియు వారికిహితంబగు కార్యంబాత్మహితంబనియునందు
లవ్యతిరిక్తమగు నాత్మహితము హితముగాదనియు భావించునట్టి
నీతిశాస్త్రానుష్ఠానక్రమముచే శత్రుజయ మొనర్చునట్టి రాజుల
ను ప్రజలనువర్తించుననుట .................................. ౧౧

ఆయత్తం రక్షణం రాజ్ఞో ర్వార్తారక్షణమాశ్రితా।
వార్తాభేదేన లోకోయంశ్వసన్నపి న జీవతి॥.. ౧౨
శత్రుబాధలు మొదలగు వాటిచే నష్టము నొందకుండునట్లు ప్ర
జలరక్షించుట రాజుననుసరించియుండుననియు - అట్టి - వార్తప
యిరు జేయుటయు - వర్తకము జేయుటయు - పశువులరక్షించుట
యు- నను త్రివిధభేదంబులగుటం జేసి యీ వార్తకు రాజరక్షణలే
నియెడ చోరాదులచేనేనియు బలవంతులచేనేనియు నాక్రమిం
చంబడుననియు నట్టి వార్తానాశనముచే లోకము బ్రతికియుండి
యువృత్తిశూన్యంబగుట మృతప్రాయమగుననుట...... ......౧౨

పర్జన్య ఇవ భూతానామాధారః పృథివీపతిః। వికల

తేచాపిపర్జన్యే జీవ్యా తేనతుభూపతౌ॥........౧౩

గావున దండధారుండగు రాజు వర్షదేవతవలె భూమిజనుల కాధారంబుగా నుండు వాఁడగుటం జేసి ప్రజారక్షణము ముఖ్య కర్తవ్యంబగుననియు నట్టిదండధారుండగు రాజక్రమప్రవర్తుండ గునపుడెట్టి సంకటము ప్రజలకగునో అట్టిసంకటము నావృష్టియ గునపుడును సంభవించదనియు దెలియఁదగును........౧౩

ప్రజాం సంరక్షతి నృపః సావర్ధయతి పార్థివం।
వర్ధనాద్రక్షణంచ్ఛ్రేయస్తస్మాచ్ఛ్రేయస్తదప్యసత్ ౧౪

శత్రుచోరకంటకాదుల భయంబులవలన సంకటము జెంద కుండ రాజు ప్రజలరక్షించుననియు నట్లు రక్షించబడు ప్రజలు ధాన్యస్వర్ణ వ్యాపారాదులవలన రాజును వృద్ధిపొందింపజేయు ననియు నందు వృద్ధిపొందజేయుటకంటె రక్షించుట యధికంబగు నెట్లన రక్షణము లేనియెడ పూర్వద్రవ్యాదులకును బాధయగుం గావున నట్టి రక్షణపరుండగు రాజునకును రాజ్యమునకుగల పరస్పరసంబంధము సంభవించనియెడ నిహపరసౌఖ్యాభావంబువలన నరిష్టంబనియు తెలియదగు........౧౪

న్యాయప్రవృత్తో నృపతి రాత్మానమథ చ ప్రజాః। త్రి
వర్గేణోపసంధత్తే నిహంతి ధ్రువమన్యథా॥....౧౫

న్యాయప్రవృత్తి యనగా నీతిశాస్త్రానుసరణంబగు దండనీతి ప్రజలకు ధర్మార్థకామములచే సంతుష్టి జేయుననియు నట్లు గానియెడ కామక్రోధదూషితుండగు రాజు చే నజ్ఞానంబువలన వానప్రస్థసన్యాసులు మొదలగు నటవీసంచారిజనంబులకును కోపము గలుగజేయు గావున న్యాయప్రవర్తకుండుగా నుండవలయు ననుట........౧౫

ధర్మాద్వైజవనో రాజా చిరాయబుభుజే మహీం।
అధర్మాచ్చైవ నహుషః ప్రతిపేదే రసాతలం॥ ౧౬

పూర్వంబున శాసవవంశోద్భవుండగు ఇంద్రసేనుండను రా

జారాతిసఖయంబువలన తాననుతనదేశప్రజలును రజస్వలాసంగమదోషమువలననగునధర్మాభివృద్ధిచేనశించుచురాగాన్వావంశమునందు వైజవనుండను రాజుదయించి యారాక్షసునినిగ్రహించిధర్మస్థాపనమువలన చిరకాలప్రభుత్వమొనర్చెననియు - ఇంద్రస్థానము జెందిన నహుషుండునున ధర్మంబగునింద్రభార్యాసంగమాపేక్షవలననగస్త్యునిచేశప్తుండగుచు కొండచిలువయయ్యెననియు - ప్రసిద్ధము................................ ౧౬

శ్లో॥ తస్మాద్ధర్మంపురస్కృత్యయతేతార్థాయభూపతిః।
ధర్మేణవర్ధతేరాజ్యంతస్యస్వాదుఫలంశ్రియః॥౧౭

మన్వాదిప్రణీత ధర్మక్రమంబున వృద్ధియగు రాజ్యమునకు ఇహపరంబులను భేదంబులుగల ఫలము రెండుదెరంగులగు - నందు ఇహంబన - కాలవిభాగాది యుక్తభోగత్యాగంబులు - పరంబన - నశ్వమేధాదికంబులగు పుణ్యకర్మంబులు - నీరెండునుపరిశుద్ధంబులగుట ఐశ్వర్యమునకు - స్వాదుఫలంబులనుట...................

ఇందువలన నధర్మప్రవృత్తిచేనగుసంకటబును ధర్మప్రవృత్తిచేనగురాజ్యవర్ధనప్రజాసుఖమోక్షరూపంబులను రాజ్యప్రయోజనంబును దెలుపంబడి యెనని విచారించవలెను......౧౭

రాజ్యస్వరూపోపన్యాసము॥ శ్లో॥ స్వామ్యమాత్యశ్చ
రాష్ట్రంచదుర్గం కోశంబలంసుహృత్। ఏతావ
దుచ్యతే రాజ్యంసత్త్వబుద్ధివ్యపాశ్రయం॥...౧౮

స్వామి - అనగామంత్రి మొదలగుసర్వాంగంబులకు నధిపతియు ప్రాణభూతుండునునగుటవలన ప్రధానాంగమగురాజు - ౧ - అమాత్యుండనగా - సకలకార్యంబులయందునురాజుతోడనాచరించుచుబుద్ధిసహాయముచేయుమంత్ర్యాదులు - ౨ - రాష్ట్రంబనగా రాజ్యము - దీనివలనసమస్తసప్తాంగంబులనిర్వహణము గాదగినది - ౩ దుర్గంబనగా - దుఃఖముచేతనుశత్రువులచేతనుచేనాక్రమించబడునది - అనగా కోటలు మొదలగునది - ౪ - కోశః - అనగాబొక్కసము - ౫ - బలంబనగా - గజతురగరథపదాతిరూపంబగుచతురంగము - ౬ -

సుహృత్తనగా రాజునకు స్నేహితులగు సామంతరాజులు. ఇవి సప్తాంగము రాజ్యంబనంబడు. నట్టిరాజ్యము. సత్వముచేననగా వక్ష్యమాణంబగు సప్తాంగవ్యసనంబులయందు తగులుబడక బుద్ధి బలముచే తనిర్వహించందగినది గావున ప్రజ్ఞాబలాశ్రయం బనుట ......................................................... ౧౮

శ్లో॥ ఆలంబ్య బలవత్సత్వం బుధ్యాలోకితనిర్గమః। సప్తాం
గస్యాస్యలాభాయయతేత సతతోద్ధితః ...౧౯

సత్వంబనదుర్బలత లేనిదియు, వ్యసనమునందును సుఖమునందును తత్తద్వికారములు జెందని బుద్ధివిశేషము. నిర్గమంబనబుద్ధిచే సంకటంబులనుంచి నివర్తిజేయుట. ఇందుసుభాషితవచనము.

శ్లో॥ ప్రారభ్యతేనఖలు విఘ్నభయేననీచైః ప్రారభ్య
విఘ్నవిహతావిరమంతిమధ్యాః। విఘ్నైః పునఃపు
నరపిప్రతిహన్యమానాః ప్రారబ్ధముత్తమజనానపరి
త్యజంతి॥.........................................

అనున్యాయంబున రాజుచే నాలోచిత స్థిరీకృతంబగు కృత్యమునారంభించినపిదప నిర్వహించునట్టి స్థైర్యమువివక్షింపబడియె గావుననట్టిసత్వముబలవత్సత్వమనుట. అట్టియష్టాంగయుక్తంబగు బుద్ధిచే పూర్వోక్తంబులగు సప్తాంగయుక్తంబగు రాజ్యలాభముకొరకు నిత్యప్రయత్నము జేయదగు. అట్టియత్నము జేయుటయందుసప్తాంగమునందును ప్రధానాంగము తానయగుటంజేసి తొలుతస్వలాభార్థము ప్రయత్నము జేయవలయు-ననగానింద్రియ నిగ్రహిగావలయునని తాత్పర్యము. అట్లురాజుయత్నించునెడన మాత్యాదులును రాజాజ్ఞవినా-దుష్కార్యారంభమునకుయత్నించజాలగనియు,అన్నికార్యంబులుస్వాధీనంబగుననియు, విచారింపవలెను ......................................................... ౧౯

శ్లో॥ న్యాయేనార్జనమర్థస్యవర్ధనంరక్షణంతథా।

సత్పాత్రప్రతిపత్తిశ్చ రాజవృత్తంచతుర్విధం॥ ౨౦

శాస్త్రప్రకరణము నతిక్రమించక ద్రవ్యము నార్జించుటయును గానభిలషిత ద్రవ్యము నార్జించుటయు, అట్టి ద్రవ్యమును గాని భూష్యములను గాని వృద్ధి జేయుటయు, అట్టిదాని శత్రుచోరాదులచే నపహృతంబు గానియట్లు రక్షించుటయు, అట్టి సత్త్రమాగత ప్రవృద్ధ ద్రవ్యమును త్రివిధంబులగు సత్పాత్రంబులయందనగా- సత్త్వము నుత్తమమునునగు ధర్మాత్ములును కర్మఠులునునగు బ్రాహ్మణులకును, తపస్వులకును, దేశకాలపాత్రము లెరింగి దానమొసంగుటయునను దిధర్మపాత్రమనియు, మంత్రిపురోహిత వార్తాధికారులు మొదలగు వారికి వేతనాదులొసంగుటవలన రాజ్యకోశవాహనాదివృద్ధియగుటం జేసియర్థపాత్రమనియు, కులరూపయవ్వనాదులచే పరిపూర్ణులగునంతఃపురకాంతారత్నవిషయికంబగు వ్యయము కామపాత్రమనియు, విభాగించబడియుండు పాత్రత్రయంబులయందాయాయి విషయంబుల నతిక్రమించకుండ నటుల లోభము లేక వ్యయించుటయును రాజవృత్తము- నాల్గుదెరంగులనొట........౨౦.

ఇట్లు చతుర్విధ రాజవృత్తంబులయందాద్యంబగున
ర్థార్జనానుష్ఠానక్రమం బెట్లనిన.

శ్లో॥ నయవిక్రమసంపన్నస్స్యాద్ధానశ్చింతయేద్ధియం।
నయస్యవినయోమూలం వినయశ్శాస్త్రనిశ్చ
యః॥.. ..............................౨౧

నీతిశాస్త్రజ్ఞానముగలవాడయ్యును పరాక్రమహీనుడయ్యెనేని శత్రువులపమతి జేయుటవలనను పరాక్రమశాలి యయ్యు నీతిజ్ఞుండు గాని యెడ పనుంగును బోయివాడు స్వాధీనము జేసికొనునట్లు నీతిజ్ఞునిచేతిరస్కృతుండగుంగావున నీయుభయమును గలుగవలయుననియు. అట్టినయవిక్రమసంపన్నుండగు రాజు పురుష ద్రవ్యసంపన్నుండగుచు నాపత్ప్రతికారదక్షుండై అనుకూలంబగు దేశకాలంబు లెరింగి దండయాత్రారంభము జేయవల

యుననియు, అట్లు చేయుయాత్రారంభాదులచే నైశ్వర్య ఫలాలంబులగు సప్తాంగరాజ్యము లభించుయత్నము జేయవలెననియు, అర్థార్జన విధానము - అట్టిక్రియకు ప్రథమంబగు నీతిశాస్త్రాభ్యాసమునకు స్వాభావికంబగు నింద్రియజయము ముఖ్య కారణంబగుట నట్టియింద్రియజయము లేనివాని చేవిషయాకృష్టచిత్తుండగుటవలన శాస్త్రచింతనమసాధ్యమనియు, అట్టి వినయముచే శాస్త్రనిశ్చయమగుటవలన నాశాస్త్రానుష్ఠాతయందు భగవత్కటాక్షముగలుగును గావున- అందు చేపూర్వోక్త ప్రయోజనము సిద్ధించు ||........................................................... ౨౧

శ్లో|| వినయోహీంద్రియజయ స్తద్యుక్తశ్శాస్త్రమృఛతి।
తస్మిన్ స్థరిహి శాస్త్రార్థాః ప్రసీదంతితత్ శ్రి
యః || ౨౨ వినయలక్షణము.

శ్లో|| జితేంద్రియత్వంవినయస్య లక్షణంగుణ ప్రకర్షో
వినయాదవాప్యతే। గుణాధికేపుంసిజనోనురజ్య
తెజనానురాగప్రభవాహిసంపదః || ........................

ఇంద్రియంబులుస్వకీయార్థంబుల లగ్నంబులు గాకుండునట్లు నిగ్రహించుటవినయమనియు, నట్టిపురుషుండు శాస్త్రముల జదువనేర్పుగలవాడగుననియు, నట్టియనవరతశాస్త్రాభ్యాసము జేయువానికి శాస్త్రార్థంబులు సమర్థకంబులుగ దెలియుననియు, నాదువలన నైశ్వర్యం బధికంబగుననియు విచారించవలెను||........................................................................౨౨

ఇందుముఖ్యంబగునింద్రియజయంబాత్మసంపదయగుటంజేసి తత్స్వరూపప్రకటనము.

శ్లో || శాస్త్రంప్రజ్ఞాధృతిర్దాక్ష్యం ప్రాగల్భ్యంధారయిష్ణుతా। ఉత్సాహోవాగ్మితాదార్ఢ్యం
ఆపత్క్లేశసహిష్ణుతా। ప్రభావశ్శుచితామైత్రీ
త్యాగస్సత్యంకృతజ్ఞతాకులంశీలం దమశ్చేతిగు
ణాస్సంపత్తిహేతవః||................... ......౨౩

నీతిప్రతిపాదకంబగుశాస్త్రజ్ఞానంబును-శ్లో॥శుశ్రూషాశ్రవణం చైవగ్రహణంధారణంతథా - ఊహాపోహార్థవిజ్ఞానంతత్త్వజ్ఞానం చధీగుణాః॥ అనియెనుమిదియష్టాంగంబగుబుద్ధిప్రజ్ఞయును-దుఃఖసమయమునందువిషణ్ణతనొందకుండుధైర్యంబును-సామర్థ్యంబన-నిర్భయరూపంబగుసామర్థ్యంబును-జయసంపత్తియు-ఇంద్రియజయమనిభావము- రాజున్నియమింద్రియజయసంపన్నుండగునేడ ప్రకృతులును- పుత్రులును జితేంద్రియులగుదురు గావుననింద్రియజయసంపత్తియవశ్యంబనుట-తనచేదెలియబడువిషయంబులచిరకాలముజ్ఞాపకమునందుంచుకొనుట॥ శ్లో॥ దాక్ష్యంశైఘ్ర్యంతథామర్షః శౌర్యంచోత్సాహలక్షణం॥ పరాక్రమంబును - అమర్షంబును- సమర్థతతోనుగూడియుంటయుత్సాహమనుట - సంకుదాక్ష్యంబననదివిశేషనాయకగుణంబనియు శీఘ్రకారితయునను ట- వాగ్మిత్వంబును- దృఢగాత్రతయు - ఆలుత్కాలంబునశ్రమలనోర్చుటయు- యట్టి పుణ్యాతిశయచేష్టాయుక్తంబగుదండధారిత్వముచే పగులచేననవమానితుండగునదియ ప్రభావంబనుట - అట్టి ప్రభావంబును పరస్త్రీపరద్రవ్య పరహింసలయందాసక్తుడుగాకుండుట శుచితయనునది- సర్వభూతంబులయందు మైత్రియు- సత్పాత్రంబులయందర్థముప్రయుంచుట- త్యాగము- అబద్ధాలాపములు జేయకుండుటసత్యము - ఒకలచే జేయబడిన యుపకారమునకు ప్రత్యుపకారము జేయవలయునను తలంపుతోగూడినది కృతజ్ఞత- మాతాపుహపితా మహావంశశుద్ధియు - శుకంబగుతాత్పర్యంబును - ఇంద్రియనిగ్రహములు మొదలగు గుణంబు లైశ్వర్యకారణంబులగునని విచారించవలయును............౧౩

ఇట్టిగుణంబులచేసాధ్యుండగు రాజాత్మవంతుడనంబరగు నతండు రాజ్యమునకంగభూతుండగు నయిననుస్వభావవినయసంపత్తిమాత్రముచే శాస్త్రనిశ్చయము సంభావితంబగుటవలన రాజ్యమును బొందిన రాజుచేవినయానుష్ఠానమవశ్యకరణీయము మనుష్యులకింద్రియసుఖంబులు విచిత్రంబులునుమనోహరంబులున

గుటం జేసియు చిత్తమునకుచాంచల్యముస్వాభావికగుణంబగుటం జేసియు రాజగువాడుసార్వకాలంబును వినయంబున నింద్రియ జయంబునం దతిజాగరూకుండు గావలయుననుట.........

శ్లో॥ ఆత్మానంప్రథమంరాజావినయేనోపపాదయేత్ ।
తతోమాత్యాం స్తతోభృత్యాం స్తతఃపుత్రాం స్త
తః ప్రజాః॥........................ ...౨౪

తొలుత రాజగువాడు స్వకీయేంద్రియజయశాలి గావలయు నందువలన ప్రకృతులును జితేంద్రియులగుదురనుట-పిదపమంత్రులుభృత్యులు - పుత్రులు - మొదలగు వారి నాత్మతుల్యులగునట్లు శిక్షింపుచు వారలచే ప్రజలనునట్టి గుణయుక్తులగునట్లు జేయుచుండవలయుననుట ...............................౨౪

వినయమునకు ప్రయోజనం బేమనిన.

శ్లో॥ సదానురక్తప్రకృతిః ప్రజాపాలనతత్పరః । వినీతా
త్మాహినృపతిర్భూయసీం శ్రియమశ్నుతే॥ ౨౫

రాజ్యసప్తాంగంబులయందు ప్రపన్నుడగు రాజు చిరకాలము మహదైశ్వర్యముననుభవించునని విచారింపవలెను... ... ....౨౫

ఇట్టి ఇంద్రియజయము కష్టసాధ్యమనుట.

శ్లో॥ ప్రకీర్ణేవిషయారణ్యే ధావంతం ప్రమాథినం। జ్ఞా
నాంకుశేనకుర్వీతవశ్యమింద్రియదంతినం । ఆత్మా
ప్రయత్నేనాఖేభ్యోమనస్సమధితిష్ఠతి। సంయో
గాదాత్మమనసోః ప్రవృత్తిరుపజాయతే। విషయా
మిషలోభేనమనః ప్రేరయతీంద్రియం । తన్నిరుం
ధ్యాత్ప్రయత్నేనజితేతస్మిన్ జితేంద్రియః॥ ౨౬

శబ్దస్పర్శరూపరసగంధంబులనియెడు పంచేంద్రియవిషయంబులుబహుభంగులగుటం జేసియు నవిమనోహరంబుల గుటం జేసియువిషయంబులయందాసక్తిగలుగు మనస్సింద్రియంబుల ప్రేరేపించుటవలనను ఆత్మమనస్సంయోగంబులవలన ప్రవృత్తి గలు

గుటవలనను జితేంద్రియుండు గావలయును రాజు జ్ఞానంబను నంకుశంబువల ననింద్రియంబులను మదమేనుగలను నిగ్రహించిన జితేంద్రియుండనంబడు…… …… …… ……………

ప్రధానేంద్రియంబగు మనస్సునకు పర్యాయనామంబులు.

శ్లో॥ విజ్ఞానం హృదయం చిత్తం మనో బుద్ధిశ్చ తత్సమం।
అనేనాత్మా కరోతీహ ప్రవర్తననివర్తనే॥ .. ..౨౯

కార్యప్రవృత్తి మనః ప్రధానంబగుటం జేసి బుద్ధిచే కర్తవ్యాకర్తవ్యంబులను ప్రవర్తననివర్తనంబులనగు విషయంబుల దెలిసి మనస్సుచే శాస్త్రవిహితానుష్ఠానంబులయందు ప్రవృత్తియును అకార్యనివర్తియు జేయనగు……… ……… ……… …. ……౨౯

శ్లో॥ ధర్మాధర్మౌ సుఖం దుఃఖమిచ్ఛాద్వేషౌ తథైవ చ। ప్ర
యత్నో జ్ఞాన సంస్కారాః ఆత్మలింగముదాహృ
తం॥………………… ……………౩౧

స్వర్గమోక్షఫలప్రదంబులగు ప్రవృత్తిలక్షణము ధర్మంబనియు - నరకాదిదుఃఖఫలదంబగు ప్రవృత్తి యధర్మంబనియు - శబ్దంబునకు బుద్ధీంద్రియంబుల ధర్మంబులు గావున నట్టి బుద్ధీంద్రియంబులకు సంతోషము సుఖమనియు - అనర్థము దుఃఖమనియు - కోరికయు - ద్వేషంబును - మొదలగు స్వరూపంబుల దెలియుట యాత్మస్వరూపంబనబడు……… …… ………………౩౦

శ్లో॥ జ్ఞానస్యాయుగపద్భావో మనసోలింగ ఉచ్యతే। నా
నార్థేషు చ సంకల్పః కర్మ చాస్య ప్రకీర్త్యతే॥౩౧

శబ్దస్పర్శాది ఇంద్రియార్థంబుల దెలియుట మనఃస్వరూపంబనియు, నానార్థంబులయందు ప్రయత్నంబు గానచుట దానికృత్యంబనియు, దెలియునది………………………౩౧

ఇంద్రియేంద్రియార్థస్వరూపము.

శ్లో॥ శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వా నాసికా చేతి పంచమీ।
పాయూపస్థం హస్తపాదౌ వాక్చేతీంద్రియసంగ్ర
హః। శబ్దస్పర్శశ్చ రూపంచ రసో గంధశ్చ పంచ

మః। ఉత్సర్గానందనాదానగత్యాలాపాశ్చ తత్
క్రియాః॥.............................. ౩౩

శబ్దంబుల నెఱుంగు చెవులును, సోకుడు దెలియుత్వగింద్రియంబును, రూపము జూచు కన్నులును, రుచులు దెలియు నాలుకయు వాసనలు దెలియు ముక్కును, ననుజ్ఞానేంద్రియంబులును. మలవిసర్జనము జేయుగుదేంద్రియంబును, స్త్రీపురుషులసంయోగానందమనుభవింపజేయు నుపస్థంబును, తీసుకొనుటయు నిచ్చుటయును వృత్తిగాఁగలుగు హస్తంబులును, గమనక్రియాపాటవంబగు పాదంబులును, మాటలాడు నోరుసునను, కర్మేంద్రియంబులు, ను - నిదియశంద్రియదశకంబులు తత్కార్యంబులు... ........౩౩

బహిరంతర్విభాగములకు కారణం.

శ్లో॥ ఆత్మామనశ్చతద్విద్భిద్వైరంతఃకరణముచ్యతే। ఆ
భ్యాతుంసప్రయుత్నాభ్యాంప్రవృత్తిరుపజాయతే॥

ఆత్మయు మనస్సునను రెండును నంతఃకరణంబులనంబడు వీటి ప్రేరణచేత పూర్వోక్తంబులగు దశేంద్రియముల ప్రవృత్తిగలుగు॥ ........................ ...... . ... ....... .........౩౪

శ్లో॥ ఆత్మబుద్ధీంద్రియాణ్యర్థాబహిఃకరణముచ్యతే।
సంకల్పాధ్యవసాయాభ్యాంసిద్ధిరాసాం ప్రకీర్తితా।
ఉభే ఏవేహికరణే యత్నానంతర్యకేస్మృతే।
తస్మాత్ప్రయత్నసంరోధాద్భావయేన్నిగ్రహము
స్మృతాం॥................. ................... ......౩౫

స్వకీయంబగు బుద్ధీంద్రియంబులు బహిఃకరణంబులనంబడు - నెట్లన అంతఃకరణప్రవృత్తిలేనయెడ నింద్రియప్రచారంబులకు హేత్వభావంబగుటవలనను, ఇంద్రియంబుల ప్రవృత్తి సంకల్పానంతరంబగుటవలనను, యత్నమునగా సంకల్పమునిగ్రహించి అహంకారమునను నిగ్రహింపవలయుననుట ........................ ..౩౫

శ్లో॥ ఏవంకరణసామర్థ్యాత్సంయమ్యాత్మాననాత్మనా।నయాపనయవిద్రాజాకుర్వీతహితమాత్మనః౩౬

ఇట్లంతఃకరణబహిఃకరణంబుల స్వాధీనము జేసికొని న్యాయాన్యాయవిదుండగు భూపతితనకును రాష్ట్రంబునకును హితంబగు కార్యంబనుష్ఠించవలయుననుట॥..................3౬

శ్లో॥ యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యంపశవ స్త్రియః। ఏకస్యాపినపర్యాప్తంతస్మాదతితృషాంత్యజేత్॥..............................3౭

భూమియందుగలిగియుండు ధాన్యహిరణ్యపశు ప్రమదాజనంబులు నింద్రియజయములేని నొకపురుషుని యనుభవమునకు జాలినదగనుండదుగావున నత్యాశనువర్జించవలయుననుట- ఇట్లుండు నెడల నింద్రియనిగ్రహింగానివాడు................ 3౭

శ్లో॥ ఏకస్యాపినయశ్శక్తోమనసస్సంనిబర్హణే మహీం సాగరపర్యంతాంసకథంనువిజేష్యతి॥.........3౮

ఏ రాజువకటియగు సహాయరహితంబును అణువుపునగుతనమనస్సునుజయించుటకసమర్థుండగునో అట్టిపురుషుడు జయింపబడవలయు- ననేకరాజులచే పూరితంబగు సముద్రపర్యంత భూమి నెట్లుజయింపవచ్చునుట॥.... .......... ... ...........3౯

ఇంద్రియనిగ్రహము లేనివానికిఫలము.

శ్లో॥ క్రియావసానవిరస్సైర్విషయైరపహారిభిః। గచ్ఛత్యాక్షిప్తహృదయః కరీవనృపతిర్గ్రహం। సజ్జమానోహికార్యేషు విషయాంధీకృతేక్షణః।అవహత్యుగ్రభయదంస్వయమేవాపదంనృపః॥ ...౪౧

విషయములందాసక్తంబగుచు పురుషునవశునింజేశి క్రియాపరిణామానంతరంబుననిష్ఫలంబులునవిష్టప్రదంబులునునగునింద్రియంబులచే నిగ్రహీత్ముండగుచు మదమేనుగవలెనన్యులచే పట్టుబడుటయేగాక విషయములగుడ్డివాడగుచు దుష్కార్యప్రవర్తనచే భయంకరంబగు నాపదను తనంతననుభవించుననుట.....౪౧

శ్లో॥ శబ్దస్స్పర్శశ్చ రూపంచ రసోగంధశ్చపంచమః। ఏకైకమేవమే తేషాంవినాశప్రతిపత్తయే। శుద

శష్పాంకురాహారో విదూర క్రమణక్షమః । లు
బ్ధకాద్గీత మోహేన మృగో మృగయతే వధం। గిరీం
ద్రశిఖరాకారో లీలయోన్మూలిత ద్రుమః । కరిణీ
స్పర్శసంమోహా దాలానంయాతి వారణః। స్ని
గ్ధదీపశిఖాలోక విలోభితవిలోచనః । మృత్యుమృ
చ్ఛత్య సందేహః పతంగస్సహసా పతన్। దూరే
పిహిభవన్నృష్టే రగాధే సలిలే చరన్ । మీనస్తు
సామిషం లోహ మాస్వాదయతి మృత్యవే। గం
ధలుబ్ధో మధుకరో దానాస వపిపాసయా। ప్రా
ప్నోత్యసుఖసంచారాం గజకర్ణ ఝుళంఝుళాం।
ఏకైకశోపి నిఘ్నంతి విషయా విషసన్నిభాః। కే
నునః కథం నస్స్యా ద్యస్సర్వం పంచ సేవతే॥...౪౮

వినికిడియు - సోకుడు - రూపము - రుచి-వాసన - యన్నై దింద్రియార్థంబులు జంతువినాశకరంబులుగావున నందొకటొకటికి దృష్టాంతరంబులు క్రమంబునజెప్పంబడియె - నందుశబ్దముచేగలుగుననర్థంబు - పరిశుద్ధంబగుగడ్డి మేసవి అశ్రమంబుననతిదూరముబారగలజింకలు మృగయునిచే శ్రావితంబగు సంగీత మోహముచే వధమునొందుటయు - పర్వతశిఖరమువంటి దేహముగలిగివృక్షములనవలీలగావిరువజాలునేనుగు ఆడయేనుగుచేనగు సోకుడుమాత్రముచే గట్టబడుటయు - యుజ్జ్వలితమనోహరంబగురూపముగలదీపకళికాలోకనమాత్రముచేఫలభ్రాంతిగలిగి మిడతమృతినొందుటయు - నీటియందగుపడని యట్టిలోతుననుండియు గాలగర్భితంబగు మాంసాస్వాదలోభముచే మత్స్యములు మృతినొందుటయు - పుష్పరసములుచే సులభముగాస్వాదువస్తువులాస్వాదించునదియయ్యు ఏనుగమదముచెనైన వాసనాలుబ్ధంబగు భృంగంబులయ్యేనుగలకర్ణతాడనవివశత్వమునొందుటయు-క్రమంబుననొకటొకటికి దృష్టాంతంబులగుచుండు విషతుల్యములగు విషయంబులనన్నిటియందును పరవశుండగు నరుండెట్లు

సౌఖ్యమనుభవింపగలఁడనుట......... .......... ..........౪౯

ఇట్లీయుపన్యాసమువలన సుతరావిషయంబులను భవయోగ్యంబులుగా చేయుననను భవవిభాగము.

శ్లో॥ సేవేతవిషయాన్కాలే భుక్త్వాతత్పరతాంవశీ। సుఖంహిఫలమర్థస్య తన్నిరోధేవృథాశ్రియః॥౪౯

ద్రవ్యసంపాదనమునకుఁ బ్రయోజనమాత్మసౌఖ్యంబయగుటవలనను-అట్టియాత్మసుఖముగలుగనియెడ నైశ్వర్యము వృథయగుటవలనను కేవలముతత్పరత్వముచే పూర్వోక్తానర్థ సంభావితమగుటవలనను మేధావియగుపురుషుఁడింద్రియార్థంబులయందత్యాసక్తిజెందక పూర్వికులచే మూఁడుముక్కాలుగడియమితంబగుచు ముహూర్తనామకమయిన నెనిమిది భాగంబులుగా విభజింపంబడు పగటియందు మొదటి కాలంబున నంతఃపురవిషయంబులను నాదాయవ్యయంబులవిచారణయు - రెండవకాలంబునదండవిషయంబును - మూఁడవ కాలంబునస్నానభోజనంబులును - నాలుగవకాలంబున ద్రవ్యార్జనవిషయంబును - నైదవ కాలంబున నమంత్రులతోడ నాలోచనయు - నారవ కాలంబున నంతఃపురసంచారంబు - నేడవ కాలంబున చతురంగబలావలోకనంబును - ఎనిమిదియవకాలంబున పరాక్రమచింతయు - రాత్రియందలి ప్రథమకాలంబున గూఢచరులవిచారణయు - రెండవకాలంబున భోజన గ్రంథావలోకనంబులును - మూఁడవ కాలంబున గీత వాద్యనాట్యావలోకనంబును - చతుర్థ పంచమ కాలంబులనిద్రయు - నారవకాలంబున శాస్త్రచింతా కార్య చింతలును - నేడవకాలంబున పురోహితాదులతోడవైదికంబగు దైవమానుషోత్పాతిక ప్రతీకారచింతయు నను తత్తత్కాలవిభాగపూర్వకంబులును పరస్పరబాధాభావంబులు నగునట్లింద్రియసుఖంబులనుభవించఁదగునని ఫలితార్థము ...

శ్లో॥ నికామసక్తమనసాంకాంతాముఖవిలోకనే। గలంతిగలితాశ్రూణాంయవ్వనేనసహశ్రియః॥౫౦

కామినీముఖావలోకనమునందే సదాసక్తుడగు రాజు తదేక పరవశుండగుటచే కార్యాంతరాభావమువలన యవ్వనంబును ద్రవ్యంబును సమీపవర్తినియగు ప్రియురాలి కన్నీళ్లతోడనజారుననియర్థము - అనగా పరకృత్యమునందే ముఖ్యానురాగముగల పురుషుడు విషయాంతర స్వరూప నిరూపణాజ్ఞానముచేత దర్శనమాత్రపరవశుండగుచు జెడుననుట.................... ౫౦

ధర్మార్థకామవిషయంబులప్రయోగవిభాగము.

శ్లో॥ ధర్మాదర్థోర్థతః కామః కామాత్సుఖ ఫలోదయః। ఆత్మానంహంతితౌహిత్వా యోయుక్త్యాన నిషేవతే॥................................. ౫౧

ధర్మప్రవర్తనచే ద్రవ్యార్జనంబును - ద్రవ్యార్జనముచే కామభోగోపపత్తియు పరస్పర సంబంధప్రవర్తనంబులగుటను నందు కేవల ధర్మాసక్తుండగుచు నతిదానాదులవలననర్థంబును నతి తపస్సు మొదలగు క్రియానుష్ఠానంబులచే కామంబును - నశింపజేయుటవలన శరీరక్షయాపాదకంబగుట - దానిచే నశించుననియు కేవలార్థాసక్తుండగుచు త్యాగము జేయకుండుటవలన ధర్మంబును - నంతఃపురరక్షణాదికంబుల వ్యయించకుండుటచే కామంబును - నశింపచేయుటవలన ధర్మకామవిరోధంబుగలుగుటచే దాను నశించుననియు కేవలకామాసక్తుండగుచు స్త్రీమృగయాద్యత్యాసక్తుండగుచు ధర్మార్థంబులనశింపజేయుటవలన రాజయక్ష్మాదిరోగ ప్రాప్తుండగుచు నశించుననియు, నేకైకానుష్ఠానంబున నితరద్వయక్షయమగుటవలననందుచే తాను నశించుంగావున నట్లు చేయక పరస్పరసాపేక్షంబులగు యుక్తిచే త్రివర్గమనుష్ఠించవలయుననుట౫౧

స్త్రీ విషయకామమునందలి దోషము.

శ్లో॥ నామాపి స్త్రీతిసంహ్లాది వికరోత్యేవ మానసం। కిం పునర్దర్శనంతస్యా విలాసోల్లాసితభ్రువః। రహః ప్రచారకుశలా మృదుగద్గదభాషిణీ। కంననారీచలత్

యతిరక్తం రక్తాంతలోచనా । ము నేరపి మనోహ
క్ష్యం సరాగం కురుతేంగనా॥ ప్రసన్నం కాంతిజననం
సంధ్యేవ శశిమండలం । మనః ప్రహ్లాదయంతీభిః కం
డయంతీభిరప్యలం॥ మహాంతో పి హి ధైర్యం తే స్త్రీభి
• రబ్భిరివాచలాః॥.................................౫౫

శ్లో॥ నారీతి నామమాత్రేణ కాష్ఠం నమతి నిష్ఠురం। పీనోన్నతస్త
నీ నారీకం వా ననమయేన్నరం। అను చాటూక్తిననుసరించి రూపౌ
దార్య సౌందర్యాలంకార భాషారాగపరిచర్యాది క్రియా విశేష
ముల చే బుద్ధుల నేసియు నాత్మవశ్యము జేయుటచే కొండలనువంగ
దీసునట్టియుదక స్వభావంబును - కఠినంబగు కాష్ఠంబును వంగజే
యునట్టి యల్లెత్రాటి స్వభావంబునుంగల ప్రమదా జనంబులను
రక్తుండగు భోగపరుండగు పురుషు నేల వశ్యము జేసికొననదని తా
త్పర్యము....................................................౫౫

## మృగయాదుల దోషము.

శ్లో॥ మృగయాక్షస్తథాపానం గర్హితాని మహీభుజాం ।
దృష్టాస్తేభ్యస్తు విపదః పాండు నైషధ వృష్ణిషు॥ ౫౬.

అతిమృగయాసక్తుండగు పాండురాజు మృగరూపధారియ
గు ఋషిచే శప్తుండగుచు నాపదనొందెననియు, నతిద్యూతాసక్తుం
డగు నల చక్రవర్తి పుష్కరుచే నోడి ఆపదజెందెననియు, నతిపా
నాసక్తులగు యాదవులు పరస్పరహతులగుచు మృతిబొందిరనియు,
ప్రసిద్ధంబులగుట, రాజులచే నీమూడు ననత్యనుష్ఠానాహంబులు
గావనుట.......................................................౫౬

## కామక్రోధాదుల దోష నిరూపణము.

శ్లో॥ కామః క్రోధస్తథా లోభః హర్షో మానో మదస్తథా।
షడ్వర్గముత్సృజేదేనం యస్మిం స్త్యక్తే సుఖీ నృపః॥ ౫౭

పూర్వోక్తలక్షణలక్షితంబగు కామంబును ప్రాణిద్రోహబు
ద్ధిజనకంబగు క్రోధంబును ద్రవ్యంబు నందత్యాసక్తరూపంబగు లో
భంబును, పరహింసా పరద్రవ్యాదుల హరించునట్టి హర్షణంబును,

స్వజనస్వపక్షాదులయందలి దురభిమానంబును, బలాతిశయము చే జనితంబగు మదంబును, ననునదివర్గములుటచే రాజుసుఖియగు ననుట................................................౫౮

వీటిననుష్ఠించి నశించినరాజోదాహృతి.

శ్లో॥ దండాఖ్యోనృపతిఃకామాత్క్రోధాచ్చ జనమేజయః। లోభాదైళస్తురాజర్షిర్వాతాపీహర్షతోఽసురః। పౌలస్త్యోరాక్షసోమానాన్మదాద్దంభోద్భవోనృపః। ప్రయాతానిధనంహ్యేతే శత్రుషడ్వర్గమాశ్రితాః॥ ..............................౬౦

ఇక్ష్వాకుమహారాజపుత్రుండగు దండుఁడను రాజుశుక్రపుత్రియగునరజయందలి కామంబువలన శుక్రశాపగ్రస్తుండగుచుమృద్వర్షముచే మృతిబొందెనని యుత్తరరామాయణప్రసిద్ధము - తనచే జేయు నశ్వమేధయాగమునందు ఇంద్రప్రవిష్టంబగుపశువగునశ్వముచే కామించబడుతనభార్యయగు వపుష్టమువిషయంబున ఋషులమీదకోపించిన జనమేజయుండు ఋషిశాపముచేనశించెనని హరివంశప్రసిద్ధము - ఐళుండనురాజుతనచే జేయబడుయజ్ఞమునందలి సౌవర్ణమయంబులగు యజ్ఞపాత్రాదుల ఋత్విజులకొసంగక లోభమువలన ఋషిశాపదగ్ధుండయ్యెనని ప్రసిద్ధము - వాతాపియనురాక్షసుండు అగస్త్యమహర్షిచేజచ్చుటప్రసిద్ధము - రావణాసురుండభిమానముచేజచ్చుటరామాయణప్రసిద్ధము - దంభోద్భవుండను రాజుమదాతిశయముచే నరనారాయణులపైదండెత్తియెదిరి నశించెనని యుద్యోగపర్వ ప్రసిద్ధము........౬౧

అరిషడ్వర్గవశ్యులుగాక సౌఖ్యమునొందినవారు.

శ్లో॥ శత్రుషడ్వర్గముత్సృజ్య జామదగ్న్యోజితేంద్రియః। అంబరీషశ్చ నాభాగో బుభుజాతే చిరం మహీం॥ ..............................౬౧

జితేంద్రియులగుచు పరశురామ - అంబరీష - నాభాగులు- చిరకాలమురాజ్యపాలనము జేసి ఇహపరసౌఖ్యాదుల నొందిరని

ప్రసిద్ధము............................................౬౧

ఇతీంద్రియజయో నామ ప్రథమవిభాగః

ఇట్లింద్రియజయవిభాగము దెలిపి యందుచే సాధ్యంబ
గు విద్యావృద్ధివిషయంబును ప్రస్తుతించుచున్నాఁడు.

శ్లో॥ వర్ధతే హ్యర్థకామాభ్యాం ధర్మో సేవితో సద్భిరాదరా
త్। నిగృహీతేంద్రియగ్రామః కుర్వీత గురుసేవనం।
శాస్త్రాయ గురుసంయోగః శాస్త్రం వినయవృద్ధయే।
విద్యావినీతో నృపతి ర్న కృచ్ఛ్రేష్వవసీదతి। వృద్ధో
పసేవీ నృపతి స్సతాం భవతి సమ్మతః। ప్రేర్యమా
ణోప్యసద్వర్గై ర్నాకార్యేషు ప్రవర్తతే॥ ... ౬౨

చతుర్విధపురుషార్థంబులకును ముఖ్యకారణభూతంబుల
గు ధర్మార్థంబులవృద్ధి జేయుకొఱకు పూర్వీకులచేననుష్ఠితంబగు
గురుసేవాదులచే వినయవృద్ధికొఱకు శాస్త్రం బనుష్టించవలయు
ననియు-అట్టిశాస్త్రాభ్యాసవినయాది గుణగణంబులుగలనరపతి-
దుర్మార్గులచేఁ బ్రేరేపింపబడియును దుష్కర్మానుష్టానంబులయం
దు ప్రవర్తించడనియు విచారింపవలెను......................౬౨

శ్లో॥ ఆదదానః ప్రతిదినం కలాస్సమ్యఙ్మహీపతిః। శుక్ల
పక్షే ప్రతిచరన్ శశాంక ఇవ వర్ధతే। జితేంద్రియ
స్య నృపతే ర్నీతిమార్గానుసారిణః। భవంత్యుజ్జ్వ
లితా లక్ష్మ్యః కీర్తయశ్చ నభస్స్పృశః॥ .. ...౬౩

పూర్వోక్తంబగు శాస్త్రాభ్యాసమనవరతము జేయుచుండు
టవలన నిర్మలంబగు బుద్ధిచాతుర్యాదులు గలుగుననియు నట్టివిద్యా
శాలియు జితేంద్రియుండును నీతిమార్గానుసారియు నగు రాజున
కు నైశ్వర్యకీర్తులు వృద్ధియగుచుండుననియు విచారింపవలెను. ౬౩

సర్గోపసంహారశ్లోకములు.

శ్లో॥ ఇతీవ రాజా వినయాన్వయాగతో నిషేవమాణో
నరదేవసేవితం। పదం సమాక్రామతి భాస్వరం శ్రి
యః శిరో మహారత్నగిరేరివోన్నతం॥........౬౪

పూర్వోక్తక్రమంబున రాజగువాడు పూర్వరాజులచే ననుష్ఠితంబగు నయవినయంబుల ననుష్ఠించెనేని సూర్యకాంతిచే నెడతెగక ప్రకాశించుచుండెడు మేరుపర్వతమువలెనిత్యైశ్వర్యోజ్జ్వల్యుండగుననివిచారించవలెను.............................౬౭

శ్లో॥ ఇయంహిలోక వ్యతిరేకవర్తినీ స్వభావతఃపా
ర్థివతా సమున్నతా। బలాత్త దేనాంవినయైర్ని
యోజయేన్నయస్యసిద్ధ్యై వినయఃపురస్సరః॥ ౬౮

ఇట్టిరాజధర్మములోకనిష్టజనంబులచే ననుష్ఠించదగినది యయ్యునుచిరంతనవాసనాబలముచేనున్మార్గవర్తులగుట వలనను నీతిశాస్త్రానుష్ఠానమునకు వినయముమూలంబగుటవలనను రాజగువాడట్టిలోకంబును బలాత్కారముచేననగా దండనీతియుక్తులును నగునట్లు జేయదగు ననుట.............................౬౮

శ్లో॥ పరాంవినీతస్సముపైతిసేవ్యతాంమహీపతీనాంవి
నయోహిభూషణం.। ప్రవృత్తదానోప్యుదుపంచ
రత్కరః కరీవభద్రోవినయేనశోభతే॥.......౬౯

మదధారలనొసంగుచు మృదువుగాచలింపజేయు తొండముగలభద్రగజరాజు పూజ్యంబగు సంపదవహించినట్టుల సత్పాత్రదానాద్యుండును వినయయుక్తుండునునగు రాజుసత్పురుషసేవ్యుండగుననుట.............................౬౯

శ్లో॥ గురుస్తువిద్యాధిగమాయసేవ్యతే శ్రుతంచవిద్యా
మతయేమహాత్మనాం। శ్రుతానుబంధీనిమతానివే
ధసాం అసంశయంసాధుభవంతిభూతయే॥... ౭౦

నీతిశాస్త్రకారులగు పూర్వాచార్యుల తాత్పర్యము శ్రుతమనగా శాస్త్రోపదేశ శ్రవణమునననుసరించియుండుటవలనను- నట్టిశ్రుతము విద్యననుసరించి యుండుటవలనను నట్టి విద్యాధిగమము గురువుసేవవలన సంభవించు వలయుననియు నట్టిగురుశుశ్రూషవలన సంభవించువిద్యచేతమనందు చేలభించు శ్రుతముచేతను విశేషైశ్వర్యముననుభవించుననుట........ ౭౦

శ్లో॥ సునిపుణముపసేవ్య సద్గురుంసుధిరను వృత్తివరో
విభూతయే। భవతిహివినయో పసంహితోన్నృప
తిపదాయశమాయచతుమః॥...... ... ......౭౧

స్వేచ్ఛవృత్తిగలవాడగుచు వినయసంపదచేగురుసేవియగు రాజువినయముగలవాడును రాజ్యస్థానమున కర్హుఁడును నగు ననుట. ... ... .. ... ... ౭౧

శ్లో॥ అవినయపరమాదరాద్భతే వశమవశంహినయం
తి విద్విషః॥ శ్రుతివినయవిధింసమాశ్రిత స్తనురపి
నైతిపరాభవంక్వచిత్॥... ........ ...౭౨

పూర్వోక్తంబులగువిద్యావినయంబులులేక నన్యాయప్రవర్తకుండగు రాజునుసులభముగా శత్రువులుస్వాధీనముజేసికొనుదురుగావునను నట్లుగాకవినయశ్రుతంబులననుష్ఠించు రాజు స్వల్పమేనియు పరాభవంబునొందఁడుగావునను విద్యావినయంబుల ననుష్ఠించవలయునని ప్రథమసర్గోక్త ఇంద్రియజయఫలితార్థము. * * * * * * * * *

---

ద్వితీయసర్గప్రారంభః॥ ఆన్వీక్షక్యాదివిద్యాః।

శ్లో॥ ఆన్వీక్షకీం త్రయీంవార్తాం దండనీతించపార్థి
వః।తద్విద్యైస్తత్క్రియోపేతైశ్చింతయేద్వినయా
న్వితః॥.................................. ౧

పూర్వసర్గోక్తవిధానంబున వినయయుతుండగు రాజువక్ష్యమాణలక్షణలక్షితంబులగు - ఆన్వీక్షకీవిద్యయును - త్రయీవిద్యయును - వార్తావిద్యయును - దండనీతివిద్యయునను - నాలుగువిధంబులగు రాజవిద్యలను - నాయావిద్యాజ్ఞానానుష్ఠానంబులుగలపెద్దలతోఁగూడి యీవిద్యలులోకమునందు చక్కఁగాప్రవర్తించునటుల యోచించదగుననుట.

ఇందుస్వరాజ్యపరిపాలనము సమీచీనముగాదయ్యేనేని యన్యరాజ్యముస్వాధీనంబగుట దుర్లభంబుగావున స్వరాజ్యప్ర

తిష్ఠకొఱకుక్రమంబున నుపాయంబుఁజెప్ప నుపక్రమించి యందునీ సర్గంబున విద్యావిభాగంబును - వర్ణాశ్రమవిభాగంబును - దండనీతిమాహాత్మ్యంబును క్రమంబున వివరింపంబడుననుట........౧

శ్లో॥ ఆన్వీక్షికీత్రయీవార్తా దండనీతిశ్చ శాశ్వతీ। వి
ద్యాశ్చతస్రఏవైతా లోకసంస్థితిహేతవః॥..౨

పూర్వోక్తంబగునీవిద్యాచతుష్టయంబునులోకముఅధర్మమార్గము నందకుండసన్మార్గప్రవర్తనమును చతుర్విధ పురుషార్థంబులను గలుగఁజేయుంగావున లోకప్రతిష్ఠకొఱకుముఖ్యహేతువులని యాంతర్యాతిశయముచే పునరుపాదానంబనందును తొలుత సకలవిద్యాపరిశ్రమంబునకు ముఖ్యకారణంబులయిన నాన్వీక్షికీయు- పదపదర్మప్రాధాన్యంబగుటచే ధర్మస్థాపనాధర్మము త్రయీవిద్యయు-నట్టిధర్మమర్థసంబంధియగుటచేనర్థార్జనము కొఱకువార్తయు - నట్టిధర్మార్థాభివృద్ధులు దండనీతివలన నేరక్షితంబులు గావలయు గావున దండనీతియు- పరస్పర సంబంధంబులును వృద్ధిహేతువులునుగావునను నివిలేనియెడ లోకవ్యవసాయనాశంబగుచు జెడుం గావుననునివియవశ్యానుష్ఠేయంబులని విచారించవలెను.......... ........... ....... ......... ......౨

శ్లో॥ ప్రదీపస్సర్వవిద్యానాం ఉపాయస్సర్వకర్మణాం।
ఆశ్రయస్సర్వధర్మాణాం శశ్వదాన్వీక్షికీమతా॥౩

అందుప్రథమంబగునాన్వీక్షికీ - వక్ష్యమాణంబులగుత్రయీవార్తాదండనీతి స్వరూపంబులన్వేషించుటకు దీపాయమానంబును - రాజషాడ్గుణ్యంబులు నుపాయంబులు దెలుపునదియును - సమస్తధర్మంబులకునాశ్రయంబునునగు గావున తొలుత ప్రస్తూయమానంబయ్యె.............. .. ............ .......... ......౩

శ్లో॥ ఉభౌలోకావవాప్నోతిత్రయ్యాంతిష్ఠన్యథావిధిః।
ఈక్షమాణస్త్రయీతత్వం హర్షశోకావ్యుదస్య
తి॥........ ....... ...............౪

త్రయీవిద్యయనుద్వితీయముచేనాయాయివిద్యావిశేషంబులస్వరూపంబుల నెరుంగుటవలన సుఖదుఃఖంబులయందత్యంతము గృందుగాకుండుననుట........................................౪

ఇందుమతాంతరంబులు వ్రట్లన.

శ్లో॥ త్రయీవార్తాదండనీతి రితివిద్యా హిమానవాః॥
త్రయ్యా ఏవవిభాగోయం యేయమాన్వీక్షికీ మ
తా॥........................................౫

ఆన్వీక్షికియనునది హేతువాదంబనియునదిసాంఖ్యమీమాంసారూపంబుల రెండుదెరంగులనియునవిరెండును త్రయీయను వేదవిద్య ననుసరించియుండుటవలన నాన్వీక్షికీత్రయీవిద్యయందంతర్భావము గావున - త్రయీ - వార్తా - దండనీతులనునది మూడువిద్యలగునని మనుశిష్యులమతమ్మనుట........................౫

శ్లో॥ వార్తాచదండనీతిశ్చ ద్వేవిద్యే ఇత్యవస్థితే। లో
కస్యార్థప్రధానత్వా ద్బృహస్పత్యనుగోధసః॥౬

లోకముఅర్థప్రధానంబగుటవలనను- నట్టియర్థముదండనీతిచే రక్షితంబగుటవలనను - నాదండనీతియందు రాజనీతియు శేషంబు నంతర్భావంబగుటవలనను బృహస్పతిశిష్యులగు వారిమతము వార్తా - దండనీతులనియెడివిద్యాద్వయంబనుట....... ౬

శ్లో॥ ఏకైవదండనీతిస్తువిద్యేత్యౌశనసాఃస్థితాః। తస్యాం
హిసర్వవిద్యానా మారంభాస్సంప్రతిష్ఠితాః॥...౭

దండనీతిలేదయ్యేనేని మాత్స్యన్యాయంబున బలవంతులచే దుర్బలులాత్మద్రవ్యమానాదుల నొందకపోవుదురుగావు నన్నట్టి దండనీతిలేనియెడల - శేషంబులగునాన్వీక్షక్యాదుల కారంభము సంభావితంబగుటవలనను - దండనీతివిద్యయేప్రధానంబనియునాన్వీక్షక్యాదులంగంబులనియును - శుక్రశిష్యమతంబునందొకటియవిద్యయనుట........................................౭

శ్లో॥ విద్యాశ్చతస్రఏవైతా ఇతినోగురుదర్శనం। పృ
థక్పృథక్ప్రసిద్ధ్యర్థంయాసులోకోవ్యవస్థితః॥౮

వక్ష్యమాణక్రమంబున నాన్వీక్షికిచేసిద్ధించంబడుస్వస్వరూపజ్ఞానము - త్రయీచేతసిద్ధించబడుధర్మాధర్మవివేకము - వార్తచేలభించునర్థసిద్ధియునర్థనాశకబాధనివృత్తియు-దండనీతిచేసిద్ధించుతారతమ్యదండభేదంబులును- పృథగ్విషయంబులగుచుస్వతంత్రములగుటయు నొకటిచే నన్యంబులులభించుట యసాధ్యంబులగుటయు నీవిద్యలునాల్గును ప్రత్యేకంబులును స్వతంత్రంబులు నని విష్ణుగుప్తమతసిద్ధాంతము.......................................౭

శ్లో॥ ఆన్వీక్షిక్యాత్మవిజ్ఞానం ధర్మాధర్మౌ త్రయీస్థితౌ।
అర్థానర్థౌతు వార్తాయాం దండనీత్యాంన
యానయౌ॥.......................................౮

ప్రత్యక్షపరోక్షంబులవలనదృష్టంబులగు విషయంబులబుద్ధిచేమరల జూచుటనాన్వీక్షికియను శబ్దార్థము గావున దానిచే వస్తుస్వరూపమాత్మయందుగలుగుట నాన్వీక్షికీవిద్యవలనను- ఇజ్యాధ్యయనదానాదిధర్మంబులును - అభక్ష్యభక్షణ- అగమ్యాగమనంబులు మొదలగునధర్మంబులును ఋగ్యజుస్సామాథర్వణలక్షణంబులగు త్రయీవిద్యయందు నిష్పన్నంబులగుటవలనను- సస్యములకాలమునందు వెదబెట్టుటచే ప్రయోజనంబును- అకాలమునందు వెదబెట్టుటచే నప్రయోజనంబును ననుట మొదలగు కృషి-వాణిజ్య-పాశుపాల్యాదులు-వార్తయందునిష్పన్నంబులగుటవలనను - న్యాయాన్యాయంబులు దండనీతివలన నిష్పన్నంబులగుటవలనను- నీవిద్యలునాల్గునుపృథక్స్వభావంబు లగుట దీనిచే కౌటిల్యమతముస్పష్టీకృతంబయ్యెననుట॥.......................................౯

ఇట్లయ్యుశు క్రమతానుసారంబగు దండనీతి
మూడుశ్లోకముల చెప్పాయమానంబగు.

శ్లో॥ ఆన్వీక్షికీత్రయీవార్తాసతీవిద్యాఃప్రచక్షతే। స
ర్వోపిహీనసత్యస్తా దండనీతేస్తువిప్లవే॥ దండనీతి
ర్యదాసమ్యజ్నేతారమధితిష్ఠతి। తదావిద్యావిద

శ్చైషావిద్యాస్సమ్యగుపాసతే॥ వర్ణాశ్చైవాశ్ర
మాశ్చైవ విద్యాస్వాసుప్రతిష్ఠితాః । రక్షిత్వార
క్షణాత్తాపాంతద్ధర్మస్యాంశభాఙ్నృపః॥ ..౧౨

బ్రాహ్మణాది వర్ణవిభాగంబులును - బ్రహ్మచర్యాద్యాశ్రమవిభాగంబులును నాన్వీక్షక్యాదులయందుండుటవలన నట్టి విభాగంబుల బలిషడ్భాగహారియగు రాజురక్షించునెడ పుణ్యకీర్తులనొందు ననియును, నట్టి విద్యావిదుల రక్షించుట దండనీతియందుండు గావునను, నాదండనీతిచే హీనంబగు విద్యాత్రయముభ్యస్తంబయ్యు స్త్రీవిద్యలగుట స్వతంత్రప్రవర్తనానర్హంబులనియును, నట్టిదండనీతిప్రవర్తింపకుండుటచే నేనియు - క్రమప్రవర్తనాభావంబుచే నేనియు నప్రయోజకంబులగుట న్యాయవిధియగుదండనీతి ననుష్ఠించిన రాజుచే సకలంబు సమీచీనంబగు ననుట.

శ్లో॥ ఆన్వీక్షిక్యాత్మవిద్యాస్యాదీక్షణాత్సుఖదుఃఖయోః॥
ఈక్షమాణస్తయా తత్త్వం హర్షశోకౌవ్యుదస్య
తి॥ ........................................ ౧౩

పూర్వోక్తలక్షణలక్షితంబగు నాన్వీక్షకీవిద్యచే సుఖస్వరూపంబును - దుఃఖస్వరూపంబును - దాని నాలోచించుటచే ॥శ్లో॥ సుఖస్యానంతరందుఃఖందుఃఖస్యానంతరంసుఖం - అనుక్రమంబు ననీరెండును నిహంబుననిత్యంబులనియు పరలోకంబునను ధర్మఫలోపభోగానంతరంబున నధర్మఫలోపభోగంబును అధర్మఫలోపభోగానంతరంబున ధర్మార్జనప్రాప్తియునగునను క్రమంబును దెలియుటచే సుఖదుఃఖముల యందత్యంతాసక్తుండు గాకుండ నాత్మను రక్షించుకొనుటయ్యాన్వీక్షకీవిద్యాభ్యాసఫలమనుట ౧౩

శ్లో॥ ఋగ్యజుస్సామనామానస్త్రయో వేదాస్త్ర
యీస్మృతా। ఉభౌలోకావవాప్నోతిత్రయ్యాం
తిష్ఠన్యథావిధి ॥ ౧౪ ॥ శ్లో ॥ అంగాని వేదాశ్చ

శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః। ధర్మశాస్త్రం
పురాణం చ త్రయీదం సర్వముచ్యతే॥......౧౫

ఋగ్యజుస్సామంబులను మూఁడువేదముల సముదాయనామముత్ర యీవిద్యాయనంబడునది కేవలవేదమాత్రముగాక చతుర్దశ విద్యాస్థానంబులును త్రయీవిద్య యందంతర్భావము..................................................

శ్లో॥ శిక్షావ్యాకరణం కల్పోజ్యోతిషామయనంతథా।
ఛందస్సహనిరుక్తేన వేదాంగానివదంతిషట్॥...

అనన్వాయంబున వేదాక్షరోచ్చారణ ధర్మ ప్రతిపాదకంబగుశిక్షయు - ౧ - ప్రకృతి ప్రత్యయావాంతర కార్యపద శబ్దస్వరూపశిక్షకంబగు వ్యాకరణంబును- ౨- నానాశాఖా భేదంబులచే నిష్పన్నంబులగు నశ్వమేధాదికంబుల విధినిర్ణయంబుంజేయుకల్పంబును- ౩- నట్టియజ్ఞానుష్ఠానాది కాలభేదంబులనిర్ణయించుజ్యోతిషంబును-౪- ఉక్తయత్యుక్త మొదలుగాఁగలనానావృత్తభేదంబులును - మయరసాదిగణంబులాదిగాఁగల స్వరూపప్రతిపాదకంబగు ఛందశ్శ్రుతియును- ౫- వేదంబులయందుండు నపూర్వశబ్దార్థంబుల బోధించునిరుక్తంబును- ౬- నను వేదాంగంబులారును - మరియును - పరబ్రహ్మమును ప్రతిపాదకంబగుమీమాంసయు- ౭- న్యాయదర్శననిష్పన్నముదెలుపుతర్కశాస్త్రంబును-౮- మన్వాదిప్రణీతంబులగు నష్టాదశస్మృతిరూపంబులగు ధర్మశాస్త్రంబును- ౯- భారతరామాయణభాగవతాదులగు పురాణంబులును- ౧౦- మరియునిందు నాయాయివిషయంబులప్రపంచితంబులగు శాఖాసహస్రంబులును త్రయీవిద్యాంతర్భావమనుట..........................................౧౫

శ్లో॥ పాశుపాల్యంకృషిఃపణ్యంవార్తావార్తోపజీవనం।
సంపన్నోవార్తయాసాధుర్నావృత్తేర్భయమృ
చ్ఛతి॥..........................................౧౬

గౌతమశాలిహోత్రాది ఋషిప్రణీతంబులగు గవాశ్వరక్షణదికిత్సా విషయాదికంబులగు పశుపాలనంబును- ౧- పరాశరప్రోక్తంబగు కృషిబీజావాపపరికర్మాదులగు కృషియు- ౨- విదర్భరాజప్రోక్తంబగువర్తకవిషయకంబగు పణ్యంబును- ౩-నను భేదత్రయంబులు గలిగినవార్తా శాస్త్రంబనుష్టించువాడు తనతన స్వభావవృత్తియందాసక్తుండై యుండుటవలన......

శ్లో॥ కర్షకాణాంకృషిర్వృత్తిఃపణ్యంవిపణిజీవినాం। వైశ్యానాం గోఃపురావృత్తివార్తాభేదైరియంత్రిభిః। విద్యయానయాయుక్తస్స్యసాదేవతామహత్। సైవపూజ్యాయ్చనీయాంచ సైవతస్యోపకారికా॥..............................

అనుభాగవత-౧౦-స్కం-భగవద్వాక్యమునననుసరించిదరిద్రక్లేశమునొందడుగావునవార్తావిద్యాభ్యాసఫలంబిట్టిదనిదెలుపుటగు.

శ్లో॥ దమోదండ ఇతి ప్రోక్తస్తస్యద్దండోమహీపతిః। తస్యనీతి దండనీతినయనాన్నీతిరుచ్యతే। తయోత్మానంచ శేషాశ్చవిద్యాఃపాయాన్మహీపతిః। విద్యాలోకోపకారిణ్య స్తత్పాతాహిమహీపతిః॥.......................................౧౨

వధపరిక్లేశ అర్ధహరణాదులగు నిగ్రహంబుల చేనుమార్గవర్తులగు వారిస్వాధీనపరచుట..............................

శ్లో॥ సర్వోదండ జితోలోకోదుర్లభో హిశుచిః క్వచిత్। దండస్యహిభయాత్సర్వంజగద్భోగాయకల్పతే॥..............................

అనున్యాయంబున్నలోకంబున పరిశుద్ధుండగు పురుషుండరుదుగనుక- దండభయమువలననేలోకముభోగాపవర్గంబులగునిహపరసౌఖ్యంబులనొందుగావుననట్టిదండధారియగు రాజుదండస్వరూపుండుగావుననాదండమును....

శ్లో॥ అదండ్యాన్ దండయన్ రాజాదండ్యాంశ్చైవా
ప్యదండయన్। అయశోమహానాప్నోతినరకంచాధి
గచ్ఛతి॥...........................................

అనురీతనివతఃపాతముగాకుండనట్లున యుంచుటనీతియనుట నట్టిదండనీతి శాస్త్రాభ్యాస ప్రయోగములవలన నాన్వీక్షిక్యాది విద్యాత్రయంబును దండధారియగు నాత్మీయదేహంబును నాత్మస్థానీయంబగు రాజ్యంబును శత్రుచోర ఈతిబాధాదులనుంచి రక్షించుగావున నిట్టిలోకోపకారకంబగు దండనీతియథావిధానంబున ననుష్ఠించదగుననుట- యిందు ఈతియనగా॥ శ్లో॥ అతివృష్టిరనావృష్టిశ్శలభాముషకాశ్శుకాః। అత్యాసన్నాశ్చరాజానష్షడైతే ఈతయస్స్మృతాః। అనునది......................................

శ్లో॥ విద్యాద్యదాభినీతఘృణం చతుర్వర్గముదారధీః।
విద్యాత్తద్విద్యాం విద్యాత్వం విదజ్ఞానే నిరుచ్యతే॥

విదజ్ఞానే - విదవిచారణే - అను ధాత్వర్థబలంబుచేనీచతుర్విధ విద్యాబలంబున చతుర్వర్గంబుల దెలియుగావున విద్యలనియభిధానము......................................౧౯

ఇతివిద్యాప్రకరణం.

---

శ్లో॥ ఇజ్యాధ్యయనదానాని యథాశాస్త్రం సనాతనం।
బ్రాహ్మణక్షత్రియ విశాం సామాన్యో ధర్మఉ
చ్యతే॥...................................౨౦

బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్యులను - ద్విజాతిసామాన్యంబునకు- యజ్ఞములుజేయుటయు- వేదాధ్యయనమొనర్చుటయు- దేశకాల పాత్రంబులననుసరించి దానమొసంగుటయు-ననుమూడుధర్మంబులును సాధారణంబులనుట - ఇందుపూర్వోక్తంబగువిద్యాస్వరూపానంతరంబున దండతారతమ్యజ్ఞానార్థంబుగా వర్ణాశ్రమలక్షణంబుల నొడువుటకారంభించబడెనని విచారించవలెను..

శ్లో॥ యాజనాధ్యాపనేశుద్ధేః శుద్ధాచ్చప్రతిగ్రహః। వృ
త్తిత్రయమిదంప్రాహుర్మునయోజ్యేష్ఠవర్ణినః౨౧

అందగ్రజుండగు బ్రాహ్మణునకు పరిశుద్ధులగువారిచే యజ్ఞము లుచేయించుటయు - నట్టివారలకధ్యయనము జెప్పుటయు - నట్టి వారలచేద్రవ్యపరిగ్రహంబు జేయుటయునను మూఁడువిధంబులగు వర్తనమనుట..........................................౨౨

శ్లో॥ శస్త్రేణజీవనంరాజ్ఞో భూతానాంచాభిరక్షణం। పా
శుపాల్యంకృషిఃపణ్యంస్మృతంవైశ్యస్యజీవనం౨౨

ఆయుధముచేజీవించుటయథవా దేశకంటకులగువారినిహిం సించిరాజ్యపరిపాలనముజేయుటయు, రాజసమీపమునందుశస్త్ర రూపంబగు సేవయు, సర్వభూతరక్షణంబునను రెండుకృత్యంబులు క్షత్రియజాతికివిశేషంబులనియు-పూర్వోక్తలక్షణలక్షితంబగు-ప శుపాలనంబును, కృషిజేయుటయు, వర్తకమొనర్చుటయు, ననుక ర్మత్రయమువైశ్యజాతికివిశేషంబులనియు, విచారింపవలెను౨౨

శ్లో॥ శూద్రస్యధర్మశ్శుశ్రూషా ద్విజానామనుపూర్వ
శః। శుద్ధాచవృత్తిస్తత్సేవా కారుచారణకర్మచ॥౨౩

పూర్వోక్తులగుబ్రంహ్మ - క్షత్రియ - వైశ్యులను - మూఁడువ ర్ణంబులకును యథాక్రమంబుననిష్కల్మషంబగు మనోభావ ముచేపరిచర్యయొనర్చుట ముఖ్యంబును - పరిశుద్ధంబును- నగువృ త్తియు. శ్లో॥ శూద్రస్యద్విజశుశ్రూషా జీవనంశుద్ధమాహితం। శిల్పైర్వావివిధైర్జీవేద్ద్విజాతిహితమాచరన్ ॥ అనువిధిచేతమ రియు- వర్ణ - రంగోపజీవనము మొదలగుకృత్యంబులునుశూద్ర వృత్తికరంబులనివిచారింపవలెను.....................౨౩

శ్లో॥ గురౌవాసోగ్నిశుశ్రూషాస్వాధ్యాయోబ్రంహ్మ
ధారణం। త్రికాలస్నాయితాభైక్ష్యం గురౌప్రా
ణాంతికీస్థితిః। తదభావేగురుసుతే తథాసబ్రంహ్మ
చారిణి। కామతోవాశ్రమాన్యత్వం స్వధర్మోబ్రం
హ్మచారిణః॥..............................

శ్లో॥ సమేఖలీజటీదండీ ముండీవాగురుసంశ్రయః॥ అవిద్యాగ్రహణాద్గచ్ఛేత్తతో వాశ్రమాంతరం. ౨౪

అందుబ్రహ్మచర్యాశ్రమస్థుండగు బ్రాహ్మణుఁడు - త్రికాలస్నానంబును - నగ్నిశుశ్రూషయు - మౌంజీపాలాశ దండధారణంబులును - మాధుకరము జేయుటయును - గురు - గురుపుత్ర - సహపాఠులసమీపంబులయందు పరిచర్యాదులొనర్చుచుండుటయు - దీక్షవహించియేనియు - క్షౌరంము జేసుకొనుచునేనియు - విద్యాగ్రహణావసానముపర్యంతము వసించి తదనంతరంబైనగ్రహస్థ - వానప్రస్థ - సన్న్యాసాదులకు - వక్ష్యమాణాశ్రమాంతరంబులయందొకటి అంగీకరించుటయేనియు - నట్లులేక నైష్ఠిక బ్రహ్మచారి వ్రతముధరించియేనియు నుండుట బ్రహ్మచారిధర్మంబనఁ. ఇట్టియాశ్రమధర్మంబులు విస్తృతంబులుగావున గ్రంథాంతరంబులవలన దెలియఁదగు.............................. ౨౪

శ్లో॥ అగ్నిహోత్రోపచరణం జీవనంచస్వకర్మభిః।
ధర్మదారేషుకుల్యేషు పర్వవర్జం రతిక్రియా॥
దేవపిత్రతిథిభ్యశ్చ పూజాదీనానుకంపనం॥...౨౫

అందుగ్రహస్థాశ్రమవిధియన - నాద్యులగు బ్రహ్మక్షత్రియవైశ్యులగుద్విజులకు సామాన్యముగా నగ్నిహోత్ర పరిచర్యయును - దేవపితృఅతిథిపూజయును దీనులయందుదయయును - మఱియుంబ్రాహ్మణాదులకు.................................. ౨౫

శ్లో॥ యాజనాధ్యాపనేశుద్ధేవిశిష్టాచ్చప్రతిగ్రహః। శమోదమస్తపశ్శౌచంక్షాంతిరార్జవమేవచ। జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యంబ్రాహ్మంకర్మస్వభావజం॥ ౨౬

అనుయజ్ఞములు జేయించుటయు - నధ్యయనము జేయించుటయు - పరిశుద్ధద్రవ్యగ్రహణంబును - అంతరింద్రియములనగా నరిషడ్వర్గంబులజయించుటయు - బాహ్యేంద్రియంబులనగా హస్తపాదాదులకుపాపకార్యమునంబ్రవర్తించకుండునటుల నిగ్రహించు

టయు త్రపంబొనర్చుటయు - ఓర్పును - పెద్దలయందు భక్తిగలిగి యుండుటయు - లౌకికశాస్త్రాదిజ్ఞానంబును - పరమార్థజ్ఞానంబును వేదశాస్త్రదేవతాప్రామాణ్యబుద్ధియను బ్రహ్మజాతిగుణంబులుగలిగి........................................

శ్లో॥ చతుర్వేదవిదశ్చాపి దేహషడ్వృషళాస్స్మృతాః॥
క్షత్రియాస్సప్తవిజ్ఞేయా వైశ్యాస్త్వష్టౌ ప్రకీర్తితాః॥ నియతాః పాండవశ్రేష్ఠ శూద్రాణామేకవింశతిః। కామః క్రోధశ్చ లోభశ్చ మానశ్చ మదఏవ చ। మద్యమోహాశ్చ ఇత్యేతే దేహషడ్వృషళాస్స్మృతాః। గర్వస్తంభోప్యహంకార ఈర్ష్యాచ ద్రోహఏవచ। పారుష్యం క్రూరతా చేతి సప్తైతే క్షత్రియాస్స్మృతాః। తీక్ష్ణతా నికృతిర్మాయా శౌర్యస్తంభో హ్యనార్జవం। పైశున్యమనృతం చైవ వైశ్యాస్త్వష్టౌ ప్రకీర్తితాః॥ తృష్ణాబుభుక్షానిద్రాచ ఆలస్యంచాఘృణాదయా। అధిశ్చాతివివాదశ్చ ప్రమాదో హీనసత్వతా। భయం పిక్లబతా జాడ్యం పాపకం మన్యురేవచ। ఆశాచాశ్రద్ధధానత్వం మనసశ్చాప్యయంత్రణం। అశౌచం మలినత్వంచ శూద్రాహ్యేతే ప్రకీర్తితాః। యస్మిన్నేతేన దృశ్యంతే సవైబ్రాంహ్మణ ఉచ్యతే॥...... ......... ........౨౭

చతుర్వేదవేత్తయగు బ్రాహ్మణునందేనియు - కామ - క్రోధ - లోభ - మానమద - మద్యమోహంబులను నారువృషళగుణంబులును-గర్వ-౧-స్థంభమనగా మొద్దుతనంబును-౨- అహంకారంబును-౩-ఓర్చమియును-౪-ద్రోహంబును-౫- పరుషములుబలుకుటయు-౬-క్రూరత్వంబును-౭-నను నేడు క్షత్రియగుణంబులును-చురుకును-౧-నమ్మినవారి జెరుచుటయు-౨-మోసంబును-౩-శౌర్యంబు-౪-మూఢతయు-౫-అణిగియుండమియు-౬-పాపములు జేయుటయు-౭-అబద్ధములుబలుకుటయు-౮-అను నెనిమిది వైశ్యగుణంబు

లు-అతిదాహిత్వంబును- ౧- నత్యాకలియు-౨- అతినిద్రయు- ౩ సోమారితనంబును-౪-అఘృణయనగాహింసావిహారంబును-౫దయ యులేమియు- ౬- మనోవ్యాధిత్వంబును-౭-అతివివాదంబును ౮ అజాగ్రతయు-౯-స్థైర్యములేకునికియు- ౧౦-అతిపిరికితనంబును- ౧౧-బేలతనంబును- ౧౨- మోసకృత్యంబును- ౧౩ పాపములుజే యుటయు- ౧౪- దీర్ఘక్రోధంబును- ౧౫- అత్యాశయు- ౧౬- కార్యములందు శ్రద్ధలేకునికియు- ౧౭- తనమనస్సునుస్వాధీనప రిచికొనమియు- ౧౮- మైలతనంబును- ౧౯- అంటునకురోయకు కియు- ౨౦- ననుశూద్రగుణంబులిరువదియును లేకునికియు - రో గముచేబాధితగాని ధర్మదారయందనగా తనభార్యయందు సం తానదారసంరక్షణ - కామోపభోగంబులకొరకు ఏకాదశ్య మాపూర్ణిమాది దేవతాపిత్రుతిథులదప్పించిబుతుకాలంబులయం దుసంచరించుటయును బ్రాహ్మణవృత్తియు.........................౨౭

శ్లో॥ శౌర్యంతేజోధృతిర్దాక్ష్యంయుద్ధే చాప్యపలా
యనం। దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మస్వభా
వజం॥........... ................... ...........

అనుపరాక్రమంబును - ప్రభావంబును - ధైర్యంబును - స మర్థతయు - యుద్ధమునందోటమిలేకునికియు - త్యాగంబును - దొరతనంబును - మరియుబాహుబల - మనోబల- ఉపాయబల- బంధుబలంబులను చతుర్విధబలంబులునుగలపూర్వోక్తసామా న్యగుణంబులననుష్టించుక్షత్రియవృత్తియు॥ శ్లో॥ కృషిగోరక్షవా ణిజ్యం వైశ్యంకర్మస్వభావజం॥..................................

అనుపైరుజేయుటయు- పశురక్షణంబును- వర్తకముజేయు టయు - గలిగిపూర్వోక్తసామాన్యలక్షణంబులననుష్టించు వైశ్య వృత్తియు - ననువర్ణత్రయగృహస్థాశ్రమలక్షణంబనుట- ౨౮

శ్లో॥ జటిత్వమగ్నిహోత్రిత్వం భూశయ్యాజినధా
రణం। వనేవాసఃపయోమూల నీవారఫలవృత్తి

తా। ప్రతిగ్రహనివృత్తిశ్చ త్రిస్నానం బ్రహ్మచారి
తా। దేవతాతిథి పూజాచ ధర్మోయం వనవా
సినః॥....................................౨౮

జడలు ధరించుటయు - అగ్నిపరిచర్యయు - భూమియందు పరుండుటయు - కృష్ణాజినధారణంబును - వనమునందుండుటయు - ఉదకము - గడ్డలు - నివ్వరిధాన్యము - ఫలంబులు మొదలగు వాటిచేనగు దేవతాపిత్రతిథిపూజాశేషము నుపయోగించుటయు - త్రికాల స్నానంబును పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్ సహైవ వా॥ శ్లో॥ అనువిధి ప్రవృత్తోసుండును పుత్రును బ్రహ్మచర్యవ్రతధారణంబును అత్యాపత్కాలంబులయందేనియు ప్రతిగ్రహవర్జనంబు ననగు లక్షణంబులుగలది వానప్రస్థాశ్రమంబనుట........౨౮

శ్లో॥ సర్వారంభపరిత్యాగో భైక్షాశం వృక్షమూలితా।
నిష్పరిగ్రహతా ద్రోహో సమతా సర్వజంతుషు।
ప్రియాప్రియా పరిష్వంగస్సుఖదుఃఖావికారితా।స
బాహ్యాభ్యంతరం శౌచం వాగ్యమో వ్రతచారితా।
సర్వేంద్రియసమాహారో ధారణాధ్యాత్మనిత్యతా।
భావసంశుద్ధిత్యేష పరివ్రాడ్ధర్మ ఉచ్యతే॥...౩౦

సకలైహికస్వర్గసాధనంబులగు కామ్యానుష్ఠానపరిత్యాగంబును - భైక్షముచే దేహయాత్ర నడుపుట - చెట్టుక్రింద నేనియు శూన్యాగార దేవాలయాదులయందు నేనియు నునికియు - పరిగ్రహవర్జంబును - ద్రోహము జేయకుండుటయు - సర్వభూతసమత్వంబును - సుఖదుఃఖంబులయందు మగ్నుండుగాక సమత్వము నొందుటయు - అతివాదము జేయకయు - వ్రతధారణంబును - మనోవాక్కాయంబుల నిగ్రహించుటయు - ధ్యానంబును - ధారణయు - అధ్యాత్మశాస్త్రచింతనంబును - మొదలగునది సన్యాసధర్మంబులని విచారింపవలెను.......................................౩౦

శ్లో॥ అహింసాసూనృతావాణీ సత్యం శౌచం దయాక్ష
మా।వర్ణినాం లింగినాం చైవ సామాన్యో ధర్మ ఉ

చ్యతే । స్వర్గానంత్యాయధర్మోయంసర్వేషాంప్ర
ణినాం । తస్యాభావేచలోకోయం సంకరా
న్నాశమాప్నుయాత్ ॥ .................. ౩౧

అవిహింసజేయకుండుటయు - సత్యముబలుకుటయు - పరి
శుద్ధతయు- భూతదయయును - ఓర్పును - బ్రాహ్మణాదివర్ణం
బులకును - బ్రహ్మచర్యాద్యాశ్రమంబులకును సామాన్యంబగుధ
ర్మంబగుటవలనను - నట్టిధర్మముచేస్వర్గంబును మోక్షంబునుగ
లుగుటయు నట్టిధర్మములేనియెడ వర్ణసంకరంబును - వర్ణసంక
రంబుననను ద్వివిధసంకరములచే లోకమునశించుననుట ... ౩౧

శ్లో॥ ధర్మస్యాస్యయథాన్యాయ్యం భూపతిస్సంప్రవర్త
కః। తస్యాభావేధర్మనాశస్తదభావేజగచ్చ్యుతిః॥ ౩౨

పూర్వోదాహృతంబులగు వర్ణాశ్రమధర్మంబులుయథాశ్ర
మంబున ప్రవర్తింపజేయుటకు దండధారుండగురాజు మూలము
గావున నట్టిరాజులేనియెడ ధర్మనాశంబగుచు లోకమునశించు
ననుట.............................................౩౨

శ్లో॥ వర్ణాశ్రమాణాశ్చారయతో వర్ణాశ్రమవిభాగవిత్ ।
పాతావర్ణాశ్రమాణాంచ పార్థివస్స్వర్గలోక
భాక్ ॥ ....................................... ౩౩

పూర్వోదాహృతంబులగు వర్ణాశ్రమాచారంబు లెఱింగినడి
పించుచు రక్షించుచుండురాజు రాజ్యానంతరంబున స్వర్గసౌ
ఖ్యమనుభవించుననుట.................................౩౩

దండమాహాత్మ్యము.

ఇతియస్మాదుభౌలోకౌ ధారయత్యాత్మవాన్నృ
పః । ప్రజానాంచాత్మనస్సమ్యగ్దండందండీవధార
యేత్ ॥..................................౩౪

జితేంద్రియుండగురాజు ఇహపరలోకంబులును దండనీతిచే
జయించుననుపూర్వహేతువులవలన తనయందును ప్రజలయందు

ను సమానంబగు ధర్మముచే యముని వలెదండమునకు జనులుభా
యమునొందుచునకృత్యంబులప్రవర్తించకుందురనుటులోంచదగిన
ననుట.......................................................... ౩౪

దండతారతమ్యము

ఉద్వేజయతితీక్ష్ణేన మృదునాపరిభూయతే । దం
డేననృపతిస్తస్మాద్యుక్తదండః ప్రశస్యతే॥ ...౩౫

అపరాధమునకధికంబగు దండముగలయడజనులు హింసితు
లగుట వికిలిభయమునొందుదురుగావునను - అపరాధమున
కు న్యూనంబగుదండముగలయడ రాజునవమతిమొనర్చియు కా
ర్యప్రవృత్తులగుదురుగావునను - యుక్తంబగు దండముగలయడ
లోకహితంబగుగావునను - రాజగువాడుయుక్తదండప్రవర్తన
చెందవలయుననుట.................................................. ౩౫

త్రివర్గం వర్ధయత్యాశు రాజ్ఞోదండోయధావిధి।
ప్రయుక్తోథాసమంజస్యాద్వనస్థానపికోపయేత్॥ ౩౬

పూర్వోదాహృతంబగుయుక్తదండము - ధర్మార్థ - కా
మంబులను త్రివర్గంబునువృద్ధిజేయుటవలనను - అట్లుగాకవ్యత్య
స్తముగునపుడులోకబాహ్యులగుచువనంబునసుండు సన్యాసుల
కును కోపముగలుగజేయునన గృహస్థులకున్వాతస్సిద్ధముగా కో
పముత్పాదకంబగుగావున యుక్తదండుండుగావలయుననుట ౩౬

శ్లో॥ లోకోశాస్త్రానుగోయేనో దండోనుద్వేజ నా
చ్ఛ్రియే । ఉద్వేజనాద్ధర్మస్యౌత్తస్మాత్తం సో
మహీపతేః॥.............................................౩౭

లోకవ్యవహారమునగాని యాయాయీదేశ మర్యాదలనుశా
స్త్రమర్యాదలను నతిక్రమించక యుక్తదండుండగుట ఐశ్వర్య
వృద్ధియనునియు - నట్లుగానియెడ ధర్మబాహుళ్యంబగుట పై
శ్వర్యంబుతోడన రాజునాశముసుననియు విచారించవలెను. ౩౭

శ్లో॥ పరస్పరామిషతయా జగతోభిన్నవర్త్మనః । దండా

భావేపరిధ్వంసీ మాత్స్యన్యాయః ప్రవర్తతే॥ ౩౭

దండములేకుండెనేని లోకము నేకమార్గములగుటవలన మత్స్యన్యాయముగా బలవంతులచేదుర్బలులధనప్రాణమానదారాదుల పహృతంబులగుగావున దండధారిత్వము రాజునకవశ్యకార్యంబనుట॥ ........................................ ౩౭

శ్లో॥ జగదేతన్నిరాలంబం కామలోభాదిభిర్బలాత్ ।
నిమజ్జమానంనిరయే రాజ్ఞానండేన ధార్యతే॥ ౩౮

కోరికయు- లోభంబును మొదలుగాగల యరిషడ్వర్గంబులవలన నాధారశూన్యంబగు పురుషుని నీటియందు ముంచునట్లు నరకంబున - లోకంబును మునుగ - జేయుగావుననట్టిలోకంబును వెదురుకర్ర మొదలగుసాధనంబులచే నీటియందుమునుగువాని నెట్లుపయికుద్ధరించునట్లు దండనీతివలన రాజుచే నుద్ధరించ బడునను ట........................................ ౩౮

సర్గోపసంహారము.

శ్లో॥ ఇదం ప్రకృత్యా విషయైర్వశీకృతం పరస్పర స్త్రీధన లోలుపంజగత్ । సనాతనేవర్త్మని సాధుసేవితే ప్రతిష్ఠతేదండభయోపపీడితం॥ .................. ౪౦

స్వభావికంబుగా నన్యోన్యదారధనాదులయం దాసక్తంబగుచు విషయోపహతంబగులోకము దండధరుండగు రాజునకుభయము జెందుచు న్యాయమార్గమునందు వర్తించునను ట... ..౪౦

శ్లో॥ నియతవిషయవర్తీప్రాయశో దండయోగాజ్జగతిపరవశేస్మిన్దుర్లభస్సాధువృత్తః। కృశమధవికలంవా వ్యాధితోవాధనం వాపతిమపికులనారీదండనీత్యాభ్యుపైతి॥........................ ౪౧

సాధారణముగా విషయపరశంబగు నీలోకంబునదండము చే నియడ క్రమవర్తనము దుర్లభంబుగావునను - వివాహపరిగృహీతయయ్యు కృశుండును - పిచ్చివాడును - రోగియు - ధనహీనుండును - నగుపతినివిడుచుగావునను... ... ... ... ... ...

వాక్యం.

భర్తారంద్విషతీయాస్త్రీ సప్తార్తవాన్యమండ
నా యమానా పితదానీమేవ సంస్థాప్యాభర
ణంవిధా యభర్తారమనయాసహశయానమ
పశయీత - ఇతి కౌటిల్యః||....... ...........

అట్లు పెనిమిటిని వదలినకులాంగన తత్కాలంబున రజస్వల యు నలంకారహీనయునుగా నుండినదైనను నాతుణంబున స్నానము జేయించియలంకృత - జేసిదానితోడను భర్తనుశయనమునందు వరుండజేయ వలయునను దండనీతివలన అతిక్రమించుటకు భయము నొంది వర్తించుగావున నవశ్యముదండనీతి నవలంబించవలయునను....... ....... .......౪౧

శ్లో|| ఇతిపరిగణితార్థశాస్త్రమార్గానుసారిణియాను
యః జితాత్మాయః ప్రజాందండనీత్యా| అపసరపగ
మాయప్రాప్తమార్గప్రచారాసరితఇవసముద్రంసం
పదస్తంవిశంతి....... ....... .....౪౨

ఇట్లుధర్మశాస్త్రంబును నర్థశాస్త్రంబును ననుసరించి జితేంద్రియుండగుచు దండనీతినిధరించురాజును సముద్రము నొందునదులవలె సమస్తసామంతరాజములుండలై శ్వర్యము శాశ్వతముగా ననుభవించునట్లు తనంతసంభవించునని ద్వితీయసర్గఫలితార్థము. ....... .......౪౨



తృతీయసర్గప్రారంభము.



శ్లో|| దండందాడీనభూతేషు ధారయన్ధర్మజీవనః ప్ర
జాస్సమనుగృహ్ణీయాత్ప్రజాపతిరివస్వయం ||..౧

పూర్వసర్గోక్తంబగుదండముయమునివలె నిష్పక్షపాతబుద్ధి చేననుష్ఠింపుచు - భూమివలెనోపుచును - బ్రహ్మవలెలోకవృద్ధి

తాత్పర్యమునుం గలవాడగుచు జనులరక్షించుట భూపాలకవశ్య కార్యంబనుట......................................౧

శ్లో॥ వాక్సూనృతా దయా దానం దీనోపగతరక్షణం। ఇతి సంగస్సతాం సాధుహితం సత్పురుషవ్రతం॥...౨

సత్యముబలుకుటయు - దయయును - దీనులకొసంగుటయును శరణాగతరక్షణంబును - ననుకర్మచతుష్టయంబును-సత్సహవాసంబును- సాధువగువారికి హితంబొనర్చుటయును సత్పురుషవ్రతంబులనంబడును... ... .. .. .. ... ... ... ౨

దయాస్వరూపము.

శ్లో॥ ఆపన్నస్య దుఃఖేన తప్తతెనగరీయసా। సమన్వితః కరుణాయా పరయా దీనముద్ధరేత్। న తేభ్యోభ్యధి కాస్సంతి సంతి సత్పురుషవ్రతాః। దుఃఖపంకార్ణవే మగ్నం దీనమభ్యుద్ధరంతియే॥...... ... .. ౩

దీనుండగువాని దుఃఖము తనను జెందినట్టుల దుఃఖించుచు మిక్కిలికరుణగలవాడగుచు దుఃఖంబను సముద్రమున మునిగినవారల దుఃఖముతో నిరీక్షించి నివృత్తి జేయువారగలకన్న నధికులు లేరనియును వారే సత్పురుషవ్రతముగల మహాత్ములనియు నొడువుట దీనులరక్షించవలయుననుట... ... .. ... ... ... ... .. ... ౩

శ్లో॥ దయామాస్థాయ పరమాం ధర్మ్యాదవిచలన్నృపః। పీడితానాము నాథానాం కుర్యాదశ్రుప్రమార్జనం॥.....................................౪

స్వధర్మమునందుచలించకుండుచు దయాయుక్తుండై యన్యులచే పీడితులగు దిక్కులేనివారలకన్నీళ్లుదుడువదగుననుట ....

శ్లో॥ ఆనృశంస్యం పరోధర్మస్సర్వప్రాణిభృతాంమతః। తస్మాద్రాజానృశంస్యేన పాలయేత్కృపణంజనం॥౫

సమస్తప్రాణులకును దయయుంచుట ముఖ్యధర్మంబుగావున కృపణులగుజనంబును రాజురక్షించవలయుననుట...... ..౬

శ్లో॥ నహిస్వసుఖమన్విచ్ఛ న్పీడయేత్కృపణం జనం। కృపణః పీడ్యమానోహి మన్యునా హంతి పార్థివం॥

స్వకీయంబగుసౌఖ్యంబుకొరకు దీనులను పీడించెనేని యట్టి
రాజు ........................................................ ౬

శ్లో॥ ప్రజాపీడనసంతాప సముద్భూతో హుతాశనః।
రాజ్ఞఃశ్రియంకులంప్రాణా న్నాదగ్ధ్వావినివర్తతే॥౭

అనుక్రమంబున నట్టికృపణజనంబుల దుఃఖంబుచే నశించున
నుట........................................................ ౭

శ్లో॥ కోహినామకులేజాతః సుఖలేశోపలోభితః।
అల్పసారాణిభూతాని పీడయేదవిచారయన్॥ ..౮

పూర్వోక్తంబగుదీనులబాధించుట దుష్కులప్రసూతకృత్యం
బు గావున - నట్టిస్వకీయంబగు సుఖలేశమునకాశించి యల్పస
త్వంబులగు దీనులనాత్మీయ యశశ్శ్రీనాశంబులకొరకు కులీనుం
డగురాజేలయోచించక నకృత్యముచేయుననుట. ... ........౮

ఆధివ్యాధిపరీతాయ అద్యశ్వోవావినాశినే। కో
హినామశరీరాయ ధర్మాపేతంసమాచరేత్॥౯

మనఃపీడలచేతను దేహజాడ్యములచేతను - నానావిధ
తాపత్రయంబులచేతను స్థిరతనొందక క్షణభంగురంబగు తన
శరీరసుఖార్థము బుద్ధిమంతుండగురాజేలన ధర్మప్రవర్తకుండ
గుననుట.. ................................................ ..౯

శ్లో॥ ఆపాతే రమణీయమానంహి క్షణందుఃఖైకహ్రా
ద్యతాం। ఛాయామాత్రకమేవేదం పశ్యేముమన
కబిందువత్॥... ... ... ... ... .. ...౧౦

స్వభావముచేకంపును - దుఃఖదంబును - చమటమొదలగు
వాటిచే నసహ్యకరంబునునగు దేహంబునుమహాప్రయత్నాల
బ్ధంబులగు సుగంధానులేపనవస్త్రాభరణంబులచే క్షణకాలమున
కు మనోహరంబుగానొనర్చుట నీటియందు వాయుసంఘట్టన
చేనిర్మితంబగు జలబుద్బుదమువలె నూహించదగియుండనట్టిస్వ
ల్పంబగునాత్మసుఖంబుకొరకేలకులీనుండగు రాజకార్యప్రవర్త
నుండగుననని వైరాగ్యపూర్వకనిషేధము... .. .. .. ౧౦

శ్లో|| మహా వాతాహతిభ్రాంత మేఘమాలాణి పేలవైః।
కథంనామ మహాత్మానో హ్రియంతే విషయారి
భిః|| ... .. .. .. ... ... .. .. ౧౧

పెద్దగాలిచే విచ్చు మేఘములవలె నత్యల్పంబగు విషయంబులయందు మహాత్ములగు రాజులేటికి భ్రమించుచు దీనుల రక్షించకుండుదురనుట... .. ... .. ... ... ... ... ... ౧౧

శ్లో|| జలాంతశ్చంద్రచపలం జీవితంఖలుదేహినాం। త
థావిధమివఙ్ఞాత్వా శశ్వత్కల్యాణ మాచరేత్ ||౧౨

నీటియందు ప్రతిఫలితంబగు చంద్రునియట్లు మనుష్యజీవితకాలంబస్థిరంబుగావునను - ఐశ్వర్యంబు నస్థిరయగుటచేతను మంగళకరంబును కీర్తికరంబునునగు దీనదయామార్గ మవలంబించవలెననుట... ... ... .. .. ... ... .. .. ౧౨

శ్లో|| జగన్మృగతృషాతుల్యం వీక్ష్యేదంక్షణభంగురం।
సుజనైస్సంగమంకుర్యాద్ధర్మాయచ సుఖాయచ||౧౩

ఈలోకంబును యెండమావులతుల్యముగా క్షణస్థితంబులని బుద్ధిచే నాలోచించినవాడగుచు ధర్మార్థకామంబుల క్రమలబ్ధికొరకు వృద్ధోపసేవ జేయవలయుననుట... .. .. ... ... ... ౧౩

శ్లో|| సేవ్యమానస్తుసద్వృత్తై ర్మహానతివిరాజతే।
సుధాలిప్తఇవశ్రీమాన్ప్రాసాదశ్చంద్రరశ్మిభిః||౧౪

సుధాధవళితంబగు ప్రాసాదము చంద్రకిరణకాంతిచే నతిప్రకాశితంబగునట్లు స్వభావతః కల్యాణగుణయుక్తుండగు రాజు వృద్ధోపసేవచే నత్యంతప్రకాశితుండగుననుట.. .. .. ... ౧౪

శ్లో|| హిమాంశుమాలీనతథా నచోత్ఫుల్లోత్పలంసరః।
ఆనంద యతిచేతాంసి యథాసజ్జనచేష్టితం||౧౫||

స్మరణమాత్రముచే నంతకంతకు నత్యంతానందదంబగు సజ్జనచేష్టితమువలె - చూచినపిదప నానందకరంబగు శరత్కాలచంద్రమండలంబును నందుచే వికసితంబగు కుముదవనంబును నెట్లానం

నము గలుగజేయుననుట— ఇచ్చట సజ్జనసహవాసమాహాత్మ్య
ప్రకటనము ఫలితము... ... ... .. .. ... ... .. ౧౫

ఇచ్చట సజ్జనసహవాసాధిక్యముకొరకు దుర్జన
సంగదోషంబులదెలుపంబడు.

శ్లో॥ గ్రీష్మేసూర్యాంశుసంతప్తముద్వేజనమనాశ్రయం
మరుస్థలమివాత్యుగ్రం త్యజేద్దుర్జనసంగతిం॥౧౬॥

జలవృక్షగుల్మవల్లీగృహాదులచే వర్జితంబును గ్రీష్మకాలసూర్యకిరణములచే దహ్యమానంబును నగు మరుకాంతారంబులను విడుచునట్లత్యంతత్వరితముగా దుర్జనసాంగత్యము వదలదగు ననుట... ... ... ... ... ... ... ... .. .. ... ౧౬

శ్లో॥ గ్రాహకశీలోపసంపన్నానకస్మాదేవదుర్జనః। అం
తఃప్రవిశ్యదహతి శుష్కంవృక్షమివానలః॥ ౧౭ ॥

ఎండినచెట్టు బొరియయందు లగ్నంబగు నగ్ని పెద్దమ్రానెట్లావృక్షంబును శూన్యమాపు నాక్రమంబున విద్యాసుశీలగుణంబులచేగూడియుండు మహాత్ములసకృద్దర్శనమాత్రముచే విశ్వాసము గలుగజేసి మూలోత్పాటనము జేయుగావున దుష్టసంసర్గలేశంబును మహాత్ములంగీకరించదగదనుట... .. ... ... ౧౭

శ్లో॥ నిశ్వాసోద్గీర్ణహుతభుగ్ధూమధూమ్రీకృతాననైః।
పరమాశీవిషైస్సంగం కుర్యాన్నత్వేవదుర్జ
నైః॥... ... .. ... ... .. ..... .. ౧౮

అతిక్రూరంబులగుచు స్పర్శమాత్రముచే దహించు కృష్ణసర్పవిషంబుకన్నను దుర్జనసాంగత్యమధికంబుగావునను విషము స్పర్శించువానిమాత్రము సంహరించునదియు-దుర్జనసాంగత్యము క్షణక్షణంబును కులదాహకరంబునుగావున సుతరాం వర్జించదగుననుట... .. ... .. .. .. .. ... ౧౮

శ్లో॥ దీయతేస్వచ్ఛహృదయైః పిండోయేనైవపాణినా।
మార్జారఇవదుర్వృత్తస్తానేవహి విలుంపతి॥౧౯॥

తనకన్నమొసగువానిచేతిని గరచుపిల్లివలె స్వచ్ఛహృద

యులగుచు దనకన్న మొసగుదాతలగృహంబునకును రాజ్యంబు
నకును శత్రుణంబున భంగముగలుగ జేయు దుర్జనసాంగత్యము
వర్జించదగుననుట.. ... ... ... .. ... ... .. ౧౯

శ్లో॥ అసాధ్యం సాధుమంత్రాణాం తీవ్రం వాగ్విషముద్వ
మన్। ద్విజిహ్వో వదనం ధత్తే దుష్టో దుర్జనపన్న
గః॥.. .. ... ... .. .. ... ... ౨౦

మహామంత్రములకు నసాధ్యమును భయంకరమును నగు విషంబుగక్కుచు రెండునాలుకలుగల దుష్టసర్పమువలె కుశలులగు వారి మంత్రాలోచనరూపంబగు ప్రతిక్రియలచే సాధించదగని దురాలాప దుష్కార్యాలోచనంబులుజెప్పుచు కుత్సితవచనములచే వాఙ్మ యతినొందని దుర్మార్గుని నమ్మగూడదనుట .... ౨౦

శ్లో॥ క్రియతేఽభ్యర్హణీయాయ సుజనాయ యథాం
జలిః। తతస్సాధుతరః కార్యో దుర్జనాయ శివా
ర్థినా॥... .. ... ... ... ... .. ౨౧

పూర్వోక్తలక్షణలక్షితుండగు దుర్జనసాంగత్యమెంతమాత్రము జేయగూడదనియు నట్లు కదాచిత్కముగా సంభవించిన యెడ.. .. .. ... ... ... ... ... ... ... .. ౨౧

శ్లో॥ మూర్ఖానప్రష్టవ్యాద్రష్టవ్యాశ్చైన్న తైశ్చసహ
తిష్ఠేత్। యదితిష్ఠేన్నతుకథయేత్ యదికథయే
త్ మూర్ఖవత్కథయేత్॥... .. ... ... ౨౨

అను న్యాయము ననుసరించి యథోచితముగా మాట్లాడుటయును గాక సుజనుండును మాన్యుండును నగు పండితునకొనర్పు మర్యాదారూపంబుగా.. ... ... ... ... ... .....౨౨

శ్లో॥ మధురం గసవద్వాచి వస్తునా విరసస్థితః। యేనమా
ద్యంతి ధీమంతో మధునేవ మధువ్రతాః॥... ... ౨౩

అనుక్రమంబున సుజనునకొనర్చు మధురాలాపాంజలిబంధాదులకన్న నధికముగా సుఖార్థియగువానిచే దుర్జనుండాదరించదగుననుట - అట్లుగానియెడ స్వకీయదౌరాత్మ్యప్రకటనముచే ననర్థమగు కృత్యంబుల జేయుననుట... ... ... ౨౩

శ్లో॥ ప్లాదినీంసర్వసత్వానాం సమ్యగ్జనజిహీర్షయా।
భావయన్సరమాం మైత్రీంవిసృజేత్ క్లాకిక్లీ ౧౨౦॥౨౪
లోకజనంబుల సౌజన్యసంపదకొఱకు సమస్తజనమనోల్లా
సకరంబును మధురంబునునగు వాక్కులు ప్రయోగింపవలయుననుట.

శ్లో॥ ఉద్వేజనీమోంభవతిక్రూరా వాగర్థదోపిసరా।
హృదివిద్ధ ఇవాత్యర్థంయయాసంతప్యతేజగత్।
పీడితోపిహి మేధావీ నతాంవాచముదీరయేత్ । తీ
క్ష్ణవాణు ద్వేగకారిణివిసృష్టాన్యశమాస్త్రకైః । కృ
తంతిదెహినాంమర్మ శస్త్రాణీవవచాంసిచ॥... ౨౫
లోకవ్యవహారప్రయోగ కుశలుండగువానిచే లౌకికవ్యావ
హారమునకసంగతంబును - గర్వదూషితంబును హృదయదుఃఖ
కరంబుననగుమాటలు.... .. ... .. ... ... ... ౨౫

శ్లో॥ వాక్సాయకావదనాన్నిస్సరంతియై రాహతశ్శో
చతిరాత్ర్యహాని । పరస్యనామమసు తెపతంతి
తాన్పండితోనావసృజెత్పరేషు॥ . .. ...౨౬
అనువిధంబున దుష్టవాక్కుల చేలోకము బాణవిద్ధుండగు
వానివలె దుఃఖించుగావున పరులచేహింసితుడయ్యును మేధా
వియగువాడు పరుషములుబలుకదగదనుట... ... ... ౨౬

శ్లో॥ ప్రియమేవాభిధాతవ్యంసత్సునిత్యంద్విషత్సుచ ।
శిఖీవకెకామధురైః ప్రియవాక్యస్యనప్రియః॥ అలం
క్రియంతెశిఖినఃకెకయామదరక్తయా। వాచాలిన
శ్చితోత్యర్థంమాధుర్యగుణయుక్తయా। మదరక్త
స్యహంసస్యకోకిలస్యశిఖండినః। హరంతిన తథా
వాచోయథాసాధువిపశ్చితాం॥... ... ... ౨౭
మదించియుండిన హంసలయొక్కయు. కోకిలములయొక్క
యు- నెమళ్లయొక్కయు - పలుకులకన్నను పండితులగువారల
చేనభిహితంబులగు వాగ్జాలంబులతి మనోహరంబులు గావున
నట్టి వాక్కుల శత్రువులయందును నొడువదగదనుట... ౨౭

శ్లో॥ గుణానురాగీస్థితిమాన్ శ్రద్ధధానో దయాన్వితః ।
ధనంధర్మాయవిసృజేత్ప్రియాంవాచముదీరయన్ ।
యేప్రియాణిప్రభాషంతే ప్రయచ్ఛంతిచసత్కృతం।
శ్రీమంతోవంద్యచరితాదేవాస్తేనరవిగ్రహాః॥...౨౮

జనంబులయందుండు గుణంబులకు మెచ్చుచు శ్రద్ధగలవాఁడై దయాళుతయుగలిగి ప్రియమగు వచనంబుల తోడను సత్కరించి ధనంబుల నొసంగు మహాత్ములు నరరూపము ధరించిన దేవతలనుటకు సందియము లేదనుట. ఇట్లు- యుక్తదండంబును - దయయును- పరుషాలాపవర్జనంబును- మధురాలాపంబులును - దానంబు జేయుటయును- నైదువిధంబులగు లోకసంగ్రహోపాయ కథనానంతరము విశేషము జెప్పబడు... ... ...౨౮

శ్లో॥ శుచిరాస్తిక్యపూతాత్మా పూజయేద్దేవతాస్సదా।
దేవతావద్గురుజన మాత్మవచ్చ సుహృజ్జనం॥౨౯

అంతరంగశుద్ధియనగాన ధర్మాన్వయంబుల స్మరించకుండుట- బహిరంగశుద్ధియనగా దుష్కార్యములు జేయకుండుటయును- ద్వివిధంబగు అశుచిచేవిముక్తుండగుచు స్వవర్ణాశ్రమోచితానుష్ఠానము చేశుచియగుచు - దేవత' వేదప్రామాణ్యముచే పరిశుద్ధుండగుచు సర్వకాలంబునందు దేవతాపూజయు - అట్లుగురుపూజయు - స్వకీయదేహపోషణాక్రమంబున స్నేహితసమూహంబును నర్చించవలెననుట... ... ... ... .. .. ౨౯

శ్లో॥ ప్రణిపాతేనచగురూన్ సతోనూచానచేష్టితైః। కు
ర్వీతాభిముఖాన్ భూత్యై దేవాన్ సుకృతకర్మణా॥
శ్లో॥ సద్భావేనహరేన్మిత్రం సంభ్రమేణచ బాంధ
వాన్ । స్త్రీభృత్యాన్ ప్రేమదానాభ్యాం దాక్షి
ణ్యేనేతరాన్ జనాన్॥... ... ... .. ..౩౦

గురువులనమస్కారముచేతయు- కులక్రమాగతంబగు సన్మార్గవర్తనముచే పెద్దలగువారలను- పుణ్యకర్మములచేదేవతలను- కపటములేనినడతచే మిత్రగణంబును - అత్యంతప్రీతిచే బంధుజ

నంబును - ప్రీతిచేయుటచే ప్రమదాజనంబును - దానముచే భృత్య
వర్గంబును - దాక్షిణ్యాతిశయముచే నితరజనంబుల ననురాగాదులొ
నర్చుటచే నాత్మీయప్రభుతాదులగు సంపదభివృద్ధియగుననుట ౩౨

## సద్వృత్తసముదాయస్వరూపము.

శ్లో॥ అనిందా పరవృత్తేషు స్వధర్మపరిపాలనా । కృపణేషు
దయాళుత్వం సర్వత్ర మధురా గిరః॥ ప్రాణైరప్యుప
కారిత్వం మిత్రాయావ్యభిచారిణే । గృహాగతే పరి
ష్వంగశ్శక్త్యా దానం సహిష్ణుతా । స్వసమృద్ధిష్వను
త్సేకః పరవృద్ధిష్వమత్సరః । నాన్యోపతాపి వచ
నం సర్వద్వంద్వసహిష్ణుతా । బంధుభిర్బంధుసం
యోగస్స్వజనే చతురశ్రతా । తచ్చిత్తానువిధాయి
త్వమితి వృత్తం మహాత్మనాం॥... ......... ౩౩

పూర్వోదాహృతంబులగు విషయకథనానంతరంబున సత్పురుషులగు వారిచే ప్రయోక్తవ్యంబులగు సముదాయధర్మంబులనగా - నన్యులయందలి దోషంబుల నిందించకుండుటయు - స్వకీయ వర్ణాశ్రమ ధర్మము నతిక్రమించకుండుటయు - దీనదయయును - మధురములగు వచనంబుల నాడుటయును - నిష్కపటస్నేహుండగు మిత్రవిషయంబున నాత్మీయప్రాణత్యాగము నొనర్చియైనను నపకారము జేయుటయును - నాత్మీయగృహాగతులకు నాలింగనాదులొనర్చుటయును - తనశక్త్యనుసారంబుగా దేశకాలపాత్రముల నెరింగి దానము జేయుటయును - ఓర్పును - నాత్మీయంబగు నైశ్వర్యంబుచే గర్వము జెందకుండుట - ధర్మార్జితంబులగు నన్యసంపదలయందసూయాత్యాగంబును అనగా నిచ్చట వివక్షితము రాజధర్మము గావున దుష్టసంపన్నిగ్రహమును సూచింపబడెనని నుట॥ అన్యులు దుఃఖించునట్టి పరుషములు పలుకకుండుటయు - లాభాలాభ - సుఖాసుఖ - శీతోష్ణాదులగు ద్వంద్వదుఃఖములయందోర్పును - బంధువుల యెడ బంధుత్వ ప్రకటనంబును - స్వజనులయందార్జవముగలిగి సకలవిషయంబులయందును వారలననువర్తించుటయునను కృత్యములుగలిగియుండుట ముఖ్యమనుట ౩౩

## సర్గోపసంహారము.

శ్లో॥ సనాతనేవ గర్మ్మని సాధురిష్టతా మయం హిపంథాః
గృహమెధినాం గుణః। అనేనగచ్ఛన్నియతం మహా
త్మనామిమంచలోకం పరమంచవిందతి॥..... ౩౭

ఆప్తపురుషోపలాలితంబగు మార్గము ననుష్ఠించు - సర్వా
శ్రమమూలభూతులగు గృహస్థాశ్రమస్థుల మతంబిదియగావు
నవిధినను ష్ఠించుసుజనులిహపరసౌఖ్యంబులొందుదురనుట. ౩౭

శ్లో॥ ఇతిపథివినివేశితాత్మనోరిపుంపిగచ్ఛతి సాధుని
త్రతాం। కిముసుజనగణ స్త్వ మత్సరోవినయగు
ణేనజగద్వశంనయేత్॥... ... .. ... ...౩౮

ఇట్లుపరిశుద్ధంబును మధురంబునునగు మార్గంబునలోకయా
త్రంనడుపుగృహమేధియగు రాజునకుశత్రుగణంబులును వశ్యుల
గుననమత్సరశూన్యులగు సుజనంబులేటికివశ్యులుగాక యుందు
రుగావున రాజగువాడు ఈస్వార్ధసూయారహితుండగుచువినయ
సంపన్నలోకమునుస్వాయత్తమొనర్చుకొనవలయుననుట. ౩౮

శ్లో॥కస్వచనరపతిగస్వస్సంగ్రహఃకప్రజానాం మధురవచ
నమోగాల్లోకమ భ్యాదదీత।మధురవచనపాశైరా
యతాలాంతస్సన్నదమువినహిలోకస్సంస్థితేభేదమెతి॥ .. .. .. ... .. .. .. ... ౩౯

గర్విష్ఠుండగునరపతిచే లోకసంగ్రహమసాధ్యంబగుటవలన
ను- మధురవచనంబులచే లోకసంగ్రహంబసాధ్యంబగుటవలనను
అట్టిమధురవచనంబులను పాశంబులచే కట్టబడియుండులోకం
బు న్యాయవర్తనమునందెంతమాత్రము భేదంబు నొందకుండు
గావునను- ఇంద్రియనిగ్రహియగు రాజుచేలోకరక్షణంబొనర్చ
వలయుననుట... ... ... ... ... ... ... ... ౩౯

ఫలితార్థము.

---

ఇట్లుతృతీయసర్గముసమాప్తము;

---

కామందకీచతుర్థసర్గప్రారంభము.

శ్లో॥ స్వామ్యమాత్యశ్చ రాష్ట్రంచ దుర్గంకోశో బలం
సుహృత్। పరస్పరోపకారీదంసప్తాంగం రాజ్య
ముచ్యతే॥ ... ... ... ... ... ... ... ౧

పూర్వసర్గోక్తవిధిక్రమంబునజితేంద్రియుండగు రాజువిద్యా వృద్ధులతోడ యువణాశ్రమస్థాపన మొనర్చిన పిదప రాజ్యస్వరూపంబగు ప్రధానంబగు స్వామిత్వలక్షణముపూర్వోక్తము- అట్టిలక్షణములుగల రాజుచే జీవనాదులొసంగుటవలనను- నతనిబుద్ధిసహాయమువలననాత్మరక్షణంబును రాజ్యాదిరక్షణంబులు నొనర్చుటవలననీరెండును పరస్పరోపకారంబులగు స్వామి- మంత్రులుప్రధానాంగములనుట పూర్వోక్తులగు రాజమంత్రులచే రాజ్యముసురక్షితంబగుటయు నారాష్ట్రముచే నుత్పన్నంబులగు ద్రవ్యాదులవలన సంరక్షితులగుటయు నిదియుతృతీయాంగమనుట- ప్రభుత్వశక్తిచేతయు నాలోచనచేతయు రాష్ట్ర సంపాదితద్రవ్యము చేత యు నిర్మించబడుటయునట్లునిర్మింపబడిన దుర్గము చే రాష్ట్ర రాజాదులు రక్షించబడుటయునను హేతువు వలన దుర్గము చతుర్థాంగమనుట- స్వామియధికారమువలనను మంత్రియుక్తిచేతయు- రాష్ట్రజనంబులగుణములచేతయు కృష్యాదులచేతయు- దుర్గము నేనైన సంరక్షచేతయువృద్ధియగుటయు- నట్లుప్రవర్ధితంబగుకోశమనగా బొక్కసముచే రాజునకు త్యాగభోగోపయోగంబును-మంత్ర్యాదులకు వేతనంబు చేనుపకారంబును రాజ్యమునకుద్రవ్యాభిబుణము మొదలగు పిధంబులనొసంగుటచే నుపకృతియు- ద్రవ్యవ్యయము లేక దుర్గనిర్మాణమసాధ్యంబగుటయు ననుకారణంబులచేకోశము పంచమాంగమనుట- స్వామిమంత్రి రాజ్యదుర్గకోశరక్షణంబులకొరకు చతురంగబలాభావంబగుట చేనసాధ్య బగుటయు నట్టిబలమునకు తారతమ్యము లెరింగిద్రవ్యదానమానదానాదులచేత రక్షించుటచే రాజుచేతయు - సామర్థ్యమెరింగి కార్యనియోగము చేయుటవలన మంత్రిచేతయు - స

స్వసమృద్ధిచే రాష్ట్రముచేతయు- శత్రుబాధానివారకమగు దు
ర్గముచేతయు- వేతనాదులచే కోశముచేతయు బలమువృద్ధి
నొందుటవలనబలము ఆరవయంగమనుట- నిట్టిషడంగయుక్తంబ
గురాజ్యము స్వతుల్యుండగు నంతరంగరాజుచే పరస్పరసంరక్షి
తంబగుటవలనను రాజ్యము సప్తాంగయుతంబనుట. ... ... ౧

శ్లో॥ ఏకాంగేనాపివికలమేతత్సాధువర్తతే।తస్యసా
మగ్య్రమిచ్ఛన్కుర్వీతాశుపరీక్షణం॥ ... ...౨

పూర్వోక్తంబులగు రాజ్యసప్తాంగంబులలోనొకటి వైకల్యం
బైనను- దేహమునందుండునవయవలంబులగు హస్తపాదాదులం
దొకటిచే హీనమగుమనుజునికరణి సర్వకార్యనిర్వహణ సామ
ర్థ్యాభావంబగుంగావునను- మనుష్యదేహమునందగు వ్యాధి
వ్యాధుల సజ్జనమైత్రిచేతయు నౌషధసేవచేతయు సంరక్షించు
నట్లు రాజుచేసు పరిపూర్వకరక్షణాభావముచే వైకల్యము
నొందుగావున నట్లుగాకుండునట్లు సప్తాంగములననవరతము ప
రీక్షించదగునట... ... ... ... ... ... ... ... ... ౨

అంగప్రధానాంగంబగు రాజాత్మపరీక్షజేయువిధి.

శ్లో॥ ఆత్మానమేవప్రథమమిచ్ఛేద్గుణసమన్వితం। కుర్వీ
తగుణసంపన్నస్తతశ్శేషపరీక్షణం॥ ... ... ౩

పూర్వసర్గోక్తంబులగు శాస్త్రజ్ఞానార్జనవృద్ధోపసేవలవల
ననుగుణసంపత్తులుగలవాడగుచు తదనంతరంబున మాత్యాదుల
గుప్రకృతులపరీక్షించదగు - ఏటికనినగుణహీనుండును విద్యాహీ
నుండును నాచారహీనుండును నగురాజుచే- అన్యులగుణదోషం
బులెరుంగుటయసాధ్యంబును ప్రయోజనాభావంబునునగుటయు-
సంభవించుటవలనతొలుత తాను పరిశుద్ధుండుగావలయుననుట. ౩

శ్లో॥ సాధుభూతల దేవత్వందుష్ప్రాపమకృతాత్మభిః।
ఆత్మసంస్కారసంపన్నోరాజాభవితుమర్హతి॥౪
జితేంద్రియులుగానివారికి లభించుటకర్హంబుగానట్టి ప్ర

భుత్వాభు సద్గుణసంపదాకరంబగునట్టినగుట రాజగువాడు వత్స్య
మాణంబిలగుసుగుణసంపదలతోఁగూడినవాఁడుగావలయుననుట. ౪

శ్లో॥ లోకాధారా రాత్రిష్ఠో రాజ్ఞాం మహాపాంసుపరిగ్ర
హాః। త్రిష్ఠాంత్యాపణివాధారే ధికనాత్మనిసంస్థితే॥ ౫

లోకంబున కాధారంబగుచును జితేంద్రియులుగాని వారిచే
పొందఁదగనిదియు - గ్రహించదగనిదియుగాక ఘట్టికట్టలేనుండుస్థ
లంబునస్రవించుజలంబులవలె లభ్యంబయ్యు ప్రయోజనాభావం
బగుచును నుండెడు రాజ్యసంపద పూర్వోక్తుండగు రాజునందుం
డెనేని దృఢతరసేతుబద్ధంబగు జలాశయంబునందలి జలంబులవలె
శాశ్వతంబుగా నుండుననుట... ... ... .. ... ... ... ౫

అందుసాధునేవ్యగుణగణకథనము.

౧ ౨ ౩ ౪ ౫ ౬
శ్లో॥ కులంశీలంవయస్సత్త్వందాక్షిణ్యంక్షిప్రకారితా। అ

౭ ౮ ౯ ౧౦
విసంవాదితాసత్యంవృద్ధసేవాకృతజ్ఞతా। దైవసం

౧౧ ౧౨ ౧౩ ౧౪
పన్నతాబుద్ధిరక్షుద్రపరివారతా। శక్యసామంత

౧౫ ౧౬
తాచైవతథాచదృఢభక్తితా। దీర్ఘదర్శిత్వము

౧౭ ౧౮ ౧౯ ౨౦ ౨౧
త్సాహఃశుచీతాస్థూలలక్షతా। వినీతతాధార్మిక

తాగుణాస్సాధ్వభిగామికాః॥ .. ... ... ౬

అకులీనుండును మధ్యకులీనుండునగువానియెడ కులతారత
మ్యజ్ఞానపూర్వకంబగు సన్మానముగలిగియుండదుగావున రాజ
గువాఁడుభయవంశపరిశుద్ధుండుగా నుండవలయునిందువలన కులీ
నులగువారల తారతమ్యజ్ఞానముగలిగి యథాక్రమోచితసన్మా
నము జేయుటంజేసి పండితాగ్రణులమన కాధారభూతంబుగావు
న కులీనతముఖ్యగుణమనుట - మంచిస్వభావముగలిగియుండుట
శీలము - బాలుండును వృద్ధుండునునగు రాజుచే కార్యనిర్వహణ
సామర్థ్యముగలుగదుగావున మధ్యవయస్కుఁగా నుండవలయున

నుట - వ్యసనసంతోషాదులయందవికారిత్వముగనుండుటయే
నగా ధైర్యముసత్త్వమనుట - భృత్యులు మొదలగువారియందలి
యనురాగుట దాక్షిణ్యము - మంత్రనిశ్చితములగు మంగళకార్యంబు
ల దీర్ఘసూత్రము జేయక త్వరితముననడిపించుట ఇందువలన
శీఘ్రకార్యలభ్యము వలన జనులచ్చటలగ్నులగుదురనుట. అవిసం
వాదితయనగా తనచేపలుకబడినపలుకునకవ్యర్థము జేయుట -
ఎట్లనన్నొకనికిస్వర్ణదానమొనరుతునని ప్రతిజ్ఞజేసిమరుల మొత్తుదాన
ము జేయు నెడ స్వర్ణదానమనుసాధారణ ప్రతిజ్ఞానిర్వాహణంబ
ద్యల్పదానము వలననుపయోగాభావమొందుటవలన లుబ్ధత్వ
ము ప్రసిద్ధముగుంగావున నట్లు నసమంజసంబులు బలుకకునికియ
నుట- వాస్తవము నుడువుట వృద్ధోపసేవయు- అన్యునిచే జేయబడి
నయుపకారము ప్రత్యుపకారపూర్వకముగా నిర్వహించవలయు
ననుగుణము కృతజ్ఞతయనుట. దైవానుగ్రహముచే స్వల్పయత్న
ముచే మహాత్కార్యము నిర్వహించుట. ... ... ... .. ...

శ్లో॥ గ్రహణంధారణంచైవ స్మరణం ప్రతిపాదనం। ఊ
హాపోహార్థవిజ్ఞానం తత్త్వజ్ఞానంచ ధీగుణాః॥

పరులచే జెప్పబడు తాత్పర్యము గ్రహించుటయు - నదిమరువ
కుండుటయు- సమయమునందుజ్ఞాపకము దెచ్చుకొనుటయు- దా
నిప్రయోగించుటయు- నయ్యర్థముమీదసాధకంబును బాధకం
బును నెరుంగుటయు- నావిషయక తాత్పర్యము నెరుంగుటయు వా
స్తవజ్ఞానంబునునను అష్టాంగంబులును- మరియు. .. .. ...

శ్లో॥ దేశకాలజ్ఞతాదార్ఢ్యం సర్వక్లేశసహిష్ణుతా। స
ర్వవిజ్ఞానతాదాక్ష్య మూర్జస్సంవృతమంత్రతా।
అవిసంవాదితాశౌర్య శక్తిజ్ఞత్వం కృతజ్ఞతా। శర
ణాగతవాత్సల్యం అమర్షిత్వ మచాపలం॥.. ..

దేశమును- కాలమును నెరుంగుటయు - దృఢముగుప్రవేశంబు
ను- ఆపదకోర్చుటయు- కార్యసర్వస్వము నెరుంగుటయు - సము
ర్థతయు- తేజంబనగా బుద్ధిసూక్ష్మతయు-సుప్తమంత్రంబనగా

కార్యపరీక్షాపర్యంతము మంత్రముభిన్నముగాకుండుట - పూర్వోక్తలక్షణలక్షితంబగునవిసంవాదితయు - పరాక్రమంబును అన్యసామర్థ్యమెఱుంగుటయు - కృతజ్ఞతయు - శరణాగతదయయు ఓర్పుగలుగుటయు చాపలము లేమికియు నను పదునాల్గులక్షణంబులును. మఱియు. .... .. ... .. .. ... .. ... ...

శ్లో॥ స్మృతిర్వ్యతీతవిషయా మతిరాగామిగోచరా । బు
ద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాలికీ మతా । బు
ద్ధిర్నవనవోన్మేషశాలినీ ప్రతిభా విదుః॥ .. ... ..

గడచినవిషయంబులోచించుస్మృతియు - భవిష్యదర్థవిచారంబగుమతియు - వర్తమానవిషయవిచారణదక్షబగుబుద్ధియు - భూతభవిష్యద్వర్తమానకాలంబుల నెఱుంగుప్రజ్ఞయు - అంతకంతకు జ్ఞానవికాసముగలుగజేయు ప్రతిభయు నను - భేదంబులచే ప్రసిద్ధంబగుబుద్ధియు - దుర్మార్గులుగాని పరిజనంబులనుంచుటయు - సామంతరాజుల స్వాధీనపరచికొనుటయు - పెద్దలయందవ్యభిచారియగుభక్తియు - దూరమాలోచించుటయు - హరకారాలచే దెలియుటయునను ద్వివిధంబగు దీర్ఘదర్శిత్వంబును - శౌర్యసంత్రాదులగూడియుండుట - పరదార పరధనాదులకాశించక పరిశుద్ధుండగుట. విశేషద్రవ్యములు లక్షలపర్యంతము త్యాగముల్లొసంగుట - అధికులయందు నైచ్యానుసంధానంబును - ధర్మప్రాధాన్యముగా కార్యములనిర్వహించుట - మొదలగునిరువదియొక్క గుణంబులాశ్రితజనాకర్షకములగుననుట... ... ... ... ...౭

శ్లో॥ గుణైరేతైరుపేతస్తు సువ్యక్తమభిగమ్యతే। తథా
చక్షుర్వీతయథాగచ్ఛేల్లోకోఽభిగమ్యతాం॥ ....౮

పూర్వోక్తలక్షణలక్షితంబులగునేకవింశన్మహాగుణంబులు గలుగుటచేలోకము సౌముఖ్యముగానుండుగావున నట్టిగుణంబుగలిగియుండవలయుననుట... .. .. .. .. ... ... ౯

రాజపరివారస్వరూపకథనము.

శ్లో॥ ప్రఖ్యాతవంశ్యమక్రూరం లోకసంగ్రాహిణం శు

చిం! కుర్వీతాత్మ హితాకాంక్షీ పరివారంమహీ
పతిః॥ ... ... ... ... .. ... ... .. ౧౦

స్వకీయ రాజ్యమునకును తనకును సౌఖ్యంబును కీర్తిగోరు చుండురాజు కులమునందు ప్రసిద్ధుఁడును - క్రూరస్వభావము లేనివాఁడును - లోకజనులందయాదాక్షిణ్యగుణంబులచే స్వాధీనపఱచి కొనుగుణముగలవాఁడును - పరిశుద్ధాచారవంతుఁడును - నగుపరివారంబును జేర్చవలయుననుట.. ... .. ... .. .. ౧౦

సన్మార్గము ర్మార్గపరిజనంబుచే నగుగుణదోషంబులు.

శ్లో॥ క్రూరోపిభోగ్యతామేతి పరివారగుణైర్నృపః । న
క్రూరపరివారస్తు వ్యాళాక్రాంత ఇవద్రుమః॥౧౧

సుగుణంబులుగల భృత్యవర్గములుగలరాజు క్రూరస్వభావుండయ్యు పుష్పవాసనచే భావితంబగు హిమాంబువులవలె భోగ్యుండగు గావునను - దుర్గుణంబులుగలభృత్యవర్గంబుచే పరివేష్టింతుండగు రాజు సుస్వభావుండయ్యు సర్పములచే నాక్రాంతంబగు చందనవృక్షమువలె మదర్శుండగుంగావునను - సుగుణంబులుగలపరిజనపరివృతుండు గావలయుననుట.. ... ... ౧౧

శ్లో॥ నిరుంధానాస్సతాంమార్గంభక్షయంతిమహీపతిం।
దుష్టామాత్యాన స్తునచిరాత్తస్మాత్సునచిరోభవేత్॥౧౨

దుర్మార్గులగుమంత్రులు రాజసమీపంబునకు పెద్దలగువారిరాకలేకుండునట్లొనర్చి రాజ్యంబును - నైశ్వర్యంబును - రాజును నాత్మీయమొనరింతురుగావునపరిశుద్ధులగుమంత్రులనుంచికొనియుండవలయుననుట... .. ... ... .. ... ... ... ౧౨

శ్లో॥ విభూతీఃప్రాప్యపరమాః సతాంసంభోగ్యతాంవ్రజేత్ । యాసుసంతోనతిష్ఠంతితావ్యర్థైవవిభూతయః॥.. ... ... .. .. ... ... ... ౧౩

సత్పురుషులచేననుభవించబడకుండెడు రాజైశ్వర్యమువ్యర్థము గావున రాజగువాఁడాత్మీయసంపదపండితోపయోగపడునట్లొనరించవలయుననుట.. ... ... .. .... ... ౧౩

శ్లో॥ అసద్భిరసతామేవ భుజ్యంతేఘనసంపదః। ఫలం
కింపాకవృక్షస్య ధ్వాంక్షౌ భక్షంతినేతరే॥ ...౧౪

వేపచెట్లుపండ్లను కాకులుదినునట్లు- దుష్టులగువారికిగల సం
పద్విశేషంబులు దుష్టభోగ్యమెయగుననుట... ... ... ౧౪

శ్లో॥ వాగ్మీ[౧] ప్రగల్భః[౨] స్మృతిమాన్[౩] దగ్రో[౪] బలవాన్[౫] వశీ[౬]। నే
తా[౭] దండస్య నిపుణః[౮] కృతశిల్పో[౯] స్వవగ్రహః[౧౦]। పరాభి
యోగ[౧౧]ప్రసహస్సర్వదృష్ట[౧౨] ప్రతిక్రియః। పరచ్ఛిద్రాన్వ
వేక్షీ[౧౩] చ సంధివిగ్రహ[౧౪]తత్వవిత్। గూఢమంత్ర ప్రచా[౧౫]
రజ్ఞో దేశ కాలవిభాగవిత్[౧౬]। ఆదాతాసమ్య[౧౭]గర్థా
నాంవినియోక్తాచపాత్రవిత్[౧౮]। క్రోధలోభభయ
ద్రోహస్తంభచాపలవర్జి[౧౯]తః। పరోపతాపపైశున్య
మాత్సర్యేర్ష్యానృతా[౨౦]తిగః। వృద్ధోపదేశసంపన్నశ్శ
క్తో మధురదర్శనః। గుణానురాగీస్థితవాగాత్మసం
పత్ప్రకీర్తితా। ఇత్యాదిగుణసంపన్నే లోకయా
త్రావిదిస్థిరే। నివ్రణైఃపితరీవాస్తే యత్రలోకస్స
పార్థివః। ఆత్మసంపద్గుణైస్సమ్యక్సంయుక్తంయు
క్తకారిణం। మహేంద్రమివరాజానంప్రాప్యలోకో
భివర్ధతే॥ .. .. ... ... ... ౨౧

సదస్సులయందువాక్సంపదగలవాడును ౧ న్యాయ విషయ
మునందు నిగ్రహించిచెప్పదగినవాడును ౨ జ్ఞాపకముగలవాడు
ను౩ సమర్థుండును౪ యుద్ధమునందు యెగురుటలు మొదలగు
క్రియలు దుర్బలులు చేనసాధ్యముగావున బలవంతుండును౫ స్వా
ధీనేంద్రియుండును ౬ చతురంగ బలంబుల దేశకాలము లెరిం
గినదుప్పవాడును - మరియునిందు - ఆజ్ఞాధారకుండనియు దండ

నీతిసమర్థుండనియు - నన్వయించదగు - ౭ చాతుర్యయుతుం
డనియు నానావిధశిల్పవిద్యలయందును సమర్థుండును ౯ మరి
యువర్తకాదులయందును నృత్తగీతాదులయందును సమర్థుం
డును౯ - ప్రమాదమువలన కార్యమునందు తగులుబడియుచాతు
ర్యముచే నివర్తించువాడును ౧౦ అన్యులచేననగా శత్రులచే
జేయబడు పరాక్రమాదులనూచిన ప్రతిక్రియలోనరు [illegible]వాడును
౧౧అన్నివిధంబులగుసంకటంబులకును ప్రతిక్రియాపా[illegible]గల
వాడును ౧౨శత్రువులపొరబాటు వెతు[illegible]త్యమా
ణంబగు సంధివిగ్రహంబులెరుంగువాడును [illegible]లోచనయు
ను నాలోచితకార్యప్రయోగంబును రహస్యముగా నొనర్చు చా
తుర్యముగలవాడును ౧౪ దేశభేద కాలభేదంబులెరింగి తమప
యుక్తకార్యకరణసమర్థుండును ౧౬ న్యాయమార్గముదప్పక
ద్రవ్యార్జనమొనర్చువాడును ౧౭ పాత్రములెరింగిద్రవ్యము వ్ర
యించువాడును ౧౮ కోపము - లోభము - భయము - ద్రోహ
ము - ఆలస్యము - చపలతయు మొదలగుదుర్గుణంబులు లేనివా
డును౧౯ పరులను బాధించుటయు - చాడీలుబలుకుటయు - మ
త్సర మొనర్చుటయు - ఓర్వకునికియు నిట్టివాటి విడుచు వా
డును ౨౦ పెద్దల యుపదేశము వినువాడును ౨౧ స్వచ్ఛంబగు
నడతగలవాడును ౨౨ మనోజ్ఞంబగు సౌష్టవముగలవాడును ౨౩
మంచిగుణములు గలవారలజూచి సంతోషించి ప్రియమొనర్చు
వాడును౨౪ నవ్వుచుమాట్లాడు వాడును ౨౫ నగు రాజగుణంబు
లుపూర్వాచార్యులచే రాజసంపద్గుణంబులనబడియెంగావున ని
దిమొదలగు సుగుణసంపదగలిగిలోకవ్యవహారము దెలిసియుండు
రాజునందు పుత్రుండుతండ్రిచే పోషితుండగునట్లు రాజ్యముపో
షింపబడుగావున నిట్టిగుణసంపన్నుండగు రాజును జెందినరాజ్య
ము ఇంద్రునిచే దేవలోకమువలె క్షేమము జెందియుండుననుట౨౬

శ్లో॥ శుశ్రూషా శ్రవణంచైవ గ్రహణంధారణంతథా। ఊ

హోపోహార్థ విజ్ఞానం తత్వజ్ఞానంచధీగుణాః॥౨౨

వినవలయు విషయంబుల వినుకోరికెయు - వినుటయు - వ
య్యర్థము గ్రహించుటయు - నదిమరువకుండుటయు - నట్టివిష
యంబునందలి సాధకబాధకంబులవిచారణచే వాస్తవజ్ఞానము
దెలియుటయు బుద్ధిగుణంబులనుట.. ... ... .. ... ౨౨

ఉత్సాహగుణంబులు.

శ్లో॥ దాక్ష్యం శైఘ్ర్యమమర్షశ్శౌర్యంచోత్సా
హలక్షణం। గుణైరేతైరుపేతస్స్యాద్రాజాభవితు
మర్హతి॥... .. ... ... ... .... ... ౨౩

ఆలస్యము జేయకునికియు - త్వరయు - పరాభవముసూర్వ
కుండుటయు - పరాక్రమంబును నుత్సాహలక్షణంబులుగావుననిట్టి
గుణంబులు రాజునకుగలిగియుండవలయు.. ... .. ... ౨౩

మహాగుణంబులు.

శ్లో॥ త్యాగస్సత్యంచశౌర్యంచత్రయఏతేమహాగుణాః।
ప్రాప్నోతిహిగుణాన్ సర్వానేభిర్యుక్తో మహీప
తిః॥... .. .. .. ... ... .. .. .. ౨౪

ద్రవ్యమును పాత్రమెఱింగి వ్యయముజేయుటవలన సజ్జనస
మూహానురాగంబును లోకసంగ్రహణంబును - సత్యవాక్యమువ
లనకృషివాణిజ్యాదివృద్ధియు జనులకునమ్మకంబును - శౌర్యంబు
వలననాత్మరాజ్యరక్షాపూర్వకపరరాష్ట్రసంపాదకంబునుం గ
లుగుగావుననుపూర్వోక్తంబులగు రాజగుణంబులన్నియునీగుణ
త్రయముచేసంపాదించదగుంగావునను నీమూడునుమహాగుణం
బులనంబడుగాన నీగుణత్రయంబులగూడినవాడు రాజుగావలయు
ననుట... .. ... ... ... .. .. ... ... ... ... ౨౪

శ్లో॥ త్యాగేనవిక్రమాదిత్యశ్శౌర్యేణశూద్రకః। స
త్యేయుధిష్ఠిరో రాజ్యంప్రాప్తవానితిశ్రూయతే॥౨౫

అతిదాతృత్వగుణప్రాధాన్యముగల విక్రమాదిత్యుండనేక
రాజ్యమనుభవించి శరీరముతో స్వర్గమునా గమనముల నను

భవించెనని విక్రమార్కచరిత్రాదులవలనను - శూద్రకుండను రాజు పరాక్రమముచే ఫలంబనుభవించెనని కాదంబర్యాదులవలనను- సత్యప్రతిజ్ఞవలన యుధిష్ఠిరుండు రాజ్యముఁ జెందెనని భారతాదులవలనను ప్రసిద్ధంబులు గావున నీగుణంబులయందొకటొకటి ననుష్ఠించు వారిట్లుండగుణత్రయవిశిష్టుని సాంబ్రాజ్యమత్యధికంబగుననుట కేమి సందియము నిదృష్టాంతర రూపంబున మహాగుణంబుల నిర్ణయింపఁబడియెనని విచారించవలెను...... ......

ఇట్లు ప్రధానాంగంబగు రాజగుణసంపత్కథనానంతరంబు
నద్వితీయాంగంబగు అమాత్యసంపల్లక్షణము.

శ్లో॥ కులీనాశ్శుచయశ్శూరాగుణవంతోనురాగిణః।దం
డనీతేఃప్రయోక్తారస్సచివాస్స్యుర్మహీపతేః॥ ౨౬

హీనకులజాతుండగు వాఁడు రాజసమీపాగ్రాసనాది మర్యాదార్హుఁడుగా నేరఁడు గావున మంచికులంబుగలవారును- సదాచారయుక్తులును- రణమునందును - వాదమునందును- త్యాగమునందును- శూరులును- జనానురాగసంపాదనగుణయుక్తులును- ఆన్వీక్షిక్యాదిదండనీతిజ్ఞులును- నగువారు రాజమంత్రులు గావలయుననుట.        ఇవియారునుమంత్రిముఖ్యగుణంబులు ..

శ్లో॥ ఉపధాశోధితాస్సత్యాగిహామానాః ఫలోదయం।
తేస్యుస్సర్వంపరీత్యేరణసానురాగాఃకృతాకృతం॥ ౨౭

ధర్మవిషయంబులయందు స్వపక్షపరపక్షములు లేకుండనడుచునమ్మికయనుధర్మోపధయుఁ అధార్మికుఁడగువాని యందలి యర్థంబును గ్రహించి ధర్మత్రయము జేయుట యందాసక్తుండగుటయనునర్థోపధయుఁ రాజమహిష్యాదుల కామించువారలనిష్పక్షపాతముగా నిగ్రహించుటయునట్టి మ కామకృత్యములయందు తాను ప్రవర్తించకుండుటయు నను కామోపధయు ని-మంత్రులయందొకఁడపరాధమొనర్చునెడ శేషసమాజమునందయ్యపరాధనిదర్శన రూపంబగు దండంబువలన భయముగలుగఁజేయుననుభయోపధయునను నీనాల్గువిధంబులగుపరీక్షలచే. ... ... ...

శ్లో॥ నచైవకుర్యాదాత్మానం దేవీంవామాత్యమీశ్వరః।
శౌచహేతోరమాత్యానా మేతత్కౌటిల్యలక్షణం॥

పరీక్షితులు గాని భృత్యవర్గంబుల మొదట రాజు గాని రాజభార్యలు మొదలగువారు గాని విస్రంభము గా సంచరించదగదను కౌటిల్యమతము ననుసరించి యుపధాశుద్ధులగు మంత్రులు రాజ్యఫలముల నభివృద్ధి జేయునర్థతాత్పర్యము గలవారగుచు కృతాకృతంబులగు రాజకార్యంబుల ప్రియముతోడుత పరీక్షించదగుననుట.

శ్లో॥ ఉపేత్యాధీయతేయస్మా దుపధేతితతస్స్మృతా। ఉ
పాయా ఉపధాజ్ఞేయా తయామాత్యాన్ పరీక్ష
యేత్॥ .. .. .. ... .. ౨౮

పూర్వోక్తంబులగు నాల్గువిధంబులగు ధర్మార్థకామభయరూపంబులగు వ్యాజముల చే మంత్రుల పరీక్షించదగుననుట. ౨౮

అందు ప్రధానమంత్రిగుణనిరూపణము.

౧ ౨ ౩ ౪ ౫ ౬
శ్లో॥ స్వవగ్రహో జానపదః కులశీలబలాన్వితః। వాగ్మీ
౭ ౮ ౯ ౧౦
ప్రగల్భశ్చక్షుష్మానుత్సాహీ ప్రతిపత్తిమాన్। స్తం
౧౧ ౧౨ ౧౩ ౧౪ ౧౫ ౧౬
భచాపలహీనశ్చ మైత్రః క్లేశసహశ్శుచిః। సత్యశౌ
౧౭ ౧౮ ౧౯ ౨౦ ౨౧
ర్యధృతిస్థైర్యప్రభావారోగ్యసంయుతః। కృతశిల్ప
౨౨ ౨౩ ౨౪ ౨౫
శ్చదక్షశ్చ ప్రజ్ఞావాన్ ధారణాన్వితః। దృఢభక్తిర
౨౬
కర్తాచవైరాణాం సచివోభవేత్॥... ...౩౧

స్వకీయగుణసంపదచే రాజ్యమునందలి జనంబులన సన్మార్గవర్తులుగాకుండ జేయువాడును ౧- స్వదేశవృత్తాంతము దెలిసి స్వాభిమానమువలన దేశసంరక్షకుండగు గావున - నాగరికుండును ౨- బ్రాహ్మణాద్యసంకరవర్ణజాతుండును ౩-మంచినడతగలవాడును ౪- దృఢదేహముగలవాడును ౫- స్వల్పాక్షరములచే న

థ౯- పౌష్కల్యముగలిగి మధురంబులగువాక్ప్రయోగకుశలుం డును౬- సమధుర్యండును ౭- చారశాస్త్రజ్ఞానంబులను కన్నులు గలవాడును౮- పూర్వోక్తంబులగుశౌర్యామర్షదార్ఢ్యంబులను నుత్సాహగుణంబులుగలవాడును౯- ఆపత్ప్రతిక్రియాకుశలుండు ను - నమ్మకముగలవాడును౧౦ - జడత్వంబునుతొందరయు లేని వాడును ౧౧- దయగలవాడును ౧౨- తొందరనోర్చువాడు ను౧౩- పరిశుద్ధుండును౧౪- సత్యముబల్కువాడును౧౫- పరా క్రమమును౧౬- ధైర్యంబును౧౭-స్థిరబుద్ధియు౧౮-మాహాత్మ్యం బును౧౯- ఆరోగ్యంబును౨౦- గలవాడును- నానావిధశిల్పకళా నిపుణుండును౨౧- శీఘ్రకారియు౨౨- ప్రాజ్ఞుండును౨౩- జ్ఞాప కముగలవాడును౨౪- స్వామియందుదృఢభక్తిగలవాడును౨౫- వైరకృత్యంబుల జేయనివాడును౨౬- మంత్రిగావలయుననుట౩౧

శ్లో॥ స్మృతిస్తత్పరతార్థేషు వితర్కోజ్ఞాననిశ్చయః।
దృఢతామంత్రగుప్తిశ్చమంత్రిసంపత్ప్రకీర్తితా॥౩౨

చిరకాలజ్ఞాపకంబును- కార్యములయందాసక్తియు- విషయ విచారంబును- జ్ఞానమువలనవిషయస్వరూపనిశ్చయంబును-పట్టు దలయును - కార్యములనెరవేర్చునంతకు మంత్రగోపనంబును- మంత్రిముఖ్యగుణంబులనుట.. ... .... .. .. .....౩౨

పురోహితగుణకథనము.

శ్లో॥ త్రయ్యాంచదండనీత్యాంచకుశలఃస్యాత్పురోహి తః।అథర్వ విహితంకుర్యాన్నిత్యంశాంతికపౌష్టి కం।సాధు తేషామమాత్యానాంతద్విద్యైర్భ్యస్తుబు ద్ధిమాన్। చక్షుష్మతాంచశిల్పంచ పరీక్షేతగుణ ద్వయం। కథాయోగేషు బుధ్యేత వాగ్మిత్వంప్ర త్యవాదితాం। స్వజనేభ్యోవిజానీయాత్కులంస్థా నమవగ్రహం। పరికర్మసుదాక్ష్యంచవిజ్ఞానంధార యిష్ణుతాం। గుణత్రయంపరీక్షేతప్రాగల్భ్యంప్ర తిభాంతథా। ఉత్సాహంచప్రభావంచతథా క్లేశ

సహిష్ణుతాం। ధృతించైవానురాగశ్చ స్థైర్యంచా
పదిలక్షయేత్ । భక్తిం మైత్రించ శౌచంచ జానీ
యాద్వ్యవహారతః। సంగ్రామేభ్యో బలం సత్త్వ
మారోగ్యం శీలమేవచ । అస్తబ్ధతామచాపల్యం వై
రాణాంచాప్యకర్తృతాం। ప్రత్యక్షతో విజానీ
యాత్ భద్రతాం క్షుద్రతామపి। ఫలానుమేయా
స్సర్వత్ర పరోక్షగుణవృత్తయః। తస్మాత్ప్రత్యక్షపరోక్ష
వృత్తీనాం ఫలైః కర్మ విభావయేత్॥.. .. ౪౦

వక్ష్యమాణంబులగు నష్టాదశ తీర్థంబులయందు పురోహితుండును మంత్రితుల్యుండుగావున నట్టి పురోహితుండు పూర్వోక్తలక్షణలక్షితంబులగు త్రయీదండనీతులశక్తుండును.. ... ౧

శ్లో॥ తాదృక్సాంవత్సరోప్యస్య జ్యోతిశ్శాస్త్రార్థచింత
కః। ప్రశ్నాభిధానకుశలో హోరాగణితతత్త్వ
విత్॥... .. ... ... ... .. ... ... ..

అనుజ్యోతిర్జ్ఞానముగలుగుటచేత దేశకాల భూచరఖేచరంబులగు ఉత్పాతంబుల నెరింగి తదనుగుణంబులగు శాంతికపౌష్టికాథర్వణికక్రియలవలన సౌఖ్యముగలుగ జేయువాడును ౨ - ప్రత్యక్ష - పరోక్ష - అనుమానంబులచేతయు తత్తుల్యవిద్యావంతుడగుటచేతయు మంత్రులగుణంబులు దెలియువాడును ౩ - శిల్పకళాకుశలుండగుటవలన శిల్పంబులు పరీక్షించువాడును ౪ - సర్వవిషయంబులయందలి ద్వివిధంబులగు గుణంబులపరీక్షించు వాడును ౫ - పండిత గోష్ఠియందహంకారమిథ్యాజ్ఞానాదివర్జితుండగుచు ప్రసంగవశంబులచేస్ఫుటవాగ్మితయు వాచాలకంబును కులస్థానయుక్త ప్రతిక్రియాదులును భూతవ్యాపారప్రతిక్రియలును నెరుంగువాడును ౬ - దుర్గాదికర్మలయందు శక్తిగలవాడును నాలస్యము లేనివాడును ౭ - ప్రజ్ఞగలవాడును ౮ - జ్ఞాపక శక్తిగలవాడును ౧౦ - కృతక్రియమాణకరిష్యమాణంబులగు క్రియారూపంబులగు గుణత్రయంబులయందు ప్రగల్భతయు బుద్ధిచాతుర్యంబునుగ

లవాఁడును౧౧- ఉక్తలక్షణలక్షితంబులగు ఉత్సాహ ప్రభావంబులుగలవాఁడును౧౨- కష్టముల నోర్చువాఁడును౧౩- ధైర్యంబును౧౪- రాజప్రీతియు౧౫- స్థిరబుద్ధియు౧౬- ధనురాస్థానలక్షణంబులు నెఱుంగువాఁడును౧౭- వ్యసనవర్గంబులయందు మంత్రులు మొదలగువారికి రాజునందుఁగల భక్తియు ప్రీతియును వారి శౌర్యములు మొదలగువాటి నెఱుంగువాఁడును౧౮- మరియు రాజునకు యుద్ధములయందుఁగల పరాక్రమంబును బలంబును ఆరోగతయు నంతకవర్తనంబును జడిమయు చపలత్వంబులు వైరంబులు లేకునికియు మొదలగు విషయంబు లెఱుంగువాఁడును౧౯- నిధి మొదలగు ప్రత్యక్షపరోక్ష విషయంబుల నెఱింగి దృఢానురాగుండుగా నుండు పురోహితుండుఁ గావలయు ననుట...... ......౪౦

మంత్రిపురోహితులకార్యప్రయోజనము.

శ్లో॥ సజ్జమానమకార్యేషు నిరుంధ్యుర్మంత్రిణోనృపం।
గురూణామివ చైతేషాం శృణుయాద్వచనంనృపః॥
నరేశ్వరే జగత్సర్వం నిమీలతి నిమీలతి। సూర్యోద
యఇవాంభోజం తత్ప్రబోధే ప్రబుధ్యతి। తదోబ్ధ
యెజ్జగన్నాథం సంబుధ్యేత యథాతథా। ధీసత్త్వో
ద్యోగసంపన్నైస్తత్కార్యంతమపాశ్రితైః॥...౪౩

రాజగువాఁడు జ్ఞానచారనీతిరూపంబులగు నేత్రంబులవలన జాగరితుండుగాని యెడ రాత్రియందు ముకుళితంబులగు తామరసపుష్పంబులఁ జోకను లోకము నిద్రించుఁ గావున నిట్లు నిద్రితుండు గాకుండునటుల బుద్ధిశాలులగు మంత్రి పురోహితులు హితోపదేశంబుల బోధింపవలయుననియు నట్టిమంత్రులబోధ చేపూర్వమునందకార్యాసక్తుండయ్యును గురూపదేశమునందు శ్రద్ధానుండగు శిష్యునివలె సత్కార్యప్రవర్తన దుష్కార్యనివర్తనారూపంబులగు ననుష్ఠానపరత్వంబున రాజగువాఁడు వినుచుండవలయుననుట... ... ... ... ... ... ... ... ... ...౪౩

శ్లో॥ నృపస్య తే హి సుహృదస్త ఏవ గురవో మతాః। య ఏ
నముత్పథగతం వారయంత్యనివారితాః॥ ... ౪౪

దుష్కార్యప్రవర్తితుండగు రాజును బలాత్కారముగానే నియాస్వతంత్రతచే నివర్తింపజేయుచు సత్కార్యప్రవృత్తిగలుగునట్లు జేయువారలే రాజునకు హితులును గురువులును నగుదురనుట.. .. ... ... .. ... .. ... ౪౪

శ్లో॥ సజ్జమానమకార్యేషు సుహృదో వారయంతి యే। న
కేవలం తే సుహృదః గురవో గురవో హి తే॥ ... ౪౫

రాజగువాడు జేయు అకృత్యంబుల స్వతంత్రముగా నివారించుచున్న హితులును గురువులును సాధారణులుగారు గావునట్టివారలు మహాత్ములని వారి విశేషసన్మానము జేయుచు రాజు వారి యాజ్ఞాధారకుండు గావలయు ననుట... ... ... .. .. ౪౫

శ్లో॥ కృతవిద్యోపి బలిభిర్విషయైరనురజ్జనాత్ । రాగో
పరక్తచిత్తస్సన్నకార్యాభిముఖో హి భూపతిః॥.. ౪౬

బలవంతంబులగు విషయములచే గృహీతుండగునేని మహావిద్యావంతుండగు రాజును ఇంద్రియపరవశుండగుచు నకార్యప్రవర్తకుండగునప్పుడు- విద్యాహీనుండగువాడెంతయనుట.. ౪౬

శ్లో॥ పశ్యన్నపి భవత్యంధః పుమాన్ రాగావృతేక్షణః।సు
హృద్వైద్యాశ్చికిత్సంతి నిగ్రహైర్వినయాంజనైః॥ ౪౭

పూర్వోక్తంబులగు నింద్రియవ్యాపారంబులచే పరవశుండగు పురుషుం డైహికాముష్మికద్వయంబులయందును హానికరంబగు కార్యస్వరూపంబుల దెలియమిచే కందంపద్యం విని చెవుడును కనిగుడ్డియు జననాధులకెల్లనివియ సహజగుణంబుల్ అనునీతిక్రమంబున గుడ్డివాడగు రాజును మంత్రులగువారు సద్బోధరూపంబగు నీతియను నంజనముచే వినయంబను దృష్టిని గలుగజేయుదురనుట .. ౪౭

శ్లో॥ రాగమానమదాంధస్య స్ఖలతః శత్రుకంటకైః। హ
స్తావలంబో భవతి సుహృత్సదివ చేష్టితం॥....౪౮

విషయములందభిమానరూపంబగు రాగంబుచేతను గర్వమునచేతను - ఐశ్వర్యాభిజన విద్యావయోరూపంబగు మదంబుల చేతను - అంధుండగుచుననగా కృత్యాకృత్య వివేకహీనుడై గుడ్డివలెనుండుచునందుల ఫలరూపంబగుశత్రుకంటకాదులవలని సంకటంబులవలన దూరగాడుచుండెడు రాజునకునీతిశాస్త్రవిదులు బుద్ధిశాలులు సుహృత్తులునగుమంత్రిప్రచారంబులుఆధారదండరూప బలంబు కాపాడుననుట... .. ... ... ... ౪౮

శ్లో॥ మహోద్ధతస్య నృపతేస్సంకీర్ణస్యైవ దంతినః। గచ్ఛతాం
న్యాయ్యవృత్తస్య నేతారో వాచ్యతాం ఖలు॥ ౪౯

మదమేనుగవలెగర్వముచే నన్యాయప్రవర్తనుండగు రాజునుపూర్వోక్తక్రమంబున మంత్రులు శిక్షించరేని యామంత్రులు లోకమునందపకీర్తికి పాల్పడుదురనుట.. .. .. ... ౪౯

మూడవఅంగంబగు రాష్ట్రసంపత్స్వరూపము:

శ్లో॥ భూగుణైర్వర్ధతే రాష్ట్రం తద్వృద్ధిర్నృపవృద్ధయే। తస్మాద్గుణవతీం భూమిం భూత్యై భూపతి రా
విశేత్॥ ... ... ... .. ... ౫౦

భూగుణంబులనగా రాజ్యజనంబులమంచిగుణంబులును భూమియందలి సస్యసంపదయు ననునుభయవిధగుణంబులచే రాజ్యమువృద్ధిబొందుననియు - నట్టి రాజ్యవృద్ధిచే రాజకోశాదివృద్ధియు క్రమంబుగనగుంగాపున పూర్వోక్తగుణద్వయయుతంబగు రాజ్యమును సంపాదించదగుననుట.. ... .. ... ... ... ౫౦

శ్లో॥ సస్యాకరవతీ పణ్యఖనిద్రవ్యసమన్వితా। గోహితా
భూరిసలిలా పుణ్యైర్జనపదైర్యుతా। రమ్యా సకుం
జరవనా వారిస్థలపథాన్వితా। అదేవమాతృకా చేతి
శస్యతే భూర్విభూతయే॥ .. ... ... ౫౧

సకలపైరులుపుట్టినదియు వాణిజ్యోపయుక్తంబులగుకస్తూర్యాదులుగలుగునదియు - బంగారు మొదలగులోహములయొక్క

ను-రత్నములయొక్క-సుఖనులుగలదియు-పశువులవృద్ధిగలది యు-కీనీరుగలది యు-రమణీయ్యంబగునది యు-వనగులలడవి గలది యు-ఓడలునుబండ్లునును చరించదగినమార్గంబులుగలదియు- వస్లకాల్వలుగలదియుపుణ్యాత్ములగు బ్రాహ్మణాదివర్ణంబులచే సమృద్ధంబగునదియునగురాజ్యంబైశ్వర్యదాయకంబు గావున నట్టిరాజ్యమాక్రమించదగుననుట.. .. .. .. .. .. ౫౨

శ్లో॥ శర్కరాపరపాషాణా సాటవీఃత్యతస్కరా। రూ
క్షాసకంటకవనా సవ్యాళీ చేతిభూరభూ ॥ .. ౫౩

క్షుద్రపాషాణంబులుగలదియు- చవుడు మెండుగాగలదియు రాతిభూమిగానుండునదియు మహారణ్యంబుగలదియుదొంగలు మెండుగానుండునదియు- రోగభూమియు - శత్రుబాధగలదియు ననగాదుష్టజనంబులు నిండుగా నుండునది యు- పాములుగలదియునగుభూమివాసయోగ్యము గాదనుటవలననిట్టిదుర్గుణరహితంబునపూర్వోక్తగుణవిశిష్టంబుననగు రాజ్యము సంపాదించదగుననుట.. ... ... ... ... .. ... .. ౫౩

ఊరిలక్షణము.

శ్లో॥ స్యాజ్జీవోభూగుణైర్యుక్తస్స్యానూపః పర్వతాశ్రయః। శూద్రకారువణిక్ప్రాయో మహారంభకృషీవలః। సానురాగో రిపుద్వేషీపీడాకర్మసహఃపృథుః। నానాదేశ్యైస్సమాకీర్ణోధార్మికఃపశువృద్ధిమాన్। ఈదృగ్జనపదశ్శస్తోమూఢ వ్యసనినాయకః। తంవర్ధయేత్ప్రయత్నేనతస్మాస్సర్వం ప్రవర్ధతే॥ .. .. .. ... ... ౫౬

వర్తకములు మొదలగువ్యాపారములచే చక్కనిజీవనము గలదియుమంచిగుణంబులుగలజనంబులుగలదియు- నదినేనియుసముద్రమునేనియు అంచునగలది అనగానింమచేత నూడలజేరంబునుసర్వసస్యసమృద్ధియుగలుగుననుట। తృణకాష్టసమృద్ధియుపుష్టి

కరంబగుసస్యోత్పాదనకారణంబుననగుటచేత కొండనాశ్రయించినదియు- శూద్రులును అన్నివన్నెబాబులవారును గలదియు- విశేషపయిలుఁజేయుబలవంతులగు సంసారులుఁగలదియు - రాజునందుప్రియముగలజనభరితంబును- శత్రులకవకాశము గలుగఁజేయని అనఁగా స్వామిద్రోహిజనులచేరహితంబగునదియు - గొప్పపన్నుగలపన్ను షనునిగ్రహించునదియనఁగా విశేషపంటగలభూమిగలదియు- విస్తారభూమిగలదియు నానాదేశజనంబులచే నిబిడంబగునదియు నిందువలన నాగరీకముగలుగుననుట- పశుసమృద్ధిగలదియు- మూర్ఖులగు వారిచే విడువబడినదియనఁగా పండితసమృద్ధంబును నగుగ్రామంబునుబస్తీ చేయుటవలన రాజకోశాదివృద్ధియగుననుట... .. ... ... ... .. .. ౫౬

కోటస్వరూపము.

శ్లో॥ పృథుసీమంమహాఖాతం ఉచ్చప్రాకారగోపురం।
సమావసేత్పురం శైలసరిన్మరువనాశ్రయం॥ ౫౭

చుట్టునువిస్తారము బైలుగలదియు- విశాలంబు లోతునుగల అగడ్తలుగలదియు- మిక్కిలి యున్నతంబగు కోటగోడలును పెద్దవాకిళ్లునుగలదియు- కొండయు - నదియు- సముద్రము- దుర్గమంబగు కనములుఅడవులును చుట్టునుగలదియుగా కోటనిర్మించవలయుననుట... ... ... .. .. .. .. .. .. ౫౭

శ్లో॥ జలవత్స్యాసంధాన్వం దుర్గంకాలసహంమహత్।
దుర్గహీనోనరపతిర్వాతాభ్రావయువై స్సమః॥౫౮

నీరుపాగీగలదియులోపలజలసమృద్ధిగలదియు - ధాన్యసంగ్రహముగలదియు- ఆయుధసంపదచే సమృద్ధంబగునదియు - చిరకాలయుద్ధమునందేనియు చలించకుండునదియు నగుదుర్గము లేనిరాజు గాలిచెచీకాకుపడు మబ్బువలెవిచ్చుగావుననీలక్షణములుగల కోటలుండవలయుననుట.. ... ... .. ... ... .. ...౫౮

శ్లో॥ ఔదకంపార్వతంవార్క్షం మైరిణంధాన్వనంత

ధాశ్చ స్తంప్రశ స్తమతిభిస్తద్గందుర్గోపచింతకైః॥ ౫౯

కోటస్వరూపంబులుపదేశించుశుక్రాచార్యులచే- అగడ్తలుగలదియు- కొండసహాయముగలదియు- చుట్టును నీజలంబగునదియగుటచేశత్రులకసాధ్యంబగుననుట - ఆయుధపాణులుచేకొండినదియునగుకోటగలుగవలయుననుట... ... ... ... ... ౫౯

శ్లో॥ జలాన్నాయుధయంత్రాఢ్యాం వీరయోధైరధిష్ఠి
తాం। గుప్తిప్రధానమాచార్యాదుర్గంసమను శంసి రే॥ ౬౦

రాజ రక్షణమునకు ప్రధానసాధనంబగుకోట - నీటిసమృద్ధిచేతయు- ధాన్యసమృద్ధిచేతయు- ఆయుధపూర్తిచేతయు - నానావిధశత్రునిరాసకరంబులగు యంత్రంబులచేతయు ధైర్యవంతులును పరాక్రమవంతులునునగు సరదారులచేతయుగూడియుండవలయుననుట ... ... ... ... ... ... ... ... ౬౦

శ్లో॥ సాపసారాణిదుర్గాణి యవసానూపజాంగలాః।
నివాసాయ ప్రశస్యంతే భూభుజాం భూతిమిచ్ఛ
తాం॥ ... ... ... ... ... ... ... ...౬౧

ఐశ్వర్యకాములగురాజులకు - ఆపత్కాలమునందు తొలిగితప్పించికొను నవకాశముగలదియు - చుట్టువిశాలముగలదియు అడవిగలదియు ధాన్యసమృద్ధిగలదియునగు కోటవాసార్థముగానుండవలయుననుట.. ... ... ... .. .. ... ... ౬౧

కోశస్వరూపము.

శ్లో॥ బహ్వాదానోల్పనిష్స్రావః ఖ్యాతఃపూజితదైవతః।
ఈప్సితద్రవ్యసంపూర్ణః హృద్యస్స్వాప్తైరధిష్ఠితః।
ముక్తాకనకరత్నాఢ్యఃపితృపైతామహోచితః।
ధర్మార్జితోవ్యయసహః కోశఃకోశజ్ఞసమ్మతః।ధ
ర్మహేతోరథార్థాయభృత్యానాంభరణాయ
చ। ఆపదర్థంచ సంగత్యః కోశఃకోశవతాస
దా॥... ... ... ... ... ... ... .. ౬౪

ధర్మపరిపాలనకొరకును స్వప్రయోజన ప్రాప్తియనగాధర్మావిరోధంబగు కామపూరణకొరకును- భృత్య వేతనంబు కొరకును- ఆపత్కాలరక్షణంబుకొరకునునగువాల్గువిధంబు లప్రయోజనార్థమగుబొక్కసము- ధర్మావిరోధంబగు నానోపాయములచేనార్జితమగునదియు- పత్స్యమాణంబగువిధానంబున నల్పవ్యయముగలదియు- ప్రసిద్ధమగునదియు- కుబేరాది దేవతాపూజలుగలదియు-నానావిధనాణ్యములుగలదియు-నలంకారముగలదియు- నమ్మకముగలవారిచే కాపాడబడునదియు- బంగారమణినవరత్నములు మొదలగువాటిచేనిండినదియు కులక్రమాయాతంబగుద్రవ్యసంపత్పరిపూర్ణంబుగా నుండవలయుననుట... •• ౬౮

బలసంపత్కథనము.

శ్లో॥ పిత్రుపైతామహోభూవశ్యస్సంహతోదత్తవేతనః।
విఖ్యాతః పౌరుషైజన్యైఃకుశలఃకుశలైర్వృతః।
నానాప్రహరణోపేతో నానాయుద్ధవిశారదః। నా
నాయోధ సమాకీర్ణోనీరాజితహయద్విపః । ప్ర
వాసాయాసదుఃఖేషుయుద్ధేషుచకృతశ్రమః । అ
ద్వైధ్యఃక్షత్రియ ప్రాయోదండోదండ విదాం
మతః॥ ... ... ... ... ... ... ... ౬౯

కులక్రమంబుగా శౌర్యాదిగుణంబులుగలవాడును- రాజునకువశంవదుండనగా స్వాధీనంబగు నడవడిగలవాడును - శత్రువులచేలోబడనివాడును - తనక్రిందనుండు సైనికులతారతమ్యముదెలిసిసంబళములుక్రమముగానొసంగువాడును- పరాక్రమముచేప్రసిద్ధుండును - జయశీలుండనగా యుద్ధమునందు జయించకమరలనివాడును- నానావిధ ఆయుధవ్యాపారాదులగుశిల్పంబులనిపుణుండును- బుద్ధిమంతులసహవాసముగలవాడును- నానావిధంబులగునాయుధంబుల నుపయోగించువాడును- నానాయుద్ధవిధానకుశలుండును-వివిధవంశోద్భవులగుశూరులచేగూడియుండువాడును- గజహయాదులకనగా చతురంగబలములకుగలనీరాజనం

బను శాంతివిధి దెలిసినవాడును- దేశాంతరభ్రమణసమర్థుండును- యుద్ధసమర్థుండును- నిశ్చలబుద్ధిగలవాడును- క్షత్రియుడుగాని అట్టిక్షత్రియప్రాయుండనగా సూతకుల ప్రసూతు జేసి యుక్షాంగకులంబున బుట్టినవాడేనియు నగువాడును - అనగా బలాఢ్యకుండు గావలయుననుట . ఇట్టివాడు బలాఢ్యకుండగునేని అతని శీఘ్రశక్తి చేబలంబులును నిట్టిగుణంబులుగలవి గానుండుననుట ౬౭

మిత్రసంపత్కథనము.

శ్లో॥ త్యాగవిజ్ఞానసత్వాఢ్యంమహాపక్షంప్రియంవదం।
ఆయతిక్షమమద్వైధ్యంమిత్రంకుర్వీతసత్తులం౬౮

ధనవ్యయ శీలుండును- జ్ఞానముగలవాడును- వికారములేని సాత్వికగుణమునగా స్థిరబుద్ధిగలవాడును - విశేషస్వజనపరివారాదులుగలవాడును- మనోజ్ఞవాగ్వ్యాపారుండును- భావికాలప్రియకరుండును అనగా కృచ్ఛ్రముగు సంకటకాలంబుల సహాయము జేయు స్థిరబుద్ధిగలవాడును- రెండువిధంబులగు బుద్ధులు లేనివాడును- మంచికులముగలవాడును- నగువానిమిత్రునిగా నంగీకరించదగుననుట... .. ... ... .. ... ... .. .. ౬౮

శ్లో॥ సముత్పన్నేషు కృచ్ఛ్రేషు దారుణేష్వప్య సంశ్రయం। దర్శయత్యచ్ఛహృదయః కులీనశ్చతుర
స్రతాం॥... .. ... ... .. ... ... ౬౯

కులీనుండగు వాడు భయంకరంబులగు సంకటకాలంబుల యందును నిర్వహించు వాడగుచు నిజంబగుహృదయనైర్మల్యము గలిగి వక్రగుణంబులు లేనివాడగుచుండుగావున సత్కులప్రసూతుండు మిత్రుండు గావలయుననుట... ... . ... ... ౬౯

శ్లో॥ పితృపైతామహం నిత్యమద్వైధ్యంహృదయా
నుగం। మహాల్లఘుసముత్థానం మిత్రంమిత్రార్థ
మిష్యతే... ... ... .. ... .. ... ౭౦

కులక్రమముగా మిత్రుండగుచు నిత్యమైత్రిగలవాడును. అంతరంగబహిరంగ వ్యాపారతుల్యుండును. మనోజ్ఞుండును- మం

త్రబలముచే కార్యముల సులభోపాయంబున సాధించువాఁడును-
నగువాఁడు పరస్పరము మైత్రిగలిగియుండుటకుదగునునుట.... ౭౦

శ్లో॥ దూరాదేవాభిగమనంస్పష్టార్థా హృదయానుగా। వాక్సత్కృత్యప్రదానంచ త్రివిధోమిత్రసంగ్రహః॥... ... .. .. ... ... ... ... ౭౧

మిత్రాగమన సమయంబునదూరమెదురేగుటయు - స్నేహముతోఁగూడియుండు కపటరహితంబులగు వాగ్వ్యాపారంబులును- మర్యాదాపూర్వకంబగునుడుగర లొసంగుటయునను మూఁడును మిత్రసంపాదనవ్యాపారంబులనుట... ... ... ... ౭౧

శ్లో॥ ధర్మకామార్థసంయోగోమిత్రాత్తుత్రివిధంఫలం। యస్మిన్నేతత్త్రయంనాస్తినతంసెవేతపండితః॥౭౨

యుక్తిసహాయంబును దేహసహాయంబును ఉత్సాహమొనర్చుటయు - బలసహాయమొనర్చుటయు మొదలగుక్రియావిశేషములచేధర్మార్థకామములనుత్రివర్గవృద్ధిజేయుటమిత్రగుణంబుగావుననట్టిసహాయుండుగామిత్రునిమిత్రత్వమువ్యర్థమనుట ౭౨

శ్లో॥ ఔరసంమాతృసంబంధం తథావంశక్రమాగతం। రక్షితంవ్యసనేభ్యశ్చ మిత్రంజ్ఞేయంచతుర్విధం౭౩

స్వకీయులగుపిత్రుసంబంధులును - తల్లివంకవారును - కులక్రమముగా స్నేహసంబంధముగలవారును - ఆపత్కాలమునందు రక్షించువాఁడును- ననుచతుర్విధంబులగు వారును మిత్రులనదగుననుట... ... ... ... ... ... ... ... ... ... ... ౭౩

శ్లో॥ శుచితాత్యాగితాశౌర్యం సమానసుఖదుఃఖతా।అనురాగశ్చదాక్ష్యంచసత్యావాచస్సుహృద్గుణాః॥ తదర్థేష్వనురాగశ్చసంక్షిప్తంమిత్రలక్షణం।యస్మిన్నేతన్నతన్మిత్రంతత్రత్యాజ్యానంనవిక్షిపేత్ ౭౪

మనఃపరిశుద్ధతయు- దాతృత్వంబును - పరాక్రమంబును- సమానసుఖదుఃఖత్వంబును-ప్రీతియు సమర్థతయు - సత్యంబబల్కుటయు - మిత్రునికార్యంబులయందనురాగంబును మిత్రము

ఖ్యగుణంబులుగావున నిట్టిగుణంబులులేనివానితో నమ్మిస్నేహము జేయదగదనుట .. .. ... ... ... ... ... ... ౭౫

శ్లో॥ ఆదావతన్వ్యోబృహన్మధ్యా విస్తారిణ్యఃపదేపదే।
యాయిన్యోన నివర్తిన్యఃసతాంమైత్ర్యస్సరిత్సమాః॥... ... ... .. ... .. .. .. ౭౬

మంచివారలస్నేహము స్వల్పారంభముగలిగియు అంతకంతకధికంబగుచు ప్రతిక్షణమునందును నధికరించుచు నశోష్యముగాప్రవాహరూపంబగుచుండుననుట.. .. ..., ... ౭౬

సర్గాంతశ్లోకములు.

శ్లో॥ ఇతిస్మరాజ్యంసకలంసమీరితం పరాప్రతిష్ఠాస్యధనంససాధనం। గృహీతమేతన్నృపుణేన మంత్రిణా త్రివర్గనిష్పత్తిముపైతిశాశ్వతీం। యథాంతరాత్మాప్రకృతీరధిష్ఠితశ్చరాచరంవిశ్వమిదంసమశ్నుతే తథానరేంద్రఃప్రకృతీ రధిష్ఠితఃపరంశ్రియంజానపదంసమశ్నుతే। ప్రకృతిభిరితి సమ్యగన్వితోజనపదమాదరవాన్ప్రపాలయేత్। జనపదపరిపాలనాచ్చిరంస్పృశతినృపః పరమంపదంశ్రియః॥ ప్రకృతిగుణసమన్వితస్సుధీర్వ్రజతినృపః స్పృహణీయతాంపరాం। సచభవతిరణేష్వపిద్విషాంప్రళయ ఇవశ్వసనఃపయోముచాం॥.. ... ... .. ౮౦

పూర్వోక్తంబులగుప్రకృతిసప్తకంబులకును ద్రవ్యసాధనపూర్వకంబగు రాజ్యవృద్ధియు త్రివర్గప్రాప్తియుగలుగుంగావునను. ప్రకృతిగుణంబులతోగూడిన అంతరాత్మలోకము ననుభవించునట్లు రాజురాజ్యసుఖములనుభవించుచు శత్రులకజేయుండగుగావుననీవిధినిసప్తాంగరక్షశోధనములజేయదగుననుట... ... ..

నాల్గవసర్గముసమాప్తము.

## పంచమసర్గప్రారంభః.



శ్లో॥ వృత్తస్థం వృత్తిసంపన్నం కల్పవృక్షోపమం నృపమ్ ।
అభిగమ్య గుణైర్యుక్తం సేవేరన్ననుజీవినః॥ ... ౧

పూర్వసర్గంబున ప్రకృతిసప్తకలక్షణంబులు నొడువుటచేసీసర్గంబున భృత్యలక్షణంబు చెప్పుట కారంభమొనరించి యందు మంచినడతగలిగినట్టియు ద్రవ్యముగలిగినట్టియు కల్పవృక్షము వలె కోరిన ప్రయోజనంబులొసంగునట్టియు కులశీలాచారాదులచే నాశ్రయించదగు గుణంబులుగలిగినట్టియు రాజును పూర్వోక్తులగు మంత్ర్యాదులాశ్రయించదగుననుట... .. ... ... ... ౧

శ్లో॥ ద్రవ్యప్రకృతిహీనోపి సేవ్యస్స్యాద్గుణాన్వితః భ
వత్యాజీవనం తస్మాచ్ఛ్లాఘ్యం కాలాంతరాదపి॥ ౨

కాలవశముచే ద్రవ్యసంపద్హీనుండయ్యును మంచిగుణంబులుగలవాడగు రాజు నాశ్రయించెనేని యారాజువలన మరియొక సమయంబున నేనియు సంపూర్ణవృత్తికరంబగు శ్లాఘ్యజీవనము గలుగుననుట... ... ... .. ... ... .. ౨

శ్లో॥ న స్వేవానాత్మసంపన్నాం వృత్తిమీహేత పండితః।
అపిస్థాణువదాసీత శుష్యన్పరిగతః క్షుధా॥ .. ౩

పూర్వోక్తశ్లాఘ్యగుణయుక్తుండు గాక ద్రవ్యసంపదయుక్తుండగు రాజు నాశ్రయించుకంటె వృత్తిహీనుండగుచు నాకలిచే శుష్కించుచు నేనియునుండదగుగాని పండితుండగువాడు దుష్టరాజసేవచే లభించు జీవనమునపేక్షించదగదనుట.. ... .. ౩

శ్లో॥ అనాత్మవాన్నయద్వేషీ వర్ధయేదరిసంపదమ్ ।
ప్రాప్యాపి మహదైశ్వర్యం సానుజీవీ వినశ్యతి॥ ౪

ఇంద్రియజయములేక నీతిశాస్త్రము నాక్షేపించుచుండు రాజు మహదైశ్వర్యవంతుండయ్యు శత్రుసంపద్వృద్ధికరుండగుచు భృత్యకోశసహితంబుగా నశించుననుట... ... .. ... ౪

శ్లో॥ లబ్ధావకాశోనిపుణమాత్మవత్యవికారవాన్।స్థానె
స్థైర్యమావాప్నోతిమంత్రసాధ్యేషునిశ్చితః॥ ౫

ఆత్మసంపద్గుణాదులుగలుగురాజుసదస్సునందు ప్రవిష్టుండగుపండితుండగుభృత్యుండుమంత్రసాధ్యంబులగు క్రియావిశేషంబులయందునిశ్చితుండగుచు రాజవృద్ధిపూర్వకంబగు నాత్మస్థైర్యమునొందుననుట.. ... .. ... ... ... ... ౫

శ్లో॥ ఆయత్యాంచదదాత్వేచ యత్స్యాదాస్వాదపే
శలం। తన్నికృశ్యన్నపికుర్వీ తనలోకద్విషమాచ
రేత్॥ ... .. ... ... ... .. ౬

ఆదాయవ్యయవిషయంబులయందుసర్వజనసమ్మతంబగుక్రమంబగువృత్తినాత్మీయశ్రమచేతనేనియుననుష్ఠించదగుగానిలోకద్వేషకరంబగుకృత్యములుపజీవిజేయదగదనుట... ... ... ౬

శ్లో॥ తిలాశ్చంపకపుష్పస్యసంశ్లేషాద్యాతిగంధవత్। ల
సోనభక్షా స్తద్గంధాస్సర్వేసాంక్రామికాగుణాః॥ ౭

సంపెంగపువ్వులతోచేరిననువ్వులవలనగంధతైలము త్పత్తియగుటయు- ఉల్లిగడ్డభక్షించువానినోరు కంపుకొట్టుటయుప్రసిద్ధముగావున దుష్టసహవాసమువర్జించి శిష్టపండితజనమైత్రిగలిగియుండదగుననుట. ... ... .. ... ... ౭

శ్లో॥ అపాంప్రవాహోగాంగోపిసముద్రంప్రాప్యత
ద్రసః।భవత్యవశ్యంతద్విద్వాన్నాశ్రయేదశుభా
త్మకం॥ .. .... .. .... .. ౮

మధురస్వభావముగల గంగోదకంబును సముద్రసంగమము చేనుప్పగుచునపేయంబగుగావున పండితుండగువాడుదుష్టసంపర్కముజేయదగదనుట.. ... ... .. ... ... ౮

శ్లో॥ క్లిశ్యన్నపిహిమేధావీశుద్ధంజీవనమాచరేత్।తేనె
హశ్లాఘ్యతామేతిలోకేభ్యశ్చనహీయతె॥ ... ౯

బుద్ధిశాలియగుభృత్యుడుదుష్టరాజసేవ జేయుటచే లభించు విశేషలాభమునిచ్ఛింపక కించిచ్ఛ్రమచేనైనను యోగ్యుండగు రాజసేవయుపరిశుద్ధంబగునడతయు గలిగియుండెనేని లోకద్వయంబులయందును కీర్తిప్రతిష్ఠలుగలవాడగుననుట... ... ౯

శ్లో॥ లభిలష్యంస్థిరంపుణ్యంఖ్యాతంసద్భిర్నిషేవితం। సేవేతసిద్ధిమన్విచ్ఛన్ శ్లాఘ్యంవింధ్యమివేశ్వరం॥౧౦

సత్పురుషులచేనిచ్ఛింపదగువాడును - అచలంబగునను రాగముగలవాడును- పుణ్యాత్ముండును- పెద్దలచే సేవింపబడువాడును- నగురాజును ఆత్మీయసేవాసాఫల్యముకొరకు సేవింపదగుననుట.. ... .. .. .. .. ... ... ౧౦

శ్లో॥ దురాపమపిలోకేస్మిన్యద్యద్వస్త్వభివాంఛతి।తత్తదాప్నోతిమేధావీతస్మాత్కార్యస్సముద్యమః॥౧౧

యత్నముజేయుటవలనలోకమునందులభించదగినవస్తువిశేషంబులునులభ్యంబగుగావున బుద్ధిశాలియగువాడు నిరుద్యోగిగాకపూర్వోక్తలక్షణలక్షితుండగురాజసేవజేయదగుననుట౧౧

శ్లో॥ ఆరిరాధయిషుస్సమ్యగనుజీవీమహీపతిం। విద్యావినయశిల్పాద్యైరాత్మానముపపాదయేత్॥ ౧౨

విద్యచేతయు- వినయముచేతయు - నానావిధచమత్కారములచేతయు - రాజునారాధించుచు నతనియనుగ్రహపాత్రుండుగావలయుననుట.

రాజసేవజేయనిచ్ఛించుపురుషుండు- ఆన్వీక్షక్యాదివిద్యలచేతయు- ఇంద్రియనిగ్రహాదిగుణములజేతయు- నానావిధ శిల్పచాతుర్యముచేతయు మరియుసమయోచితాలాపకౌశలముజేతయుసడిసన్నవాడుగావలయుననుట...... ... ... ౧౨

శ్లో॥ కులవిద్యాశ్రుతౌదార్యశిల్పవిక్రమధైర్యవాన్।వపుస్సత్వబలారోగ్యస్థైర్యశౌచదయాన్వితః।పైశున్యద్రోహసంభేదశౌర్యలౌల్యానృతాతిగః। స్తంభచాపలహీనశ్చ సేవనంకర్తుమర్హతి॥ ... ... ౧౪

మందిరములీనతయు-పూర్వోక్తంబులగు నాన్వీక్షక్యాదివిద్యా యుక్తతయు - వృద్ధసేవయు - దాక్ష్యంత్వంబును - నానావిధ శిల్ప కౌశలంబును- ధైర్యంబును - పరాక్రమంబును- దేహదృఢతయు- సత్వగుణంబును- బలంబును- నిరోగతయు- కార్యములయందుస్థిరబుద్ధియు- లంచముదీయకుండుట మొదలగు పరిశుద్ధగుణంబులు ను- భూతదయయుగలవాఁడును- పాపంబును- ద్రోహంబును మి త్రభేదము జేయుటయు- దుష్టత్వంబును- చపలతయు - నసత్య మాడుటయు- జిహ్వాదిచాపల్యంబును మొదలగుదుర్గుణంబులు లేనివాఁడును రాజసేవకార్హుండగుననుట. .. ... .. ౧౪

శ్లో॥ దక్షతాభద్రతాదార్ఢ్యంక్షాంతిఃక్లేశసహిష్ణు
తా। సంతోషశ్శీలముత్సాహోమండయంత్యను
జీవినం॥... ... ... .. ... ౧౫

కార్యములనతిత్వరితంబున శ్రేష్ఠముగానిర్వహించుటయు- మంగళాచరణంబును- దేహపటుత్వంబును- ఓర్పును- సంకట ములనోర్చుటయు- ఆత్మవృత్తివలన సంతోషించుటయు-కార్యో ద్యోగనిత్యతయు- భృత్యముఖ్యగుణంబులు. ... ... ..

శ్లో॥ అర్థశౌచపరోనిత్యంగుణైరేతైస్సమన్వితః।భూత
యేభూతిసంపన్నాంసాధువిశ్వాసయేన్నృపం॥౧౬

ద్రవ్యవిషయంబున మిక్కిలిపరిశుద్ధుండగుటఉపజీవిప్రధానగు ణంబుగావున నట్టిగుణముగలిగి పూర్వోదాహృతగుణియగుచు- స్వకీయవృద్ధికొరకు ఐశ్వర్యవంతుఁడగు రాజునకుతనయందు న మ్మకముగలుగునట్లు ప్రవర్తించవలెననుట. ... .. ౧౬

శ్లో॥ ప్రవిశ్యసభ్యాగుదితేస్థానేతిష్ఠేత్సువేషవాన్।య
థాకాలముపాసీతరాజానంవినయాన్వితః॥ ౧౭

స్వకీయంబగువిద్యోచితకాలంబున యుక్తవిధానంబుగానా స్థానమునజొచ్చి తనకుదగిన వేషముగలవాఁడగుచు తనకుచితం బగుస్థలంబునగూర్చుండి వినయాదిగుణంబులుగలవాఁడగుచు రా జసేవజేయదగుననుట.... ... ... .. .. ౧౭

శ్లో॥ పరస్థానాసనంక్రౌర్యంమత్సరంసహసాత్యజేత్।నీ
గృహ్యైకద్ధనంచైవనకుర్యాజ్జ్యాయసాసహ॥౧౮

అన్యుఁడుగూర్చుండుస్థలంబును అన్యుఁడుగూర్చుండుఆసనంబును క్రూరతయు- దీర్ఘవైరంబును- తిరస్కరించుటయు- పైయుద్యోగస్థునినెదిరించుటయు- మొదలగుదుర్గుణంబులు విడవదగుననుట.

శ్లో॥విప్రలంబంచమాయాంచస్తైయ్యందంభంచవర్జయేత్।
పుత్రేభ్యశ్చనమస్కుర్యాద్వల్లభేభ్యశ్చభూపతేః॥౧౯

వ్యర్థప్రలాపంబులును- మోసంబును- దొంగిలించుటయు- డాంబికంబునువిడిచి- రాజపుత్రులకును రాజపురోహితులు మొదలగుమన్ననగలవారలకునునిత్యనమస్కారములు జేయదగుననుట. ... ... ... ... ... ... ... ౧౯

శ్లో॥ ననర్మసచివైస్సార్థంకించిదప్యప్రియంవదేత్।తే
హిమర్మాణ్యభిఘ్నంతిప్రహసైస్సైవసంసది॥౨౦

రాజునకువినోద సహాయులగు విదూషకాదులు రాజునొద్దస్వతంత్రత వహించియుండువారగుట వారలు తమకప్రియులగువారిరహస్యవృత్తాంతంబులనగా దోషంబులప్రస్తావవ్యాజంబునసభయందు నొడివియగౌరవింతురుగావున నట్టి వారితోవిరోధంబునువిశేషమైత్రియు జేయదగదనుట. .. ... ౨౦

శ్లో॥ భర్తురన్వాసనేతిష్ఠే ద్దృష్టింనాన్యత్రనిక్షిపేత్।
బ్రూయాత్కియదపీత్యస్యముఖంచ రాస్యంవిలో
కయన్॥ .. ..... ... .. ౨౧

రాజాసనసమీపస్థానమున గూర్చుండి ఏకాలంబుననే మియాజ్ఞాపించు నోయను తాత్పర్యముచే అన్యత్రదృష్టితాత్పర్యములప్రసరింపజేయక రాజముఖావలోకనము జేయుచుండవలయుననుట. .. ... ... .. .. ... ... ౨౧

శ్లో॥ కోత్రేత్యహమితిబ్రూయాత్సమ్యగాజ్ఞాపయేతిచ।
ఆజ్ఞాంచాపితథాకుర్యాద్యథాశక్త్యవిలంబతం॥౨౨

ఎవరక్కడయని రాజు చేనాహ్వానముజేయు నెడ నేననియు నాజ్ఞాపించదగునని విన్నవించి భర్తృ రాజ్ఞను శక్తివంచన లేక సాధ్యంబగుత్వరితకాలంబున నెరవేర్పదగుననుట. .. ౨౨

శ్లో॥ఉచ్చైఃప్రహసనంకాసంష్ఠీవనంకుత్సనతంథాద్బ్రుం
భేణంగా త్రభంగంచపర్వస్ఫోటంచవర్జయేత్. ౨౩

రాజసదస్సునందు - చప్పుడగునట్లునవ్వుటయు- దగ్గుటయు- ఆవులించుటయు- అన్యనిందాదుల జేయుటయు- కేకరించుటయు- ఒడలువికారముగావిరచుటయు - వ్రేళ్లువిరచుటయు మొదలగున ల్పకార్యములు జేయదగదనుట ... ... ... .. ౨౩

శ్లో॥ప్రవిశ్యసానురాగస్యచి త్తంచి త్తజ్ఞసంమతః । సను
ర్థయఃశ్చతత్పథ్యం సాధుభాషితభాషితం. ౨౪

తనయందుకార్యకరణవిశేషంబున ప్రియుండగు రాజునకుఅభిమత కార్యనిర్వహణ దక్షుండగుచు దయగలుగజేయుటయెగాక రాజపార్శ్వచరులగువారికిని ప్రియుండగుచు రాజాభిమతంబగువిషయంబును నిజబుద్ధిబలంబున రసపోషణము జేయుచు ప్రకరణానుసారంబగు మధురవాక్కుగావలయుననుట... ..౨౪

శ్లో॥ తన్నియోగేన వాబ్రూయాదర్థంసుపరి నిశ్చి
తం । సుఖప్రబంధగోష్ఠీషు వాదేవావాదినాం
మతం॥ .. ... ... ... ... ౨౫

పండితులపరస్పరప్రసంగకాలంబున కక్షి ప్రతికక్షులబలాబలంబులెరింగినిశ్చితంబగునర్థంబును పూర్వోక్తక్రమంబున నేనియు- రాజాజ్ఞానంతరంబున నేనియు నొడువదగుననుట.. ౨౫

శ్లో॥ విజానన్నపినబ్రూయాద్భర్తుఃక్షిప్తోత్తరంవచః ।
ప్రవీణోపిహిమేధావీవర్జయేదభిమానితాం॥౨౬

తానుసమర్థుండయ్యునుఅహంకారముచే రాజాభిమత్యతిరిక్తంబును రాజునొడువుట కవకాశము లేనిదియునునగుయుక్తుల దెలిసియుబలుకదగదనుట. ... .. ... ... ౨౬

శ్లో॥ యద్యప్యుచ్చైర్విజానీయాన్నీచై స్తదపికీర్తయే
త్ । కస్మిన్ జాతస్యవైశిష్ట్యంకథయేద్వినయాన్వితః॥౨౭

తనకుచక్కగా దెలిసిన కార్యంబునుకొంచముదెలుసునని వి
నయపూర్వకంబుగా విన్నపించి స్వకీయకార్యనిర్వహణశక్తిని
కార్యరూపముగానిర్వహింపజేసిపను వినయపూర్వకంబుగాభ
వదాజ్ఞప్తకార్యముభవదాజ్ఞాలంబనబలముచే నాచేయధాశక్తిని
ప్రకారము జేయబడియెనని పునివి జేయదగుననుట. ... ౨౬

శ్లో॥ ఆపద్యున్మార్గగమనే కార్యకాలాత్యయేపిచ। అపృష్టో
పిహితాన్వేషీ బ్రూయాత్కల్యాణభాషితం౨౮

రాజహితంబుగోరుచుండెడు భృత్యుడు- శత్రులచే నాపద
సంభవించునవసరంబునను- రాజుదుర్మార్గప్రవర్తకుండగునవసరం
బునను-రాజుచేనడుగబడకనేనియు యుక్తియుక్తంబులగు మధుర
వాక్కుల స్వతంత్రముగా పునివి జేయదగుననుట. ... ౨౮

శ్లో॥ పరార్థం దేశకాలజ్ఞో దేశకాలేచసాధయేత్ ।
స్వార్థంచస్వార్థకుశలఃకుశలేనార్థకారిణా॥౩౦

రాజసేవకులగువారు పరస్పరసహాయబలముచే నాత్మీయ
కార్యములుసాధించుటకవకాశంబు గావున దేశకాలభేదంబులు
దెలిసి అన్యకార్యంబులును స్వకార్యంబులు రాజకార్యవిరోధ
ముగాకుండునట్లు ప్రయోజనకరంబులగు మధుర వాక్యములచే
సాధించదగుననుట... .. ... ... ... ... ౩౦

శ్లో॥ గుహ్యకర్మ చమంత్రంచ నభర్తుస్సంప్రకాశయే
త్ ।విద్విష్టంచవినాశంచమనసాపినచింతయేత్॥౩౧

రాజకార్యవిషయంబులగుచారప్రయోగాదులు మొదలగు ర
హస్యంబులును- రాజకార్యాలోచనయు - తనకెరంగియుండిన
ను ప్రకాశముజేయదగదనియు రాజునకువిరోధంబగు వాక్పారు
ష్యంబులు మొదలగునదియు - రాజునకు నాశకరంబులగు దుష్ట
కృత్యంబులుమనస్సునందేనియు దలచదగదనియుభృత్యానుశా
సనము.. .. .. ... ... .. ... .. ౩౧

శ్లో॥ స్త్రీభిస్తద్దర్శిభిః పాపైః వైరిభూతైర్నిరాకృతైః॥
ఏకార్థచర్యాం సంహతం సంసర్గం చ వివర్జయేత్॥ ౩౨

రాజాంతఃపురవనితలతో నేనియు - అంతఃపురచరులగు భోనకత్తెలు మొదలగువారితో నేనియు - పాపాత్ములతో నేనియు - శత్రువులహరకారాలతో నేనియు - రాజుచే నిగ్రహించబడి కార్యబహిష్కృతులగువారలతో నేనియు - సహవాససంభాషణసౌహార్దములు విడువవలయునని భృత్యానుశాసనము... ౩౨

శ్లో॥ వేషభాషానుకరణం నకుర్యాత్పృథివీపతేః। సం
పన్నోపిహి మేధావీ స్పర్ధేత నసతద్గుణైః॥ ౩౩

భృత్యుండు సంపన్నుండయ్యును బుద్ధిశాలియగువాడు రాజవేషంబును రాజుమాట్లాడునట్లు మాట్లాడుటయు మొదలగు క్రియలచే రాజున పహాస్యము జేయునట్లు పరిణమించుటం జేసి యందువలన నాత్మవినాశ సంభవంబగు గావున నట్లు జేయదగదనట .. ... ... ... ... .. ... ౩౩

శ్లో॥ రాగోపరాగౌ జానీయాద్భర్తుః కుశలకృత్। ఇం
గితాకారలింగాభ్యాం ఇంగితాకారతత్త్వవిత్॥ ౩౪

రాజకార్యప్రవిష్టుండగుచు సకార్యంబులసుష్టుగా జేయుచు నావిషయంబుల రాజునకుగల ఇంగితముచేతయు నాకారము చేతయు మరియును నానావిధంబులగు అడియాలంబుల చేతయు రాజునకు తనయందుగల కోపప్రసాద స్వరూపంబులెరింగి తనయందు దయగలుగునట్లు ప్రవర్తించదగు. ... .. ౩౪

రాజానురాగేంగితము.

శ్లో॥ దృష్ట్వాప్రసన్నో భవతి వాక్యం గృహ్ణాతి చాదరా
త్। దిశత్యాసనమభ్యాశే కుశలం పరిపృచ్ఛతి। వివి
క్తదర్శనస్థానే రహస్యే చ నశంకతే। తదర్ధాంగ
తత్కృతాన్మోచ్చైస్త్వ రాకర్ణయతి సత్కథాం। శ్లా
ఘతే శ్లాఘనీయోక్తౌ శ్లాఘమానం చ నందతి। కథాం
తరేష్వస్మరతి ప్రహృష్టః కీర్త్యతే గుణాన్। సహతే

పథ్యముక్తస్సన్న నిందాం సమన్యతే । కరోతి వా
క్యం తద్రక్తః తద్వచో బహుమన్యతే । వృద్ధాప్రస
న్నో భవతి వ్యసనే పరితప్యతే । రక్తస్య హి గుణాః
ప్రోక్తా భృత్యే వసుధాధిపే ॥ ... ... ౩౯

చూచినంతనె సంతసించుటయును - వానిచే చేయు వాక్యంబుల ప్రియపూర్వకంబుగా నంగీకరించుటయు - సమీపంబున గూర్చుండు మనుటయు - క్షేమప్రశ్నజేయుటయు - ఒంటిగానుండు నెడలను రహస్యప్రదేశంబుల జూచు నెడ సందేహము లేకునికియు - భృత్యునిచే చెప్పబడు మాటలును కార్యంబులును సావధానుండగుచు వినుటయు - పొగడదగు పనుల నెడ బహుమానించుటయు - నన్యులతని పొగడునప్పుడామోదించుటయు - కథాప్రస్తావంబుల సంతోషితస్వాంతుడగుచు గుణంబుల శ్లాఘించుటయు - భృత్యుని పొరబాటు చేని పథ్యంబులనగాన ప్రియంబులు నొడివినను సహించుటయు - నతని నిందించువారి నొప్పకొనమియు - నతనియందాసక్తుండగుచు భాషించుటయు - నతని వాక్యంబుల మన్నించుటయు - నతని శుభక్రియలయందు సంతసించుటయు - నతనికి సంకటములు సంభవించు నెడ తానును దుఃఖించుటయు - ననుచిహ్నంబులు భృత్యుని యందు దయగల రాజునకు గలిగియుండుననుట.. ... ... ౩౯

రాజకోపేంగితకథనము.

శ్లో॥ ఉపకారేషు మాన్యస్థం దర్శయత్యద్భుతేష్వపి ।
తత్కృతం కర్మ చాన్యేన కృతమిత్యభిభాషతే। విప
క్షముత్థాపయతి వినాశం చాప్యపేక్షతే। కార్యేసం
వర్ధయత్యాశాం ఫలే చ సుగుతేన్యథా । యద్వా
క్యం మధురం కించిత్తదప్యర్థేన నిష్ఠురం । ఆచర
త్యాత్మశంసాసు పరివాదంచ కేవలం। కోపోపి నస
కోపాభః ప్రసాదోపి హి నిష్ఫలః। హసత్యకస్మా
త్త్యజతి రూతం చ సముదీక్షతే। విజ్ఞాప్యమానో వ్య
త్యర్థం సహసోత్థాయ గచ్ఛతి। ఆఘట్టయతి కస్మా

ఽశిశుదీనః బహుమన్యతే | ఆపాద యతిమర్మాణి
గుణాన్న బహుమన్యతే| సంభావయతిదోషేణ వృ
త్తిచ్ఛేదంకరోతిచ| సాధూక్తమపియద్వాక్యం సమ
ర్థయతిచాన్యథా | అపర్వణికథాభంగంకరోత్యపి
•రసీభవన్| ఉపాస్యమానశ్శయనేసు త్తలక్షేణతి
ష్ఠతి| యత్నేనారాధ్యమానోపిస్తవచ్చాపివిచేష్ట
తే| ఇత్యాదిచానురక్తస్యవిరక్తస్యచలక్షణాః||౫౮

అద్భుతంబులగు నుపకారములొనర్చినను నూరకుండుటయు - నతనిచే జేయబడు కార్యమన్యునిచే జేయబడియెననుటయు - నతని శత్రులుగానుండువారి ప్రేరేపించుటయు - నతని యాపత్కాలములయందుపేక్షించుటయు - కార్య ప్రకరణంబుల నాశగలుగునట్లు జేసిఫలమునందు హ్రాస్వము జేయుటయు - ఒకానొకమందిమాటయతని విషయంబున నాడువునపుడును పరుషగర్భితంబుగా నుండునట్లు బల్కుటయు - నతనిచే జేయు స్తోత్ర వాక్యములవ్యత్యస్తార్థంబులు జేసి పరుషములుగా నన్వయించుటయు - కోపమువచ్చినప్పుడును నిగ్రహించమియు - దయావిషయంబులు ఫలాభావంబులొనర్చుటయు - నిష్కారణంబుగా నవ్వుటయు - నిష్కారణంబుగా విడుచుటయు - కోపముగా చూచుటయు - నతడు స్వకీయభృత్యాదుల కొరకు విజ్ఞాపనము జేయు లేచిపోవుటయు - నతని చేయు పనులనాక్షేపించుటయు - మంచి కార్యంబులనామోదించమియు - దుష్కృత్యంబుల వెనుకొనుటయు - గుణంబులకనురాగుండుగామియు - దోషముల మెండుగా నతనియందారోపించుటయు - జీవహాని జేయుటయు - నతనిచేనాడబడు మంచియుక్తుల నేనియు మనుక్తులొనరించుటయు - వైరస్యము గలవాడగుచు నిష్కారణము గా నతని చేపలుకబడు వాక్యంబుల నడుమ కథాప్రస్తావభంగమొనర్చుటయు - పడకయందు సేవించినను నిదురించువానివలె నభినయించుటయు - భయభక్తులతో సేవించినను పలుకకుండుటయు - నిది మొదలగు లక్షణంబులు విరక్తుండగు రాజేంగితంబులనుట... ౫౮

శ్లో॥ రక్తాద్వృత్తింసమీహేతవిరక్తాత్తాంపరిత్యజేత్ ।
నిర్గుణంచాపిభర్తారంత్వాపత్సునపరిత్యజేత్ ॥౪౯

భృత్యునియందనురాగముగల రాజువలన దేహయాత్ర నిర్వహించవలయుననియు- విరక్తుండునుగుణహీనుండును నయ్యును రాజాపత్కాలమువలనవిడువదగడనియు నట్టి నిర్గుణుండైనను నాపత్కాలసహాయహేతువుచే రాజు చేననుగృహీతుండగు గావున నట్టియాపదంతకాలమును పరీక్షించి యుక్తక్రమానుష్ఠాన మొనరించదగుననియు ననుశాసనము... ... ... ... ... ౪౯

శ్లో॥ తతఃపరతరోనాస్తియఆపత్స్వుపతిష్ఠతే। స్వచ్ఛవృ
త్తేషుసత్త్వాఢ్యాస్సూపయాంత్యభిలక్ష్యతాం। ప
రోఢేధర్మధుర్యాణాం తేషాంనామాతిరిచ్యతే॥౫౦

సాధారణంబగు కాలంబులయందు సమర్థులగువారి సామర్థ్యముప్రకాశించుటకు ప్రసక్తిలేకుండుటవలన - సేవాధర్మతుల్యులయందు ఆపత్కాలంబుననుపకరించువానికీర్తి ప్రతిష్ఠలతిశయించుగావున- నట్టియాపత్కాలంబున సహాయముజేయు భృత్యునికన్నవధికుండగువాడు లేడనుట... .. .. .. ౫౦

శ్లో॥ శ్లాఘ్యాచనందనీయాచమహతాముపకారితా। కా
లేకల్యాణమాదత్తేస్వల్పాపిసుమహోదయం॥౫౧

ఆపత్కాలమునందొనరించు స్వల్పోపకారంబును రాజాదులచేమన్నించదగినదియు స్తోత్రార్హంబునుగావున నట్టియుపకారమల్పమయ్యును ప్రబలంబగుసంపత్ప్రదంబగుననుట... ౫౧

శ్లో॥ అకార్యాత్ప్రతిషేధశ్చకార్యేచైవానువర్తనం ।
సంక్షేపాదితిసద్వృత్తంబంధుమిత్రానుజీవినాం॥౫౨

రాజబంధువులును- రాజమిత్రులును- రాజసేవకులునునగువారలచే- రాజధర్మప్రాయములగు కార్య ప్రవర్తనుండగు నవసరంబునస్వతంత్రముగానిషేధించి ప్రవృత్తిలేకుండునట్లు జేయుటయు- రాజుమంచికార్యంబులప్రవర్తించు నెడలసహాయముగా నుపకరించి వెంబడించుటయు- ముఖ్యంబులనుట... ... .. ౫౨

శ్లో॥ పాన స్త్రీమృగ్యాద్యూత గోష్ఠిషు రాజానమభితశ్చరాః।
బోధయేయుః ప్రమాద్యంత ముపాయైర్నర్మ లీలా
దిభిః॥... .. ... .. ... ..౫౩

మద్యప్రసన్నాదిపానాసక్తుండును- ద్యూతాసక్తుండును కామిన్యాసక్తుండునునగు రాజును కాలాతిక్రమంబులనగా అనుష్ఠాన కాలాముల లతిక్రమించుననుమొదలగు కారణంబులచే సత్కార్మ ప్రవర్తకుండగునట్లు ఉపజీవులగువారు విజ్ఞాపించదగునను టి.. • ... ... .. ... ... ... ... ౫౩

శ్లో॥ రాజానంయెప్యుపేక్షంతేసజ్జ్యమానంవికర్మసు।
తెగచ్ఛంత్యకృతాత్మానస్సహతేనపరాభవం॥౫౪

పూర్వోక్తంబులగు వ్యసనాసక్తుండగు రాజును బోధించిసన్మార్గప్రవర్తకుడగునట్లు జేయనిపండితమ్మన్యమానులగుభృత్యులుఆరాజుతోడనమర్గతియు సవమానంబునొందుదురనుట... ౫౪

శ్లో॥ జయాజ్ఞాపయజీవేతితథాదేవేతిచాదరాత్ । ఆ
జ్ఞామస్యప్రతీచ్ఛంతోభృత్యాఃకుర్యురుపాసనాం౫౫

జయము నొందుము- ఆజ్ఞాపింపుము- చిరకాలము జీవింపుము ఓదేవయనియత్యంతబద్ధాసక్తులగుచు రాజాజ్ఞను చేయుచు వారిని చుకొలువవలయు... ... .. .. ... ... ౫౫

శ్లో॥ భర్తుశ్చిత్తానువర్తిత్వంసద్వృత్తమనుజీవినాం।
రక్షాంస్యపిహిగృహ్యంతెనిత్యంఛందానువర్తిభిః౫౬

రాజాజ్ఞానుసారంబగునడతగల భృత్యులచే వారలపారిశుద్ధ్యకృత్యంబులవలన రాక్షసులు నుగ్రహింపబడుదురన తుల్యధర్మలగుమనుష్యులుస్వాధీనులగుట కేమియాధికమనుట.. ...౫౬

శ్లో॥ ధీసత్వోద్యోగయుక్తానాంకిందురాపం మహాత్మ
నాం। ఛందానువర్తినాంలోకేకఃపరః ప్రియా
వాదినాం॥.. ... .. ... .. ౫౭

దుష్కరంబులగునర్థంబులస్వాధీనము జేయుటకుపూర్వోక్తశాస్త్రాలంకృతంబగుబుద్ధియు-సత్వగుణంబునుమంచినడతయుగలు

గుటచేతయు ప్రియములు నొసఁగుటచేతయు సుభృత్యులవలన నందఱు ప్రసన్ను లగుదురు గావున అనుజీవియగువానికి రాజస్వాధీనవర్తిత యు బుద్ధిసత్వ ప్రయత్నంబులును ముఖ్యములుగా నుండవలయు ననుట॥

శ్లో॥ అలసస్యాల్పదోషస్య నిర్విద్యస్యాకృతాత్మనః। ప్ర దానకాలే భవతిమాం అపిహాయ రాజ్యశ్రీ॥ ... ౫౮

కార్యవిషయములయం దుద్యత్న హీనుండును - అశక్తివలనయు దృఢలాభముచేత సంతుష్టుండగువాఁడును - విద్యాహీనుండును - ఇంద్రియస్వాధీనుండును - నగువానికి తల్లియును చక్రాణా విచారించదను నేడను తెరుల నేల జెప్పవలయు ననుట.. .. ... ౫౮

శ్లో॥ యెశూరాయెచవిద్వాంసోయెచసేవావిపశ్చితః। తేషామేవపకాస్నుభోజ్యాన్నృపతిసంపదః॥ ౫౯

శూరులును - విద్వాంసులును - సేవాధర్మజ్ఞులును నగువారలచే రాజైశ్వర్యమనుభవించదగినదనుట.. ... ౫౯

శ్లో॥ అప్రియోపహితాపథ్యస్యాదితివృద్ధానుశాసనం। వృద్ధానుశాసనేతిష్ఠః ప్రియతా మధిగచ్ఛతి॥... ౬౦

వృద్ధసేవచేతయు శాస్త్రజ్ఞానముచేతయు కుశలుండగుచు క్రమప్రవర్తకుండగు భృత్యుం డొకకాలంబున రాజునకప్రియుండుగా నుండినను నతనిక్రమప్రవర్తనమువలన మఱియొక కాలంబున నేనియుఁ బ్రియుండగుఁ గావున క్రమప్రవర్తనయవశ్యంబనుట౬౦

ఇంక రాజుభృత్యులయందుండవలసిన క్రమ మెఱుఁగింపంబడియెడు

శ్లో॥ ఆజీవ్యస్సర్వభూతానాం రాజాపర్జన్యవద్భవేత్। నిరాజీవ్యం త్యజంత్యేనం శుష్కం సర ఇవాండజాః॥ ... ... ... ... ౬౧

దానాశ్రయాదిగుణంబులవలన వానదేవునివలె సమస్తులను నాదరించువాఁడుగానలె ననుట - అట్లాదరించని రాజును వొండి పోయినగుంటను నీరు పక్షులు విడచినట్లు విడుతురనుట......౬౧

శ్లో॥ కులంవృత్తంశ్రుతంశౌర్యంసర్వమేతన్నగణ్యతే। దుర్వృత్తేవాకులీనేవాజనోదాతరిరజ్యతే॥ ౬౨

శ్లో॥ కాలేస్థానేచపాత్రేచనహీనవృత్తింవిలోపయేత్ ।
ఏతద్వృత్తివిలోపేన రాజాభవతిగర్హితః॥ ౬౭

తనపెద్దలచేత నేనియు దనచేత నేనియు పుణ్యకాలంబు లందును - దేవతాయనాతది స్థానంబుల యందును - శ్రోత్రియు లు మొదలగు పాత్రంబులయందును - నెవ్వరికె కాలంబున నేదేశంబున నేది యొసంగునట్లు తమపూర్వికులచే నేనియు దన చే నేనియు నిర్ణయింపంబడియెనది వ్యత్యస్తము జెందకుండున ట్లొసంగవలయుననియు నట్లొసంగకజనులవృత్తి లోపము జేయు టవలన రాజునిందితుండగుననియు తాత్పర్యము .. ... ౬౭

శ్లో॥ అపాత్రవర్షణం జాతు నకుర్యాత్తద్విగర్హి
తం। అపాత్రవర్షణాదన్యత్కించిన్నాస్త్యాత్మకర్శ
యాదృతే॥ ... ... ... ... ౬౮

అపాత్రమునందు వ్రయించుద్రవ్యమువలన బొక్కసముశూ న్యంబగుటదక్క-నురియేమియు ప్రయోజనము లేదు గావునను- అక్కార్యము పెద్దలచేనిందితంబగుటవలనను వ్యర్థవ్రయము జే యగగదనుట... ... ... ... .. ... ౬౮

శ్లో॥ కులంవిద్యాంశ్రుతంశౌర్యంసౌశీల్యంభూతపూర్వ
తాం। వయోవస్థాంచసంవీక్ష్య స్వాద్రియేతమహీ
మనాః॥ ... ... ... ... ...౬౯

భృత్యుండగువానికులీనతయు- విద్యయు- నీనికియు- పరాక్ర మంబును- వానిచేనింతకుముందు జేయబడినకృత్యంబులును-వయ స్సును- నిదానించియందుకు దగినట్టివృత్తికల్పన పూర్వకంబగు నాదరము జేయుట రాజునకుచితంబగుననుట.. .. ౬౯

శ్లో॥ కులీనాన్నావమన్యేత సమ్యగ్వృత్తాన్మస్వినః ।
త్యజంత్యేతేవమంతారం ఘ్నంతిహా మానహే
తవే॥ .. ... .. ... ... ..౭౦

కులీనులును - మంచినడతగలవారలునునగు వారినవమాన ము జేయుటవలన వారలయందు మనస్వియనగా సాత్త్వికగుణ

ముగలవాడు ఆరాజునువదిలివెళ్లుటయేనినియు - నితరులవమాన కుపితులగుచు నారాజుంజంపుటయు- సంభవించుగావుననట్టివా రియవమానము జేయదగదనుట.. ... .. ౭౦

శ్లో॥ గుణైరుదారైస్సంపన్నాన్ ప్రోన్నయేన్మధ్యమా
థమహాన్ । మహత్త్వంప్రాప్నువంతస్తే వర్ధయంతి
నరేశ్వరం॥ ... .. ... ... ... ౭౧

మధ్యమాధమంబులగు నుద్యోగంబులయందుండెడు మంచి గుణంబులుగలవారును వారియోగ్యతానుగుణంబగు నుత్తమంబులగు నుద్యోగంబులొసంగి యుత్సాహపరచుటచే రాజునభివృద్ధికరంబులగు కార్యంబులచేతయు నాశీర్వచనాదులచేతయు రాష్ట్రరాజులను వృద్ధియగునట్లు జేయుదురనుట... .. ...౭౧

శ్లో॥ ఉత్తమాభిజనోపేతాన్నసీచైస్సహవర్తయేత్ ।
కృశోపిహివివేకజ్ఞోయాతిసంశ్రయణీయతాం॥ ౭౨

ఉత్తమకులీనులును-గుణవంతులును నగునుపజీవులను-నధమకులీనులును హీనబుద్ధులునునగువారలతోగూర్చుటచే రాజునకవమానధనప్రాణహానిగలుగుననియు- నట్లుజేయకక్రమవర్తకుండగువివేకియగు రాజుస్వల్పరాజ్యకోశబలంబులుగలవాడయ్యు వివేకులచే నాశ్రయించబడుటవలనమాహాత్మ్యముగల వాడగునను.. ... ... .. ... ... .. ... ౭౨

శ్లో॥ కృశోపిరాజాపిద్వద్భిర్యాతిసంశ్రయణీయతాం।
కృశోపిహివిద్వైకే స్త్రైర్వివేకముపలభ్యతే।... ౭౩

రాజ్యకోశబలంబులచేసన్నగిలినవాడయ్యును పండితులచే నాశ్రయించబడు రాజువారివివేకబలమువలన తానునువివేకియగుచు రాజ్యకోశబలంబుల వృద్ధిబొందజేయుననుట.. ... ౭౩

శ్లో॥ నిరాలోకేహిలోకేస్మిన్ నాసతే తత్రపండితః।
జాత్యస్యహిమణేర్యత్రకాచేనసమతామతా।౭౪

ఏరాజ్యంబునరాజుఅంధప్రాయుండగుచు పండితపామరుల తుల్యులగా జూచునట్టి- నన రాజాతిరత్నంబును గాజురా

యునతుల్యముగాఁ జూచునట్లనుట- అట్టి రాజ్యంబునఁ బండితుండగు వాఁడుండఁడనుట... ... .. .. ... ... ౭౪

శ్లో॥ విశ్రామ్యంతి మహాత్మానో యత్రకల్పతరావివ।
సశ్లాఘ్యం జీవతి శ్రీమాన్ సత్సంభోగఫలాశ్రియః॥ ౭౫

రాజైశ్వర్యము పెద్దలగు సత్పురుషులకుపయోగించుటయే ఫలముగాఁ గలది గావున నట్టిసత్పురుషులు కల్పవృక్షసమీపమునందుండునట్లు సకలసౌఖ్యంబుల నేరాజు రాజ్యంబున ననుభవింతురట్టి రాజు శ్లాఘ్యముగా బ్రతుకుననుట... ... .. .. ౭౫

శ్లో॥ లక్ష్మ్యా ... వతాంలోకే వికాసిన్యాపికింతయా।
బంధుభిశ్చసుహృద్భిశ్చ విస్రంభం యానభుజ్యతే॥ ౭౬

ఏ రాజుయొక్క- ఐశ్వర్యము బంధువులచేతను - స్నేహితులచేతను స్వతంత్రముగా ననుభవించబడక యుండునట్టి రాజుయొక్క- సంపద ప్రబలంబయ్యు నేమి ప్రయోజనంబనుట.. ...

ఇందుకు మహాభాగవతమునం దర్జునుం డింద్రునితోఁ జెప్పినశ్లోకము.

బంధుభిర్యానభుజ్యేత శత్రుభిర్యానదృశ్యతే । కింతయా మమదేవేశ విదేశగతయా శ్రియా॥ అనఁగా బంధువులచే స్వతంత్రముగా ననుభవించు సంపదయె శ్లాఘ్యంబనుట.. ... ౭౬

శ్లో॥ ఆయద్వారేషుసర్వేషు కుర్యాద్రాజాపరీక్షితాన్।
ఆదదీతధనం తేభ్యో భాస్వాన్ పాదైరివోదకం॥ ౭౭

ద్రవ్యోత్పాదన ద్రవ్యాగమన కార్యంబులయందు పరీక్షింపబడియుండెడు కులీనులగు వారలనిలిపి వారలవలన సూర్యుండు తనకిరణంబులచే భూమియందలి యుదకంబుల బీల్చినటుల ద్రవ్యార్జన మొనర్పఁదగుననుట... ... ... ...... ౭౭

శ్లో॥ అభ్యస్తకర్మణస్తజ్ఞాన్ శుచీన్ జ్ఞానాధన్ సంగతాన్ । కుర్యాదుద్యోగసంపన్నా నధ్యక్షాన్ సర్వకర్మసు॥ ... ... .. ... ౭౮

పూర్వోక్తంబులగు నాయాదియుద్యోగంబులయందు ఆయా యుక్తియాపి శపంబులయందభ్యాసముగలవారును - బుద్ధిశాలు

లును - లంచముదీయనివారును - కార్యనిశ్చయముగలవారును - రాజునకుద్రవ్యమువిశేషముకూర్చునందుప్రయత్నపరులునునగువారిసద్భృత్యులనౌనర్చవలయుననుట... .. .. ౭౮

శ్లో॥ యోయద్వస్తువిజానాతి తత్రతం వినియోజయే
త్। అభ్యస్తంకర్మయైస్తైతాన్విజానంతిహి నేతరాః॥ .. .. .. ... ౭౯

ఎవ్వడేయుద్యోగవిషయంబునుకృత్యంబభ్యసించియుండునట్టి వానివలెతదితరుండు దానినేర్చియుండడుగావున నెవ్వనికేకార్యంబున పాండిత్యముగలిగియుండునకార్యంబునవానిని యోగించదగుననుట .. .. ... ... .. ..౭౯

శ్లో॥ లక్షణజ్ఞోనికృష్టస్తు లక్ష్యవేదీతుమధ్యమః। ఉభయోయోవిజానాతి। సఉత్తమఇతీరితః॥ ..౮౦

కార్యలక్షణముదెలిశినవాడధముండును - అనుభవముగలవాడుమధ్యముండును - అనుభవంబును లక్షణంబును దెలిసినపురుషుండుత్తముండుననగుటనట్టి విషయంబులను త్తమమధ్యమాధమంబులదెలిశి నియోగించదగు... .. ... ... ౮౦

శ్లో॥ తాఃశుచీనుపధాశుద్ధాం తజ్ఞైరాప్తైశ్చసంగతాః।
ఉపయుంజీతపురుషైశ్చిర్భంధనళీకాదిభిః।అశేష
విషయప్రాప్తైరింద్రియాధారాణివేంద్రియాః॥౮౧

ఏవిషయంబునెయ్యింద్రియంబుగ్రహించ సమర్థంబగునావిషయంబునన్యేంద్రియంబుగ్రహించచాలదుగావున నట్టిపంచేంద్రియంబులచే నాత్మఆయాయి విషయంబుల గ్రహించిసుఖియగునట్లు పూర్వోక్తంబులగు నెయ్యేకార్యంబులయం దెవ్వడునేర్పరి యుపరిశుద్ధుండునుతగు సహాయముగలవాడునునగు భృత్యశ్రేష్ఠుని పరివారపరికరసహితంబుగా నిలిపివానివలననయ్యర్థలాభము జెందదగుననుట... ... ... ... ... ౮౧

శ్లో॥ కోష్ఠాగారేభియుక్తస్స్యాత్తత్రాయత్తంహిజీవితం
నాత్యాయంచవ్యయంకుర్యాత్ప్రత్యవేక్ష్యేత్తద
న్వహం॥.. ... ... ... .. ౮౭

కోష్ఠమనగా ఉదరము - గావునలక్షణప్రయుక్తముగా ధా
న్యాదులు మొదలగునది అనగా మోదీఖానా-కమీసరియేరి-అను
పర్యాయనామములుగలకొలుచు అన్నివస్తువులకన్నను రాజునకు
సైన్యంబునకు ప్రాణాధారముగావున నందువిశేషఆయమనగా
అన్యాయముచే ధాన్యార్జనము గాకుండునట్లులను వత్యయమా
నక్రమంబున అధికవ్రయముగాకుండునట్లులను రాజుప్రతిదినంబు
ను విచారించదగుననుట... .. ... ... ... ౮౭

అష్టవిధాయద్వారాణి.

శ్లో॥ కృషిర్వణిక్పథోదుర్గస్సేతుఃకుంజరబంధనం । ఖ
న్యాకరఃకరాదానంశూన్యానాంచనివేశనం । అ
ష్టవర్గమిమంసాధుస్స్వస్థవిత్తోభివర్ధయేత్ । జీవనా
ర్థమిహాజీవ్యైఃకారయేత్కరణాధిపైః॥.. ౮౮

వయిలుగా జేయించుటయు ౧- వర్తకమనగావర్తకమూలద్ర
వ్యార్జనమొనర్చుట ౨-వంతెనలు మొదలగుసాధకములచేతదు
ర్గమస్థలంబులసులభంబుననాక్రమించి యచ్చటియపూర్వవస్తు
విశేషంబులసాధించుట-౩-౪-రేనుగులయడవిని బందోబస్తుజే
సి తగుకాలంబులనేనుంగుల బట్టించుటమొదలగునది ౫-రత్నా
దులు బంగారుమొదలగుఖనుల బందోబస్తుజేయుట ౬-పన్నుతీ
ర్వమొదలగురొక్కదాయముల కాలక్రమంబునవసూలుజేయు
ట ౭-పాడుపల్లెమొదలగు స్థలంబులనొకసమయంబున ద్రవ్యం
బులుసంభవించుగావుననట్టివాటినన్యాక్రాంతముగాకుండ కా
పాడుట-౮-యనునీఆర్జనద్వారంబు లెనిమిదింటినిచలచిత్తము
లేకుండ జాగరూకుండగుచు స్వకీయస్వామ్యమాత్యాదుల జీవ
నముకొరకు జాగ్రతగావిచారించదగుననుట.. .. ౮౮

శ్లో॥ యయాయయెవావర్తేతవృత్త్యాక్షీణోపి పార్థివః। తస్యాంతస్యాంనసంరోధంకుర్యాత్ప్రాణోప
జీవినాం॥... ... ... ... ... ౬౫

అన్యదేశములనుంచి వాడలమీదనేనియు గట్టుమీదనేనియు వస్తు విశేషంబులగొని వర్తకము జేయుచుండు వర్తకులెవరెవరేవిధంబగువర్తకంబొనర్చినను- నట్టివారివలన మోతరఫాతీర్వలు మొదలగు ద్రవ్యముగ్రహించువిషయంబున రాజు ఐశ్వర్యహీనుండయ్యును నధికద్రవ్యముబుచ్చికొనదగదనుట... ...౬౫

శ్లో॥ సుసంరక్షేతనిపుణస్స్యాత్కంటకశాఖయా ఫలా
యలగుడః కార్యైర్దస్యుభోగ్యమిదంజగత్॥ .. ౬౬

ఈలోకముచోరులచేప్రాయంబుగ భోగింపబడుచుండుగావునిపుణుండగువాడు ముండ్లకట్టెలకంచె వేయుటచేత పశువులు మొదలగువాటిచే నష్టముగాకుండ సంరక్షించునట్లును- గొప్ప వృక్షములందుండు ఫలంబులనుదోటి మొదలగువాటిచే పక్వసమయంబున చోరగృహీతముగాకుండ స్వాధీనమొనర్చుకొను - నట్లురాజును దుర్మార్గులగు వారిని నిబంధముచేతయును - దండమువలన శత్రుచోరులవలనను- ప్రజలసంరక్షణ మొనర్చదగునట్లొనర్చనతనికి రాజ్యముయథేచ్ఛాభోగయోగ్యంబగుననుట౬౬

శ్లో॥ అయుక్తకేభ్యశ్చోరేభ్యః పరేభ్యో రాజవల్లభాత్।
పృథివీపతిలోభాచ్చ ప్రజానాంపంచధాభయం।
పంచప్రకారమప్యేతదపోహ్యనృపతిస్స్వయం। ఆ
దధీతధనంకాలేత్రివర్గపరివృద్ధయే... ... ... ౬౭

తగనియుద్యోగస్థులవలనను-౧-దొంగలవలనను-౨ శత్రురాజులవలనను-౩-రాజబంధువులవలనను.౪-రాజలోభము అనగా ద్రవ్యాశచేతయు-౫-నను నైదువిధంబులప్రజలకుభయంబుగలుగుగావుననట్టిభయంబులపోగొట్టి స్వకీయకోశాదుల వృద్ధివాగల వలన జేయదగునట... ... .. ... .. ౬౭

శ్లో॥ యథాగౌః పాల్యతే కాలే దుహ్యతే చ తథా ప్రజాః।
సిచ్యతే పుష్యతే చైవ లతా పుష్పప్రదా యథా॥ ౮౯

ఆవునుఁ దోలుత సంరక్షించి పిదప క్షీరము ననుభవించునట్లును - తీగెలు మొదలగువాటికి జలసేకాదులగు దోహదములొనర్చి పిదప పుష్పాపచయ మొనర్చునట్లును రాజ్యజనములను న్నించుట మొదలగు కృత్యములచే స్వాధీనమొనర్చి ద్రవ్యార్జన మొనర్పదగుననుట.. ... ... .. ... .. ౮౯

శ్లో॥ ఆస్రావయేదుపచితాన్ సాధుదుష్టవ్రణానివ। ఆయుక్తాస్తే చవర్తేరన్ వహ్నావివ మహీపతౌ॥..... ౯౦

లంచము తీసుట మొదలగు దుష్టకార్యములు జేయు భృత్యులను - రాజగువాఁడు రణ చికిత్సకునివలె వారల శిక్షించుటచే శేష భృత్యులు అగ్నికి భయంపడునట్లు రాజదండభీతులగుచు క్రమ ప్రవర్తకులగుచు రాజ్యకోశంబుల నభివృద్ధియొనర్తురనుట॥ ౯౦

శ్లో॥ స్వల్పమప్యపకుర్వంతి యేపాపాః వృద్ధిపీపతేః। తే వహ్నౌ వివదహ్యంతే పతంగా మూఢచేతసః॥ ౯౧॥

మూఢాత్ములును పాపిష్ఠులునునగు భృత్యులు స్వల్పంబగు నపరాధంబొనర్చియు అగ్నియందు బడుమిడుతలవలె మాడిపోవుదురనుట.. ... ... .. ... ... .. ... .. ౯౧

శ్లో॥ సంవర్ధయేత్సదా కోశమాప్తైస్తజ్ఞైరధిష్ఠితం। కాలే చాస్యవ్యయం కుర్యాత్త్రివర్గప్రతిపత్తయే॥ ౯౨

ఆప్తులును బుద్ధిశాలులునునగు భృత్యులచే బొక్కసమునభివృద్ధి జేయుచు త్రివర్గసిద్ధికొరకు కాలదేశపాత్రంబు లెరింగి తగు వ్యయము జేయదగుననుట... ... ... ... ౯౨

శ్లో॥ ధర్మేణ క్షీణకోశస్య కృశత్వమపి రాజతే। సురైః పీతావశేషస్య శరద్ధిమరుచేరివ॥... ... ౯౩

ధర్మముకొరకు బొక్కసము వ్యయించి క్షీణుండగు రాజు - దేవతులకమృత మొసంగి కృశుండగు శరత్కాలచంద్రునివలె నత్యంత ప్రకాశుండగుననుట... ... ... .. ... ౯౩

శ్లో॥ బృహస్పతేరవిశ్వాస ఇతిశాస్త్రస్యనిశ్చయః। అ
విశ్వాసీతథానస్యాద్యథాసువ్యవహారవాన్। వి
శ్వాసయేదవిశ్వస్తానాత్మనోనచవిశ్వసేత్। యస్మి
న్విశ్వాసమాయాతిభూతేఃపాత్రమేవసః॥ ౯౫

భృత్యులనెవ్వరినినమ్మదగదనియు- నటులనుతరాంనమ్మకుండదగదనియు- నట్టిరాజునకుతనయందు నమ్మకముగలుగునట్టి వర్తనముఃభృత్యుండగువాఁడొనర్పదగుననయు- ఏభృత్యుని యందు రాజునకు నమ్మకముగలుగునతఁడు రాజుసంపదకు పాత్రుండనియు- నీతిశాస్త్రప్రవర్తకుండగు బృహస్పతిమతమని దెలియఁదగుననుట... .. .. ... ... ... ... ౯౫

శ్లో॥ ప్రాదుర్భవంత్యర్థసమంయస్మాచ్చిత్తాన్యనుక్ష
ణం। తస్మాద్యోగివసతతంతానపశ్యేత్సమాహితః॥ ౯౬

మనుష్యులచిత్తవృత్తులాయాయి విషయంబుల ననుసరించి వ్యత్యస్తంబులగుచుండుం గావునభృత్యాదులు సుపరీక్షితులయ్యె రాజగువాఁడు నిర్నిద్రుండగుచు నాయావిషయప్రయోగసమయంబుల వారిప్రవర్తనల చారముఖంబున పరీక్షించుచుండవలయుననుట... ... ... ... ... ... .. ౯౬

శ్లో॥ ఉద్యోగాదనివృత్తస్యసుసహాయస్యధీమతః। ఛా
యేవానుగతాతస్యనిత్యంశ్రీస్సహచారిణీ॥.. ౯౭

సహాయసంపన్నుఁడగుచు మనుష్యయత్నముసంపూర్ణంబుగఁజేయుచుండు ధైర్యవంతుండగు భృత్యునకు సంపదఛాయవలెననువర్తించియుండుననుట... ... ... ... ౯౭

శ్లో॥ స్వనుగతపరితోషితానుజీవీమధురవచశ్చరితాను
రక్తలోకః। సునిపుణతరమాప్త మంత్రతంత్రోభ
వతినృపస్సుచిరంప్రదీప్తరశ్మిః॥... ... ౯౮

అనుసరించియుండెడుమంచినడతగల భృత్యులసంతోషింపఁజేయుచు-మధురవచనంబులచే జనంబులప్రీతినిసంపాదించుచు- ఆప్తులగువారితోడను సుకరంబగుమంత్రాలోచన మొదలగుకా

ర్యంబులనడచుచుండు రాజు - సూర్యుని వలె చిరకాలము ప్ర
కాశితుండగునని సర్గోపసంహారము...........................*

తి కామందకటీకాయాంభృత్యసేవా ధర్మోనామ
పంచమస్సర్గః.



కామందకీషష్టసర్గప్రారంభః



శ్లో॥ లోకే వేదే చకుశలైఃకుశలైఃపరివారితః।ఆదృతఃవిం
తయేద్రాజ్యంసబాహ్యాభ్యంతరంన్నృపః॥..... ౧

పూర్వసర్గోక్తక్రమంబున భృత్యులతోగూడిన వాడగుచు -
లోకవ్యవహారమునందును- వేదము మొదలగుసమస్తశాస్త్రవేత్త
యు- శాస్త్రవేత్తలగు సభాధూలచేపరివృతుండగుచు। రాజ్యవ్య
వహారంబులును మంత్రులు మొదలగు వారి వృత్తాంతములు ఆద
రణపూర్వకంబుగ తెలియదగు.. ... .. ... ౧

శ్లో॥ అభ్యంతరంశరీరంస్వంబాహ్యంరాష్ట్రముదాహృ
తం। అన్యోన్యాధారసంబంధాదేవ మే వేదముచ్య
తే॥.. .. ... ..... .. ... ... .. ౨

అభ్యంతరంబనరాజదేహంబును- బాహ్యంబనగా రాజ్యమ
నియును - రాజుచేరాష్ట్రంబును రాష్ట్రంబుచేరాజునురక్షితంబ
గుచుండుటవలన ఈరెండొకటియయనియర్థము... ... ౨

శ్లో॥ రాజ్యాంగానాంతుసర్వేషాంరాష్ట్రాద్భవతిసంభవః।
తస్మాత్సర్వప్రయత్నేనరాజారాష్ట్రంవివర్ధయేత్॥౩

రాజ్యసప్తాంగంబులకున్ను రాజ్యముత్పత్తిస్థానంబుగావు
నసకలప్రయత్నంబులచేతను రాజ్యమువృద్ధిజేయదగు.........౩

శ్లో॥ శరీరపాలనమపి రాజ్యాయభవతిధ్రువం।తస్యాను
గ్రహమన్విచ్ఛన్ శరీరమనుపాలయేత్॥.........౪

ధర్మిష్ఠుండగురాజు లేనియెడ రాజ్య మరాజకమగుచునశిం
చుంగావుననట్లు రాజ్యమునశించకుండ వృద్ధియగుటకుధార్మికుం

యగు రాజు ప్రధానకారణంబగుట లోకానుగ్రహముకొరకు రాజ దేహము కాపాడవలయుననుట... .. .. ... ౪

శ్లో॥ ధర్మ్యామారేభిరేహింసామృషికల్పామహీభుజః। తస్మాదసాధూన్పాపిష్ఠాన్ హింసన్ దోషైర్నలిప్యతే॥ ... .. .. ... ... ౫

ఋషితుల్యులగుపూర్వరాజులు ధర్మంబగుననగా లోకబాధకరులగుదుష్టులను వధించుట-అట్టిధర్మహింస నారంభించి పాపాత్ములగుదుష్టులను చంపుటచే దోషము గలుగనేరదనుట... .. ౫

శ్లో॥ ధర్మసంరక్షణపరోదస్మాయార్థంవివర్ధయేత్। యే యేప్రజారౌద్రకరాస్తాన్ స్తాన్హన్యాన్మహీపతిః॥౬

ధర్మమునురక్షించుట ప్రధానకార్యముగాగలవాడగుచు నట్టి ధర్మము నెరవేరుకొరకు ద్రవ్యమభివృద్ధియొనర్చుటయెగాక లోక కంటకులైయుండు వారినిహింసించవలయుననుట.. .. ౬

శ్లో॥యమార్యాఃక్రియమాణంహిశంసంత్యాగమవేదనః। సధర్మోయంవిగర్హంతితమధర్మంప్రచక్షతే॥....౭

ఆగమశాస్త్రవేత్తలగుపెద్దలు ప క్రియలను స్తోత్రము జేయుచుందురది ధర్మంబనియు- అసహ్యపడునదియధర్మంబనియు తాత్పర్యము... ... .. .. .. ... ... .. ౭

శ్లో॥ ధర్మాధర్మౌవిజానన్హి శాసనైభిరతస్సతాం।ప్రజారక్షేన్నృపస్సాధుహన్యాచ్చపరిపంథినః॥...౮

పెద్దలసేవచేధర్మస్వరూపంబును అధర్మస్వరూపంబును నెరింగిశత్రువధపూర్వకంబుగా ప్రజాసంరక్షణచక్కగ నొనర్పదగుననుట.. ... ... ... ... ... ... ... ౮

శ్లో॥ రాజ్యోపఘాతంకుర్వంతియెపాపారాజవల్లభాః। ప్రకైకశస్సంహతావాతాన్హన్యాత్తాన్పరిచక్షతే॥౯

రాజబంధువులగువారలైనను-యేపాపాత్ములు-ఒంటిగా సేనియు సమూహముగా నేనియు రాజ్యఘాతము జేయుదురట్టివారు దూషితులనగా దండనార్హులగుదురనుట.. .. ... ౯

శ్లో॥ దూష్యానుపాంశుదండేన హన్యాద్రాజావిలంబితం । ప్రదూష్యవాప్రకాశంవాలోకవిద్వేషమాగతాన్॥ .. ... ... ... ... ... ౧౦

పూర్వోక్తలక్షణలక్షితులగుదూషితులదండించక కాలహరణము జేయుటచే రాజు రాష్ట్రహానియగుంగావున తత్క్షణంబున న నగాదూషితులని దెలియబడినమాత్రంబున నిర్దయుండయి రాజ్యమునందంతటప్రసిద్ధంబగునట్లొనర్చియు విషపానాది నానావిధములచేదండించదగుననుట.. .. .. ... ... ౧౦

శ్లో॥ రాజారహసిదూష్యంహి దర్శనాయోపమంత్రయేత్। గూఢశస్త్రావిశేయుస్తంపశ్చాద్దాసజ్ఞితా నరాః॥ ... .. ... ... ... ౧౧

ఆయుధములుదెలియకుండునట్లుంచికొని దూషితుని వెంబడించివచ్చునట్లు శస్త్రధరులకాజ్ఞాపించి రహస్యప్రదేశంబునకు స్వకీయదర్శనార్థముగావచ్చునట్లు దూషితుని రప్పించవలయుననుట, ౧౧

శ్లో॥ విశ్వస్తాహివిచిన్వీయుః ద్వాఃస్థాః కక్ష్యాంతరంగతాః। తేశస్త్రగ్రాహిణో బ్రూయుః ప్రయుక్తాస్మ ఇతిస్ఫుటం॥ .. .. ... ... ౧౨

రాజదౌవారికులుమిక్కిలినమ్మికగలవారలగుటనచ్చటికి వచ్చుగూఢాయుధపాణుల శోధించునెడ రాజుచే ననుజ్ఞాతులమని నొడువదగుననుట.. .. .. ... ... ... ౧౨

శ్లో॥ ఇత్యాదిదూష్యాన్ సంహృత్య ప్రజానామభివృద్ధయే। నిర్వీష్టుశ్శ్రియముత్కృష్టం రాజాశల్యం సముద్ధరేత్॥ . ... ... ... ౧౩

పూర్వోక్తోపాయంబులదుర్మార్గులదండించి రాజ్యాభివృద్ధియుం గంటకశోధనంబును జేయుచు ప్రబలంబగు నైశ్వర్యంబనుభవించదగుననుట... ... ... ... .. .. ౧౩

శ్లో॥ యథాబీజాంకురస్సూక్ష్మః పరిపుష్టోభిరక్షితః। కాలే ఫలాయభవతిసాధుతద్వదియంప్రజాః॥ ... ౧౪

సూక్ష్మంబగువిత్తనముక్రమముగా నాటివృద్ధిబొందినట్లొనర్చినపిదపసాద్వాదుఫలప్రదంబగునట్లు రాజ్యంబును సంరక్షించుటచేభోగప్రదంబగుననుట... ... ... .. ... ౧౪

శ్లో॥ ఉద్వేజయతితీక్ష్ణేనమృదునాపరిభూయతే। తస్మా
 ద్యథార్హతోదండంనయేత్పక్షమనాశ్రితః॥ ౧౫

తీక్ష్ణదండన జేయుటదుఃఖకరంబగుటను- మృదువగుటనవమానకరంబగుటను గావున రాజగువాడుపక్షపాతము లేక క్రమదండనీతి ప్రవర్తనమందుగావలయుననుట.. ... ... .. ౧౫

ఇతి కామందకీయే షష్ఠస్సర్గః.



సప్తమసర్గప్రారంభః.

శ్లో॥ ప్రజాత్మశ్రేయసే రాజాకుర్వీతాత్మజరక్షణం। లో
 లుభ్యమానాహ్యర్థేష్వహన్యురేనమరక్షితాః॥...౧

రాజ్యమునందలి ప్రజలయొక్కయు - తనదేహముయొక్కయు- సౌఖ్యాభివృద్ధికొరకు రాజపుత్రులద్రవ్యదానలాలనతాడనవిచారణాదులచే సంరక్షించవలయు నట్లొనర్పకుండెనేనియా రాజపుత్రులు ద్రవ్యాపేక్షగలవారలగుచు రాజునకుద్రోహముజేసి చంపుదురనుట... ... ... ... .. ... ౧

శ్లో॥ రాజపుత్రామదోన్మత్తాగజాఇవనిరంకుశాః। భ్రా
 తరంవాపినిఘ్నంతిపితరం వావమానితాః॥.. ...౨

అంకుశము లేని మదమేనుగులవలెనుండు రాజపుత్రులుతమకనురూపంబులగు మన్నన లేనియెడ తండ్రి నేనియు తోబుట్టువుల నేనియు జంపుదురనుట... ... .. ... ... ౨

శ్లో॥ రాజపుత్త్రైఃమదోన్మత్తైఃప్రార్థ్యమానమిత స్తతః।
 దుఃఖేనరక్ష్యతేరాజ్యం వ్యాఘ్రాఘ్రాతమివామిషం॥ ౩

మదించియుండెడు రాజకుమారులచేనంతటంతటనపేక్షింపబడు రాజ్యమును పులిచేవాసనజూడబడుచుండు మాంసమువలెబహుప్రయాసచే రక్షింపబడవలయుననుట... ... ౩

శ్లో॥ రక్ష్యమాణాపదిభిద్రంకథంచిత్ప్రాప్య వృన్నవంతిహి।
సింహశాబా ఇవఘ్నంతిరక్షితారమసంశయం॥...౪

అట్టి రాజపుత్రులు రక్షింపబడు నెడల కొంచెమేనియు నెడబడు సమయంబున సింహకిశోరములవలెనంతకుముందు తమకు కావలియుండువారల నిస్సందేహము గాజంపుదురనుట॥... ... ౪

శ్లో॥ వినయోపగ్రహోద్భృత్యైఃకుర్వీతనృపతిస్సుతాన్।
అపినీతంకుమారంహికులమాశువినశ్యతి॥.. ...౫

తగుమైనభృత్యులవలన వినయము మొదలగు గుణములుగలుగునట్టుల రాజపుత్రులరక్షణ శిక్షణాదులొనర్పదగుననియు- నట్లుగాక దుష్టుండగు రాజకుమారునివలన నారాజకుటుంబము నశించుననియు- తాత్పర్యము.. ... ... .. ... ౫

శ్లో॥ వినీతమౌరసంపుత్రంయౌవ రాజ్యేభిషేచయేత్।
దుష్టంగజమివోద్వృత్తంకుర్వీతసుఖబంధనం॥...౬

మదమేనుగును లాలించికట్టునట్లు సమర్థుండును వినయసంపన్నుండునునగు పుత్రునియువ్వరాజ్యమునందభిషిక్తుఁజేయదగును౬

శ్లో॥ రాజపుత్రఃపరిత్యాగంసుదుర్వృత్తోపినార్హతి।క్లి
శ్యమానఃపరిత్యక్తఃపరానాశ్రిత్యహంతితం॥.....౭

దుర్మార్గప్రవర్తనుండగువానినైనను రాజపుత్రుని విడుచుటచేతయు బాధించుటచేతయు వాఁడుశత్రులనాశ్రయించి తండ్రినిజంపునుగావున రాజపుత్రునివిడువదగదనుట... ... ... ౭

శ్లో॥ వ్యసనేసజ్యమానంహిక్లేశయేద్వ్యసనాశ్రయైః।త
థాసంక్లేశయేదేనంయథాస్యాత్పితృగోచరః॥..౮

ద్యూతపానాదులగు వ్యసనంబులయందాసక్తుండగువానినాయాయికృత్యంబులయందు దుఃఖముగలిగి వాటినవిడిచి తండ్రియందువినీతుండగునట్టులతనుకుసుఖ్యులతోఁజేయించవలెననుట ౮

రాజదేహారక్షణవిషయము.

శ్లో॥ యానేశయ్యాసనేభోజ్యేపానేవస్త్రవిభూషణే।
సుప్తేత్రైవాప్రమత్తస్సన్ఖుర్వీతవిషదూషితం॥౯

రథాదులగు సవారీలవిషయంబునను - పడకలయందును - సిం
హాసనాదులగు నాసనంబులయందును - భోజనపదార్థంబుల
యందును - పానకాదులగు త్రాగుడు వస్తువులయందును - ధరిం
చువ స్త్రభూషణాదులయందును - శత్రువులచేఁ బ్రోత్సాహితులగు
దుష్టభృత్యులు విషాదిమారకవస్తువులనుంచియుందురుగావున న
ట్టివిషయంబులజాగరూకుండగుచు పరీక్షయొనర్చి దుష్టంబులగు
దానివిడువదగుననుట... .. .. .. .. ... ౯

శ్లో॥ విషఘ్నైరుదకైస్స్నాతో విషఘ్నమణిభూషితః।
పరీక్షితం సమశ్నీయాజ్జాంగలీవిద్భిషగ్వృతః॥౧౦

తెల్లతామరపూలు - వృంతాకము యీ రెండువస్తువలు చే
ర్చికాచినయుదకంబులన్ని విషంబుల హరించునని వైద్యశాస్త్ర
ప్రమాణము గావున నట్టివిషహరంబగుజలంబుల చేస్నాతుండగు
చు - విషఘ్నమణులనగా... .. .... .. ... ...

శ్లో॥ రచితో గరుడోద్గారమణిర్యస్య విభూషణం। స్థావ
రంజంగమం తస్య విషం నిర్విషతాం వ్రజేత్॥.... ..

అనేక్రమంబున గరుడపచ్చలచేనిర్మితంబగునాభరణంబులు
ధరించి(కారస్కరం - కరవీరం మొదలగు స్థావరవిషంబులును - పా
మువిషము - తేలువిషము మొదలగు జంగమవిషంబులును - నిష్ఠు
పండ్లరసముతో పచ్చకర్పూరముకలుపుటయు - నెయ్యి తేనె కలి
పి యొసంగుటయు మొదలగు కృత్రిమవిషంబులును చక్కగా నె
రింగి దానిపరీక్షలును ప్రతిక్రియలును దెలియుటచే జాంగలులను
పాంజ్ఞగలవైద్యులసమీపంబున ననగా వారలతోఁగూడి భోజన
ము జేయునగు.. ... ... .. .. ... ౧౦

శ్లో॥ భృంగరాజశ్శుకశ్చైవ శారికాచేతిపక్షిణః। క్రో
శంతిభృశముద్విగ్నా విషపన్నగదర్శనాత్॥౧౧

భృంగరాజంబనియు - కృష్ణపక్షియనియు - గోపుచ్ఛకమని
యు - సర్జ్ఞగలపక్షియు - చిలుకయు - గోరవంకయు. విషదూషి
తవస్తువు నేనియు - పాము నేనియు చూచినమాత్రాన బెభ్రయంపడు

స్వభావముగలదిగావున భోజనాత్పూర్వముభోజ్యంబగు పదార్థంబుల నాపక్షులచేపరిక్షించి పిదపభుజించదగు... • ... ౧౧

శ్లో॥ చకోరస్యవిరజ్యంతె నయనెవిషదర్శనాత్ । సు
వ్యక్తంమాద్యతిక్రౌంచో మ్రియతె మత్తకోకిలః॥ ౧౨

చకోరంబను పక్షికికండ్లెఱ్ఱనగు యగ్రగానుండుటవలనను విషదూషిత పదార్థదర్శనమాత్రముచే దానికండ్లు తెలుపగుట వలనను దానిచేతయు - విషదుష్టపదార్థ దర్శనమాత్రముచే క్రౌంచంబనుపక్షిమదించుటచే నాయడియాలముచేతయు - వం టకోయిలవిష పదార్థముచూచినమాత్రముచే జచ్చుటవలన నయ్యడియాలముచేతయు - విషస్వరూపముదెలియనగు .. ౧౨

శ్లో॥ జీవంజీవస్యచగ్లానిజాయతేవిషదర్శనాత్ । ఎ
షామన్యతమెనాపి సమశ్నీయాత్పరీక్షితం॥ ౧౩

జీవంజీవంబను పక్షివిశేషంబునకును విషపదార్థముగనుగొనినంతవాడుటగలుగుగావున నీమూడుశ్లోకంబులందు నొడువం బడినపక్షులచేతనేనియు నిందొకటిచేనేనియు పరీక్షించ బడిన యన్నంబు భుజింపదగుననుట.. ... ... .. ౧౩

శ్లో॥ మయూరపృషతోత్సర్గె నభవంతిభుజంగమాః । త
స్మాన్మయూరపృషతౌభవనెనిత్యముత్సృజేత్॥ ౧౪

నెమలియు - పృషతంబనగా - జింకలలో తెల్లచుక్కలున్నొకకొమ్మున్నగల జంతువిశేషము పొడదుప్పియు రెండునుసర్పముల భక్షించునదిగావున నీరెంటిని పెంచియింటియందు సంచరింపజేయదగు... ... ... ... .. ... ౧౪

శ్లో॥ భోజ్యమన్నంపరీక్షార్థంప్రదద్యాత్పూర్వ మగ్నయె । వయోభ్యశ్చతతోదద్యాత్తతోలింగానిలక్షయెత్ । ధూమార్చిర్నీలతావహ్నెశ్శబ్దస్ఫోటశ్చ జాయతె । అన్నేనవిషదిగ్ధెన వయసాం మరణం ధ్రువం॥ ... .. ... .. ... ౧౫

విషదుష్టంబగు పదార్థము నిప్పులోవేసినమాత్రముచేనగ్నిం

టిపోగయును మంటయును చిట్లుటయుగలుగుటవలన తొలుతనిప్పు లలోనుంచియు- పక్షులుభక్షణమాత్రముచేచచ్చుటవలన వాటికి వేసియును పరీక్షించి పిదపభక్షించదగుననుట... ... ౧౬

శ్లో॥ అగ్నిర్దగ్ధాన్నసోదకత్వంఆశుశైత్యంవివర్ణతా। అ
న్నస్యవిషదిగ్ధస్య క్వథనంశ్యామఫేనతా॥౧౭

విషదిగ్ధంబగునన్నము - కాంతిరహితము గాను - తడిగలది గాను - త్వరగాచల్లారుటయు - వర్ణభేదముగాను - వాసనా హీనముగాను - నురుగుగలదిగాను నుండునని తెలియదగు,౧౭

శ్లో॥ వ్యంజనస్యాశుశుష్కత్వం క్వథనంశ్యామఫేన
తా। గంధస్పర్శరసాశ్చైవ నశ్యంతివిషదూష
ణాత్॥... ... ... .. ... ౧౮

విషదుష్టంబగుపప్పుమొదలగు కొంచముతడిగలవస్తువులుత్వ రితముననెండుటయు - వాడివివర్ణముజెంది నురుగుకట్టినట్లుం డుటయు - అయాయివసునైజంబగు - వాసనయు - మృదుత్వక ఠినత్వంబులును ముద్దయు జావయును- మొదలగుగుణంబులున శించుననుట.. ... .. .. ... ... .. ౧౮

శ్లో॥ ఛాయాతిరిక్తాహీనావాద్రవేచవిషదూషితే। దృ
శ్యతేరాజిరూర్ధ్వాచ ఫేనమండలమేవచ॥... ౧౯

విషదుష్టంబగు - పులుసు - నెయ్యిమొదలగు పలచనద్రవ్యం బులయందు - దానిస్వభావంబగు వర్ణంబునకన్ననధికంబుగానే నియు - తక్కువగానేనియుండుటయు - పైననురుగులుగట్టు టయు మరియునానావిధవికారంబులు గలిగియుండుననుట. ౧౯

శ్లో॥ రసస్యనీలాపయసస్యతామ్రామద్యస్యతోయస్య
చకోకిలాభా। శ్యామాచదధ్నోవిషదూషితస్య
మధ్యేభవత్యూర్ధ్వగతాచరేఖా॥ ... ౨౦

విషదుష్టంబగుచెరుకురసంబునందునల్లటిరేఖయు- పాలయందు ఎఱ్ఱరేఖయు- కల్లుమంచినీళ్లవీటియందు కోకిలపిట్టవంటిఛాయగ

లశేషియు- పెరుగునందు చామనివర్ణంబునుగల చారపొడుగా నగుపడుచుండుననుట... ... ... ... ... ౨౦

శ్లో॥ ఆర్ద్రస్య సర్వస్య భవేత్తు సద్యః ప్రమ్లానభావో విష
దూషితస్య। ఉత్పక్వతా క్వాథవినీలితా చ ప్రమ్లాన
తా చేతి వదంతి తజ్ఞాః... .. ... .. ౨౧

విషదూషితంబగు తడిగలదాడిమపండ్లు మొదలగువాటియందు- అప్పుడే వాడుటయు- పక్వభేదంబును- వాసనలేకునికియు- నల్లబడుట - మిక్కిలి వాడుటయు - గలుగుననుట... .. ౨౧

శ్లో॥ శుష్కస్య సర్వస్య విషోపసంగాద్విశీర్ణతా చాశువివ
ర్ణతా చ। ఖరం మృదుః స్యాన్మృదునః ఖరత్వం వదంతి
కేచాల్పక జంతుఘాతం... ... .. ... ౨౨

విషసంబంధియగు- ఎండువస్తువులకు- పగులుటయు - వర్ణభేదంబులగుటయు- మృదువగు వస్తువు గట్టియగుటయు - గట్టివస్తువు మెత్తనయగుటయు- చిన్న జంతువుల జంపుటయునను గుణంబులు గలిగియుండుననుట... .. ... .. ... .. ౨౨

శ్లో॥ ప్రావారాస్తరణానాంచ శ్యామమండలకీర్ణతా। తం
తూనాంపక్ష్మణాంరోమ్ణాంస్యాద్భ్రంశశ్చ విషాశ్ర
యాత్॥... .. ... ... ... ౨౩

విషసంబంధియగు- వస్త్రములయందును - తివాసులు మొదలగునందును - ఎండలో వెయ్యకుండియు బీటికలుబాసి పెటులుటయు- ధారములు పురివీడుటయు- పట్టు - వెంట్రుకలు మొదలగునవి రాలిపోవుటయుంగలుగు... ... ... ... ... ౨౩

శ్లో॥ లోహానాంచ మణీనాంచ మలపంకోపదిగ్ధతా। ప్రభా
వస్నేహగురుతా వర్ణస్పర్శవధస్తథా॥.. ... ౨౪

విషసంబంధియగు బంగారు- రత్నములు పీటికి వైవర్ణ్యంబును- కాంతియందమాంద్యంబును సోకుడుయందు మనోజ్ఞతలేమనికియుగలుగు.. ... ... ... ... ... ౨౪

విషమొసంగినవానిలక్షణము.

శ్లో|| సంశుష్కశ్యామవక్త్రత్వం వాక్స్తంభోగాత్రభ్రమణం
ముహుఃస్ఖలనం వేపథుః స్వేదఆవేగోదిగ్విలోకనం|
స్వకర్మణిస్వభూమౌచ అనవస్థానమేవచ । లింగా
న్యేతానినిపుణంలక్షయేద్విషదాయినాం|| ...౨౬

విషము పెట్టినవారి లక్షణంబులు - మొగమెండుట - ముఖము దేబరించుటయు - మాటతడబాడుటయు - నిలిచినచోట నిలువకుండుట - తొట్రుపడుట - వణకుట - చెమర్చుట - దిగులొందుట - దిక్కులుచూచుట - తనపనియందుండమి - తానుండవలసిన స్థలంబున నుండమి - యును ఇది మొదలగు గురుతుల నిదానించదగుననుట. ౨౬

శ్లో|| ఔషధానిచసర్వాణి పానంపానీయమేవచ । త
త్ప్రాల్పకైః ప్రమాస్వాద్యప్రాశ్నీయాద్భోజనా
నిచ... ... ... .. ... ౨౭

విషహరంబులగు నౌషధంబులును - అట్టియుదకంబులును - నాయాయి అనుపానంబులముందుగా భుజింపిపిదపభోజనము జేయదగుననుట .. .. ... ... ... ... ౨౭

శ్లో|| ప్రసాధనాదియుక్తంచతత్సర్వంతత్పరిచారకాః| ఉ
పనయ్యేయు రంగరాయసుపరీక్షితముద్రితం|| ... ౨౮

రాజోపభోగయోగ్యంబులగు చందన తాంబూలశేలాంకాంజనాదివివిధపదార్థంబులాయాయి కార్యంబుల కధికారులచేప రీక్షింపంబడి ముద్రితంబగువాటి నాయాయిపరిచారకులు రాజుసమ్ముఖంబుననునుచుదురనుట... ... ... ... ౨౮

శ్లో|| పరస్మాదాగతంయత్తుతత్సర్వంసుపరీక్షయేత్ । స్వ
భృత్యైఃపరైర్భృత్యైశ్చప్రతిధారకైఃరాజాహిరక్షితః|| ౨౯

తనవారివద్దనుండేసియు నన్యులవద్దనుండేసియు కానుకరూపంబులుగా వచ్చువస్తుజాలంబులాయాయధికారులవలన చక్కగా శోధింపంబడిపిదప రాజసమ్ముఖము జేయదగుననుట.......౨౯

శ్లో॥ యానంవాహనమారోహేద్జ్ఞాతం జ్ఞాత్రోపపాదితం। అవిజ్ఞాతేనచపథాసంకటేనచనవ్రజేత్॥ ౩౦

రథమేనియు- అందోళికాదులేనియు, పరీక్షించబడినభృత్యునిచేదేబడినదేని యారోహించివిశాలంబగు రాజమార్గంబున నరుగదగుం గాని- గురుతెరుగనిమార్గంబున నేనియు సందులయందేనియునరుగదగదనుట... ... .. ... ... ౩౦

శ్లో॥ వీక్షితాదుష్టకర్మాణం ఆప్తంవంశక్రమాగతం।సంవిభక్తంచకుర్వీతజనమాసన్నవర్తినం॥.. ......౩౧

దుర్మార్గకార్యములుజేయనివాడని పరీక్షింపబడినట్టియు ఆప్తుండును- కులక్రమంబున దనరాజ్యమునందు జీవించినవాడును తాగ్యాకార్యవిచక్షణుండునునగువాని రాజుతనవద్దనుంచికొనదగుననుట... .. .. .. .. ... .. ౩౧

శ్లో॥ అధార్మికాన్ క్రూరాన్ దృష్టదోషాన్నిరాకృతాన్। పరేభ్యోభ్యాగతాన్ శ్చైవదూరాదేతాన్విసర్జయేత్॥.. .. ... ... ౩౨

ధార్మికులుగానియట్టియు- క్రూరులగునట్టియు- తప్పుజేసిత్రోయబడినట్టియు - అన్యరాజులవద్దనుంచివచ్చినవారును - నిట్టివారలవిడువదగుననుట... ... ... .. .. ౩౨

శ్లో॥ మహావాతసముద్ధూతావు పరీక్షితనావికాం। అన్యనౌ ప్రతిబద్ధాంతాం నౌమారోహేన్నావమాతురాం॥... .. .. .. .. ౩౩

పెద్దగాలిచేకొట్టుబడినట్టియు- పరీక్షితుడుగాని కర్ణధారుడుగలిగినట్టియు- యితరులవాడతో సంబంధబడినట్టియు- శిథిలమగునట్టియు వాడమీదరాజు ఎక్కదగదనుట... .. ౩౩

శ్లో॥ పరితాపిషువాసరేషుపశ్చాత్తటభాగస్థితమాప్తసైన్యచక్రం।పరిశోధితమీననక్రజాలంవ్యవగాహేతజలంసుహృత్సమేతః॥... ... .. ౩౪

ఎండకాలంబులయందు- తనచేపరీక్షింపబడి విషాదులచేత

యు-[మొసళ్లు మొదలగు దుష్టజంతువులచేతయు దూషితముగా నిగుంటయందు చుట్లుసైన్యంబులరక్షణము గలుగునట్లొనర్చి విహితులతోడస్నానము జేయదగుననుట- నిట్లొనర్చక పావు నెడల దండికృతంబగు- దశకుమారచరిత్రయందు- మంత్రగుప్తుండనువానిచే కవక లేఖయను స్త్రీకొరకు అంధ్రదేశాధిపుండగుజయ సింహ్మంఒనురాజుకృత్రిమోపాయమువలనజలాశయంబునజంపబడియెనని యుదహరింపంబడియుండుటజూడదగు - నాకథగ్రంథవిస్తరభయంబున దిఙ్మాత్రముసూచింపబడియె... ... ౩౪

వనవిహారవిధిః.

శ్లో॥ గహనానివిసర్జయిత్వా శుద్ధంబహిరుద్యానవనం
సమభ్యాసేయాత్ । విహరన్మధురంవయోనురూ
పైర్నచమాద్యోద్విషయోపభోగరాగాత్॥ ౩౫

వనవిహారము జేయువేళయు నెడ తనవయస్సునకను రూపులగుహితులతోడను కేవలవిషయాసక్తుండనగా విశేషపానాదులయందాసక్తిగలిగినవాడనుట - అట్లుగాక జాగ్రతగలవాడగుచు - బాధకరములగు మృగములచేత నేనియు శత్రులగువారిచేత నేనియు నట్టివారిభృత్యులు మొదలగు వారిచేత నేనియు నాక్రమించబడక పరిశుద్ధంబులును, మధురఫలంబులునుగల వృక్షులతొసముదాయములచే శోభితంబగునగరబహిరుద్యాన వనంబునక్రీడించదగుననుట... .. ... .... .. ... ౩౫

మృగయాయానవిధిః.

శ్లో॥ సువినీతసువేషపృష్ఠయానఃసుఖగమ్యాముచితాంచ
లక్ష్యసిద్ధ్యై।సుపరీక్షితరక్షితాంతసీమాలఘుకో
ష్టశ్చమృగాటవీముపేయాత్॥ ... ... ౩౬

వక్ష్యమాణంబగు వ్యసనసర్గంబునందలి విధినినిర్మితంబగు వేటలాడదగు- నడవియందు చలాచలంబులగు జంతుజాలంబుల లక్ష్యభేదంబులు వారకబడుటకొరకు పరిక్షించబడినట్టియు వే

టకుతగిన యలంకారములుగలిగియు భయభక్తులుగలిగియునుం డునట్టి శూరులగుభృత్యవర్గములతోడను మితాహారముగలవాఁడగుచు వేటలాడదగు.. ... ... .. ... ... ౩౬

అన్యగృహప్రవేశవిధిః.

శ్లో॥ కార్యమేవ్యవశోధనమూడో మాతులాంతికమపి పవి పిత్రోః। అప్తశో స్వ్యనుగతప్రవిశేత్తత్వంకి టెచ గహనేచనతిష్ఠేత్॥ .. ... ... ...౩౭

కార్యవశంబున నెచ్చటికేనియుననగా తనతల్లి మొదలగు వారిగృహములకుబోవలయు నెడ ముందు రాజాగమనము దెలియకుండెనేని వారలన్యకార్యాసక్తులగుచు రాజాగమము నెరవేర్పుటకు సంభావితముగుటంజేశియు - మరియునేక సంకటాస్పదముగుటంజేశియు ముందాయిల్లుజనసంమర్దనములు లేకుండునట్లుశోధించినమ్మకముగల ఆయుధపాణులు వెంబడింపరాగా నరుగదగునేనియు, నట్టిస్థలంబున యిరుకుగలయెడనేనియు సంమలయందేనియునిలువక విశాలస్థలంబున; నచ్చటికార్యము చూచికొనిరాదగు.. ... ... .. ... .. .. ... ౩౭

శ ॥ ప్రాంసూత్కటాకష్టాణివాతివాతేసంసక్తధారాజలదేచదేవే। శీతాతపేచాపితథాంధకారేస్వస్తుసన్నక్వచిదభ్యుపేయాత్॥ ... ...౩౮

మిక్కుటముగాగాలియుదుమ్ముగాలియు- మిక్కుటముగు వానయు - అధికంబగు నెనడయు - చీకటియు - చలియు - నిది మొదలగు దుష్టకార్యంబులయందుశత్రువులూనర్చు కపటోపాయంబుల కవకాశముగలుగుగావున నట్టికాలంబున రాజనువాడు బయిట వెళ్లదగదనుట.. .. ... .. ... ... ౩౮

శ్లో॥ నిర్గమేచప్రవేశేచరాజమార్గంసమంతతః ప్రోత్సారితజనంగచ్ఛేత్సమ్యగావిష్కృతోన్నతిః॥......౩౯

రాజుదేహసౌఖ్యార్థముగా- బయిలువెళ్లు సమయంబులందును మరలప్రవేశించుసమయంబులందును మార్గముచక్కజేయు

టయు - శస్త్రపాణులగు వారు వెంబడించియుండుటయు గలుగ వలయుననుట.. ... ... ... .. .. ౩౯

శ్లో॥ యాత్రోత్సవసమాజేషు జనసంబాధశాలినః। ప్రదేశాన్నవగాహేత నాతివేలం చ సంవిశేత్॥ ..౪౦

విస్తారముగ జనము జేరుచుండెడు ఉత్సవములు - వసంతయాత్రలు- మరియు నానావిధ సమాజములుగల ప్రదేశంబులు శత్రుప్రయుక్తంబులగు మారణాదిక్రియల కవకాశంబులగుటం జేసియట్టియెడలకుఁబోవదగదనుట- మరియునట్టిసమయంబులగమనమావశ్యకమగు నెడపూర్వోక్తంబగుసన్నాహయుక్తుండగుచు - స్వల్ప కాలంబునమరలి రాదగుననుట.. .. .. ... ౪౦

అంతఃపురరక్షావిధిః.

శ్లో॥ నిషేవితోపస్థవర్షైః కంచుకోష్ణీషధారిభిః। అంతర్గృహేచవిచరేత్కుబ్జకైరాతవామనైః॥.... ౪౧

తలగుడ్డలును- చొక్కాలును నిరంతరముధరించి వయసుచెల్లినవారనగా యవ్వనవయసునతిక్రమించిన ఖోజాలు- కుబ్జులు- మిక్కిలిపొట్టివారు మొదలగువికారదేహములు గలిగియు- పుంస్త్వ హీనులయ్యునుండెడునష్మకముగలయంతఃపురజనులచేననుగతుండగుచునంతఃపుర సంచారము జేయదగు... .. ౪౧

శ్లో॥ స్త్రీసైరంతఃపురామాత్యాశ్చయశ్చిత్తవేదినః। శస్త్రాగ్నివిషయోరత్యైస్తాధారంగోపశీషభిః॥ ... ౪౨

పూర్వోక్తులగునంతః పురభృత్యులురాజచిత్తానువర్తనులగుచు- దుర్మార్గులగువారిచేఁబ్రయుక్తంబులగుకృత్రిమంబులగు - శస్త్ర- అగ్ని- మొదలగువిషమప్రయోగములవలన రాజదేహంబున కపాయంబురాకుండునట్టుల రక్షించదగుననుట.. ... ౪౨

అత్రపాఠాంతరం.

శ్లో॥ స్త్రీభిరంతఃపురామాత్యాశ్చయశ్చిత్తవేదినః। శస్త్రాగ్నివిషసర్వేభ్యోహిస్రయోయుర్మహీపతిం॥ ౪౩

అంతఃపురంబునందలినర్మసఖులగువారలు నమ్మకముగలవా రలగుటంజేసి చిత్తానువర్తనులగుచు- రాజు కేవలమును అంతఃపుర స్త్రీవ్యసనమునందాసక్తుండుగాకుండునటుల- శస్త్రములు- నిప్పు- విషము- యీలాటిసంబంధముగలుగని క్రీడలచే కాలక్షేపము జేయదగుననుట... ... ... ... ... ... ౪౩

శ్లో॥ అంతర్వంశికసైన్యంహిసన్నద్ధంసాధుసమ్మతం। ర
క్ష్యేదాయుక్తకుశలమంతఃపురగతంనృపం॥..౪౪

అంతఃపురగతుండగుచుక్రీడాసక్తుండగురాజున కపాయంబు రాకుండునట్లు అంతఃపురరక్షయందాజ్ఞప్తులగుచుపరీక్షితులగుచు సన్నద్ధులగుచుండుజనంబులు రక్షించదగు.. .. ౪౪

శ్లో॥ ఆశీతికాశ్చపురుషాఃపంచాశతాః స్త్రియోషితః।
బుద్ధ్యేరన్నవరోధానాంశౌచమాగారికాశ్చయే॥౪౫

అంతఃపురరక్షణకై పరీక్షాపూర్వకంబుగా నేర్పరచబడియుండెడు- ఎనబదిసంవత్సరవయసుగల పురుషులును- ఏబదిసంవత్సరములవయసుగల స్త్రీలును అంతఃపుర స్త్రీలవిషయంబగు పరిశుద్ధతను గనిపెట్టియుండదగుననుట॥ ఇట్టివయసునకు తక్కువగు స్త్రీపురుషులకింద్రియజయముగలుగదుగాన నంతఃపురక్రియల కుతగినవారుగారని తాత్పర్యము.. .. ... ౪౫

శ్లో॥ రూపాజీవ్యాః స్త్రియస్స్నాతాః పరివర్తితవాససః।
రాజానముపతిష్ఠేయుర్విచిత్రస్రగ్విభూషితాః॥౪౬

మిక్కిలిరూపవంతులగు రాజాంతఃపురవనితలు పరిశుద్ధంబులగు జలములచేస్నానమొనర్చియు - యోగ్యవసనంబుల ధరించియు - విచిత్రంబులగు పుష్పాభరణములనలంకరించికొనియు - రాజసన్నిధికి రాదగుననుట... ... .. ... ...౪౬

ఇచ్చట రూపాజీవ్యాశబ్దమున కొకవ్యాఖ్యానకారుడు వారాంగనలనర్థము గావ్రాసియున్నది ధర్మవిరోధంబగుటవల, నను - వ్యాఖ్యానాంతరంబు ననంతఃపుర స్త్రీవిషయముగానుండుటవలనను నంతఃపురపరముగా నర్థముల్వ్రాయబడియె. ..

శ్లో॥ సుహృత్కైర్జటిలైశ్చైవ ముండైశ్చాభ్యంతరోజ
నః। సంసర్గంనక్వచిద్గచ్ఛే ద్బాహ్యైర్దాసీజనై
గపి॥ ... ... ... ... .. ౪౭

శత్రురాజప్రేషితులగు దూతలువేషగాంబ్లస్వరూపముచేత యు - జటాధరరూపములచేసయు - బోడితలలుగలిగియు - దాసీ రూపములచేతయు రాజద్రోహముకొఱకు కనిపెట్టియుండుదురు గావుననట్టివారితో నంతఃపురపరిజనులు కలయదగదనుట... ౪౭

శ్లో॥ నిర్గచ్ఛేత్ప్రవిశేచ్చాపిసర్వత్రాభ్యంతరోజనః। వి
జ్ఞాతద్రవ్యసంచారీ కరణేనోపలక్షితః॥ .. ౪౮

అంతఃపురసంచారులగు పరిజనంబులు బయలువెళ్లునపుడును మగలప్రవేశించునెడలను వాకిలియందు కావలియుండెడువారలకు శోధనయొసంగిరప్పటుప్రాయించిప్రవేశనిర్గమము లొనర్చదగుననుట - అటులజేయనియెడ అంతఃపుర సామగ్రివిషయంబులను విషప్రయోగాదులయందును పరిజనంబులయెడ సంశయముగలుగు గావున శోధనయొసంగుటయావశ్యకమనుట... ౪౮

శ్లో॥ నచానుజీవినంపశ్యేదకల్యంపృథివీపతిః, అన్యత్రా
త్యయికాద్రోగాత్సర్వత్రైవాతురోగురుః॥... ౪౯

కొన్నిరోగములుచూచినమాత్రముచేతయు - కొన్నిగాలిబాకినమాత్రముచేతయు - కొన్నిరోగితోమాటలాడినమాత్రముచేతయు సంభవించుటవలన - రోగియగుభృత్యునిజూడదగదనియు - నట్టిముఖ్యుండగు భృత్యునికిప్రాణాంతికంబగు రోగముసంభవించియుండు నెడ - నతనిను నోరథప్రూరణార్థముదర్శనమొసంగుటయవశ్యముగావున నారోగంబునకు ప్రతిక్రియారూపంబగు విషపరిహారకవస్తుభూషణభూషితుండగుచు దర్శనమొసంగదగుననుట... .. ... ... .. .. ...౪౯

రహఃప్రవేశవిధిమాహ

శ్లో॥ స్నాతోనులిప్తసురభిస్స్రగ్వీరుచిరభూషణః। స్నా
తాంస్వనత్తవసనాంపశ్యేద్దేవీమలంకృతాం॥ ౫౦

స్త్రీలకు ప్రీత్యతిశయము గుటకో అను సురభిజలంబుల స్నాన మొనర్చి వాసనలుగల కలపములలంది వాసనగల పుష్పముల ముడిచి దివ్యాభరణవస్త్రాదులచే నలంకృతుండగుచు నిజనివాసంబున నాప్తులగు పరిచారికాజనంబులచే సిద్ధము జేయఁబడిన యుదకంబుల స్నానమొనర్చి యచ్చటివస్త్రభూషణాను లేపనములచే నలంకృతయగు స్వకీయనాయికనుజూడఁదగుననుట.. ... ౫౦

శ్లో॥ నహి దేవీగృహం గచ్ఛేదాత్మీయాత్సంనివేశనాత్।
అత్యంతవల్లభోఽస్మీతి విస్రంభం స్త్రీషు నవ్రజేత్॥ ౫౧

స్త్రీల తాత్పర్య మతిచంచలంబును సాహసాత్మకంబునుం గావున వక్ష్యమాణ హేతుబలంబున - దానెయా స్త్రీలకత్యంత ప్రియుండనని నమ్మి తనయంతఃపురమునుండి స్త్రీలయంతఃపురంబునకు జనఁదగదనియు- క్రీడించుసమయంబున తనయెడకు నిజభార్య వచ్చునపుడును తదీయకపటంబునవలన రాజదేహమున కపాయము సంభవించని యటుల పూర్వశ్లోకోక్తక్రమంబున స్నానాద్యలం కర్చి రాదగుననియు దెలియదగు .. .. ... ... ౫౧

విశ్వాసాత్ స్త్రీభిర్వినాశితానాముదాహరణం.

శ్లో॥ దేవీగృహగతం భ్రాతా భద్రసేనమమారయత్।
మాతుశ్శయ్యాంతరేలీనః కారూషం చౌరస
స్సుతః॥ .. ... ... .. .. ౫౨

కళింగదేశరాజగు భద్రసేనునకు తమ్ముండగు వీరసేనుండను వాఁడు భద్రసేనుని పత్నియగు - శశుంతయనుదాని ప్రీత్యతిశయముచే శయనగృహంబున దాగియుండి భద్రసేనుంజంపెననియు ౫౨

మరి యొకకుమారునకు రాజ్యమొసంగవలయునను తాత్పర్యముగల కరూశదేశరాజును తల్లిచే ప్రేరేపితుండగు మరియొక పుత్రుడు తల్లిపడకలో దాగియుండి తండ్రిజంపెననియు.. ..

శ్లో॥ లాజాన్విషేణ సంయోజ్య మధునేతి విలోభితం। దేవీతు కాశీరాజానం నిజఘాన రహోగతం॥ ౫౩

కారణాంతరము చే కోపమునని నిర్బంధించుటచేత కుపిత యగు భార్య - ఒక పాత్రంబునకొన్ని విషముగలిపినవియు కొన్ని తేనె కలిపినవియుగా విభజించియుంచిన పేలాలను రహస్యప్రవర్తకుండగు తన పెనిమిటియును కాశిరాజునకు విషముగలిపియున్న దానిని సంగి శుద్ధంబును దానిని దాభక్షింపుచు రాజ్యలోభంబున బెనిమిటిం జంపెననియు .. ... .. ... .. ౨౩

శ్లో॥ విషాక్తేన చ సౌవీరం మేఖలామణినా నృపం। నూ
పురేణ చ వైరంత్యం జారూషం దర్పణేన చ॥... ౨౪

సౌవీరరాజును నతని చే బలుకంబడు వాక్పరుషంబుల చే కుపితయగు నతని రాణి విషమునందు తడపబడిన బడ్డాణము చేత ప్రణయకుపితయను వ్యాజము చే ప్రహరించి చంపెననియు.. ..

మిథ్యారూపంబగు ప్రవాదము వలన కుపితుండగు నిజనాయకుని విషమునందు తడపబడిన వెలపలి త్ర్లుగల అందె చే ప్రణయకుపిత వ్యాజము చే వైరంత్యంబను రాజుం దన్నిజం పెననియు, ...

అన్యాసంభోగదుఃఖితయగు కాంత చే విషచూర్ణము చే కప్పబడిన అద్దము యొక్క స్పర్శనమాత్రము చే జారూషుండను రాజు చంపంబడియెననియు ... ... .. .. .. ...

శ్లో॥ వేణ్యాం శస్త్రం సమాధాయ నిజఘాన విదూరథం॥

అసమానశీలయగు మరియొక స్త్రీని అంతఃపుర కాంతలతోడ నుంచుటను యత్నించినవి దూరథుండను రాజును భార్య తన జడయందు చిన్నదియగు నొక కత్తినుంచుకొని, రాజు నిద్రించు సమయంబున జంపెననియు - పూర్వరాజచరిత్రంబులం దుండుటం జేసి.. .. ... .. .. ... .. ...

శ్లో॥ అపాంవృత్తం పరిహరేచ్ఛత్రౌ త్వేతత్ప్రయోజయేత్॥ ౨౫

రాజు లేనియు రాజాంతఃపుర స్త్రీ లేనియు నిజాప్తులను వారి విషయంబులం దేవిధ ఉపాంశుపాయంబులు పొందనగదనియును శత్రు కృత్యంబులకు విషయంబుల ప్రయోగింపవలెననియు దెలియవలె... ... .. ... ... ... .. ..

దారగుప్తప్రయోజనం.

శ్లో॥ యస్యదారాస్సుగుప్తాస్స్యుఃపురుషైరాప్తకారిభిః।
సర్వభోగాన్వితంతస్యహ్యస్తిలోకద్వయంస్థితం॥ ౫౬

పూర్వోక్తంబులగుదారావమానంబులవలనప్రమాదంబులు గలుగుటం జేశియట్లుగాకుండనాప్తులగునంతఃపురరక్షకులచేమస్మార్గ ప్రవిష్టలుగాకుండునట్లు అంతఃపురంబును రక్షించుటవలననిహలోకంబున నట్టిసులాంగనా సంభోగసౌఖ్యాదులును ధర్మప్రజోత్పత్తియునను హేతువులచే నైహికసంతోషంబును- స్త్రీలుపరిశుద్ధలగుటవలన పరలోకంబునసుఖంబునుగలుగుననుట... ... ౫౬

శ్లో॥ ధర్మమిచ్ఛన్నరపతిస్సర్వాన్ దారాననుక్రమాత్।
గచ్ఛేదనునిశంనిత్యంవాజీకరణబృంహితః॥ .. ౫౭

ధర్మముగాపరిగ్రహించియుండెడుభార్యలయడకుధర్మలోపముగలుగకుండునటుల ప్రతిదినంబును భోగార్థము గాబోవదగుననుట- ఇట్టిబహుస్త్రీసంభోగబలముకొరకు వాజీకరణంబను ప్రయోగము - వైద్యశాస్త్రోక్తముగావునవందుజూడందగు- నీవాజీకరణప్రయోగవిషయంబునరతి రహస్యప్రకరణము నొకవ్యాఖ్యాతవిశేషముగావ్రాశియున్నను ప్రకృతకాలీనానర్హంబగుట విచ్చటసంక్షేపింపబడియె.. ... .. ... .. ..

అహోరాత్రకార్యభేదాః.

శ్లో॥ విచార్యకార్యాణ్యయవాన్ దినక్షయె విస్పృజ్యలోకంప్రమదాకృతక్రియః। అథస్త్వవధ్యేన హిసాధుపాణినాస్వపేదజస్రంపరమాప్తరక్షితః॥... ..౫౮

ప్రథమసర్గంబునందుదాహృతంబగు 'దినరాత్రులపదియాఱుభాగంబులుగావిభజించి యాయాకాలంబులయందాయాకృత్యములంజేయుచు నంతఃపురవర్తనకాలంబునకుపూర్వంబ ఆయాయికార్య సామాజికులనింద్లనిపి స్త్రీలచేయుధోచితపరిచర్యలంగీకరించిపరమాప్తులగు నంతఃపుర రక్షకులచేరక్షితుండగుచు నిజదే

హాసంరక్షణార్థమై కశస్త్రమును సమీపంబుననునిచి కొని నిద్రించవలెను... ... ... ... ... ... ... ౫౭

ఏతేషాంప్రయోజనమహ.

శ్లో॥ నయోనజాగ్రత్యనిశంన రేశ్వ రేసుఖంస్వపంతీహ ని
•రాధయఃప్రజాః॥ ప్రమత్తచిత్తేవిషయేస్తు తస్మినా
త్ ప్రజాగరేణాన్యజగత్ప్ర బాధ్యతే॥... .. ౫౯

నీతిశాస్త్రోక్తమార్గముచే రాజుజాగరూకుండగు నేడపునః పీడలులేక జనులు నిర్భయముగా నిద్రింతురనియునట్లుగాక విషయాసక్తుండగుచు నున్మార్గవర్తనుండయ్యెనేని నితరినుర్మార్గములవలన బాధించబడుదురనియు ఫలితార్థము... ... ...

సర్గోపసంహారమాహ.

శ్లో॥ ఇతిస్మపూర్వేమునయోబభాషిరే నృపస్యరాజ్య
స్యచసాధురక్షణం। తదేతదేవం పరిపాలయన్న
యాత్ నరేశ్వరఃపాలనకల్యతాంవ్రజేత్॥. ౬౦

ఇట్లుస్వకీయరాజ్యంబును స్వకీయదేహంబునురక్షించురీతిని పూర్వీకులగునీతిశాస్త్రజ్ఞులగు ఋషులచేవివక్షితంబగుటంజేసి యీ కమంబున రాజ్యముపాలించెడురాజు నిదోషంబుగా రాజ్యపరిపాలనజేయువాడనంబడుననుట.. .. ... ..

ఇతికామందికీయేసప్తమస్సర్గః.



కామందకం అష్టమస్సర్గః.

శ్లో॥ ఉపేతఃకోశదండాభ్యాంసామాత్యస్సహమంత్రి
భిః।దుర్గస్థశ్చింతయేత్సాధుమండలంమండలాధిపః॥౧

పూర్వోక్తంబులగు నేడు సర్గలయందు తనరాజ్యమును పాలించువిధినిఁజెప్పి యిచ్చటనన్యరాజ్యముల సాధించువిధినిజెప్ప నారంభించుచున్నాడు గావునపూర్వోక్తంబులగు ద్రవ్యసంపదచేతయు దండనీతిచేతయు సంపూర్ణుండగు రాజు మంత్రసామం

తులతోఁగూడి స్వకీయరాజధానియందు రహస్యప్రదేశంబున వక్ష్యమాణంబగు మండలసంపద నాలోచించవలెననుట... ...

శ్లో॥ రోచతే సర్వభూతేభ్యః శశీవాఖండమండలః। సంపూర్ణమండలస్తస్మాద్విజిగీషుస్సదాభవేత్ ॥ ౨

షోడశకళా పరిపూర్ణంబగు చంద్రమండలమువలె వక్ష్యమాణంబగు రాజమండలముతోఁగూడి జయశీలుండగుచు జయము నిచ్ఛించుచుండెడు రాజు సర్వజనాహ్లాదకారియగు ననుట.. ... ౨

శ్లో॥ రథీవ రాజతే రాజా విశుద్ధే మండలే చరన్। అశుద్ధమండలే సర్వం జీర్యతే రథచక్రవత్

వక్ష్యమాణంబగు సంపూర్ణమండలవర్తియగు రాజు సవరణలతోఁగూడిన। రథికునివలెఁ బ్రకాశించుననియు నట్లుగాని యెడల కట్టుపీడబడిన చక్రమువలె నశించుననియు దెలియవలయుననుట....3

శ్లో॥ అమాత్యరాష్ట్రదుర్గాణి కోశో దండశ్చ పంచమః। ఏతాః ప్రకృతయస్తజ్ఞైర్విజిగీషోరుదాహృతాః॥ ౪

అన్యరాజ్యము జయించ తలంపుగల రాజునకు (విజిగీషుః) అని యెడు విశేషనామము గలిగియుండును గాన నట్టి విజిగీషునకు మంత్రిసంపదయు ౧ స్వకీయదేశ క్షేమంబును ౨ కోటలు దుర్గంబులు మొదలగునవియు ౩ ధనముచే నిండియుండెడి బొక్కసంబును ౪ దండనీతిక్రమములనప్పకుండుటయు ౫ అను నైదు పరికరంబులు ముఖ్యముగాగలిగియుండవలయు.. .. ... ... ......

శ్లో॥ ఏతాః పంచతథా మిత్రః సప్తమః పృథివీపతిః। సప్తప్రకృతికం రాజ్యమిత్యువాచ బృహస్పతిః॥... ......౫

దేవతాచార్యుండగు బృహస్పతి మతంబున పూర్వోక్తంబగు నైదు ప్రకృతులును మిత్రుండగు రాజసంపత్తియుఁ రాజును దానును ౭ గూడ సప్తప్రకృతిసంపన విజిగీషునకు గలిగియుండవలయు ననుట... .. .. ... ... .. .. ..

శ్లో॥ సంపన్నస్తు ప్రకృతిభిః మహోత్సాహః కృతశ్రమః। జేతుమేషణశీలశ్చ విజిగీషురితిస్మృతః॥... ౬

పూర్వోక్తంబులగు - సప్తప్రకృతులతోఁగూడి ఉత్సాహగుణ సంపదగలవాఁడును -- నానావిధాయుధయుద్ధములజితశ్రముండును ప్రథమసర్గోక్తక్రమంబగు - ఇంద్రియజయయుక్తుండగు రాజునకు విజిగీషుండనుసంజ్ఞయనుట.. ... .. ... ... ...

విజిగీషుగుణానాహాపంచభిః.

శ్లో॥ [౧]కౌలిన్యం [౨]వృద్ధసేవిత్వం [౩]ఉత్సాహః [౪]స్థూలలక్షితా।
[౫]చిత్తజ్ఞతా [౬]బుద్ధిమత్త్వం [౭]ప్రాగల్భ్యం [౮]సత్యవాదితా।
అ[౯]దీర్ఘసూత్రతా [౧౦]వశ్యేంద్రం [౧౧]ప్రశ్రయస్స [౧౨]ప్రధానతా
[౧౩]దేశ[౧౪]కాలజ్ఞతా [౧౫]దార్ఢ్యం [౧౬]ఆప్తక్లేశసహిష్ణుతా। స
[౧౭]ర్వవిజ్ఞానతా [౧౮]దాక్ష్యం [౧౯]ఊర్జా [౨౦]సంభృతమంత్రతా।
[౨౧]అవిసంవాదితా [౨౨]శౌర్యం [౨౩]భక్తిజ్ఞత్వం [౨౪]కృతజ్ఞతా। శర
[౨౫]ణాగతవాత్సల్యం [౨౬]అమర్షిత్వమ[౨౭]చాపలంస్వకర్మదృ
[౨౮]ష్టశాస్త్రత్వం [౨౯]కృతిత్వం [౩౦]దీర్ఘదర్శితా। [౩౧]జితశ్రమ
త్వం [౩౨]వాగ్మిత్వమక్రూర[౩౩]పరివారతా। [౩౪]ప్రకృతిస్ఫీత
తా చేతి విజిగీషోర్గుణాస్స్మృతాః॥ .. .. ౧౧

మంచికులంబున జనించియుంటయు ౧- విద్యావృద్ధులగు పెద్దల సేవించుట ౨- పూర్వోక్తలక్షణలక్షితంబగు నుత్సాహంబును ౩- దండవిషయంబులన్ప్రవృత్తి విషయంబులయందు లౌభ్యము లేక ప్రబలముగా వ్యయముఁజేయుట స్థూలలక్షితయనుట ౪- పరులయభిప్రాయంబులనింగితాదులవలన దెలియుటయు ౫- కాలోచితంబులనూహించుటయు ౬- సర్వదేశకాలంబులయందును వెనుకతీయ్యని సామర్థ్యంబును ౭- నిజము బలుకుటయు ౮- దీర్ఘముగా నాలోచించుట లేకున్కియనగా శీఘ్రకార్యకరణతయును ౯- పాపగు

జ్ఞాభావతయు ౧౦- ఆశ్రయించినవారినాదరించుటయు ౧౧- తన తాత్పర్యము అతిశయగుణోదయముగా నుండునట్లు యోచించుటయు ౧౨- దేశభేదంబులును కాలభేదంబులు దెలిసి కార్యము నందు ప్రవర్తించుటయు ౧౩- దేహబలంబు గలిగియుండుటయు ౧౪. ఆపత్కాలంబులయందోర్చుటయు ౧౫- సమస్తకార్యంబుల దెలియునట్టి జాగరూకతయు ౧౬- కార్యంబుల త్వరితముగా నడిపించుటయు ౧౭- దేహపటుత్వకాంతులు గలిగియుంటయు- పర్యాంతరంబున ఉదారగుణంబును ౧౯- రహస్యముగా నాలోచించుటయు ౨౦- వ్యర్థాలాపములు జేయకుండుటయు ౨౧- శూరగుణంబును ౨౨- భృత్యులు జేయుచుండెడు భక్తిని దెలియుట ౨౩- భృత్యులు జేయు మంచి కార్యంబుల ప్రత్యుపకారబుద్ధిచే దెలిసికొనుటయు ౨౪- శరణాగతుండగు వానిదయతో రక్షించుటయు ౨౫- స్వల్పాపకారులయందు కోపము జెందక సహించుటయు ౨౬- బుద్ధిచపలత లేకునికియు ౨౭ - స్వకీయంబగు ప్రజారక్షణ యుద్ధజయాది రూపంబులగు కర్మంబులకు తగు నానాశాస్త్రపరిజ్ఞానంబును ౨౮- కృతిత్వమనగా పాండిత్యము గలిగియుండుటయు ౨౯ - చక్కగా నాలోచించుట - ఇచ్చట దీర్ఘసూత్రతకును దీర్ఘదర్శిత్వంబునకు భేదము విచారించదగు ౩౦ -యుద్ధాదులయందు వాడికె గలిగియుండుట ౩౧- చక్కగా యుక్తులు వచించుట ౩౨- దుష్టులుగాని యోగ్యపరివారము గలిగియుండుటయు ౩౩- పూర్వోక్తంబులగు సప్త ప్రకృతులు గలిగియుండుటయు ౩౪- ననుముప్పది నాల్గుగుణంబులు విజిగీషునకు గలిగియుండవలయుననుట.. .. .. ౧౧

ప్రతాపోత్కర్షమాహ.

శ్లో॥ సర్వైర్గుణైర్విహీనోఽపి స రాజ్ఞాయః ప్రతాప
వాన్। ప్రతాపయుక్తాత్త్రస్యంతి పరే సింహాన్మృగా
ఇవ ॥ ౧౨ ॥ ప్రతాపయుక్తో నృపతిః ప్రాప్నోతి మ
హతీం శ్రియం। తస్మాదుద్ధానయోగేన ప్రతాపం జ
నయేత్పరే॥ .. .. .. ... ౧౩

పూర్వోక్తవిజిగీషునకు వలయునన్నిగుణంబులు లేకుండినను ప్రధానంబగుప్రతాపగుణంబువలనమహదైశ్వర్యప్రాప్తియగుట వలనను- సింహమునకితరమృగంబులు భయపడునట్లు ప్రతాపగుణంబులుగలవానికితరులుభయము జెందుదురుగావునను- ప్రతాపము చేనితరరాజులనుతపింపజేయదగుననుట... ... ... ౧౩

శత్రులక్షణం.

శ్లో॥ ఏకార్థాభినివేశిత్వమరిలక్షణముచ్యతే। దారుణ
స్తుస్మృతశ్శత్రుర్విజిగీషోర్గుణాన్వితః॥ ... ౧౪

భూ- హిరణ్య- కాంతావిషయంబులు మొదలగువిషయంబులయందొకటియం దిరువురపేక్షించుట శత్రులక్షణమనియు అం దుసమర్థుండగువాడుపూర్వోక్తంబులగువిజిగీషుగుణంబులుగలవాడైయుండుటవలననతనిజయించుటప్రయాసంబనుట.. ..౧౪

సుచ్ఛేద్యశత్రుమాహ.

శ్లో॥ లుబ్ధఃక్రూరోలసోసత్యః ప్రమాదీభీరురస్థిరః। మూ
ఢోయోధావమంతాచ సుఖోచ్ఛేద్యో రిపుః
స్మృతః॥ ... ... ... ... ...౧౫

లోభియు౧ - క్రూరబుద్ధియుననగా మంచివారలజేర్చనివాడును౨ - సోమారియు౩ - అబద్ధముచెప్పువాడును౪ - జాగ్రతలేనివాడును౫ - పందయనగాభయపడువాడును౬ - నిలకడగలబుద్ధిలేనివాడును౭ - తెలివిలేనివాడును౮ - నిజభృత్యులయందుగల సరదారులనవమానముజేయువాడును౯ - నిట్టిదుర్గుణంబులుగల శత్రువుసులభముగాజయించబడుననుట.. ... ... ౧౫

మండలలక్షణమాహచతుర్భిః.

శ్లో॥ అరిర్మిత్రమరేర్మిత్రం మిత్రమిత్రమతఃపరం। త
థారిమిత్రంమిత్రంచ విజిగీషోఃపురస్స్మృతాః॥౧౬

విజిగీషుండను సంజ్ఞగలయుద్ధజయముకొరకు దండుదీసుకొని శత్రులమీద నేగువానికిముందువెనుక నుభయపార్శ్వంబుల రాదగుసామంతరాజమండలము నెఱుపవబడుచుండనందు - విజి

గీషునకు మొదటగానుండదగు వారు క్రమక్రమంబున పశ్చిమా
ణంబగు నంతరభూములయందు నడవదగువారు - తనసమీపంబు
నకు మిత్రుండును ౧-శత్రువునకుమిత్రుడుగానుండి యతనివిడిచిన
వాడును ౨. తనమిత్రునకుమిత్రుండును ౩. శత్రునకుమిత్రుండగు మన
తనివద్దనుండువాడును ౪- శత్రునకుమిగులమిత్రుండును ౫- శత్రు
వును ౬- ననువారు విజిగీషునకుముందరనుండదగినవారనుట.

శ్లో॥ పార్ష్ణిగ్రాహస్తతః పశ్చాదాక్రంద స్తదనంతరః।
ఆసారావనయోశ్చైవ విజిగీషోశ్చపృష్ఠతః॥ ౧౭

వెనుకనుండదగువారిసంజ్ఞలు - సమీపంబున పార్ష్ణిగ్రాహుం
డును - నతనివెన్కటఆక్రందుండును - ఆసారులనువారలిరువురు
నుగూడిపదిమంది రాజులును గలిగియుండువాడు సార్వభౌముం
డగుచుభూమియంతయుజయించుననుట... ... ... ౧౭

అత్రవిశేషమాహ.

శ్లో॥ అరేశ్చ విజిగీషోశ్చ మధ్యమోభూమ్యనంతరః। అ
నుగ్రహే సంహతయోర్వ్యస్తయోర్నిగ్రహే
ప్రభుః॥ ... .. ... ... .. ౧౮

శత్రువునకును విజిగీషునకును మధ్యభూమియందుండు మ
ధ్యసంజ్ఞగలరాజు శత్రువిజిగీషులు ఐక్యమగునెడల నిరువురనను
గ్రహించుటకును - యుద్ధముజేయునెడధార్మికుండగుదుర్బలునకు
సహాయమొనర్చుటకును స్వతంత్రుడుగానుండుననుట... ౧౮

శ్లో॥ మండలాద్బహిరేతేషా ముదాసీనోబలాధికః।
అనుగ్రహే సంహతానాం వ్యస్తానాంచ వధే
ప్రభుః॥ ... .. ... .. ...౧౯

పూర్వోక్తులగుశత్రు - విజిగీషు - మధ్యముల మండలముకం
న్న వెలపటనుండు బలాధికుండగు - ఉదాసీనసంజ్ఞగలరాజు- ఈ
ముప్పురుకలసినయెడ వీరియందనుగ్రహించుటకును - వీరుపరస్ప
రశత్రువులగునపుడు ధార్మికుండగు దుర్బలునిపక్షమునవలంబించి

బలవంతులజంపుటకునుస్వతంత్రుండగునిట్లు - మిత్రుండును ౧ - శత్రుమిత్రుండును ౨ - మిత్రమిత్రుండును ౩ - శత్రుమిత్రుండును ౪ - నతనియత్యంతమిత్రుండును ౫ - శత్రువు ౬ - పార్ష్ణిగ్రాహుండును ౭ - ఆక్రందుండును ౮ - ఆసారద్వయంబును ౧౦ - మధ్యముండును ౧౧ - ఉదాసీనుండునునను ౧౨ పండ్రెండుమంది; రాజమండలంబని సంజ్ఞగలిగియుండు... ... ... ... ... ... ౧౯

అత్రమతాంతరాణ్యాహ.

శ్లో॥ మూలప్రకృతయస్త్వేతా శ్చతస్రః పరికీర్తితాః। అ
హైత త్తంత్రకుశలః చతుష్కంమండలంయమః॥

యముండను నాచార్యునిమతంబున అరియు - మధ్యముండును - ఉదాసీనుండును - మూలప్రకృతులునను నలుగురుమండలాధిపతులని యీ రాజశాస్త్రతంత్రకుశలుండగునీతనిమతము ౨౦ మరియునిచ్చటప్రత్యంతరంబున మయుండని వ్రాయబడియున్నది. ఐనను తాత్పర్యము సమానమగుటవలన నామభేదమావశ్యకముగా విచారించుట యనావశ్యముగా దోచుచున్నది... ౨౦

శ్లో॥ విజిగీషురరిర్మిత్రః పార్ష్ణిగ్రాహశ్చమధ్యమః। ఉ
దాసీనః పులోమేంద్రౌ షట్కంమండలమూచతుః ౨౧

పులోముండను నింద్రునిమామయు - ఇంద్రుడును - వీరియుభయులమతంబున - పూర్వోక్తలక్షణలక్షితుండగువిజిగీషుండును ౧ - శత్రుండును ౨ - మిత్రుండును ౩ - పార్ష్ణిగ్రాహకుండును ౪ - మధ్యముండును ౫ - ఉదాసీనుండును ౬ - నను నారుగురు మండలసంజ్ఞగలవారనుట... ... ... ... ... ... ౨౧

శ్లో॥ ఉదాసీనోమధ్యమశ్చ విజిగీషోశ్చమండలం। ఉశ
నామండలమిదమ్ప్రాహ ద్వాదశ రాజకం॥......౨౨

పూర్వోదాహృతంబగుపదియారవశ్లోకము మొదలు ౧౫వ శ్లోకపర్యంతము నుదహరింపబడిన ద్వాదశ రాజమండలము శుక్రాచార్యమతంబనుట.. .. .. .. .. ౨౨

శ్లో॥ ద్వాదశానాం నరేంద్రాణా మరిమిత్రే పృథక్పృథ
క్। షట్త్రింశతమితి ప్రాహు స్తైచ తేచమహర్షయః॥ ౨౩

పూర్వోక్తంబగు పన్నెండుమంది రాజులకును అరి- మిత్ర- అను వేర్వేరసంజ్ఞలచే ముప్పదియారు మండలంబులుగలవనియ నేకులగు ఋషుల తాత్పర్యము. ... ... .. .. ౨౩

శ్లో॥ ద్వాదశానాం నరేంద్రాణాం పంచపంచపృథక్పృ
థక్। అమాత్యాద్యాశ్చ ప్రకృతీ రామనంతిహిమా
నవాః... ... ... ... ... .. ౨౪

పూర్వోక్తులగు పన్నెండుగురు రాజులకును వేర్వేర- అమాత్య- రాష్ట్ర- దుర్గ- కోశ- దండాదులగు పంచప్రకృతులు వేర్వేరనియోగించిన అరువది సంఖ్యయగు మండలముగలదని మనుశిష్యులమతమనుట... ... ... .. .. ... ౨౪

శ్లో॥ మాలాద్ద్వాదశచైవైతా అమాత్యాద్యాస్తథాచ
యాః। సప్తతిద్వ్యేకాధి హ్యేషాం సర్వం ప్రకృ
తిమండలం॥... ... .. .. ... ౨౫

పూర్వోక్తంబగునమాత్యాదుల మండల మరువదియు- దీనితోడనపన్నెండురాజులకును మూలప్రకృతులు పన్నెండుగురును గూడి డెబ్బదిరెండు పూర్ణరాజమండల మనిమను శిష్యమతము... ... .. ... ... .. ... ౨౫

శ్లో॥ సంయుక్తస్యారిమిత్రాభ్యాముభయాది స్తథాసు
హృత్। మాలాద్ద్వాదశ రాజాన ఇత్యష్టదశకం
గురుః॥... ... ... ... ... ౨౬

పూర్వోక్తవిజిగీషుక్రమంబువనరిపతుంబునను మండలముగల్పించునెడ పదునెనిమిదియగుగావున నష్టాదశమండలంబని బృహస్పతిమతము .. ... ... ... .. .. ౨౬

శ్లో॥ అష్టాదశానామె తేషాం అమాత్యాద్యాః పృథక్పృ
థక్। అష్టోత్తరశతం హ్యేతన్మండలం కవయో
విదుః॥... ... ... ... .. ...౨౭

పూర్వశ్లోకోక్తబృహస్పతిమతంబగుపదునెనిమిది మండలంబులకును అమాత్యాదుల వేర్వేరగూడిననూట యెనిమిది మండలంబులగునని యతనిశిష్యులగు పెద్దలతాత్పర్యము... .. ౨౭

శ్లో॥ ఏతేషాందశ చాష్టానాం శత్రుమిత్రైః పృథక్పృథక్ ।
చతుఃపంచాశతమితివిశాలాక్షః ప్రభాషతే॥...౨౮

పూర్వోక్తంబగుబృహస్పతిమతసిద్ధంబగునష్టాదశ రాజమండలంబునకును శత్రుమిత్రులగూర్చినయేబదినాలుగు సంఖ్యయగు మండలంబగునని విశాలాక్షుండను నాచార్యునిమతమనుట...౨౮

శ్లో॥ చతుఃపంచాశతం రాజ్ఞామమాత్యాద్యైః పృథక్పృథక్ । చతుర్వింశతిసంయుక్తం మండలం త్రిశతం
మతం॥ ... ... ... ... .. ౨౯

నిందు జెప్పబడినవిశాలాక్షమతంబగు నేబది నాలుమండలరాజులకును- అమాత్యాదులగుషడ్వర్గంబులగూర్పగా మున్నూట యిరువదినాల్గుమండలంబులగుననుట.. ... ... ౨౯

శ్లో॥ సప్తప్రకృతికం తత్తు విజిగీషోరరేశ్చ యత్ । చతుర్దశకమేవేదం మండలం పరిచక్షతే॥ ... ౩౦

౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭
స్వామి- అమాత్య- రాష్ట్ర- దుర్గ- కోశ- బల- సుహృత్- అను సప్తప్రకృతులు. విజిగీషునకును - శత్రునకునునీప్రకారముగ ల్పించు నెడపదునాలుగుసంఖ్యగలమండలమగుననిపయోంతరము.

శ్లో॥ మండలత్రికమిత్యాహుర్విజిగీష్వరిమధ్యమాః। మిత్రయుక్తాః పృథక్చైతే షట్కమిత్యపరే జగుః॥ ౩౧

విజిగీషు- అరి- మధ్యములను మూడుమండలంబులని కొందరిమతంబును- ఈవిజిగీషు- అరి- మధ్యములు- వేర్వేరమిత్రయుక్తులగుచు నార్మండలంబులగునని మరికొందరిమతంబుననుట ౩౧

శ్లో॥ అమాత్యాద్యైః ప్రకృతయః ప్రత్యేకస్యైవ భూపతేః। మండలం మండలవిదః షట్త్రింశత్కం ప్రచక్షతే॥ ౩౨

పూర్వోక్తులగు విజిగీషు- అరి- మధ్యములు మిత్రయుక్తుల

గుచుండునార్వురకును వేర్వేరఅమాత్యాదిషట్ప్రకృతులచే చూ
నెడముప్పదియారుమండలంబులగుననుట... .... ... ౩౨

శ్లో॥ సప్తప్రకృతికాహ్యేతేవిజిగీష్వరిమధ్యమాః। ఏక
వింశతికంప్రాహురపరేనయవేదినః... ... ౩౩

పూర్వోక్తములగు- విజిగీషు- అరి- మధ్యములు తమతమసప్త
ప్రకృతులుగలవారగుటనిరువదియొక మండలంబగునని.అన్యులగు
నీతిశాస్త్రవేదులమతమనుట... .. .. .. ... ౩౩

శ్లో॥ చత్వారః పార్థివామూలాఃపృథక్త్రి త్రిస్సహాష్ట
కం।అమాత్యాదిభిరేతేచజగత్యష్టరసంమితాః౩౪

అరి- విజిగీషు- మధ్యమ-ఉదాసీనులనుమూలరాజులు నలుగు
రికిని వేర్వేరమిత్రులగూర్చ ఎనిమిదిమండలంబులగుననియు వీరల
కు అమాత్యాదులగు పంచవర్గముజేర్పనలుబదెనిమిది మండలమ
గుననియుపక్షాంతరము.. .. .. .. .. ౩౪

శ్లో॥ విజిగీషోఃపురస్తాచ్చయెచపశ్చాత్ప్రకీర్తితాః। దశ
కంమండలమిదంమండలజ్ఞాఃప్రచక్షతె॥.. ..౩౫

పూర్వోదాహృతంబులగు- ౧౬ - ౧౭ శ్లోకంబులయందువి
జిగీషునకుముందు వెనకలయందుండు మండలదశకంబమండల వే
త్తలతాత్పర్యము... ... ... ... ... ... ..

శ్లో॥దశానాంభూమిపాలానాంఅమాత్యాద్యాఃపృథక్పృ
థక్।మండలంమండలవిదఃషష్టిసంఖ్యంప్రచక్షతే॥౩౬

పూర్వశ్లోకోక్తమండల దశకంబుననమాత్యాదిపంచప్రకృ
తులగూర్పనరువదిసంఖ్యయగుమండలంబగు ననిపక్షాంతరము౩౬

శ్లో॥ ప్రాంచాద్యావిజిగీషోశ్చపశ్చిమావితిపంచకం। అ
మాత్యాద్యాఃపృథక్తేషాంత్రింశత్స్యాదిహ ప్రచ
క్షతె.. ... ... ... ... ...౩౭

విజిగీషునకుముందరనడుచుమిత్రుండును - శత్రుండును- వెన
కనడచుపార్ష్ణిగ్రాహ - ఆక్రందులునువిజిగీషుతోడ-నైదుగురు

గావునవీరికి అమాత్యాదులగుపంచప్రకృతులగూర్పమొత్తము
డలంబగుననుట... .. .. .. .. ... ..

శ్లో॥ అరేరప్యేవమేవేతిదృష్టోదృష్టిమతాంవరైః। పంచ
కంమండలంన్యాయ్యంత్రింశత్కంచమనీషిభిః॥ ౩౮

విజిగీషునకుంబలెశత్రువునకును గల్పించుట యుక్తముగావు
న నీతిశాస్త్రదృష్టియుక్తులగు బుద్ధిశాలులవలన శత్రుపక్షంబున
ను ముప్పదిసంఖ్యయగు మండలముగలదని దెలుపంబడియెననుట...

శ్లో॥ ద్వేఏవప్రకృతీన్యాయ్యే ఇత్యువాచపరాశరః॥ అభి
యోక్తృప్రధానత్వాత్తథాన్యాన్యభియుజ్యతే ౩౯

విజిగీషుండు- అరియునను రెండు ప్రకృతులుగావున శేషమం
డలంబులు తదంతర్భూతంబులగుటవలనను నిదియెప్రధానంబని
పరాశరఋషితాత్పర్యమనుట.. ... .. ... ౩౯

శ్లో॥ పరస్పరాభియోగేనవిజిగీషారరేస్తథా। అరిత్వవి
జిగీషుత్వేఏకాప్రకృతిరేకతా॥... ... ౪౦

విజిగీషుండనియు- అరియనియు సంజ్ఞామాత్రము భేదముగా
నివారల యందొకరికొకరికి ప్రకృతిస్వభావభేదంబు లేదుగావు
నను విజిగీషునకు- అరిశత్రుస్థానాపన్నుండును- అరికివిజిగీషు శ
త్రుస్థానాపన్నుండుననగుట ప్రధానమండల మొకటియెయనిప
రాశరఋషితాత్పర్యమనుట.. .. ... .. ౪౦

శ్లో॥ ఇతిప్రకారైర్బహుధామండలంపరిచక్షతే। సర్వ
లోకప్రతీతంహిస్ఫుటంద్వాదశరాజకం॥ .. ౪౧

ఇట్లు ౨౦యవశ్లోకము మొదలు ౪౦యవ శ్లోకముపర్యం
తంబును ననేకవిధమండల భేదంబులుగలిగియున్నను సమస్తలో
కంబులందును ప్రసిద్ధంబును నిశ్చితంబుననగుమండలము- ౧౬-
౧౭-౧౮-౧౯ శ్లోకములందు నిరూపింపబడినద్వాదశమండల
ముప్రసిద్ధమనుట... ... ... ... ... .. ౪౧

శ్లో॥ చతుర్మూలంచాష్టశాఖంషష్టిపత్రంద్వయోస్థితం।
షట్పుష్పంత్రిఫలంవృక్షంయోజానాతిసనీతివిత్ ౪౨

ప్రకరణోపసంహారమునందు ఫలితార్థరూపంబగుమండల మును వృక్షరూపంబున జెప్పంబడియె నెట్లన- విజిగీషు- అరి- మధ్యమ- ఉదాసీనులను నాల్గుపేళ్లును- వీరలకు ప్రత్యేక ప్రత్యేకముగా నేర్పరుపబడిన శత్రు- మిత్రులను నెనిమిదికొమ్మలును- ౨౮వ వాలవశ్లోకోక్తనును శిష్యమతంబగు నరువది ప్రకృతిమండలమను నాకులును- దైవ- పురుషకారంబులను క్రియాద్వయంబు లాధారంబును- వక్ష్యమాణంబగు- సంధి- విగ్రహ- యాన- ఆసన- ద్వైధీభావ- సమాశ్రయంబులను రాజషాడ్గుణ్యరూపంబగు నారుపువ్వులును- వృద్ధియు- యథాస్థితియు- క్షైన్యంబును- అధమంబు ననునదియు- పక్షాంతరంబున- ఉత్తమంబును- మధ్యమంబును- అధమంబును- ననుఫలత్రయంబులును- గలమండలవృక్షము నెరుంగదగుననుట... .. .. ... ... .. ... ౪౨

పార్ష్ణిగ్రాహాదీనాంశత్రుమిత్ర భేదానాహ.

శ్లో॥ పార్ష్ణిగ్రాహ స్తథాసారశ్శత్రుమిత్రె ప్రకీర్తితె।
ఆక్రందోపితథాసారో విజిగీషోరుదాహృతె॥ ౪౩

పార్ష్ణిగ్రాహుండును- ఆసారుండునునను వారు శత్రునకు ప్రియులును- ఆక్రందుండును- ఆసారుండునునను వారు విజిగీషునకు ప్రియులునునని భేదము విచారించదగుననుట... ... ౪౩

శ్లో॥ పురోయా యాద్విగృహ్యైవ మిత్రాభ్యాంపచ్ఛి
మావరీ। పశ్చిమావివపూర్వాభ్యాం అరింతన్మిత్ర
మెవచ॥... ... ... ... .. ౪౪

పార్ష్ణిగ్రాహుండును- అసారుండుననునువారలు శత్రుప్రియులుగావున తనకుమిత్రులగు ఆక్రందాసారులచే వారలనిగ్రహించియు- ఆక్రమంబున శత్రువును తనమిత్రునియు- పార్ష్ణిగ్రాహాసారువలన సామాద్యుపాయంబులచే నిగ్రహించియు- శత్రువునుగూర్చి విజిగీషుండగువాడు దండయాత్రారంభము జేయదగుననుట... ... ... ... ... .. ... ౪౫

శ్లో॥ అరిమిత్రస్యమిత్రంతు కృతకృత్యైఃభూయసా।సం

స్థభోభయమిత్రేణపశ్చాద్గచ్ఛేన్నరేశ్వరః॥ ౪౫

విజిగీషుండగు రాజు - తనకును శత్రువుకును మిత్రుండగునుభయమిత్రసంజ్ఞగలవానివలన విశేష ద్రవ్యదానాదులవలన శత్రునకుమిత్రుండగువాఁడు శత్రునకుసహాయము రాకుండునట్లునిలిపి పిదపదండయాత్ర జేయదగుననుట.. .. ... ... ౪౫

శ్లో॥ ఆక్రందేనాత్మనాచైవ పార్ష్ణిగ్రాహం ప్రపీడ
యేత్। ఆక్రందేనతథాసారం ఆక్రందాసారభా
గినా॥ ... ... .. .. ... ౪౬

విజిగీషువగు రాజు తానును ఆక్రందుఁడునుంగూడి శత్రుపక్షీయుడగు పార్ష్ణిగ్రాహునిపీడింపుచు - ఆక్రందునిచే శత్రుపక్షీయుండగు నాసారునియట్లయొనర్పదగుననుట... ... ౪౬

శ్లో॥ స్వమిత్రేణాత్మనాచైవ కుర్వీతోద్ధరణంరిపోః। మి
త్రేణహిసమిత్రేణ రిపుమిత్రంప్రపీడయేత్॥ ౪౭

తానును తనమిత్రుండునుగూడి శత్రుభూపతినిన్ని - మిత్రుండును అతనికిమిత్రుండునుంగూడి అరికిమిత్రుండగువానినిన్ని బాధించదగుననుట... ... ... .. ... ... ౪౭

శ్లో॥ అరిమిత్రస్య మిత్రస్యపీడనంపృథివీపతిః। కుర్వీతో
భయమిత్రేణ మిత్రమిత్రేణచైవహి॥ ... ... ౪౮

ఉభయులకుమిత్రుండగువాఁడును- తనమిత్రునకుమిత్రుండగువాఁడునుం జేరి శత్రునకుమిత్రమిత్రుని బాధించునట్లు విజిగీషుండొనర్పదగు... ... ...... .. .. ... .. ౪౮

శ్లో॥ అనేనక్రమయోగేన విజిగీషుస్సదోద్ధితః। పీడయేద
హితంశత్రుంమిత్రాణామంతరాంతరా॥.. ౪౯

ఇట్లు విజిగీషుండగు రాజు ఎల్లకాలంబును జాగరూకుండగుచు - తనకుహితులుగాని శత్రువులఅంతరాంతరంబును దేశకాలంబులును - తాత్పర్యంబులును నెరింగి శత్రుపక్షీయుల పీడింపుచుండదగుననుట... ... .. ... .. .. ...౪౯

శ్లో॥ పీడ్యమానో హ్యుభయత స్సదోద్యుక్తైర్మనీషి
భిః। రిపురుచ్ఛేదమాయాతి తద్వశే వావతిష్ఠతే॥ ౫౧

ఇట్లు - సతతజాగరూకులును బుద్ధిశాలులునునగు - విజిగీషు తత్పక్షీయులచేతను - విజిగీషుచే సామదానాదిక్రియలచే భిన్నులగుస్వపక్షీయులచేతను నెల్లప్పుడు బాధింపబడుచుండు శత్రువుమూలనాశంబు నేనియు విజిగీష్వాజ్ఞాపర తంత్రుండేనియు నగుననుట.. ... ... ... ... .. .. ౫౦

శ్లో॥ ప్రాధాన్యేన హి సర్వత్ర సర్వాస్స్వం సర్గమేత్య్ర
జాః। తాసాం సంసర్గణాద్రాజా సర్వాం గిం శ్రియ
మశ్నుతే॥ ... ... ... .. ౫౧

ముఖ్యముగా విజిగీషుండగు రాజు తనదేశప్రజల ననురాగపూర్వకంబుగా పాలింది వారి ప్రీతివడయుటయెగాక శత్రురాజ్యవర్తులగు ప్రజలను యథోచితసత్కారంబులవలన నాత్మీయులుగా నొనర్చికొనుటవలనన ధికైశ్వర్యవంతుండగుననుట... ౫౧

శ్లో॥ దూరేచరాన్మండలినః తథాన్యాన్దుర్గవాసినః। మిత్రీ
కుర్వీత తాన్ప్రాణాః సాధయంతీహ మంగళం॥ ౫౨

దూరదేశములయందుండు మండలాధిపతులను - మరియును దుర్గాధ్యక్షులగు వారిని తనకు హితులగునట్లు సామాద్యుపాయంబులొనర్చుటవలన విజిగీషునకత్యంత శుభోదయంబగుననుట ౫౨

శ్లో॥ సర్వోపాయైః ప్రకుర్వీత సామాన్యం మిత్రమాత్మ
సాత్। భవంతి మిత్రాదుద్విగ్నాస్సుఖ ఛేద్యోహి
విద్విషః॥ .. .. ... ... .. ౫౩

శత్రువునకును తనకును సమానంబగు మిత్రత గల రాజును పూర్వోక్తసామాద్యుపాయంబులవలన తనకత్యంత మిత్రునిగా నొనర్చుటవలన - శత్రువు - తనపూర్వజ్ఞుండగు మిత్రుండన్యమిత్రుండగుటవలన మూర్ఖభేదభయంబుచే సులభంబున సాధ్యుండగుననుట ౫౩

శ్లో॥ కారణాన్నైవ జాయంతే మిత్రాణి రిపవస్తథా। రిపవో
యేన జాయేరన్ కారణం తం పరిత్యజేత్। ... ౫౪

శత్రువులగుటయు, మిత్రులగుటయు, నెద్దియేని యొక హేతువులవలననే గావున- నెట్టి హేతువవలన శత్రులగుమరట్టి హేతుభూతంబులగు కార్యంబులవిడువదగుననుట... ... ... ౫౪

శ్లో॥ చలేచ్ఛేద్దూ జితబలో మధ్యమో౽పి జిగీషయా। ఏ
కీభూయారిణా తిష్ఠేదశక్తస్సంధినా నమేత్ ॥౫౫

మిక్కిలిబలిష్ఠుండయ్యేనేని దండయాత్ర జేయదగుననియు - మధ్యమబలుండగునేని శత్రుజయెచ్ఛచే నతనితో సంధిఁ జేసి యొకటిగానుండదగుననియు - అశక్తుండగువాడు శత్రునకు సంధిమూలంబున స్వాధీనుండుగాదగుననియు తారతమ్యమెఱుంగదగు.. .. ... ... ... .. ... ౫౫

శ్లో॥ ఉదాసీనో౽పి చలతి సర్వే మండలినస్సహ। సంధిధ
ర్మేణ తిష్ఠేయుస్సన్నమేయుర్గశక్తయః॥ ... ౫౬

పూర్వోక్తమండలచతుష్టయంబున ఉదాసీనుండను వాడందరికన్నను బలాధికుండు గావున నతడన్యులమీఁద దండయాత్ర జేయునవసరంబున మండలంబుననుండు వారందరునుతనిం జేరి సంధిఁ జేయుదురు గావున నశక్తులగువారతని కాజ్ఞాపరతంత్రులుగాదగు.. .. ... .. ... .. .. ... ౫౭

శ్లో॥ సముత్పన్నే మహత్కృచ్ఛ్రే సంభూయ స్వార్థసిద్ధ
యే। ఆపత్ప్రతరణం సమ్యక్సంధిధర్మ ఇతి స్మృతః॥౫౮

కోశబలంబులచే హీనుండగు రాజు తనకాపదసంభవించునెడ స్వకార్యార్థసిద్ధికొఱకు బలిష్ఠుండగు విజిగీషుతోడనుకలిసియుండుటకొఱకు యత్నము జేయుటసంధి ధర్మంబనంబడు... ...

శత్రుస్వరూపనిరూపణం.

శ్లో॥ సహజః కార్యజశ్చైవ ద్వివిధశ్శత్రురిష్యతే। సహజః
స్వకులోత్పన్న ఇతరః కార్యజస్స్మృతః॥......౫౯

తనకులంబుననుత్పన్నుండగు సజాతి- యనగా రావణునకు విభీషణుండును- వాలికి సుగ్రీవుండును కౌరవులకు పాండవులునను రీతిగల సహజులు సహజశత్రువులనియు - నెద్దియేని యొక హేతువ

వేలననగా దేహజాతిసంబంధాదులులేక శ్రీరామునికి రావణు
నింబోలెనొక కారణంబువలననగు శత్రువుకార్యజుండనియు శత్రు
స్వరూపము రెండువిధంబులనుట... ... ... ... ౫౯

శ్లో॥ ఉచ్ఛేదాపచయౌ కాలె కర్శనం పీడనం తథా। ఇతి
విద్యావిదః ప్రాహుః శత్రావృత్తం చతుర్విధం॥ ౫౯.

శ్లో॥ ఉచ్ఛేదనంతువిజ్ఞేయం సర్వప్రకృతినాశనం। ఆశా
ఖండనయోగస్తుబుద్ధేరపచయస్స్మృతః॥౬౦ రేచనం
కోశదండాభ్యాం మహామాత్రవధ స్తథా। ఏతత్క
ర్శనమిత్యాహు రాచార్యాః పీడనం పరం॥ ౬౧

శత్రునకుగలసప్తప్రకృతులు మొదలగువాటిని నశింపజేయుట - ఉచ్ఛేదనంబనియు, సాధనములవైకల్యమొనర్చుట అపచయంబనియు, బొక్కసదండనీత్యాదులుసంభవించకుండునట్లొనర్చుటకర్శనంబనియు, ముఖ్యామాత్యులగువారి వధబంధాదికృత్యంబులచే శత్రునకుసహాయమొనర్చుటకు సంభవించనియట్లొనర్చుట పీడనంబనియు,నీచతుర్విధంబులగుకృత్యంబుల శత్రువిషయంబున నుపయోగించదగుననుట... ... ... ౬౧

శ్లో॥ సమాశ్రయవిహీనోవా దుర్బలోపాశ్రయోపి
వా।శక్యోరిస్సంపదాయుక్తఉచ్ఛేత్తుంభూమ్యనం
తరః॥ ... ... ... ... ... ౬౨

ఆశ్రయబలములేనివాడును - దుర్బలుండగువానినాశ్రయించినవాడుననగు సమీపదేశవర్తియగురాజు సంపద్యుక్తుండైయుండినను సులభసాధ్యుండగుననుట.. .. ... ౬౨

శ్లో॥ కర్శనంపీడనంకాలె కుర్వీతాశ్రయమానినః। స
మాశ్రయందుర్గమాహు ర్మిత్రం వా సాధుసంమతం॥౬౩

ఆశ్రయబలముచే విజిగీషువును జయించవలయునను దురభిమానముగలవాని పూర్వోక్తలక్షణలక్షితంబగు - కర్శన - పీడనంబులొనర్పదగుననియు, నాశ్రయించునవసరంబున ప్రబలంబగు కోటనేనియు, యోగ్యుండగుమిత్రునినేనియు నాశ్రయించదగు

నసియు - నట్లాశ్రయించినరాజు దురుచ్ఛేద్యుండగుననియు, తా
త్పర్యము. ... ... .. ... ... .. ౭౩

శ్లో॥ విభీషణస్యసోదర్య స్తథాసూర్యసుతస్యచ । సర్వ
తంత్రాపహారిత్వా త్తథోచ్ఛేద్యోనిజోరిపుః॥..౭౪

విభీషణునిసర్వరాజ్యసుఖవిషయంబుల రావణుండపహరిం
చి దాసునివలె నవమానమొనర్చుటవలనను - నట్లుసుగ్రీవునిరా
జ్యసౌఖ్యకళత్రాదుల వాలియపహరించుటవలనను వారిరువు
రును శ్రీరామాశ్రయమువలన స్వకీయశత్రులనిర్మూలించుటయు
క్తంబనుట... ... ... ... ... ... ...౭౪

శ్లో॥ ఛిద్రంమర్మచవీర్యంచ విజానాతినిజోరిపుః । దహ
త్యంతర్గతశ్చైవ శుష్కంవృక్షమివానలః॥... ౭౫

పూర్వోక్తలక్షణలక్షితుండగుజ్ఞాతి - తనమర్మంబులును-వి
వరంబులును - పరాక్రమంబును- సమర్థముగా నెరుగుగావునలో
పలనుండియు యెండుచెట్టును - కోటరస్థితంబగునగ్నివలె సమూ
లముగాల్చుననుట... ... ... .. .. .. ౭౫

శ్లో॥ వర్తతేపక్షపాతేన మిత్రశ్చేదుభయాత్మకః । వజ్రీ
వహంత్రిశిరసం సముద్భిందాత్యత్వరః॥ ౭౬

మిత్రుండగువాడు శత్రువునకుసహాయముజేయుచుండెనేని
యతని నతిత్వరితంబున నింద్రుండు విశ్వరూపునిజంపినయట్లు జం
పదగుననుట-పూర్వంబునత్వష్టప్రజాపతిపుత్రుండగువిశ్వరూపుం
డను ఋషి సోమపానముజేయు తలయొకటియు - సురాపా
నముజేయుతలయొకటియు - అన్నముదినుతలయొకటియు- నను
మూడుతలలుగలవాడగుచు నింద్రునకు పురోహిత కృత్యంబుజే
యుచుండునెడ రాక్షసులచే ప్రోత్సాహితుండగుచు రహస్యం
బున నింద్రునకు ద్రోహముజేయవలయునను తలంపుచే తపమొ
నర్చుచుండ నావృత్తాంతవేదియగు నింద్రుండతనివజ్రాయుధము
చేఖండించెనని భారతాదులయందు ప్రసిద్ధము... ... ౭౬

శ్లో॥ బలినాపిన్యహితస్య ద్విషతాంకృచ్ఛ్రవర్తినః । కు

ర్వీతోపచయుంశత్రో ర్నోత్మనిచ్ఛిత్తిశంకయా॥౬౭

బలిష్ఠుండగువానిచే నిగ్రహింపబడి యుండెడు తనశత్రువు డు తనచేతనగుసహాయము నొనర్చియతని విడిపింపదగుననుట - అట్లు జేయనియెడ నబ్బలియుండగువానికి శత్రువుస్వాధీనంబగుటవల న పిదపతనమీద దండయాత్ర జేయుగావున, నాహేతువున కై యట్లు జేయదగుననుట.. ... .. ... ... ౬౭

శ్లో॥ యస్మిన్నుచ్ఛిద్యమానేపి రిపురన్యః ప్రవర్తతే। నత స్యోచ్ఛిత్తిరిచ్ఛేత కుర్వీతైనంస్వగోచరం॥ ... ౬౮

ఒకనిజంపుటవలన మరియొక శత్రువుకలుగునట్లెక్కడ తె లియంబడునక్కడ నతనిజంపుటమాని సామాద్యుపాయంబులవ లన నతనిస్వాధీనము జేసి కొనదగుననుట .. ... ..౬౮

శ్లో॥ వంశాగతోరిపుర్యస్తు విచలేద్దురుపగ్రహః। తస్య సంశమనాయాశుతత్కులీనంసమున్నయేత్॥౬౯

కులక్రమముగా చిరకాలశత్రుండగువాడు తనమీదదండెత్తు నవసరంబున నతనినిగ్రహించుటకై యతనిదాయాదిని సామా ద్యుపాయంబులవలన ప్రేరేపింపదగుననుట - అదియెదానికి ప్రతి క్రియయనుట.. .. ... .. .. .. ...౬౯

తత్కారణేనవ్యధయతి.

శ్లో॥ విషంవిషేణవ్యధతే వజ్రం వజ్రేణభిద్యతే। గజేం ద్రోద్వృత్తసారేణ గజేంద్రేణైవబధ్యతే॥ ... ౭౦

శ్లో॥ మత్స్యోమత్స్యముపాదత్తే జ్ఞాతిర్జ్ఞాతిమసం శయం॥ రావణోచ్ఛిత్తయేరామోవిభీషణమపూ జయత్॥.. ... ... ... ౭౦౧

భీమసేనునకు దుర్యోధనాదులచేనొసంగబడు విషముపా తాళలోకమునందు నాగరాజుచేనొసంగినవిషముచే బాధింప బడినొనరియు - నిశ్చట - మృగయాక్రీడార్థము బాల్యమునం దుపాండవకౌరవులు అరణ్యమునకేగిక్రీడించుచున్నయవసరంబు న భీమ్ముబలాసూయాపరులగు దుర్యోధనాదులు భీమునకు విష

సంయుక్తాన్నమొసంగి యతఁడొకమైకము చే నిద్రించుచుండఁ డతీగె లచేఁ తని కాళ్లుచేతులుగట్టి గంగలోబడ్వైచిన నతని నాజలచరులగు సర్పరాజులు కరవంబోయియతనిచే తాడితులగుచునతని నాగలోకంబునకు నాగరాజగువాసుకిసమీపంబునకు గొనిపోయినయతని బలాతిశయంబునకు సంతుష్టుండగు వాసుకిచేపిషహరణపూర్వక బలోత్కర్షముకొరకు విషంసముపానము జేయించి తదనంతరంబున మర్త్యలోకంబునకు దోడుకొనివచ్చిరని ఆదిపర్వప్రసిద్ధము - గావునవిషమువిషముచేత శమించుననియు - వజ్రమువజ్రంబుచేత పగల్చబడుననియు - అడివియందుండుమదగజము బలిష్టంబగు పెంపుడు జగముచేతబంధింపబడుననియు - బలహీనంబగుమత్స్యముబలిష్టంబగుమత్స్యముచేనిగ్రహింపబడుననియుదృష్టాంతంబులవలనను - రావణమహాజ్ఞానముకొరకు శ్రీరాములువిభీషణునికి రాజ్యదానాదులచే స్వాధీనమొనర్చిరనియు దెలియదగు.. .. ... ... ... ... ౭౧

శ్లో॥ యస్మిన్మండలసంక్షోభం కృతేభవతికర్మణి
నతత్కుర్వీత మేధావీ ప్రకృతీరనురంజయేత్ ॥ ౭౨

ఎట్టికార్యము జేయుటచే అమాత్యాదులగు మండలంబునకు సంకటంబుగలుగునట్టి కార్యము జేయక ప్రకృతులనుసంతోషపెట్టుచుండవలయుననుట... ... .. ... .. ౭౨

శ్లో॥ సామ్నాదానేనమానేన ప్రకృతీరనురంజయేత్ ।
ఆత్మీయాన్భేదదండాభ్యాంపరకీయాన్స్తుదార
యేత్ ॥ .. ... ... .. ... ౭౩

స్వకీయపక్షులగుప్రకృతులను- మంచిమాటలచేతయు- ద్రవ్యదానముచేతయు - గౌరవించుటజేతయు - సంతోషింపజేయుచుండవలయుననియు- మిత్రభేదమ్ము జేయుటచేతయు- దండించుటచేతయు శత్రుపక్షప్రకృతులనిగ్రహించవలయుననియు - దెలియనగుననుట... .. .. .. .. ... ౭౩

శ్లో॥ ఆక్రీర్ణంమండలం సర్వంమిత్రైరరిభిరేవచ। సర్వః స్వార్థపరోలోకఃకుతోమధ్యస్థతాక్వచిత్॥ ౭౪

మండలము- శత్రువులచేతయు- మిత్రులచేతయునిండియుండు టవలనను- లోకమంతయు స్వప్రయోజన పరతంత్రముగనుండు టవలనను మధ్యస్థవృత్తిగానుండువాడు సర్వత్రగనుపడ నేరడ నుట॥.. .. ... ... .. ... ౭౪

శ్లో॥ స్థానాస్తిపురుషోలోకేయోశ్రియంనాభివాంఛతి। అశక్తిభగ్నమానాస్తునరెంద్రంపర్యుపాసతే॥ ౭౫

లోకంబునందలి జనులందరును ఐశ్వర్యకాములయ్యును శక్త్యభావముచేనన్యసేవజేయుదురుగాని- అపేక్షాభావమువల నగాదనుట.. .. .. .. .. ౭౫

శ్లో॥ ఏవంచకస్యచిదపిమిత్రత్వంనైవవిద్యతే॥ .. ౭౬

ఈహేతువువలన నందరు ఐశ్వర్యముగలవానికి శత్రులేగా ని మిత్రులు లేరనిస్పష్టము... ... .. .. ౭౬

శ్లో॥ భోగప్రాప్తంవికుర్వాణంమిత్రమప్యుపపీడయేత్। అత్యంతవికృతంహ్యాత్సపాపీయానరిరక్షతః॥ ౭౭

కేవలభోగాసక్తుండగు మిత్రునిపీడించదగుననియు- మిక్కిలి యునసహ్యకృత్యంబులుజేయుచుండెడు మహాపాపియగు రాజ ద్రోహినిజంపదగుననియు దెలియందగు.. .. ... ...

శ్లో॥ అమిత్రానపికుర్వీత మిత్రానుపచయావహాన్। అహితేవర్తమానానిమిత్రానపిపరిత్యజేత్॥ .. ౭౮

స్వకీయంబగువృద్ధినిచ్ఛించుచుండెడు శత్రువులనేనియు మిత్రులుగానొనర్పదగుననియు- మిత్రులైనను స్వకీయంబగుక్షయం బు గోరుచుండువారివిడువదగుననియు - అనగామిత్రభావంబులు కృత్యానుసారిగావుననది దెలియదగుననుట... ... ౭౮

శ్లో॥ సబంధుర్యోనుబధ్నాతిహితేష్వర్థ్యాదరాత్సదా। అనురక్తంవిరక్తంవామిత్రముపకారియత్॥ ౭౯

హితంబులగు కార్యంబుల యందంత్యాదర యుతుండగుచుం డెనేని య్యతడు ప్రీతిగలవాడైనను విరక్తుండైనను వాడె యత్యంతోపకారియగుటం జేసి మిత్రుండనంబడుననుట... .. ౭౮

శ్లో॥ మిత్రంవిచార్యబహుశోజ్ఞాతదోషంపరిత్యజేత్ ।త్య
జన్నభూతదోషంహిధర్మార్థావుపహంతిహి ౭౯

౧ నిష్కారణంబున మిత్రుని పరిత్యజించుటవలన ధర్మార్థంబులకులోపముసంభవించుగావున- అతనకుమిత్రుండగువాడు అపరాధంబొనర్చినటుల దెలియబడు నెడల- ౩ పరిసీలనా పూర్వకంబుగా త్యజించదగుననుట... ... .. ౭౯

శ్లో॥ స్వయందోషగుణాన్వేషీభవేత్సర్వత్రసర్వదాస్వ
యంజ్ఞాతేషుదోషేషుశస్యేతేదండపాతనే॥ ౮౦

రాజగువాడు ప్రకృతిమండలాదుల గుణదోషంబులన్నివిషయంబులననవరతంబును స్వయముగా విచారింపుచు దోషముగలుగు నెడల దండించుటయు జంపుటయు మొదలగు కార్యంబుల జేయదగుననుట.. ... .. .. ౮౦

శ్లో॥ నహ్యవిజ్ఞాతతత్వస్స్యకోపంకుర్యాత్కథంచన।భు
జంగమివమన్యంతేనిదోషక్రోధినంజనాః॥ ౮౧

దోషము లేనియడల కోపించు రాజును సర్పమువంటి దుష్టస్వభావునిగా ప్రజలుదలంతురుగావున వాస్తవము దెలియక కోపించదగదనుట.. .. ... ... ... ...

శ్లో॥ మిత్రాణామంతరంవిద్యాన్మధ్యజ్యాయకనియ్యసాం । మధ్యజ్యాయకనీయాంసి కార్యాణిచపృ
థక్పృథత్॥ ... ... ౮౨

ఉత్తమ - మధ్యమ - అధములగు మిత్రస్వరూపంబులును-ఆ విధంబున - ఉత్తమ - మధ్యమ - అధమకృత్యంబులును వేర్వేరనెరుంగదగుననుట... ... ... ... ... ౮౨

శ్లో॥ నహిమిథ్యాభియుంజీత శ్రుణుయాద్వాపి తద్వి

థం। మిత్రభేదంచయోకుర్యాత్తాంసమస్తాంపరిత్య
జేత్।.. ..... .... .... ....౮౩

అబద్ధంబులు జెప్పువారి మాటలు వినుటయు - అబద్ధములాను టయుదగదనియు - మిత్రభేదము జేయుచుండెడు దుష్టులసమీపమునందు జేర్చఁదగదనియు తాత్పర్యము.... ... ... ౮౩

శ్లో॥ ప్రాయోగికంమత్సరికం వ్యాధృత్యస్థంపతిపాతికం।
సోపన్యాసంచజానీయాద్వచస్యానుశయంతథా॥౮౪

అన్యులచే జెప్పబడు మాటల జెప్పువానిని - తనసంపదనసహింపకుండువానిని - గుణదోషంబులు దెలిసియు జెప్పకుండెడువానిని - శత్రుపక్షము నవలంబించియుండువానిని - అన్యులగుణంబులు హేతువులచే నివృత్తి జేయువానిని - శత్రువులయందు ప్రీతిగలవానిని విడువందగుననుట... ... ... .. ౮౪

శ్లో॥ భూషణాద్యుపభోగేనప్రభుర్భవతినప్రభుః। పరై
రపరిభూతాజ్ఞోయోంభవేత్ప్రభురీరితః॥ ..౮౫

భూషణంబులు మొదలగు నానావిధభోగంబుల ననుభవించుట వలన ప్రభువనంబడుగాని - భోగములేని వాడును పరులచేనవమతుండగువాడు నప్రభువుగా నేరడనుట.. ... .. ౮౫

సుహృత్కృత్యమాహ.

శ్లో॥ ప్రకాశపక్షగ్రహణంనకుర్యాత్సుహృదాస్వయం।
అన్యోన్యమత్సరంచైషాం స్వయమేవ నివార
యేత్॥ ... .. .. ... ౮౬

స్నేహితులగువారియుభయులయందొకనిపక్షము నధికముగా నవలంబించదగదనియు- నట్టివారలపరస్పరాసూయల నివారించదగుననియు నొడువుట... ... ... .. ...

శ్లో॥ కార్యస్యహిగరీయస్త్వాత్ నీచానామపికాలవిత్।
సతోపిదోషాన్ప్రచ్ఛాద్యగుణానప్యసతోవదేత్ ౮౭

కాలదేశంబులెరుంగు రాజగువాడు- ఎవరివలననేనియు నెద్దియేనియు నొకకార్యము సాధింపవలయునెడ నీచులగువారినేని

యువాఁగలదోషంబులెంచక సభలయందువారి గుణంబుల నొడు
వుచు కార్యసాధకము జేయదగుననుట .. ... ౮౭౪

శ్లో॥ ప్రాయేణామిత్రాణికుర్వీత సర్వావస్థాసుభూపతిః।
బహుమిత్రోహిశక్నోతివశేస్థాపయితుంరిపూన్॥౮౮౪

ఎట్టిగుణంబులుగలవారలనేనియు లోకజనంబులసాధారణం
బుగా మిత్రులుగానొనర్చుటవలన శత్రువులు స్వాధీనులగుదు
రుగావున మిత్రజనంబులజేర్చదగుననుట... ... .. ౮౮౪

శ్లో॥ నతత్రతిష్ఠతిభ్రాతానపితానాప్యపివాజనః। పుం
సాహ్యాపత్ప్రతీకారోసన్మిత్రోయత్రతిష్ఠతి॥...౮౯౪

ఆపత్కాలమునయోగ్యుండగు మిత్రునిచే నెట్లు ఆపత్ప్ర
తీకారము సంభవించునట్టి సందర్భంబులయందు తండ్రిభ్రాత
మొదలగునితరులవలన నట్టికార్యము సంభవించదుగావున మిత్ర
సంగ్రహముత్యంతావశ్యకంబనుట. ... ... .. ౮౯౪

శ్లో॥ అమిత్రాన్మిత్రసంఘైర్నిగృహ్ణీయాద్దృఢవిక్రమైః।
ఇతిమండలవృత్తంహిమండలజ్ఞాఃప్రచక్షతే॥ ౯౦౪

దృఢపరాక్రమశాలులగు మిత్రసమూహంబులవలన శత్రు
వులనిగ్రహించదగునని మండలవృత్తఫలితార్థము, ౯౦౪

శ్లో॥ మిత్రోదాసీనరిపవ ఏతన్మాత్రంతు మండలం। స
మ్యక్శోధనమేతేషామితిమండలశోధనం॥... ౯౧౪

మిత్రుండును- ఉదాసీనుండును - శత్రుండును- ననునీమువ్వు
రివలనమండలప్రాప్తియనియు- దీనిచక్కగావిచారించుట మండల
శోధనంబనియు- దెలియందగుననుట.... ... .... ౯౧౪

ఉపసంహారన్నాహ.

శ్లో॥ ఇతిస్మరాజానయవర్త్మనావ్రజన్ సమున్నయన్మం
డలశుద్ధిమాచరేత్। విరాజతేసాధువిశుద్ధమండల
శ్శరచ్ఛశీవప్రతినందయన్ప్రజాః॥ ... ౯౨౪

ఇందుజెప్పంబడిన నీతిమార్గముచే సంచరించుచు నన్నివిష
యంబులను జాగరూకుండగుచుపూర్వోక్తక్రమంబునమండలశు

ద్ధి యొనర్చువాడు శరత్కాలంబున పరిశుద్ధమండలముచే ప్రకాశితుండగు చంద్రునివలె ప్రకాశించుచుండుననుట.. ... ౯-౭౪

---

ఇతి కామందకీయే మండలయోనిర్నామాష్టమస్సర్గః.

---

నవమస్సర్గ ప్రారంభః.

శ్లో॥ బలవద్విగృహీతస్సన్నృపోనన్య ప్రతిక్రియః । ఆప
న్నస్సంధి మన్విచ్ఛేత్కుర్వాణః కాలయాపనాం॥౧

పూర్వసర్గమునందు మండలస్వరూప మేరుపరుపంబడియెం గావున నిచ్చట రాజషాడ్గుణ్యంబులగు - సంధివిగ్రహ యాన-ఆసన-ద్వైధీభావ- సమాశ్రయంబులను నారిటియందు ప్రాథమికంబగు సంధిప్రకార మేర్పఱుపంబడియెడు- ఎట్లనబలిష్ఠుండగు శత్రురాజునకు స్వాధీనుండగుచు వానిజయించుట కుపాయాంతరములేని దీనుండగు రాజు తనకు మంచికాలము సంభవించుపర్యంతంబును నొకయుపాయంబున కాలక్షేపము జేయుటకై దినములుగడుచు నిమిత్తముకొఱకు సంధి జేయదగుననుట... ... ... ... ౧

సంధిభేదానాహ.

శ్లో॥ కపాల (౧) ఉపహార (౨) శ్చ సంతాన (౩) స్సంగత (౪) స్తథా। ఉపన్యా (౫)
సః ప్రతీకారః (౬) సంయోగః (౭) పురుషాంతరః (౮)॥ అదృష్టనర (౯)
ఆదిష్ట (౧౦) ఆత్మామిష (౧౧) ఉపగ్రహః (౧౨)। పరిక్రియ (౧౩) స్తథోచ్ఛిన్నః (౧౪)
తథా చ పరభూషణః (౧౫)॥ స్కంధోపనేయ (౧౬) సంధిశ్చ షోడ
శః పరికీర్తితః॥ ఇతి షోడశకం ప్రాహుస్సంధిం సంధివి
చక్షణాః॥ ... ... ... ... ... ౪

కపాలసంధియు ౧. ఉపహారసంధియు ౨. సంతానసంధియు ౩. సంగతసంధియు ౪- ఉపన్యాససంధియు ౫- ప్రతీకార సంధియు ౬- సంయోగసంధియు ౭- పురుషాంతరసంధియు ౮ - అదృష్టనరసం

ధియు౯- ఆదిష్టసంధియు౧౦- ఆత్మామిషసంధియు౧౧- ఉపగ్ర
హసంధియు౧౨- పరిక్రయాసంధియు౧౩- ఉచ్ఛిన్నసంధియు౧౪-
పరదూషణసంధియు౧౫- స్కంధోపనేయసంధియు౧౬- ననుపది
యారువిధంబులుగా పూర్వాచార్యులచే భేదంబు లేర్పరుప
బడియెననుట .. ... .. ... ... .. .. ౪

శ్లో॥ తధాతద్వ్యపరూపేణభవత్యేకోప్యనేకధా॥ ..౪½

ఇట్టిభేదంబులసంధియందాయాయి హేతు భేదంబులచే నొక్క
టియయ్యు ననేకంబులగు భేదంబులుగలుగుననుట .. ... ౪½

సంధీనాంక్రమేణలక్షణాన్యాహ॥

శ్లో॥ కపాలసంధిర్విజ్ఞేయః కేవలంసమసంధితః॥.....౫

పరస్పరగౌరవంబులకున్యూనముగానియట్లు ఏద్దియేనియు నొ
కనియమముచే నొకరియుద్ధము లోనర్పకతమంతట నిలిచియుం
డునట్టుల పరస్పరమునమ్మికముగలుగక కాలానుసారముగా సం
ధియొనర్చుట కపాలసంధి ఇప్పటవగిలియుండెడు రెండుశిరశ్శక
లములనేనియు ఘటఖండములనేనియుగూర్చి నెడ చూచెడువార
లకుమాత్రము కలిసినట్లుండుట యేనప్పవాస్తవముగాగలియకుం
డునట్లు జేయుట... .. .. .. ... ... ౫

శ్లో॥ సంప్రదానాత్భవతియ- ఉపహారస్సఉచ్యతే॥ ౫½

రెండవది- హీనుండగువాడధికుండగువానికికప్పములు కాను
కలు మొదలగువాటి నొసంగి సమాధానము జేయుట ఉపహారసంధి..

శ్లో॥ సంతానసంధిర్విజ్ఞేయోదారికాదానపూర్వకః॥౬

మూడవది- స్వకీయయగుపుత్రీదానమునొసంగిసంబంధపూ
ర్వకముగా సమాధానమొనర్చుటచే సంతానముగలిగియుభయు
లకునవినాభావసంబంధముగలుగుగావున నట్లొనర్చుట సంతాన
సంధి... .. ... .. .. ... ... ...

శ్లో॥ సద్భిస్సంగతసంధిస్తుమైత్రీపూర్వ ఉదాహృతః।
యావదాయుః ప్రమాణంతుసమానార్థప్రయో
జకః। సంగతస్సంధిరేవేహ ప్రకృష్టత్వాత్సువర్ణ

వత్ । అపరైస్సంధికుశలైః కాంచనస్సముదాహృతః । సంపత్తౌచవిపత్తౌచ కారణైర్యోనభిద్యతే॥ ౮

నాలవయది- కేవలస్నేహాతిశయమువలనసుభయుల ఆయుర్దాయపర్యంతంబును సమానార్థప్రయోజనంబుగలదియగుచునుండునది సంగతసంధియనంబరగు. ఇదిసమస్తసంధులయందును శ్రేష్టంబగుటవలన సంపత్కాలంబుననేనియు నాపత్కాలమునందేనియుపరప్రయత్నదుర్బోధనాదులచే భేదమునొందకయు దుర్గుణంబులకెడమీకయు స్వతస్సిద్ధంబగు నైజగుణంబుచే నేకత్వమునొందుటవలన నీతిశాస్త్రవృద్ధులవలన కాంచనసంధియనంబరగు.. ... ... ... .. ... .. ... ౮

శ్లో॥ భవ్యామేకార్థసిద్ధింతుసముద్దిశ్యక్రియేతయః॥ స ఉపన్యాసకుశలైరుపన్యాసఉదాహృతః॥ .. ౯

ఐదవది-మంగళకరంబగునొకకార్యము సాధించుటకై యనగానొకశత్రునిసాధించుకొరకుఉభయులుగూడికొనుటయు, సముద్రమథనముకొరకుబలీంద్రులుసంధించునట్లుజేయుటయు, ననుటఉపన్యాససంధి... ... ... .. ... .. ౯

శ్లో॥ మయాస్యోపకృతంపూర్వమయం ప్రతికరిష్యతి । ఇతియఃక్రియతేసంధిఃప్రతీకారస్సఉచ్యతే॥ ఉపకారంకరోమ్యస్యమమాప్యేషకరిష్యతి। అయంచాపి ప్రతీకారోరామసుగ్రీవయోరివ॥ .. ...౧౧

ఆరవది- పూర్వమితనికినాచేత నుపకారము జేయబడియుండుటవలనసిపుడతడునాకుపకారమొనర్చునని సంధిజేయుటయు, ప్రకారభేదంబున రామసుగ్రీవులవలె ఉభయులునుదుఃఖించుచుండునెడలనొకడుపూర్వముపకారమొనర్చితే మేని పిదపనతడుప్రత్యుపకారము జేయుననునర్థకముచే సంధిజేయుటయు, ననునీరెండువిధంబులును- ప్రతీకారసంధి... ... .. ... ౧౧

శ్లో॥ ఏకార్థాంసమ్యగుద్దిశ్యయాత్రాంయత్రహిగచ్ఛ

తః। ససంపాతప్రయాణాస్తు సంధిస్సంయోగఉ
చ్యతే॥ ... ... ... ... ౧౨

పన్నెండవది ఒకకార్యముసాధించుటకైయొకరికొకరు తెలియక నేగు వెడలిరువురుసుమార్గమునందు ఐకమత్యము జెందునటుల జేరుటసంయోగసంధి- ఇచ్చటనుదహరించబడిన ఐదవదియగు ఉపన్యాసము మొదలు పదవపర్యంతంబగు-ఉపన్యాస-ప్రతీకార-సంయోగంబులు- అనభియోక్తయనగా ముందుగురు తెరుగని విషయంబుల్ల జేయుసంధులనుట.. ... .. ... ౧౨

శ్లో॥ ఆవయోర్యోధముఖ్యాభ్యాం మయార్థస్సాధ్యతా
మితి। యస్మిన్పణఃప్రక్రియతే ససంధిఃపురుషాం
తరః॥ .. .. ... ... ..౧౩

పదమూడవది-ఇరువురు రాజులును - తమతమ సేనాపతులవలన నొకకార్యముసాధించబడవలయుగావుననట్టిప్రతిజ్ఞారూపంబుగా మనుష్యులమూలంబున సంధియొనర్చుటపురుషాంతరసంధి ౧౩

శ్లో॥ త్వయైకేనమదీయోర్థఃసంప్రసాధ్యస్త్వసావితి।య
త్రశత్రుఃపణంకుర్యాత్ సోఽదృష్టపురుషస్స్మృతః॥౧౪

పదునాలుగవది- విజిగీషునకు శత్రువగువాడు రహస్యంబుననావిషయంబగునట్టికార్యమునీవలనసాధించబడవలయుగాని యస్మదీయంబగుపరికరములచే నసాధ్యముగావున నీకార్యము నీవెసాధించదగునని ప్రతిజ్ఞాపూర్వకంబుగా దెలియజేయుటఅదృష్టపురుషసంధి.. ... ... ... ... ... ౧౪

శ్లో॥ యత్రభూమ్యేకదేశేనపణేనరిపురూర్జితః। సంధీ
యతేసంధివిద్భిరాదిష్టస్సఉదాహృతః॥ ... ౧౫

పదియేనవది- శత్రువగువాడు- విజిగీషునకు తనరాజ్యమునందుకొంతయొసంగి శేషముసంరక్షించుకొనునట్లు ప్రతిజ్ఞయొనర్చుటఆదిష్టసంధియనంబరగు.. .. ... ... ౧౫

శ్లో॥ స్వసైన్యేనతుసంధానమాత్మామిషఇతిస్మృతః॥౧౬

పదనకొండవది- తన సైన్యంబంతయు విజిగీషునకొసంగితన దే హంబును రాజ్యంబును మాత్రముగ రక్షించుకొనుట ఆత్మామిష సంధి

శ్లో॥ క్రియతేప్రాణరక్షార్థం సర్వదానముపగ్రహః॥౧౬

పది రెండవది - ప్రాణముగలయెడ రాజ్యాదులు మొదలగు సప్తప్రకృతులమరల సంపాదించుట కవకాశముగలిగియుండుటవ లనను- దేహత్యాగము నెడ మరలదేహముసంపాదించుట యసాధ్యముగుటవలనను- అట్టిస్వకీయ దేహమురక్షించుటకై......

ఆత్మార్థే సకలంత్యజేత్.

అను న్యాయంబున స్వకీయంబగు రాజ్యకోశాదులగు సర్వస్వంబును నొసంగి దేహరక్షణ మొనర్చుకొనుటఉపగ్రహసంధి౧౬

శ్లో॥ కోశాం శేనాధకుప్యేనసర్వకోశేనవాపునః। శేష ప్రకృతిరక్షార్థంపరిక్రియఉదాహృతః॥ .. ౧౭

పదమూడవయది- తనబొక్కసధనమునందు లిన్వితీయ- తృతీయాది భాగదానము చేత నేనియు- నందలి యోగ్యపదార్థదానము చేనేనియు- పను స్తధనదానంబు చేనేనియు మిగతగల రాజ్యాదిసప్తప్రకృతులరక్షించుటకై సంధి జేయుటపరిక్రియసంధి... ౧౭

శ్లో॥ భువాంసారవతీనాంతుదానాదుచ్ఛిన్నఉచ్యతే॥౧౮

పదునాలవది - తనభూములయందు మిక్కిలి పంటలు మొదలగునదిగలుగునట్టి సారక్షేత్రంబుల విజిగీషునకొసంగి శేషము రక్షించుకొనుటఉచ్ఛిన్నసంధి.. ... .. ... ... ౧౮

శ్లో॥ సర్వభూమ్యుద్భిఃఫలదానేనఫలదూషణః॥...౧౮

పదైదవది- తనరాజ్యమునందు త్పత్తియగు సమస్తద్రవ్యంబునువిజిగీషునకొసంగుట- వలననయ్యెడుసంధిఫలదూషణసంధి ..

ఇచ్చటనిజిగీషుని దూషణ మొనరింపక శత్రువుసమాధానంబునొసంగుటవలనపరదూషణ సంధియనియువ్యవహారము౧౮

శ్లో॥ పరిభిన్నం ఫలంయత్రస్కంధంస్కంధేననీయతే।
స్కంధోపనయునంచాహుస్సంధింసంధివిదోజనాః॥౧౯

పదియారవది శత్రువుతనదేశంబున ప్రతిసంవత్సరోత్ప త్తియందొక భాగంబును కాలనియమముచే కప్ప మొసంగు చుండు

నటుల ప్రతిజ్ఞయొనర్చి యారీతి నర్పించుచుండుట స్కంధోపనయ
నసంధి... ... ... ... ... .. .. ౧౯౪

శ్లో॥ పరస్పరోపకారశ్చ మైత్రస్సంబంధకస్తథా ఉప
హారశ్చ విజ్ఞేయాశ్చత్వారస్త్వేవసంధయః ౨౦౪

ఆరవదియగు పరస్పరోపకారసంధియు- నాల్గవదియగు మైత్రి సంధియు - మూడవదియగు సంబంధకసంధియు - రెండవదియగు నుపహారసంధియు- ననునీనాల్గువిధంబులు శ్రేష్ఠంబులనియు, తక్కినవి సామాన్యంబులనియు, మతాంతరము... .. ౨౦౪

స్వమతమాహ.

శ్లో॥ ఏక ఏవోపహారస్తు సంధిరేతన్మతంహినః। ఉపహా
రస్య భేదాస్తు సర్వేన్యే మైత్రవర్జితాః॥ .. ౨౧౪

నాలగవదియగు మైత్రిసంధిదప్ప మిగలసంధులన్నియు రెండవదియగు ఉపహారసంధియందవాంతరభేదంబులగుటం జేసి కామందకమతంబున ఉపహారసంధియొక్కటియయని తాత్పర్యము

శ్లో॥ అభియోక్తాబలీయస్త్వాదలబ్ధ్వాననివర్తతే। ఉప
హారాదృతేయస్మాత్సంధిరన్యోనవిద్యతే॥ ౨౨౪

విజిగీషుబలవంతుండగుటవలన నెద్దియేనియు నొకప్రయోజనమునొందక తిరుగుట యసంభావితంబగుటం జేసి పూర్వోక్తంబగు ఉపహారముదప్ప ఇతరసంధులు ప్రయోజనకరంబులు గావనుట... ... ... .. .. .. ... ... ౨౨౪

అసంధేయానధికృత్యాహ.

శ్లో॥ బాలో[౧] వృద్ధో[౨] దీర్ఘరోగీ[౩] తథాజ్ఞాతిబహిష్కృతః[౪]।
భీరుకో[౫] భీరుకజనో[౬] లుబ్ధో[౭] లుబ్ధజన[౮]స్తథా। విర[౯]క్త
ప్రకృతి[౧౦]శ్చైవ విషయేష్వతిసక్తిమాన్। అనేకచిత్త
మంత్రశ్చ[౧౧] దేవబ్రాహ్మణనిందకః[౧౨]। దైవోపహత[౧౩]

కశ్చైవ దైవ[౧౪]చింతకఏవచ। దుర్భిక్షవ్యస[౧౫]నోపే
తో బల[౧౬]వ్యసనసంకులః। అదేశస్థో[౧౭]బహురిపుః[౧౮]యు
క్తో[౧౯]కాలేనయశ్చసః। సత్యధర్మవ్యపేతశ్చవింశ
తిఃపురుషాఅమీ। ఏతైస్సంధింనకుర్వీత విగృహ్ణీ
యాత్తుకేవలం। ఏతేవిగృహ్యమాణాహి క్షిప్రం
యాంతిరిపోర్వశం॥ .. .., ౨౭

వ్యవహారజ్ఞానములేని పిల్లకాయయు౧ - మిక్కిలిముసలివాడును౨ - రాజయక్ష్మమొదలగురోగంబులచే కృశించుచుండువాడును౩ - తనకులీనులచే బహిష్కరింపబడియుండువాడును౪ - పిరికియు౫ - భయముగలిగియుండెడు సైన్యముగలవాడును౬ - లోభియు౭ - లోభులగు సైన్యమంత్ర్యాదులుగలవాడును౮ - మంత్రులు మొదలగుప్రకృతులను పేక్షించువాడును౯ - స్త్రీద్యూతపానమృగయాదుల యందత్యాశగలవాడును౧౦ - నిలకడలేక నొందించుచుండువాడును౧౧ - దేవతులను బ్రాహ్మణులను నిందించుచుండు వాడును౧౨ - దైవసహాయ హీనుండును౧౩ - దైవాధీనముగాకాగలకార్యమునకు మనప్రయత్నంబేమి యనువాడును౧౪ - కరువుచేత రాజ్యము జెడియుండువాడును౧౫ - వక్ష్యమాణలక్షణలక్షితంబులగు సైన్యవ్యసనముగలవాడును౧౬. దేశాంతరంబున నొంటిగాజిక్కబడినవాడును౧౭ - అనేకశత్రులుగలవాడును౧౮ - కాలవైపరీత్యముచే సంకటపడువాడును౧౯ - సత్యముబలుకుటయు, ధర్మము జేయుటయు, విడిచినవాడును౨౦ - అనునీ యిరువదివిధంబుల శత్రులనుసులభముగా సాధించుటకర్హులుగావున వీరలతోనెంతమాత్రముసంధిజేయక విజిగీషుగువాడు ముఖ్యముగానిగ్రహించదగుననుట... ... ...౨౭

క్రమాదేతేషాం హేతూనాహ.

శ్లో॥ బాలస్యహ్యప్రధానత్వాన్నలోకోయోద్ధుమిచ్ఛ

శ్లో॥ మోద్ధుంస్వయమశక్తస్య పరార్థే కోపి
యుధ్యతే॥ ... ... .. .. ౨౮౪

మొదటిది - యుద్ధము జేయజాలని పిల్లకాయముందటనిలుచుటకేసియు, సైన్యంబుల నిగ్రహానుగ్రహంబులవలన స్వాధీనపరుచుటకేన్నియు, నశక్తుండగుటం జేసి ఉపకారార్థముగా తమప్రాణంబులుబోగొట్టుకొనుటకు లోకజనులుసంమతించరు గావున నట్టిబాలుడు సులభసాధ్యుండనుట.. .. ... ౨౮౪

శ్లో॥ ఉత్సాహశక్తిహీనత్వాద్వృద్ధో దీర్ఘామయస్త
థా। స్వైరేవపరిభూయంతే ద్వావప్యేతావసం
శయం॥ ... ... .. .. ౨౯౪

రెండవ - మూడవవారలగు- వృద్ధుండును - దీర్ఘరోగియు- ఉత్సాహంబును దేహశక్తియులేకుండుటవలన నిస్సందేహముగా తమతమబలంబులచే నవమానము నొందుదురుగావునసులభసాధ్యులనుట.. .. ... ... .. ... ... ౨౯

శ్లో॥ సుఖోచ్ఛేద్యోహి భవతిసర్వజ్ఞాతి బహిష్కృతః।
తఏవైనంవినిఘ్నంతిజ్ఞాతయస్త్వాత్మసాత్కృతాః॥౩౦౪

నాలవవాడగు- జ్ఞాతిబహిష్కృతుడు- జ్ఞాతులతనిరాజ్యాపహరణము జేయుటకై యతనిజంపుదురుగావున నట్టివాడును సులభసాధ్యుండనుట... ... .. ... .. ౩౦౪

శ్లో॥ భీరుర్యుద్ధపరిత్యాగాత్ క్షిప్రమేవవినశ్యతి॥ ౩౧

ఐదవవాడగు పిరికియన్యసైన్యముజూచిన మాత్రముచేను తత్తరపడి యుద్ధమునువిడిచిపరిగెత్తుగావున నతిసులభుండనుట... .. ... .. .. ... ... ౩౧

శ్లో॥ వీరోపిభీరుపురుషస్సంగ్రామేస్వైర్విముచ్యతే॥౩౧౪

ఆరవవాడగు- పిరికిసైన్యముగలవాడునడి యుద్ధమునందుతన సైన్యముచే విడువబడుగావునసులభసాధ్యుండనుట.. ౩౧౪

శ్లో॥ లుబ్ధస్యాసంవిభాగిత్వాన్నయుధ్యంతేనుజీవినః॥౩౨

ఏడవవాడగు- లోభి- కాలదేశపాత్రంబుల నెరింగిద్రవ్యము

త్రయించ నేరఁడు గావున సైనికులగువారు సమయంబున యుద్ధ
ము జేయక విముఖులగుటవలన సులభసాధ్యుండనుట... ౩౨

శ్లో॥ లుబ్ధానుజీవ్యై రేవదానభిన్నైర్విహన్యతే॥౩౨౫

ఎనిమిదియవదియగు - లోభులగు ప్రకృతులువిజిగీషుదానా
దులకులోబడినవారగుచు సమయమునందు తమరాజునుజంపుట
వలనసులభసాధ్యుఁడనుట... .. .. .. ౩౨౫

శ్లో॥ సంత్యజ్యతే ప్రకృతిభిర్విరక్తప్రకృతిర్యుధి॥.....౩౩

తొమ్మిదవవాఁడగు - విరక్తప్రకృతియగు రాజు - స్వస్వామి
తనిచే ప్రకృతివిషయంబులగు వాక్పారుష్య దండపారుష్యాదులవల
ననితనియందు పేక్షితులగుటం జేసి యుద్ధకాలమునందు వారలచే
విడుబడుగావున సులభసాధ్యుండనుట.. .. ౩౩

శ్లో॥ సుఖాభియోజ్యోభవతివిషయేష్వతిసక్తిమాన్॥౩౩౫

పదియవవాఁడగు - విషయాసక్తుండు - జాగ్రత లేనివాఁడగుటం
జేసి సులభముగాజయించబడుననుట... .. .. ౩౩౫

శ్లో॥ అనేకచిత్తమంత్రస్య ద్వేష్యోభవతిమంత్రిణః॥ ౩౪

పదనకొండవవాఁడగు నిలకడ లేని యాలోచనగలరాజు మం
త్రులకు ద్వేషియగుటం జేసి సులభసాధ్యుండనుట .. ... ౩౪

శ్లో॥ సదాధర్మబలీయస్త్వాద్దైవబ్రాహ్మణనిందకః॥౩౪౫

పదిరెండవవాఁడగు - దేవబ్రాహ్మణనిందకుండు-అధర్మబల
మువలనసులభముగాఁ జెడుననుట... ... ... .. ౩౪౫

శ్లో॥ విశీర్యతేస్వయంచైవదైవోపహతకస్తదా॥..౩౫

పదమూఁడవవాఁడగు- దైవోపహతకుఁడు- స్వయముగా నేస్వ
ల్పకాలమున నెనశించుగాన నతనితో సంధిజేయ నగత్యము లేద
నుట... ... ... ... ... ... ... ... ౩౫

శ్లో॥ సంపత్తౌచవిపత్తౌచ దైవమేవహికారణం। ఇతిదైవ
పరోధ్యాయన్నాత్మనానవిచేష్టతే॥ ... ....౩౬

పదునాలవవాఁడగు- దైవచింతకుండు- దైవాధీనంబున శుఖా
శుభంబులు సంభవించుగావునను మనుష్యయత్నము ప్రయోజ

సం ...ము గాచుగావునను మన మేటికి శ్రమనొందవలయుననిప్ర యత్నగహీతుండైయుండుగావున నతడు సులభసాధ్యుండనుట...

శ్లో॥ దుర్భిక్షవ్యసనీచైవ స్వయమేవావసీదతి॥ 3౬

పదియైదవవాడగు- దుర్భిక్ష వ్యసనియనగా ధాన్యాదులు లేకుండుటవన తనంతట కృశించినశించుగావున నతనితోసంధిజే యనగదనుట... ... ... .. ... ... 3౬

శ్లో॥ బలవ్యసనయుక్తస్య యోద్ధుంశక్తిర్నవిద్యతే॥ 3౭

పదియారవవాడగు - బలవ్యసనయుక్తుండు - బలపగస్సరై కమత్యాభావాదులవలన యుద్ధముజేయుటకు సంభవించకపోవు టసులభసాధ్యుండనుట... ... .. .. ... 3౭

శ్లో॥ అదేశస్థోహిరిపుణాస్వల్పకేనాపిహన్యతే। గ్రా
హోల్పీయానపిజలేగజేంద్రమపకర్షతి॥... 3౮

పదియేడవవాడగు- విదేశస్థుండు- అల్పశరీరముగలనీటియం దుండు మొసలిచేరూపబలములనతిశయంబగు గజేంద్రముపట్టుబ డునట్లు అన్యదేశస్థుండగు రాజుశత్రువునకు సులభసాధ్యుండగు ననుట... ... ... ... .. .. 3౮

శ్లో॥ బహ్వామిత్రస్తుసంత్రస్తః శ్యేనమధ్యేకపోతవత్ ।
యేనైవగచ్ఛతిపథాతేనైవాశువినశ్యతి॥.... 3౯

పదునెన్మిదవవాడగు- బహ్వామిత్రుడు- డేగలనడుమ జిక్కి నపావురపిట్టవలెనే దిక్కునకేగిననాదిక్కునగల శత్రువుచేపట్టు బడి నశించుగావున నట్టివానును సులభసాధ్యుండనుట... 3౯

శ్లో॥ అకాలయుక్తసైన్యస్తుహన్యతేకాలయోధినా। కా
శికేనహతజ్యోతిర్నిశీథఇవవాయసః॥... .. ౪౦

పదితొంమిదియవవాడగు-అయుక్తకాలుడు- రాత్రికాలంబు నగుడ్లగుబ్బలచేత జచ్చుకాకిసమూహామువలె యుక్తకాలవేదియ గు ఽజిగీషుచే జయించబడుగావున నతనితోసంధిజేయనగదనుట.

శ్లో॥ సత్యధర్మవ్యపేతేననసందధ్యాత్కథంచన। సుసం
ధితోప్యసాధుత్వాదచిరాద్వ్యాతివిక్రియాం॥...౪౧

ఇరువదియవవాఁడగు-సత్యధర్మవ్యపేతుఁడు - ఘనసంధియొనర్చియుఁ దౌరాత్మ్యమువలన త్వరితకాలంబున తిరుగఁబడుఁగావున నట్టివానితో నెక్కాలంబును సంధి జేయదగనుట .. ... ౪౧

సంధేయానాహ.

శ్లో॥ సత్యార్యో ధార్మికానార్యో భ్రాతృసంఘాతవాన్
బలీ । అనేకవిజయీత్యేతే సంధేయాస్సప్తహా
ధీనాః॥ ... ... .. ... ౪౨

సత్యముబలుకువాఁడును- ౧- యోగ్యగుణంబులు గలవాఁడును-౨- ధర్మబుద్ధిగలవాఁడును ౩- పాపాత్ముండును ౪- జ్ఞాతిసమూహముగలవాఁడును ౫-అధికబలశాలియు ౬- అనేకయుద్ధంబులయందు జయించియుండు వాఁడును ౭- అనునీయేడ్వురు రాజులతోఁడ నవశ్యముసంధి జేయదగుననుట... ... ... ... ౪౨

విశేషాంక్రమాద్ధేతూనాహ.

శ్లో॥ సత్యోऽనుపాలయన్సత్యంసంధితో నైతివిక్రియాం॥౪౨॥

మొదలివాఁడగు సత్యముబలుకువాఁడు సంధి జేశినపిదపఁ దిరుగఁబడిననసత్యదోషము సంభవించుననుభయముచేత వ్యత్యస్తము నొందఁడుగావున నగత్యముసంధి జేయదగు... ... ౪౨

శ్లో॥ ప్రాణాపాయేప్యపివ్యక్తమార్యో నాయాత్యనా
ర్యతాం॥.. .. ... ... ౪౩

రెండవవాఁడగు-ఆర్యుండు- తనకుప్రాణభయముసంభవించినప్పుడును పాపకృత్యము జేయ నప్పుతినొందఁడుగావుననతనితో సంధి జేయదగు... ... ... ... .. ౪౩

శ్లో॥ ప్రజానురాగధర్మాచ్చదుఃఖోచ్ఛేద్యోహిధార్మికః॥౪౩॥

మూఁడవవాఁడగు- ధార్మికుండు- స్వపరమండలజనంబుల తన ధర్మగుణాతిశయమువలన స్వాధీనులనొనర్చియుండుటవలన నట్టివానిజయించుట దుస్తరముగావున నతనితో-సంధియొనర్చుటయుచితంబనుట.. ... ... ... ... .. ౪౩

శ్లో॥ సంధిః కార్యో౽ప్యహార్యేణ న ప్రాప్యో౽త్సాదయన్ ద్విషః। రేణుకాయాస్సుత ఇవ మూలేష్వపి న తిష్ఠతి॥ ౪౪

నాలవవాఁడగు - పాపాత్ముఁడు- మాతృఘాతకుండగు రేణుకాపుత్రుండగు పరశురామునివలె కులనిర్మూలము జేయుగావున నట్టివానితో సంధి జేయుట యుచితంబనుట... ... ... ...

ఇచ్చట జమదగ్న్యాశ్రమమునందలి హోమధేనువును కార్తవీర్యార్జునుండను రాజు అపహరించుటవలన నతని సంహారమొనర్చినపరశురామునియందు కోపమునొందిన కార్తవీర్య పుత్రులు మరలనతఁడు లేనియెడ జమదగ్నిని జంపుటచేత పితుండగు పరశురామునిచే క్షత్రియవంశము లిరువదియొకటి నిర్మూలించెననుట- ప్రసిద్ధము... ... •• ... ౪౪

శ్లో॥ సంఘాతవాన్యథా వేణుర్నిబంధః కంటకైర్వృతః। న శక్యతే సముచ్ఛేత్తుం భ్రాతుసంఘాతవాం స్తథా॥ ౪౫

ఐదవవాఁడగు భ్రాతుసంఘాతముగలవాఁడు- ముండ్లచేతయు తీగెలచేతయు పెనవేయబడియుండు వెదురుపొదవలె బలిష్ఠులగు జ్ఞాతి సమూహముచే జుట్టబడియుంటచేత సాధించుటయశక్యంబగుటవలననతనితో సంధి జేయుటయుక్తంబనుట... ... ౪౫

శ్లో॥ సమాక్రాంతస్యబలినా సర్వ యత్నవతో౽పి హి। హారిణస్యైవ సింహేన శరణం నైవ దృశ్యతే॥ ౪౬

ఆఱవవాఁడగు నధిక బలశాలిచే పట్టుబడు నితరుఁడు అనేక యత్నములుగలవాఁడయ్యును- సింహముచేతఁ బట్టుబడినజింకవలె విడిపించుకొనుట కశక్తుండగుటవలన నతనితో సంధి జేయదగు ననుట... ... .... •• ... ... ... ౪౬

శ్లో॥ ఈషదాయచ్ఛమానో౽పి సిరిహాన్మత్తానివ ద్విపాన్॥ నిహంతి బలహీనస్తస్మాత్సంధేయశ్శివమిచ్ఛతా॥ ... •• •• ... ౪౭

ఏడవవాఁడగు- అనేకవిజయి - స్వల్పయత్నపరుండయ్యును

సింహ్మముమదమేనుగులజయించునట్లు జంపుచుండుగావునతనకు శుభంబుగోరు రాజు అతనితోసంధి జేయదగుననుట... ౪౬

శ్లో॥ బలినాసహయోద్ధవ్యమితినాస్తినిదర్శనం। ప్రతి
వాతంనహిఘనఃకదాచిదపిసర్పతి॥ .. ౪౭

యెదురుగాలిని మేఘ మెదిరించజాలనియట్లు బలవంతుని నెదిరించుట యసాధ్యంబగుటవలన నెక్కాలంబును బలవద్విరోధముగలుగకుండ సంధియొనర్చుటయు చితముగు గానియుద్ధము జేయదగదనుట... ... .. ... ... .. ౪౭

శ్లో॥ బలీయసిప్రణమతాం కాలేవిక్రమతామపి।సంపదో
నాపగచ్ఛంతిప్రతీపమివనిమ్నగాః॥ .. ౪౮

తనకన్నబలిష్ఠుండగు రాజునకువిధేయుండగుచు-దేశకాలపాత్రంబులెరింగిపరాక్రమించుచుండెడు రాజుసంపదలు- నదీప్రవాహము లెదురెక్కజాలనియట్లు- శాశ్వతముగనుండుననుట ౪౮

శ్లో॥ జమదగ్నిసుతస్యేవసర్వస్సర్వత్రసర్వదా। అనేక
యుద్ధజయినః ప్రతాపా దేవభజ్యతే॥ ... ౫౦

అనేకయుద్ధజయశీలుండగు రాజునకు - పరశురామునకుంబోలె అన్నిదేశంబులయందును- సర్వకాలంబులయందును సమస్తవిషయంబులయందును- నందరునుభయము జెందుచుండుదురు గావునప్రతాపముముఖ్యసాధకము.. ... ... ౫౦

శ్లో॥ అనేకయుద్ధవిజయీసంధానంయస్యగచ్ఛతి। త
త్ప్రతాపేనతస్యాశుభయంగచ్ఛంతివిద్విషః॥ ౫౧

అనేకయుద్ధవిజయియగువాడెవ్వనితోసంధియొనర్చునతనికిద్వేషులగు వారందరు నితని పరాక్రమభీతివలన నతనికిలోబడియుందురనుట ... ... ... .. ... ౫౧

శ్లో॥ నజాతుగచ్ఛేద్విశ్వాసంసంధితోపిహిబుద్ధిమాన్।
అద్రోహసమయం కృత్వావృత్ర మింద్రఃపురావధీత్॥ .. ... .. .. ... ౫౨

పూర్వకాలంబున త్వష్టప్రజాతిపుత్రుండగు త్రిశిరస్కుం

డగువిశ్వరూపుని నన్యాయముగానింద్రుండు వధించుటవలనవుపి
తుండగుత్వష్ట్రచే నభిచారహోమాగ్ని యందుత్పన్నుండగు
వృత్రాసురునకు పరాజితుండగునింద్రుండు దేవఋషి సమక్ష
మంబున సమస్తఆయుధ - శుష్క - ఆర్ద్ర - దివా - రాత్రుల
యందు ద్రోహముజేయనియట్లు వృత్రాసురునితో సంధియొన
ర్చుటవలన విస్రంభచారియగునతని - దధీచిమహర్షి వెన్నుయెము
కచే జేయబడు వజ్రాయుధంబునకుశుష్కార్ద్రంబులుగాని సము
ద్రఫేనముచే లేపనమొనర్చి రేలునుపగులునుగానిఅస్తమనకాలంబు
నజంపెగావున - శత్రువుతోడసంధి జేసినను యేమరుపాటొందద
గదనుట.. ... .. ... ... ... ... ౫౨౪

శ్లో॥ వికారంయాతిపుత్రేపి రాజ్యోల్లీఢస్తథాపితా। త
ల్లోకవృత్తాన్నృపతేరన్యద్వృత్తంప్రచక్షతే॥...౫౩౪

రాజ్యలోభియగుతండ్రి తనపుత్రునియందును ద్రోహబుద్ధిగ
లవాడగుంగావున - లోకవృత్తాంతముకన్న రాజధర్మము పృథ
గ్భావముగలదియనుట... ... ... ... .. ౫౩౪

శ్లో॥ అభియుక్తోబలవతా దుర్గతిష్ఠన్ప్రయత్నవాన్। బ
లీయస్తరమాహ్వానంకుర్వీతాత్మవిముక్తయే॥౫౪౪

కోటయందుండియు బలశాలియగు రాజుచే నిర్బంధింపను
రాజు తననిర్బంధవిముక్తికొరకుమిక్కిలిబలశాలియగు మరియొ
కరాజును సంధిపూర్వకముగా పిలుపించదగుననుట... ౫౪౪

శ్లో॥ స్వశక్త్యుత్సాహముద్వీక్ష్య విగృహ్ణీయాన్మహత్త
రం। కేసరీవద్ద్విపమితి భరద్వాజఃప్రభాషతే॥౫౫౪

స్వకీయంబగుబలంబును- ప్రభుమంతోత్సాహంబులునుయోచించినవాడగుచు బలమధికంబుగాదోచునెడ బలశాలియగువా
నిమీద - ఏనుగులమీదసింహ ముపరాక్రమించునట్లు పరాక్రమిం
చదగునని భరద్వాజఋషి తాత్పర్యము.. ... ౫౫౪

శ్లో॥ ఏకోపిసింహస్సాహస్రం యూథంమథ్నాతిదంతి

నాం॥ ఉత్సాహవాన్ తుత్రియేషు తథైవబలినోనృపాన్॥ ... ... ... ... ...౫౬.

ఉత్సాహవంతుండగురాజు - ఒకటియగు సింహముమేలతరంబులగు గజయూథంబులజంపునట్లు అనేకరాజులను జయించదగుననుట.. ... .. ... .. ... ౫౬.

శ్లో॥ జ్యాయాంసమల్పసైన్యేన బలాద్విక్రమ్యనిఘ్నతః। ప్రతాపసిద్ధాస్సర్వత్రభజంతిరిపవోపరే॥౫౭.

మిక్కిలిబలాధికుండగువాని నల్పసైన్యసహాయముచేనెదిర్చి జయించునట్టి యుత్సాహవంతునికి మిగతరాజులు తనకితటస్వాధీనులగుదురనుట.. ... ... .. ... .. ౫౭.

శ్లో॥ సంధిమిచ్ఛేత్సమేనాపిసందిగ్ధవిజయేసుధీః। నవాసంశయితంకుర్యాదిత్యువాచబృహస్పతిః॥ ౫౮.

తనకుజయముసందేహాస్పదమగునెడల సమానుండగువానితోడనైనను సంధిజేయుటయుక్తంబని బృహస్పతిమతము. ౫౮.

శ్లో॥ అసంప్రవృద్ధేరభివృద్ధికామస్సమేనసంధానమిహాపగచ్ఛేత్। అపక్వయోర్వాఘటయోరవశ్యమన్యోన్యభేదీసమసన్నిపాతః॥ ౫౯...

కాలనికుండలొకటికొకటి యొరుసుకొనునెడ రెంటికినిబాధగల్గునట్లు సమానులగువారిరువురు యుద్ధముజేయునెడనిరువురకును హానిసంభవించుగావున నట్టివిషయంబులసంధియొనరించుటయవశ్యకమనుట... .. ... .. ... ౫౯.

శ్లో॥ యుద్ధేవినాశోభవతియథాసుందోపసుందయోః। తిలోత్తమాభిలాషేణసమవీర్యావుభౌహతౌ॥౬౦.

సమానబలశాలులగు సుందోపసుందులను రాక్షసులిరువురుతిలోత్తమయనున ప్సరస్సునువరించుటకేగునెడ దానిచేనధికబలునివరించబడుననుటవలన నొకరితోనొకరు యుద్ధమొనర్చియిరువునుసమానముగామృతినొందుటప్రసిద్ధంబగుటవలన సమానబలులగువారు సంధిజేయుటయుక్తంబని పూర్వశ్లోకముతోసంబంధము.. .. .. ... .. ... ౬౦.

శ్లో॥ విహీనోపిహిసందధ్యాద్యోవ్యసనేరిపురాగతః। ఎ
త్సద్ధినోతిహిమనఃతోయబిందురివత్సతేః॥ ౬౧॥

దీనుండగుచుశరణాగతినిజెందిన శత్రువుతనకన్న హీనుండైనను సంధిజేయుదగుననుట. అట్లుజేయనియడగాయమునందు నీరుబోశినటుల శరణాగతునిరక్షణమొనర్చని మనోదుఃఖము బాధించుచుండుననుట... .. ... .. ౬౧॥

శ్లో॥ నసంధిమిచ్ఛేద్దీనశ్చేత్తత్ర హేతురసంశయః॥ తస్య
విస్రంభమాలక్ష్యప్రహరేత్తత్రనిష్ఠురం॥ .. ౬౨॥

సంధియొనర్చువిషయంబున తగుకారణంబులు లేనియడనట్టివృత్తాంతమునెరింగియు తడుమరలబ్రతుకనియటులనిష్ఠురముగాజంపదగు.. ... .. ... ... ౬౨॥

శ్లో॥ బలీయసాభిసంధాయ తంప్రవిశ్యప్రయత్నవాన్।
తథాసావనుగంతవ్యోయథావిస్రంభమాప్నుయాత్॥ ౬౩॥

తనకన్నబలిష్ఠుండగువానితోసంధియొనర్చి యతనిసమీపప్రవేశానంతరంబున తనయందతడుమిక్కిలి నమ్మకముగలిగి స్వకీయదేహాదిప్రకృతిరక్షణంబులయందేమరియుండునట్లు ప్రవర్తించదగుననుట... ... .. ... .. ... ౬౩॥

శ్లో॥ విస్రంభనీతిముద్యుక్తో నిగూఢాకారచేష్టితః। ప్రి
యాణ్యేవాభిభాషేత యత్కార్యంకార్యమేవ
తత్॥ .. ... ... ... ౬౪॥

అట్టియడనీతిశాస్త్రానుసారియగుచు స్వకీయాకారచేష్టలదెలియనీక ప్రియంబులుబలుకుచుండదగుగాని సమయంబునజేయదగు కార్యంబులజేయుటయవశ్యమనుట... ... ..౬౪॥

శ్లో॥ విస్రంభాత్ప్రియతామేతి విస్రంభాత్కార్యమిచ్ఛతి। విస్రంభేనహిదైవేంద్రో దితేర్గర్భమశాతయత్॥ .... .... ...... ౬౫॥

జయజీవయనామొదలుగు మర్యాదగల పలుకులచేతను నమ్మకముగల నడతలచేతయు శుశ్రూషాదులచేతయు- ప్రియాచర

ణములచేతయు నన్యులకప్రీతి జనియించుంగావున నట్టివిస్రంభ వ్యాపారములచేనయ్యరియేమరుపాటొందు నవసరంబున స్వకీయకార్యముసాధించందగుననుట... ... ... ...

యిందు రాక్షసనాశముచే దుఃఖితయగు దితిదేవితనభర్తయగు కశ్యపునిసారాధించి యింద్రజేతయగు పుత్రుంబడయుటకై సహస్రవార్షికంబగు పుంసవనవ్రతంబుధరియించియాచరించుచుండనవ్వృత్తాంతవేదియగు నింద్రుండయ్యమకు శుశ్రూషచేయుచు పూర్వోక్తలక్షణముచే నమ్మకముగలుగంజేసియుండునెడ నొకసమయంబున నయ్యమవిస్రంభముచే పగటికాలంబునతలయిడు ప్రదేశంబున పాదంబులును పాదంబులిడు నెడతలయును వైచినిదురించుటంజూచియయ్యపరిశుద్ధకాలంబున వజ్రాయుధధారియగుచు నయ్యమగర్భంబునంజొచ్చి యప్పిండంబును నలుబదితొమ్మిది తునుకలుగఖండించెననియు నాశకలంబులు మరుత్తులగణంబయ్యెననియు శ్రీభాగవత ప్రసిద్ధముగాననిందు కదిదృష్టాంతరంబుగబలుకంబడియె... .. .. ౬౫

శ్లో॥ యువరాజేనసంధాయ ప్రధానపురుషేణవా। అం
తఃప్రకోపంజనయే దభియోక్తుఃస్థిరాత్మనః॥ ౬౬

స్థిరచిత్తుండు సమర్థుండుననగు శత్రునికటంబుననుండెడుయువరాజు- ప్రధానపురుషుండును- మంత్రియు- పురోహితుండును- సేనాపతియు మొదలగువారియందొకరిద్దరితోడ యథాసంభవంబునగూఢంబుగ దానాదులచే సంధిగలుగుటకై యత్నంబొనర్చి యట్టివారలచే నొండొరులకుం గలహంబు లుత్పన్నంబులగు నట్లొనరించిక్షుభితులగుచుండు నెడ స్వకీయకార్యసాధనం బొనర్పందగుననుట.. ... ... .. ... ౬౬

శ్లో॥ అథోఽర్థస్వర్ణెఽనమహతా లేఖైశ్చార్థాభిసంహి
తైః। ప్రధానపురుషైరేవ కారయేదర్థదూ
షణం॥ ... ... ... ... .. ౬౭

పూర్వోక్తులగుప్రధానపురుషులకు నతివిపులంబగు ధనంబు

లోసంగినైనను - అట్టిధనంబులిచ్చుటకుందగిన నిజముద్రాదిచిహ్నితంబులగు పత్రికేలువ్రాయుటచేనైనను వారలకుతనయెడ మక్కువగలుగం జేసికొని వారలవలన శత్రురాజునకగునర్థాదిప్రయోజనంబులపై కల్యంబొనర్పం జేయందగుననుట... ౬౭

శ్లో॥ దూషితేహిమహామాత్యే రిపురుగ్రోపిధీమతా ।
స్వపక్షే యాత్యవిశ్వాసమిత్థం భూతశ్చనిష్క్రి-
యః॥ ... ... ... ... ...౬౮

యిట్లొనర్చుటచే మహాప్రధానులుమొదలగువారు అన్యునిచేదూషితులగుచుండు నెడ విజిగీషుండనుశత్రుండు సమర్థుండయ్యు తనపక్షీయులగువారియందు నమ్మకమునుంచక పోవుట వలన ప్రయోజనములేనివాడేయగుననుట... ... .. ౬౮

శ్లో॥ అరేరమాత్యాన్సంధాయతదారంభంశమంనయే
త్। విషభేదేనవాశత్రుంసదానైనైవసాధయేత్॥౬౯

విజిగీషుండగుశత్రునిమంత్రుల పూర్వోక్తలక్షణములచేసంధియొనర్చియైనను - విషప్రయోగముచేనైనను- విశేషద్రవ్యదానముచేనైనను - మరియుంగలుగునానావిధోపాయంబులనైననుతనస్వాధీనుం జేసికొనదగుననుట... .. ... ... ౬౯

శ్లో॥ అరేస్సర్వప్రయత్నేనపశ్చాత్కోపంప్రకల్పయేత్।
పశ్చాత్కోపమథాతిష్ఠన్నుపస్కృత్యప్రథమంనయేత్॥౭౦

విజిగీషుండగుశత్రునిననువర్తించియైనను తుదినతనికి కోపముగలుగునట్లొనర్చి యకోపమువలన క్షుభితుండగునతనిందరిమి పరిమార్పందగుననుట... .. .. .. ౭౦

శ్లో॥తద్దేశకృతసంవాసైస్తైస్తైర్హీనైర్మిత్రైకైరరిః॥ఉపోథ
వ్యసనాద్దేశంకారయేత్సిద్ధలిఙ్గిభిః॥.. ౭౧

శత్రుండుండెడు దేశంబునందలి ప్రజలు రాజునకు నిత్యులుగానుండియు - దేశప్రీతివలనవారలునమ్మకము గలవారైయ్యుండుటవలన అట్టి దేశజనంబులకు జ్యోతిషికులు మొదలగు వేష

ధారులచే భేదంబులు గలుగంజేసి దేశవ్యసనంబు గల్పించదగుననుట... ... ... .. ...౭౧౪

శ్లో॥ క్షయవ్యయాపాయవధాదిదోష వ్యపేక్షయాపీక్షితసాధుకృత్యః। కామంతుపీడామపికాదిచ్ఛేన్న విగ్రహాంయత్ప్రభవాహిదోషాః॥.. ౭౨౪.

క్షయించుటయు - వ్యయంబగుటయు - అపాయముగలుగుటయు - చచ్చుటయు - నను పీడలకంతయు - విరోధముముఖ్యకారణంబగుటవలన నట్టిదోషంబులనాలోచించి సాధుకృత్యంబుల జేయుచుండదగుననుట... ... ... .. .. ౭౨౪

శ్లో॥ కళత్రమాత్మా సుహృదోధనాని వృథాభవంతీహనిమేషమాత్రాత్। ముహుర్ముహుశ్చాకులితాఃకృతాః తస్మాన్నవిద్వానతివిగ్రహీస్యాత్॥... ౭౩౪

అతివిగ్రహము చేననగా నత్యంతకార్పణ్యము చేసంభావితంబగు శస్త్రప్రహారము చేగతజీవితుండగు పురుషునికిప్రాణసమానలగు భార్యాజనంబును - సకలశాస్త్రంబులచే సంస్కృతంబగు తనదేహంబును - స్నేహితులును - బంధుజనంబులును - ధనకనకవస్తువాహనంబులును - నొకనినశించుటచే, నాకులపాటునొందుచుడ్రుగావున నెప్పుడును అతివిగ్రహము జేయందగదనుట...౭౩౪

శ్లో॥ సుహృద్ధనంతథారాజ్యమాత్మానంకీర్తిమేవచ। యుధిసందేహాలోలస్థంకోహికుర్యాదబాలిశః॥ ౭౪౪

యుద్ధంబొనర్చుటవలన - సుహృత్తులును ధనంబులును - రాజ్యంబును - తనదేహంబును - స్వకీయకీర్తియును - యుద్ధము జేయ నుపక్రమించువానికి సంశయాస్పదంబులగుచు వ్యాకులంబులగుంచుడుంగావునపండితుండగువాడట్టి యుద్ధంబునకుహాత్తుగయత్నము జేయుచగదనుట... ... .. ... ౭౪౪

శ్లో॥ సామ్నాప్రదానేనవిభేదనేనసంస్తంభయిత్వాన్యథ్వాభియుజ్యమానః। సంధిత్సురారాత్సమసైన్యచక్రంసామంతమాయాంతముపేతసంధిః॥ .. ౭౫౪

విజిగీషుండు తనకుసముండై యున్నను యుద్ధసిద్ధిసంశయా స్పదంబగుటవలన నట్టివానిని సామంత రాజులను - గుణసంబంధంబులుబలుకుటయు ౧ - ఓండొరుల కుపకారంబులం గనపరచుటయు ౨ . అభిజాత్యంబుదెలుపుటచేతయు - శరీరకష్టముచేతయు - నిజప్రకృతిస్వభావముదెలుపుటచేతయు - తనపాండిత్యవైదుష్యాదులెరింగించుటచేతయు - మంగళకరంబులగు ద్రవ్యంబులయాగమనముగలుగు నుపాయంబు లెరింగించుటచేతయు ననునాయితి కనపరచుటయు ౩ - తనద్రవ్యంబంతయు నీయదియయనియు ద్రవ్యంబింతగలిగియున్నదనియు దెలుపునాశచే ననునాత్మోపనిధానము గనపరచుటయు ౪ - ననునాల్గుభేదంబులగు సామంబులచేనైనను - క్రొత్తయగునొకవస్తువొసంగుటయు ౧ - అతండుగ్రహియించినదాని ననువర్తించుటయు ౨ - కోశమొసంగుటయు ౩ - దేశంబునకొంతభాగంబొసంగుటయు ౪ - ననునాల్గుభేదంబులుగల దానముచేనైనను - సందియముగలుగజేయుటయు ౧ - బెదరించుటయు ౨ - ననురెండుదెరంగులగు భేదంబులచేనైనను క్రమంబున కుటిలవర్తనుండుగాకుండ ప్రయోగంబొనర్చియుద్ధముపశమించునట్లుజేయుచు సామంతరాజులతోడను సంధిగలిగియుండందగునను... ... ... ... .. ... .. ౭౫

శ్లో॥ స్వగుప్తిమాధాయసుసంహితేనబలీవధీరోవిచరన్నరాతిం। సంతాపయేద్యేనససంప్రతప్తస్తేనసంధానముపైతితప్తః॥ ... .. ... ౭౬

లోకంబునకాచంబడనిలోహాదులొండొంటితోగలయంజాలదుగావున సంధిజేయుటకిచ్ఛగించని శత్రుండు తప్తుండగుటకై స్వకీయంబగు చతురంగబలంబులదృఢంబులుగ నొనర్చుచు తన్నుంగాచికొని యతండెవ్విధిచేతప్తుండగునట్లొనర్పందగుననుట౭౭

శ్లో॥ ఇతిస్మసంధింక్షిలు సంధివిత్తమాబభాషిరేపూర్వతమామహర్షయః॥ బలాత్తదేనంపివ్యాశేన్నరేశ్వరస్సమీక్ష్యకార్యంగురుచేదవిక్లబః॥... ... ౭౮

సర్గోపసంహారము- పూర్వతములగు శుక్రబృహస్పతులు మొదలగు నీతిశాస్త్రాచార్యులు సంధిస్వరూపంబుల నిట్లుగ నుపదేశించిరి గాన రాజగువాడు ధీరుండగుచు కార్యగురులాఘవంబు లెరింగి కార్యబలీయంబగు నెడ నిట్లు జేయుందగుననుట..... ౭౫
ఇట్లు కామందకముతొమ్మిదవసర్గము సంపూర్ణము.



కామందకము దశమస్సర్గము.

విగ్రహం.

శ్లో॥ అమర్షోపగృహీతానాంమన్యుసంతప్తచేతసాం।పర
స్పరాపకారేణపుంసాంభవతివిగ్రహః॥..... ..౧

పూర్వసర్గంబున సంధిభేదంబులు దెలుపంబడియెంగాననది ప్రథమతంత్రంబు ఇంక ద్వితీయ తంత్రంబగు విగ్రహము అనగా విరోధము వక్ష్యమాణంబగుటంజేసి యట్టివిరోధంబు జనియించుటకు కారణము ఓండొరులచేనగు నొండొరుల యపకారంబులవలనగలుగు నవమానముచేనగు కోపంబునమనంబుడుకుటవలన విగ్రహంబుత్పన్నంబగుననుట... .. ౧

శ్లో॥ ఆత్మనోభ్యుదయాకాంక్షీపీడ్యమానఃపరేణవా।
దేశకాలబలోపేతఃప్రారభేతేహవిగ్రహం॥.. ౨

పూర్వశ్లోకోక్తంబగునపకారంబులచేత యవిగ్రహంబు బుట్టుటమాత్రంబగాక తనకభ్యుదయంబుగోరు కారణముచేతయును- నన్యునిచేపీడింపంబడునప్పుడునుం జనియించుంగావుననట్టి విగ్రహముసంభావితంబగు నెడ దేశబలంబును- కాలబలంబును- సైన్యబలంబునుంజూచి విగ్రహంబారంభించందగుంగాని కేవలంబు పూర్వోక్తకారణంబులు బొడమిననుగత్యంతరాభావము చేతయు దేశకాలబలంబులులేకయు ననుష్ఠింపందగదనుట... ౨

శ్లో॥ రాజ్యస్త్రీస్థానదేశానాంజ్ఞానస్యచధనస్యచ।అప

హారో[౮]మదోమానః పీడా[౯]వైషయికీ తథా । [౧౦]జ్ఞానార్థ
[౧౧]శక్తి[౧౨]ధర్మా[౧౩]ణాం విఘాతో [౧౪]దైవమేవ చ । [౧౫]మిత్రా[౧౬]ర్థా
ద్యవమానశ్చ తథా [౧౭]బంధు వినాశనం । భూతానుగ్ర
[౧౮]హవిచ్ఛేదస్తథా [౧౯]మండలదూషణం । [౨౦]ఏకార్థాభిని
వేశిత్వమితి విగ్రహయోనయః ॥ ... ౫౭

సప్తప్రకృతికంబగు పూర్వోక్తలక్షణలక్షిత రాజ్యంబపహరించుటయు ౧ సీతాదేవిని రావణుండపహరించినట్లు లసత్పురాంగనల నపహరించుటయు ౨ - రాజధానినాక్రమించి యపహరించుటయు ౩ - రాజ్యంబునం గొంత యపహరించుటయు ౪ - జ్ఞానము గలుగం జేయు నుపాధ్యాయులను శాస్త్రాదులను నపహరించుటయు ౫ - ధనంబపహరించుటయు ౬ - పూర్వోక్తుండగు దంభోద్భవుని భంగి యత్యంతమదంబు జెందియుంటయు ౭ - రావణుని భంగి (నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోకభయాదపి) అనేక్రమంబున నభిమానంబందియుంటయు ౮ - దేశంబునం గల జనులం బీడించుటయు ౯ - జ్ఞానంబు గలుగం జేయు నుపకరణంబులగు నుపాధ్యాయశాస్త్రకోశాదుల విఘాతంబొనర్చుటయు ౧౦ - ద్రవ్యాగమంబులకు విఘాతంబొనర్చుటయు ౧౧ - ప్రభుమంత్రోత్సాహ రూపంబులగు త్రిశక్తులకు విఘాతంబు జేయుటయు ౧౨ - తనచే నొనర్పంబడిన యగ్రహార దేవాలయ గ్రామవన తటాక సత్రప్రపాదులకు విఘాతంబు లొనర్చుటయు ౧౩ - దైవకృతంబులును పూర్వజన్మ ప్రారబ్ధానుభవరూపకంబులును సూర్యాదులగు నవగ్రహంబుల దుస్థితిచే సంభవించుటలును దైవికంబులైనను మనుష్యప్రయత్నముచే వానిం సాధించెదనను రామాయణలక్ష్మణోక్తి ననుసరించి యుద్యమంబొనర్చుటయు ౧౪ - స్నేహితులు మొదలగు ప్రయోజనంబుల నవమానంబులొందించుటయు నపహరించుటయు ౧౫ - మాన్యజనంబుల నవమానంబొనర్చుటయు ౧౬ - తనబంధువులని ష్టా

రణంబున నొరుండువధబంధనాదులొనర్చుటయు౧ ౬-భూతానుగ్రహవిచ్ఛేదంబన నొకవనంబుననుండెడు మృగంబుల నెవ్వారలుంజంపందగదని యభయంబొసంగి యుండు నెడ నవ్వనంబున నొరుండు వేటలాడుటవలనంబుట్టు నాగ్రహంబును౧౮-పూర్వోపాహృత రాజద్వాదశమండలంబుల భిన్నంబొనర్చుటయు౧౯-ఏకార్థంబులన-దేశ-రాజ్యద్రవ్యవనితాజనులు మొదలగునొకటియయగువిషయంబున నిరువురాసగొనుటయు౨౦ - నిదియునుమరియు నొండొరులంబట్టి కారాగృహంబుల బడవైచుటలును మొదలగు నవివిగ్రహమూలంబులనంబడు... ... .. .. ౫

ఇట్లువిగ్రహంబుల్పొడమినను నిందులకుంబరిహారోపాయంబులుగలవు గాననయ్యనుక్రమణి.

శ్లో॥ రాజ్యస్త్రీస్థానదేశానాం దానేనధనమేనచ। విగ్రహస్యత్వయుక్తిజ్ఞైస్సమ్యక్ప్రశమనం స్మృతం। ఏత దేవతువిజ్ఞేయంత్వర్థజ్ఞానవిఘాతజే విషయధ్వంసజే శత్రౌ విషయస్యప్రపీడనం॥ ౬

రాజ్యమపహరించుట౧- స్త్రీలనపహరించుట౨- స్థానంబపహరించుట౩-దేశభాగంబపహరించుట౪- గురువులు మొదలగువారలనపహరించుట౫- ద్రవ్యంబపహరించుట౬- యనునీయారు విషయంబులకును నతండుదాని వైకల్యంబందకుండునట్లు మరల నర్పించి శరణాగతుండగుట చక్కని శమోపాయంబనియు - విషయంబులధ్వంసంబు జేయు నెడ యావిషయంబుమరల యథాప్రకారంబున నిలుపంబడం జేయుటయు- శమోపాయంబనియుం యుక్తి దెలిసినవారనగా నీతిశాస్త్రార్థవేదులచే జెప్పంబడియెననుట... ... ... ... ... ౬

శ్లో॥ జ్ఞానాపహారసంభూతె జ్ఞానశక్తివిఘాతజే। శమస్తద్దర్శనాత్త్యాగేనమిత్రజనడపెత్తుణం॥.. ... ౭

జ్ఞానంబపహరించుట యనపూర్వోక్తగురువులు మొదలగు

వారలనపహరించుటయు విఘాతంబొనర్చుటయునను విషయంబు లనర్థ్యైశ్వ యర్థంబులవిడిచి పశ్చాత్తాపంబందుట శాంతియని యు - మిత్రునివిషయంబునం జేయంబడు నన్యవిగ్రహమునకై తన ప్రాణంబైననుం బరిత్యజించి యుద్ధానికిం బ్రతిక్రియయొనర్పుండ గునని యు దెలియుట... .. .. ... ...౯

శ్లో॥ అవమానాత్తు సంభూతం మానేన ప్రశమం నయేత్।
రహస్యేన ప్రయోగేన రహస్యక్షణేన వా। విగ్రహం
శత్రుయోద్ధిమాన్బంధు నాశసముద్భవం॥... ...౯౫

అవమానము జేయుటచే నుత్పన్నంబగు దానినని గారవిం చుటచే నుపశమింపం జేయందగు - ఇంద్రరాజను వాడొరులకు నమస్కారంబొనర్చుటకుందగకుండెను శత్రువునకెట్లు నమస్కా రంబొనర్పందగునను నాత్మేచ్ఛా స్తంబగు నెడ (ఇంద్రాయ సప్ర ణామం వైయాంబలీయ సైనమత్) యను ఆచార్య కౌటిల్య వచనము ననుసరించి దోషంబందనుట - మఱియు బంధునాశనము నొంద లగువిషయంబులరహస్యంబులగు సామదానోద్యోపాయంబుల బలవంతుని శమింపం జేయందగుననుట... ... ...౯౫

శ్లో - యోనపీడాన జాయేత తాదృశంతు పిచక్షణః। కు
ర్యాదర్థపరిత్యాగమేకార్థాభినివేశజే॥ ౧౦౫

ఒక యర్థంబున నైపుణ శ్లోకోక్తంబగు నెట్టి యపహరింప బడియె దాని బరిత్యజించి తనకుం బీడ గలుగనట్లు జేయం దగుననుట... ... ... ... .. ...౧౦౫

శ్లో॥ ధనాపహారజాతేతు నవిరోధం సమాచరేత్। క
దాచిద్విగ్రహేపుంసాం సర్వనాశస్తుజాయతే॥౧౧౫

ధనాపహారణవిషయంబగు విగ్రహవిషయంబున నొక వేళ సర్వధనాధులును నాశంబునొందిననొందుంగాన నట్టి విషయం బున విశేష విగ్రహముకొరగాదనుట.. .. ...౧౧౫

శ్లో॥ భూతానుగ్రహవిచ్ఛేద జాతస్యాం తంనయేద్వ
శీ। దైవమేవతుదైవోపశమనంసాధుసమ్మతం॥౧౨౪

భూతానుగ్రహవిచ్ఛేదవిషయంబునంగలుగువిగ్రహంబునుం సహింపందగుననియు - దైవవశంబునంగలవిగ్రహంబునకు దైవంబే నివారకంబగుట నాగ్రహించకుండుటయ సాధువుల సమ్మతంబనియుం దెలిసియింద్రియనిగ్రహియైయుండందగుననుట.. ౧౨౪

శ్లో॥ తృష్ణోపన్యాసయుక్తేన సంప్రదానాదికేనచ। మం
డలక్షోభసంయుక్తముపాయైఃప్రశమంనయేత్॥౧౩౪

రాజమండలక్షోభంబులచే గలుగువిగ్రహంబును దానాదుల చేనగు నుపాయంబులవలన శమింపంజేయందగుననుట.. ౧౩౪

శ్లో॥ సాపత్నంవాస్తుజంస్త్రీజం వైరమేవాపరాధజం।
వైరంప్రభేదనిపుణైర్వైరంపంచవిధంమతం॥ ౧౪౪

శత్రుత్వముచేనుత్పన్నంబగునదియు - ౧ - పొలిమేరలకలతలచే బొడమునదియు- ౨- స్త్రీ హరణాదులచేగలుగునదియు-౩- తప్పుజేయుటచేనగునదియు- ౪- పరాక్రమాసహిష్ణుత్వముచేతయు - నతిపరాక్రమముచేతయునగునదియు-౫-నను నైదువిధంబుల వైరంబుత్పన్నంబగునని భేదంబు లెరుంగు నీతిజ్ఞులచే దెలుపంబడియుండు... .. .. .. ... ౧౪౪

మతాంతరము.

శ్లో॥ జాతంభూమ్యపరోక్షే తథాశక్తివిఘాతజం। భూ
మ్యనంతరజాతంచ మండలక్షోభనం తథా। చతు
ర్విధంవైరమితిప్రాహనాకాధిపస్స్వయం॥ .. ... ౧౬

భూమినికట్టుటయు యెల్లకలతయుననునదియు - ౧ - ప్రభుమంత్రోత్సాహశక్తులకువిఘాతమొనర్చుటచే గలుగునదియు -౨- చుట్టునుండు రాజులకుందనకునుయెల్లకలతలు లేకయును నుత్పన్నంబగునదియు- ౩ - ద్వాదశరాజమండలంబులగలచుటచే నగునదియు - ౪- నను నాల్గువిధంబులచేతయు వైరంబుత్పన్నంబగుచుండుననియిం(?)నుండుబలికె .. .. ... ౧౬

శ్లో॥ కులాపరాధజైవైరేమన్యం తే ద్వైచమానవాః॥ ౧౬౫
దాయాద్యమునంగలకలతలచే గలుగునదియు-౧- మఱియం తయు అపరాధము జేయుటచేతయసంభవించుననియు - ౨ వైరం బులు రెండు దెరంగులనబొడముంగాని యితర కారణంబు లన్నియు నపరాధాంతర్భూత భేదంబుల యగుటవలన మనుశిష్యుల మతంబున వైరంబు రెండువిధంబులేయని తాత్పర్యము ౧౬౫

శ్లో॥ కించిత్ఫలం నిష్ఫలంచ సందిగ్ధ ఫలమేవచ। ఆయ
త్యాంచ తదాత్వేచమండలక్షోభ కారకం॥౧౬౬
తత్కాలంబనవర్తమానకాలంబునను ఆగామి కాలంబునను మండలక్షోభమనగా ద్వాదశరాజమండలంబుగలచుటవలన గ లుగుకలతనిష్ఫలంబగునదియు - స్వల్ప ఫలంబగు నదియుఫలంబు నందు సంశయాస్పదంబగునదియుంగాననట్టి దానివృద్ధి జేయం దగదనుట.. ... ... .. ౧౬౬

శ్లో॥ అపరిజ్ఞాతవీర్యేణ దుష్టేనస్తోమితోపివా। పరా
ర్థేణం స్త్రీనిమిత్తంచదీర్ఘకాలంద్విజోత్తమైః॥౧౬౭
ఎదటివాని పరాక్రమము దెలియకుండు విషయంబునను- ౧దు ర్మార్గుండగువాడు ప్రేరేపించు విషయంబునను-౨అన్యునిద్రవ్యా మలంకొల్లబెట్టు విషయంబులను-౩ యువతికొరకును- ౪ చిరకాల ముదగులు నట్టివిషయంబునను-౫నను నీయైదువిషయంబులునుమ హాపాపంబులతోడం సంబంధించినవగుటం జేసి పెద్దలచేనిట్టి వైరం బులసంబంధంబు జెందం దగదనియనుశాసనము... .. ౧౬౭

శ్లో॥ అకాలేదైవయుక్తేన బలోద్ధ్రుతసఖేనచ। తదా
త్వేబలసంయుక్తమాయత్యాం బలవర్జితం॥౧౬౮
తనకుందేశకాలంబులుగాని యెడను- ౧-దైవబలముగలవా నితోడను౨బలవంతుండగుమిత్రులుగలవానితోడను ౩ సద్యస్కా లంబునం బలముగలవానితోడను౪ భావికాలంబునబలంబు లేనివా నితోడను ౫ విగ్రహించందగదనియనుశాసనము... .. ౧౬౮

శ్లో॥ కౌర్మంసంకోచమాస్థాయ ప్రహారమభిమర్షయేత్।
కాలేకాలేచ మతిమాను త్తిష్ఠేత్కృష్ణసర్పవత్॥ ౨౦౪

తనకుం దేశకాలంబులను వర్తించనిమొదటా వేలువృత్తిన ను సరించి స్వకీయంబులగు నంగంబులముడిచికొని శత్రుని వీపు చే మోయుచున్నైనను నతనివలన గలుగు నవమానంబులకోర్చి కొనుచు తనకుందేశకాలంబులు సమకూరిన యపసరంబున కృష్ణసర్పముకరణివిజృంభించి శత్రు నిరవశేషము జేయం దగు న నుట.. .. ... ... ... ... ... .. ౨౦౪

సాధ్యాసాధ్యవిభాగము.

శ్లో॥ కులోద్గతం సత్యముదారవిక్రమంస్థిరంకృతజ్ఞంధృ
తిమంతమూర్జితం। అతీవదాతారముపేత వత్స
లంసుమహ్వా సాధ్యంప్రవదంతివిద్విషం॥... ౨౧౪

కులీనుండును నట్టికులీనులగుపరిజనంబులచే వినుతం బడని వాడును - సత్యవాదియు - అత్యతిశయ పరాక్రమశాలియు- స్థిరంబగు నైశ్వర్యముచే దృఢమూలుండగువాడును - అన్యుల చే జేయుమేలును ఉపకారబుద్ధితోడం దెలియు వాడును - ధైర్యశాలియు - ఊర్జితుండును - విక్రమార్కుని భంగియతి దాతయు - శరణాగతవత్సలుండును - నగునిట్టియోగ్యగుణంబు లు గలరాజు సాధించబడం జాలండనుట.. .. ... ౨౧౪

శ్లో॥ అసత్యతానిష్ఠురతా కృతఘ్నతాభయః ప్రమా
దోలసతావిషాదితా। ద్వేషోభిమానోపిచ దీర్ఘ
సూత్రతా తథాంగనాద్యాదివనాశనం శ్రియః। ఇతి
స్మదోషాన్వితమాశు విద్విషం త్రిశక్తియుక్తోవిజిగీ
షయావ్రజేత్॥ .. ... .. ... ౨౩

అబద్ధంబులు బలుకుటయు - నిష్ఠురంబులుబలుకుటయు - నో రులచే జేయుమంచి యొసంగమియు - భయపడుటయు - బుద్ధిని లుకడలేసనికియు - సోమారితనంబును- యేడ్చుచుండుటయు- దీ

ఘోర ద్వేషంబును - స్వాభిమానంబును - దీర్ఘసూత్రతయు - స్త్రీ ద్యూత పానాదులగు సప్త వ్యసనంబుల నర్జనంబు ప్రయించుచుండుటయునను దుర్గుణంబులుగల శత్రుండు సులభసాధ్యుండగుటం జేసి విజిగీషుండగు వాడట్టివానిని వినం-తన ప్రభుమంత్రోత్సాహశక్తియుక్తుండగుచు జయించుటకు దండయాత్ర జేయం దగుననుట... ... ... .. ... ౨౩

శ్లో॥ అతోన్యథా సాధుజనైస్సమంతతః కోపితో విద్యాదుప
ఘాతమాత్మనః॥ ... ... .. ౨౪

పూర్వోక్తస్థలగు వారువక్కాణింతగ విషయంబులనట్టిదండయాత్ర జేయు నెడలభించుటయగుదైయ్యుంపు టయగాక అంతటను సాధుజనంబుల చేతనకుం బ్రాణహానియుసంభవించుం గావునన ట్లు జేయనగదనుట... ... ... ... ... ౨౪

సర్గోపసంహారము.

శ్లో॥ సయత్నతో రాజ్యపదోన్ని నీషయా మనీషయా వీక్షి
తమండలక్రియః। ఇమం న్యహీ పిగ్రహమార్గ మాస్థి
తః స్థిరోద్యమస్సంప్రయితే తసమ్యక్॥ ... ౨౫

రాజ్యస్థానంబు నిర్వహించునట్టిమండలక్రియల బుద్ధియందు పలుమారు నాలోచించుచు యత్నపరుండయి యేమరుపాటొందక నీవిగ్రహ ప్రకరణంబున నుపదేశింపంబడిన క్రమంబునను ష్ఠింపుచు ధృఢం బగునుద్యమముగలవాడగుచు జయంబునకై యత్నంబొనర్పదగుననుట... ... ... ... ... ౨౫

ఇట్లు కామందక దశమసర్గము సమాప్తము.



కామందకం ౧౧ సర్గారంభం.

యాత్రావిధానం.



శ్లో॥ ఉత్కృష్టబలవీర్యస్య విజిగీషోర్జయైషిణః। గుణా
నురక్త ప్రకృతేర్యాత్రాయానమిష్యతే॥ ...౧

రాజషడ్గుణంబులయందు పూర్వసర్గంబుల క్రమంబున సంధియు - విగ్రహంబునుం దెలుపంబడియెం గాననందు మూడవదియగుదండయాత్రాస్వరూపంబిందు నిరూపంబడియెడు - అతిశయంబగుబలంబుగలవాడును - పరాక్రమముగలవాడును - గుణముల చే ప్రకృతిసప్తాంగంబుల సంతసింపం జేయువాడునునగు నతండు జయేచ్ఛచే వెడలుదండయాత్రయానంబనంబడు... .. ౧

యానభేదానాహ.

శ్లో॥ విగృహ్యసంధాయతథాసంభూయాథప్రసంగతః।
ఉపేక్షా చేతినిపుణైర్యానంపంచవిధంస్మృతం॥ ౨

శత్రువులతానొక్కండజయించుటకు వెడలుటయు ౧- సామంతభూమ్యనంతరులతోడ సంధియొనర్చికొని వెడలుటయు ౨- యిద్దరునొక శత్రునిపైయగుగుటయు ౩- ప్రస్థపముపలన గలయుటయు ౪- బలవంతుం డొకచోటికరుగుచుండియన్యునినలత్యంబుగ జయించుటకరుగుటయునను నైదువిధంబులు యానంబులనుటదీని యనుక్రమణికమూలంబవ్యాఖ్యానంబైయుండు... ... ౨

విగృహ్యయానం.

శ్లో॥ విగృహ్యయాతిహియదాసర్వాఞ్ఛత్రుగణాన్స్వయం। విగృహ్యయానంయానజ్ఞాస్తదాతంపరిచక్షతే॥ ... .. .. ... ౩

బలవంతుండగుచు నందరశత్రులనునిగ్రహించి దిగ్విజయంబొనర్తునను నుత్సాహము చేదలుటయాన విద్యావిశారదుల చే విగృహ్యయానంబనంబరగు... .. ... ... ౩

సంధానయానం.

శ్లో॥ ఏకీభూయయదేకత్రసామంతైర్భూమ్యనంతరైః।
సమవాయేనచరతిసంధాయగమనంహితత్॥ .. ౪

సామంతంరాజులునుభూమిసమీపంబునందుండురాజులునుం దానునుంగలసి యాలోచించి గుంపుగూడి వెడలుట సంధాయగమనబంనంబరగు.. .. ... .. .. ౪

సంభూయయానం.

శ్లో॥ ఉభయోరౌతు యద్యానంద్వయోః ప్రకృతినాశ
నే। సంభూయగమనం ప్రోక్తంహనూమతూర్సూర్య
యోరివ॥ .. .. ... ... ... ౫

తొలుతనొండొరులకు శత్రువులగుచు నిరువురుగల హించు
చుండ నీయిర్వురిం జెయించుటకై మరియొకండరు దెంచినయ
వసరంబున నీతొలుతటి వారిరువునంగలశి యమ్మూడవవాని
నెదిరించుట సంభూయగమనంబనునది - యీవిషయంబున పూ
ర్వంబున హనుమంతుండుత్పన్నుండయి ఫలభ్రాంతిచే సూర్యు
నింగ్రమింగగమకించిన యవసరంబున నాదినంబునంబర్వంబగుట
సూర్యుంగ్రసించుట కరుదెంచిన రాహువుహనుమంతుని ముఖం
బుంగనుంగొని యతనింగూడబట్టుటకుం గమకించినట్లును - న
క్కాలంబుననా రవిహనుమంతు లిర్వురుగూడి రాహువుందరి
మినట్లునుపౌరాణికసూక్తులసాదృశ్యంబుగ నెరుంగందగు ...౫

శ్లో॥ అల్పసారాను పాదాయప్రతిజ్ఞాయ ఫలోదయం।
గమ్యతె యత్పరం జేతుం సంభూయగమనం హిత
త్॥ ... ... ... ... ... .. ౬

స్వల్పబలశాలులగు చుట్టుపక్కల వారింగూర్చి శత్రుంనిజ
యించితిమేనియాద్రవ్యంబులు మనమందరము నిక్కరణిం బంచి
కొందమనిప్రతిజ్ఞలొనరించికొని యొకనిం జెయించుటకుద్యుక్తుం
డగుట సంభూయగమనంబనంబరగు... ... ... ౬

ప్రసంగ యానం.

శ్లో॥ అన్యత్ర ప్రస్థితస్సంగాదన్యత్రైవహిగచ్ఛతి।ప్రసం
గయానంతత్ప్రోక్తమత్రశల్యోనిదర్శనం॥.... ౭

ఒకనికిసహాయంబొనర్పుటకు వెడలియరుగుచుండమరియొ
కడుతనకొనర్చిన యుపకారాదులకై సక్తుండగుచునతనికి సహా
యంబొనర్చుట ప్రసంగయానంబనంబరగు - నిందుమహాభారత
రణంబునకు ద్యుక్తుండగు యుధిష్ఠిరునిచే బిలువబడియతనికిం సహా
యంబొనర్చుటకరుదెంచుచుండెడు శల్యునికి త్రోవలోనంగావ

లయు సౌవర్ణిగ్రిసన్నాహాదులొనర్చుచు గూఢచారులంపుచు దుర్యో
ధనుండతనియుపచారాదులచే వంచించితనవశంబు జేసికొనెన
నుట ప్రసిద్ధంబు.. ... ... ... .. ౭

ఉపేక్షాయానము.

శ్లో॥ రిపుంయాతిస్వబలినస్సంప్రాప్యారి కృతంబలం।
ఉపేక్ష్యతన్నిత్రయానముపేక్షాయానముచ్యతే।
ఉపేక్షాయానమాస్థాయనిజఘ్నానధనంజయః।నివా
తకవచాన్ జిత్వాహిరణ్యపురవాసినః॥... ౯

బలిష్ఠుండగువాడొకశత్రుని జయించుటకై యరిగి జయించి యరుదెంచుచుండ మరియొకనింగూడజయించుట యుపేక్షాయానంబనంబరగు - ఇందు ఇంద్రాజ్ఞచేనివాతకవచులం జంపుటకరిగినయర్జునుండు సముద్రతీరహిరణ్యపురనివాసులగుపౌలోమకాలకేయులజయించుట నిదర్శనంబగుట నారణ్యపర్వప్రసిద్ధము.

శ్లో॥ ఇతీమం షోడశవిధంనకుర్యాద్దేవ విగ్రహం। తదా
త్వాయతిసంశుద్ధమార్గభేదవిచక్షణః॥... ....౧౦

ఇట్లు౧౬యానభేదంబులు దెలిసి తత్కాలంబునను - ఆగామికాలంబునను పరిశుద్ధంబులును శుభదంబులునగు కార్యంబులం జేయందగుంగాని పూర్వసర్గోక్తంబులగు పదియారువిధంబులగు గర్హితవిగ్రహంబులం జేయందగదనుట... ... ౧౦

శ్లో॥ తదాత్వాయతిశుద్ధాని సర్వకార్యాణిచింతయేత్।
సాధులోకస్యయద్గ్రాహ్యం విద్వాన్కర్మసమాచ
రేత్॥ ... .. ... .. .. ౧౧

తత్కాలభావికాలంబులం బరిశుద్ధంబులును ఇహలోకపరలోకసాధకంబులునగు కార్యంబులంజేయదగుననుట..౧౧

శ్లో॥ పరలోకవిరుద్ధాని కుర్వాణందూరతస్త్యజేత్।
ఇత్యాగమప్రమాణజ్ఞో సాధుకల్యాణమాచ
రేత్॥ ... .. .. ... ... ౧౨

వేదశాస్త్రంబులు పరలోక సుఖాసుఖంబుల విషయంబు నం బ్రమాణంబులను ఆస్తిక జ్ఞానమునను సరించి కల్యాణంబులగు కృత్యంబులు నడుపుచుండుటయుంగాక నాస్తికులగుచు పరలోకవిరుద్ధకార్యంబులొనర్చు వారిం దూరంబునం దొలంగించుచు నుండవలెనని యనుశాసనము... ... ... ...౧౨

విగ్రహస్యాను కూలంకాలం.

శ్లో॥ యదామన్యేత మతిమాన్ హృష్టంపుష్టం స్వకం
బలం। పరస్యవిపరీతంచతదావిగ్రహమాచరేత్ ॥౧౩

మేధావియగు విజిగీషుండు దేశకాలంబున దానమానాదులచే తనబలంబులు సంతోషంబుగలదియు - వేతన దానాదులచే బలిసియుండు నదియునై యుండు నట్టిసమయంబునను - శత్రుబలంబులకీ రెండును తలక్రిందులై యుండు నెడను - అనగా శత్రుబలంబు నిజస్వామి విషయంబున కుపితంబును - కార్శ్యంబునుం బొందియుండు నట్టి సమయంబున దండయాత్ర జేయం దగునను... ... .. ... ... ... ౧౩

శ్లో॥ స్వీతంచనవ్యప్రకృతంయదాప్రకృతిమండలం। మి
త్రఆక్రందఆసారో యదాస్యుర్దృఢ భక్తయః।
నోపతాపియదాదైవంసువ్యక్తముపలక్షితం॥౧౪

ఎనిమిదవ యధ్యాయంబున వివరించిన క్రమంబున మిత్ర ఆక్రంద ఆసారులను ప్రకృతి మండలంబంతయు తనయందు దృఢంబగు భక్తిగలదియు శత్రునకు విపరీతంబును నగుచుతనకపకారంబొనర్పకుండునట్టిదియు పుంజీభవించియుండునదియు నగునట్టి సమయంబునను దైవప్రతికూలములేక తనకుం దైవానుకూలముగల యుపలక్షణ లక్షితంబును నగు నది జైత్ర కాలంబనుట... ... .. ... ... ౧౪

ఫలవిషయకథనము.

శ్లో॥ భూమిర్మిత్రంహిరణ్యంచ విగ్రహస్య ఫలం త్ర
యం । యదైతన్నియతంభావి తదా విగ్రహమా
చరేత్॥ ... ... ... .. ౧౫౫

జైత్రయాత్రకుంఫలంబులు రాజ్యమబ్బుటయు - సిద్ధులగు మి
త్రులు గలుగుటయు - ద్రవ్యంబబ్బుటయునను నీమూడును ముఖ్య
ఫలంబులు గావున నట్టి కాలంబెరింగి దండయాత్ర జేయ దగు
ననుట.. ... .. ... ... ౧౫౫

ఫలంబుల గురులాఘవంబులు.

శ్లో॥ గురువిత్తంతతోమిత్రం తస్మాద్భూమిగరీయసీ ।
భూమేర్హి భూతయస్సర్వాస్తాభ్యోబంధుసుహృ
జ్జనాః॥ .. ... ... ... ౧౬౫

లోకంబుననుండు నన్నివ్యవహారంబులు ద్రవ్య మూలంబు
లుగావునద్రవ్యంబు ప్రబలంబయినదియనియు - అట్టి ద్రవ్యము
గలిగియుయుద్ధాదులు ప్రస్తుతంబగు నెడమిత్రబలము లేక కార్యంబు
నిర్వహించంజాలదు గాన ద్రవ్యసంపదకన్న మిత్రసంపద యధి
కంబనియు - నీరెంటిసహాయంబులచేతయును సాధించంబడునది
యును - బంధుబలసుహృద్బ్రావ్యాదులంతయు నుత్పత్తియగుటకు
ముఖ్యకారణంబగునదియు నుంగాన భూమియయన్నిటి కన్న శ్రే
నత్యధికంబయినదియనియుం విచారించందగు... ... ౧౬౫

శ్లో॥ సర్వసంపత్సమేశత్రౌ వుపాయాన్నిక్షేపేద్బుధః।
ఆగతంవిగ్రహంకృత్వాఉపాయైశ్రప్రశమంనయేత్ ॥౧౭౫

సమానంబులగు ద్రవ్యబలమిత్రసంపదలుగల శత్రునితోడ
విగ్రహంబు దగకుంటయట్టి విగ్రహము తటస్థంబగు నెడ సామా
ద్యుపాయంబులవలన శమియింపం జేయవలయుననియు - నితరు
నిచేనట్టివి సంభవించునెడ పూర్వసర్గోక్తంబులగు నుపాయం
బులచే నుపశమంబొనర్చి యాత్మీయసప్తాంగంబులంగాచి కొ
నందగుననియు ననుశాసనము.. ... ... ౧౭౫

శ్లో॥ విజయస్యహ్యనిత్యత్వాద్రభసేననసంపతేత్ । స
మాక్రాంతో బలవతా కాంతున్నభ్రం శినీం శ్రి
యం॥ ... ... .. ..౧౮౪

ఒక్కొక్కసమయంబున బలవంతులగు వారలును దుర్బ
లులచే పరాజితులగుచుండ్రుగావున అర్జునునంతవానితోడం
శ్రీకృష్ణులుపదేశించునెడను (హతోవాప్రాప్స్యసేస్వర్గంజిత్వా
వాభోక్ష్యసే మహీం) అనిజయంబు సందేహాస్పదంబుగాబలు
కుటంజేసియును బలవంతునిచే నాక్రమింపంబడినయడలను తా
బలవంతుండగుచు దండయాత్రజేయునెడనునిజంబగు నైశ్వర్యం
బుగాపాడుకొనుటకైయాలోచింపక హఠాత్తుగా కలహింపం
దగదనుట.. .. ... .. ... ... ౧౮౪

దృష్టాంతరేణోదాహరణం.

శ్లో॥ ఆశ్రయేద్వైతసీంవృత్తిం నభౌజంగీం కదాచన।
క్రమాద్వైతసవృత్తిశ్శ్రీంభుజంగీవధచేవచ॥౧౯౪

నదీప్రవాహమధ్య జనితంగు ప్రబ్బలిచెట్టుప్రవాహాధిక కా
లంబున వంగియుండుటవలన నశించకుండు గావునను - కోపప
రవశంబగుపాము మృతినొందుంగావునను నీతివిదుండగు వాడు
వేతసవృత్తినాశ్రయించి యైశ్వర్యంబు క్రమంబున ననుభవిం
పం దగుగాని భుజంగవృత్తి ననుసరించి మరణంబొంద దగద
నుట... ... ... ... ... ... ౧౯౪

యాతవ్యలక్షణము.

శ్లో॥ మత్తం ప్రమత్తం స్థిత్వాచగ్రసేత్తోత్తమపండితః॥౨౦

మదించియుండెడు వానిని - విషయంబులయందు మిక్కి
లియు నాసక్తుండగువానినిం బండితుండగువాడు స్వాధీనంబొన
ర్పందగుననుట... ... . .. .. ... ౨౦

శ్లో॥ స్త్రీమోంధపానంమృగయాతథాయై దైవోపహ
తాశ్చబహుప్రకారాః । ఇతిప్రదిష్టం వ్యసనం హి
నోనయు కంపయాతుం ససుఖేన సాదః॥... ౨౧

కాంతలయం దత్త్యాసక్తుండగువాడు ౧ పానంబునం దత్త్యాసక్తుండగువాడు ౨ వేటలెల్లప్పు డొనరించువాడు ౩ జూదజబులం దాసక్తుండగువాడు ౪ కరువుచేతయు - మరణంబులచేతయు - అతివృష్ట్యాదులచేతయు మరియు నిదిమొదలగు ననేకవిధంబులగు దైవోపఘాతంబులు గలవాడును నగుశత్రుండును లభసాధ్యుండనుట.. ... ... .. ... ౨౧

ఇట్లుయానభేదంబులు దెలిపి నాలవయదియగునాసనప్రకారం బీసర్గయదం దెలుపంబడియెడు... ... .. ..

శ్లో॥ పరస్పరస్య సామర్థ్యవిఘాతాదాసనంస్మృతం।
అరేశ్చవిజిగీషోశ్చ తత్పంచవిధముచ్యతే॥...౨౨

పూర్వోక్తక్రమంబున దండయాత్రయొనర్చియుద్ధంబు జేయునెడశత్రునకును విజిగీషునకును నొండొరుల సామర్థ్యవైకల్యంబగునెడ నాశత్రునగరంబువిడవక యందరి కానాజేసికొని నిలుచుట ఆసనంబనంబరగుఅదియు ఐదుదెరంగులైయుండు...౨౨

విగృహ్యాసనము, సంధాయాసనము, సంభూయాసనము,ప్రసంగాసనము - ఉపేక్షాసనము - నను పంచవిధంబులగుచునీసర్గోక్తద్వితీయశ్లోకోక్తంబులయథాక్రమంబునం గనందగు.

అందు విగృహ్యాసనం బెట్లన.

అన్యోన్యాక్రాంతికరణంవిగృహ్యాసనముచ్యతే । అరిం
విగృహ్యావస్థానమపితత్పరికీర్తితం.. .. ౨౩

ఒండొరులకు యేమరుపాటుగలుగు నెడనాక్రమింపం దొరకొనుననిగసి పెట్టియుండుట యొక తెరంగును - శత్రునకుసాధనసామాగ్ర్యాదులనిరోధించి ముట్టడిజేసికొనియుండుట యొక తెరంగుననను విగృహ్యాసనంబు రెండువిధంబులైయుండు ... ౨౩

శ్లో॥ యదాదుర్గగతశ్శత్రుః గృహీతుం నైవశక్యతే।
విగృహ్యైనంతదాసీత ఛిత్వాస్యాసారవీవధౌ॥౨౪

మరియుకోటయందేనియు దుర్గంబునం దేనియు నుండెడు శత్రుండుస్వాధీనుండుగాకుండునట్టియెడనతనికింగల సహాయవైకల్యంబొనర్పుటకును దేశస్వాస్థ్యంబుగలుగకుండపంటలు మొ

దలగుదాని నిర్మూలంబొనర్చుచునుంగని పెట్టియుండుటయువిగ్ర
హ్యాసనంబునంగల తృతీయప్రకారంబని విచారింపందగు.. ౨౪

శ్లో॥ విచ్ఛిన్నవీవధాసారంప్రక్షీణయవసేంధనం।విభజ్యా
మానప్రకృతింకాలేనైవవశంనయేత్॥ .. ౨౫

జలంబులునుధనధాన్యాయుధంబులును క్షీణంబులగుచు త
జ్జన్యంబగుప్రకృతిజనుల విరోధంబునుంగలుగునంతకు నిరోధించి
యతనింగ్రైవశంబు జేయందగుననుట.. ... .. ౨౫

సంధాయాసనం.

శ్లో॥ అరేశ్చవిజిగీషోశ్చవిగ్రహేహీయమానయోః।సం
ధాయయదవస్థానంసంధాయాసనముచ్యతే॥ ౨౬

చిరయుద్ధంబులచే శత్రువిజిగీషులకిరువురకును సామగ్రీన్యూ
నంబగు నెడలమరల సామగ్రులు జేర్చికొనునంతకునిలుతమనియొం
డొరులంసంధానంబొనర్చికొని నిలుచుటసంధాయాసనంబనంబ
రగు.. .. ... ... ... .. ౨౬

శ్లో॥ నివాతకవచైస్సాకంరావణశ్శత్రుగావణః।బ్రంహ్మ
ణమంతరేకృత్వాసంధాయాసనమాస్థితః॥ ... ౨౭

నివాతకవచులతోడనేకసంవత్సరము యుద్ధంబొనర్చిబలక్ష
యంబందనిరావణాసురుండరిభయంకరుండయ్యు బ్రంహ్మదేవుని
మధ్యస్థంబొనర్చి సంధానంబాచరించియుండెననియుత్తర శ్రీరా
మాయణ ప్రసిద్ధము - ఇదిపూర్వోక్తంబగు సంధాయాసనంబు
నంకిచిద్భేదముగలదియనియోచించందగు... ... ౨౭

సంభూయాసనం.

శ్లో॥ ఉదాసీనేమధ్యమేచ సమానప్రతిశంకయా । ఎకీ
భూయవ్యవస్థానరిసంభూయాసనముచ్యతే॥ ౨౮

పూర్వోక్తలక్షణలక్షితులగు నుదాసీనమధ్యములను మండ
లనిష్టరాజులు అరివిజిగీషుల సమానబలంబులుగలవారలని యె
రింగి వారివారి తమతమయడననిలుచునట్లు సంధియొనరించిని
లుపుటసంభూయాసనంబు... ... ... ౨౮

శ్లో॥ ఉభయోరింహివాంఛంతంవినాశముభయోరపి।
సంభూయాస్యైనంప్రతివ్యూహేదధికంసంధిధర్మిణా॥...

అరివిజిగీషులనిరువురనుంజంపవలయుననునిచ్ఛగలబలాధికుండగు ఉభయశత్రునింగను నెడవరి విజిగీషులిరువురును నొండొరులంగలశి యతని నెదిరించుటకై యత్నించుటయు సంభూయాసనభేదంబనివిచారింపందగు.. ... ... ..

ప్రసంగాసనం.

శ్లో॥ ఇయాసోరన్యమన్యత్ర ప్రసంగేనహి కేనచిత్।
ఆసనంయత్తధర్మజ్ఞైఃప్రసంగాసనముచ్యతే॥ ౩౦

ఒకనిపైయరుగుచుండు విజిగీషుండుమధ్యకాలంబున నెద్దియొనియునొక హేతువుచే నొక్కెడవిడిశియుండుట ప్రసంగాసనంబగు... ... ... .. ... ౩౦

ఉపేక్షాసనం.

శ్లో॥ ఆస్తేప్రేక్ష్యారి మధికముపేక్షాసనముచ్యతే। ఉ
పేక్షాంకృతవానింద్రఃపారిజాతగ్రహంప్రతి॥ ౩౧

శత్రుండుతనకన్నబలవంతుండగుటయెరింగిచూచియుచూడనట్లుండుటయుపేక్షాసనంబనంబరగు-శ్రీభాగవతదశమస్కంధంబునపారిజాతాపహరణవిషయము-తొలుత నారదుండుపారిజాతపుష్పంబుగొనివచ్చి శ్రీకృష్ణులసమీపంబున రుక్మిణికొసంగుట సత్యభామయాకర్ణించిపారిజాతవృక్షంబుగొనివచ్చుటదక్కతనయొడకురాదగదనిబలుకుటచే శ్రీకృష్ణస్వామి దేవలోకంబునకుం జని వృక్షంబుగొనివచ్చు నెడవనపాలాదు లెదిరించినవారలనిగ్రహించిన వృత్తాంతంబువినియునునింద్రుండుపేక్షించియుండెననుటదలంపందగు... ... ... .. ... ౩౧

శ్లో॥ ఉపేక్షితస్యచాన్యేన కారణేనహి కేనచిత్। ఆస
నంరుక్మిణఇవతదుపేక్షాసనంస్మృతం॥...... ౩౨

ఎద్దియేనియు నొక హేతువుచే నుపేక్షించి యుండుటయున్న- ఉపేక్షాసనంభేదంబయ్యెండు - ఎట్లన - రుక్మిణీవివా

హా విషయంబుననయ్యామసోదరుండగు రుక్మియనువాడు స్వామి తోడంగలహించి యవమానంబు నొందికృష్ణునింజయించకకుం డిన పురంబుంజొర నెల్లననియయ్యావమానంబందిన యడనయుం డి రుద్రుసిం గూర్చితపంబొనర్చెనని శ్రీభాగవత దశమస్కంధ ప్రసిద్ధము... .. ... .. .. ... ౩౨

ఇట్లు పూర్వసర్గంబుల సంధియు। విగ్రహంబును వేర్వేరంబలికి యీసర్గంబున యానంబును ఆస నంబునుంబలికియు. సింద్వైధీభాగవంబను ఐనన తంత్రం బునుంబలుకంబడియెడు.. .. ...

శ్లో॥ బలినోద్విష తోర్మధ్యే వాచాత్మానం సమర్ప యన్। ద్వైధీభావేన వర్తేత కాకాక్షి వదలక్షి తః। ... .. .. ... .. ౩౩

బలిష్ఠులగు నిరువురు శత్రులుగలయెడ దుర్బలుండగు వాడు యిద్దరికిని నాధనరాజ్యంబులునీయవియ నేనునీభృత్యుండననినొం డొరులకుం దెలియకుండ మాటలచేతయ బలుకుచు వారలకిరు వురకునుయెడ యీకకాలమగు నంతకుమనంబునం గ్రోధంబు రక్షించి కొని ఒక దృష్టిగలకాకి రెండుకన్నులున్న ట్లభినయించు లీలనిజవృత్తాంతహృదయ ప్రవర్తనను నితరులకుందెలియనట్లువ ర్తించుటద్వైధీభావము... ... ... .. ... ౩౩

శ్లో॥ యాపయేద్యత్నమాస్థాయసన్నికృష్టతరంతయోః ఉభయోరపి సంపాతే సేవేత బలవత్తరం.. ౩౪

అట్టియుభయశత్రువులలోనం మిక్కిలియుసమీపించియుండు వానికి రాజ్యధనంబు లోసంగుమనను నాసలంగలిగించుచుకా లహరణంబు జేయుచుం నిరువురిసినమ్మకయుండదగునిట్లుండు నెడ నిద్దరును నొకకాలంబునన ఆసన్నులయి రేని యయ్యెడతన్నుం గాచికొనుటకు వారిరువురిలోనం మిక్కిలియుంబలవంతుండగువా నినాశ్రయింపందగు.. ... ... .. ... .. ౩

శ్లో॥ యదాద్వావపి నేచ్ఛేతాం సంశ్లేషం జ్ఞాతసంవిదౌ।
తదోపసర్పేత్తచ్ఛత్రుం సంశ్రయేద్బలవత్తరం॥ ౩౫

వారిరువురును నితని యభిప్రాయం బెరింగి వీడు వాఙ్మాత్రంబునం గాలయాపనంబొనర్చువాఁడు గాని శుద్ధాంతఃకరణుండు గాఁడనియు మోసకాఁడనియుం దెలిసి నితనితోడం సంధి జేయుటకును నితని పలుకులు వినుటకును నిచ్చగించకుండుదు రట్టియెడ యాయిద్దరికి నిశత్రుండగు నొకబలవంతుని యాశ్రయింపందగునను... ౩౫

శ్లో॥ ద్వైధీభావో ద్విధా ప్రోక్తస్స్వతంత్రపరతంత్రయోః। స్వతంత్ర ఉక్తోఽన్యస్త్వన్యో యస్స్యాదుభయవేతనః॥.. ... .. ......౩౬

ద్వైధీభావము స్వతంత్రంబనియు పరతంత్రంబనియు, రెండు దెరంగులగుచుండునందు పూర్వోక్త క్రమంబు స్వతంత్ర ద్వైధీభావము- రెండవయదియగు పరతంత్ర ద్వైధీభావం బెట్లనయిద్దరు దొంగలయెడ కొలువు గొలిచెదనని యొప్పుకొని యొకనియెడ తన సంసారం బంతయునునిచి అన్యునియెడ నమ్మకముతక్కువయగుట- వేతన సాధనంబునకుం దగు నుపాయంబున కాలము ద్రోయుచుండుట పరతంత్ర ద్వైధీభావము ... ... ౩౬

ఆరవదియగు సమాశ్రయము.

శ్లో॥ ఉచ్ఛిద్యమానో బలినానిరుపాయప్రతిక్రియః। కులోద్గతం సత్యమార్యమాశ్రయేత బలోత్కటం॥ ౩౭

పూర్వోక్తంబులగు - సామదానభేదతంత్రంబులచేతయు ద్వైధీభావతంత్రముచేతయు స్వాధీనంబు నొందక బలిష్ఠుండగు శత్రునిచే నిర్మూలించుటకారంభించునవసరంబున ప్రతిక్రియ జేయుట కశక్తుండగువాఁడు కులీనుండును - సత్యప్రతిజ్ఞుండును ఆర్యస్వభావుండును నధికబలశాలియునగు నతని ప్రాణత్రాణంబునకై యాశ్రయించందగు... .. ... .. ౩౭

శ్లో॥ తద్దర్శనోపాస్తికతా నిత్యం తద్భావభావితా। తత్కార్యతా ప్రాపితా చ గుణాస్సంశ్రయిణస్స్మృతాః॥ ౩౮

తా నాశ్రయించువానింజూచినంత సాష్టాంగనమస్కార పూర్వకంబునఁ దనిం గృతజ్ఞతచే గొనియాడుటయు నెల్లప్పుడు నతని భావంబునం దలంచుటయు నతనికార్యంబులభక్తిచే నొనర్చుటయు మొదలగుననువర్తనంబులచే.. .... ...

శ్లో॥ యస్యయస్యహియోభావ స్తేనచైవహితంనరః।
అంతః ప్రవిశ్య మేధావీక్షిప్రమాత్మవశంనయేత్॥

అనుక్రమంబుననతనిననుసరించి నిజకార్యముసాధించికొనుట నాశ్రయించువానికిలక్షణము.. .. .. ... ౩౮

శ్లో॥ వినీతవ త్తత్రకాలం గమయిత్వాగురావివ। తస్యం గాత్సరిపూర్ణస్సక్రమేణస్వవశోభవేత్॥౩౯

గురుజనులవాసంబొనర్చునట్లు అతిభయభక్తులతోడ వినీతుం డగుచు నతనియాశ్రయముచే తనసంగల బలాదుల వృద్ధియగునట్లాచరించి క్రమంబుననతనికి విరోధంబుగాని యట్లుస్వాధీనుండుఅనగా స్వతంత్రమువహింప దగుననుట .. .. ...౩౯

శ్లో॥ దదస్యలంవాకోశం వాభూమింవాభూమి సంభవం। ఆశ్రమేతా భియోక్తారం విసంధిరనపాశ్రయః॥ ... .. .. .. ... ౪౦

పూర్వోక్తలక్షణ లక్షితుండగు నాశ్రయింపందగు గుణంబులుగలరాజుసంభవింపనియెడ శత్రునికితనబలంబున కొంతయైనను - ధనంబునకొంతయైనను - రాజ్యంబునంగొంతయైనను నిదిమొదలగు దానినంతయునైనయుపాయనంబొనర్చివిజిగీషు నినాశ్రయింపందగుననుట... ... ... ... .. ౪౦

శ్లో॥ సర్వాణిచైవతాన్యాతః దద్యాత్త్రాణార్థమాత్మనః। యుధిష్ఠిర ఇవేత్యాదీ పునర్జీవన్వసుంధరాం॥ ... ... ... ...౪౧

పూర్వోక్తంబగుకోశ బలరాజ్యాదులయందే కదేశంబునవిజిగీషుండు దృష్టినొందడేని తన ప్రాణము గాపాడుకొనుటకై

రాజ్యదండ కోశాదులంతయు నొసంగి (ఆత్మార్థే సకలంత్యజేత్) అనే న్యాయంబున ప్రాణంబుల తత్కాలంబున రక్షించికొని పిదపయుధిష్ఠిరునింబలె కాలం బరుదెంచినయెడశత్రునిసాధించందగుననుట... ... ... .. .. ...౪౧

శ్లో॥ కల్యాణీబతగాథేయంకాకికిప్రతిభాసతే। ఏతిజీవం
తమానందోనరంవర్షశతాదపి॥.. ... ౪౨

పూర్వోక్తక్రమంబుననన్నియునొసంగియైననుతన దేహము గాపాడుకొనియుండెనేని నూరేండ్లకుపిదపనైనను మనుజుండానందంబనుభవించకపోవనేరడుగావుననీమంగళకరంబగు సూక్తిననుసరించి ప్రాణంబులరక్షించికొనదగుననుట .. ... ౪౨

శ్లో॥ త్యజేత్కులార్థే పురుషం గ్రామస్యార్థేకులం
త్యజేత్ । గ్రామంజనపదస్యార్థే విచార్యపృథి
వీంత్యజేత్ ॥ ఆత్మార్థేపృథివీంత్యజేదితివాపా
ఠాంతరం॥... .. .. ... ౪౩

ఒకపురుషుని దౌర్జన్యతచేకులంబునకంతయు హానిగలుగు నెడనట్టి యొకనివిడువందగుననియు- ఒకయింటివారి దుర్మార్గ నడతచేగ్రామంబంతయుంజెడునవసరంబుననట్టి యిల్లంతయువధ నిగ్రహాదులచే నశింపంజేయందగుననియు - ఒక గ్రామము తిరగ బాటుచే రాజ్యమునకు కలహోపప్లవంబులుగలుగు నెడనాగ్రామంబునంతయు నశియింపంజేయందగుననియు - రాజునకు దేహ నాశాదులు తటస్థించునెడ మరలమరలవిమర్శించిరాజ్యకోశాదులంతయు విడువందగుననియు నన్నివిధంబులందన ప్రాణంబుర క్షించికొనియవసరంబగునెడ నభ్యుదయము జెందందగుననియను శాసనము.... ... .. ... ... ౪౩

శ్లో॥ నిష్పాతాద్వ్యాత్మలాభే వావ్యసనే వారి పోశ్శ్రి
తః। ప్రహరేద్వాబలీయస్యాః సైంహీంవృత్తిము
పాశ్శ్రితః॥ ... .. .. ... .. ౪౪

పూర్వోక్తంబులగు లక్షణంబులననుసరించి యొద్దియేనియు నొకయిరుకుకలిగిన యెడనైనను - తనకు లాభకరంబగు దేశ

కాలంబునుబ్బినయెడ నైనను - శత్రునకు దుఃఖంబులును సప్తాంగ వ్యసనంబులుంబట్టస్థించిన కాలంబునైనను బలిష్ఠంబగు నిష్పావృత్తిననుసరించి శత్రుని మొదలంటం జెరుపందగుననుట... ౪౪

శ్లో॥ నాకారణాత్సంగమియాజ్జ్యాయసా వేతరేణ వా
క్షయవ్యయకృతాద్దోషాద్విస్రంభా ద్ద్రోహజా
దపి॥ ... ... ... ... ... ౪౫

తనకన్న నధికునితోడ నైనను - సమానునితోడ నైనను - నికృష్టునితోడ నైనను - క్షయము చేతయు వ్యయము చేతయు - స్వతంత్రాన చేతయు ద్రోహము చేతయు నగు నానావిధ కారణంబులందొకటి సంభవించని యెడ నిష్కారణంబుగ సంధి యొనర్చుటయు ప్రశస్తంబనుట. ... ... ... ... ... ... ౪౫

శ్లో॥ సంయోగహేతు మజ్ఞాత్వా నవిశ్వాసేత్పితర్యపి।
విశ్వాసమాగతం సంతం ప్రాయోద్రుహ్యంత్యసా
ధవః॥ ... ... ... ... ౪౬

లోకంబున దుష్టులగు జనులు విశ్వసించియుండెడు సత్పురుషునికిం ద్రోహంబొనర్తురుగాన నట్టి విశ్వాసంబునకుం హేతువెట్టిదని విస్పష్టంబుగ నెఱుంగకయు విమర్శింపకయు తండ్రియం డైనను స్వతంత్రముగ విశ్వాసము జెంది యేమరియుండం దగదనుట... ... ... ... ... ... ... ౪౬

శ్లో॥ ఇతిషాడ్గుణ్యసిద్ధాంతం ద్వైగుణ్యమితిచక్షతే। యా
నాసనే విగ్రహస్యరూపం సంధేః పరంస్మృతం॥ ౪౭

ఇట్లు షడ్గుణంబుల భేదంబులు వేర్వేరం బలుకంబడియుండు నూషాడ్గుణ్యంబులు విగ్రహంబనియు - సంధియనియుండగు రెండుతంత్రంబులు ప్రధానంబులనుట - దండయాత్రయు - ఆసనంబును విగ్రహరూపంబనియు - తక్కినవియన్నియు సంధిభేదంబులనియు నుపసంహరింపంబడియె ... ... ... ౪౭

శ్లో॥ సంధింగచ్ఛతిగచ్ఛేచ్చ విగ్రహంకురుతేయతః। య
తోయానాసనే ప్రాజ్ఞైర్విగ్రహాః పరికీర్తితః॥ ౪౮

యానాసనంబులవలన విగ్రహముగల్పించుటచేతయు ద్వైధీభావసమాశ్రయాదులంతయు సంధిభేదంబు లేయగుటయు నీతిశాస్త్రవేత్తలచే సంధియు విగ్రహంబులను రెండుతంత్రంబులే ప్రసిద్ధంబులనంబడియె... ... .. .. ... ... ౪౮

శ్లో॥ అసంధాయయతోనాస్తి ద్వైధీభావస్సంశ్రయః।త
తోద్వావపితౌప్రాజ్ఞైః రూపం సంధేరుదాహృతం॥ ౪౯

ద్వైధీభావంబునుసమాశ్రయంబును సంధిలేక గలుగ నేరకుండుటంజేసిఆ రెండును సంధిభేదంబులని నీతివిమలచే నిష్కర్షింపంబడియె... ... ... ... .. ౪౯

శ్లో॥ సంధాయేతిహియత్ప్రోక్తం తత్సంధేః రూపమిష్య
తే।విగ్రహేతిచయత్ప్రోక్తం విగ్రహస్యతముచ్యతే॥ ౫౦

సంధియునునదియంతయుసంధిభేదంబులనియు· విరోధించుటయంతయువిగ్రహభేదంబులనియు దెలుపంబడియెననుట... ౫౦

శ్లో॥ ఏతౌచసంశ్రయశ్చైవ త్రైగుణ్యమితిచాపరే। సం
ధిశ్చవిగ్రహశ్చైవ ద్వైగుణ్యమితివదుతే॥ ౫౧

సంధియు- విగ్రహంబునునను రెండుతంత్రంబులె ప్రధానంబులనికొందరు నీతివిమలమతంబులును - సంధియువిగ్రహంబును సమాశ్రయంబునను మూడుతంత్రంబులనియు భేదమువిచారించుదురు.... ... ... ... .. ౫౧

శ్లో॥ యస్మాదన్యంసంశ్రయేద్వా బాధ్యమానోబలీయ
సా ।తత్సంధస్సంశ్రయోహ్యన్య ఇత్యువాచబృ
హస్పతిః॥ .. ... ... ౫౨

బలవంతునిచె బాధ్యమానుండగుచు నతని నేనియు-అన్యుని నేనియు సంధిపూర్వకంబుగ నాశ్రయించుటవలన నిది సంశ్రయనియు- సమాశ్రయంబు చేసనియు సురాచార్యమతమనుట ౫౨

సర్గోపసంహారము.

శ్లో॥ జ్యాయోభ్యాగుణోపిగ్రహాఎవముక్తస్సంధోపయస్త
త్ప్రభవాస్తతోన్యే । అవస్థయాభేద ముపాగత

స్వ షాడ్గుణ్యమిత్యేవసురోర్మతంనః॥ .. ౨౩

స్వకీయాచార్యుఁడగు కౌటిల్యమతంబగు సిద్ధాంతంబెట్లనము ఖ్యంబుగ నన్యోన్యవిగ్రహంబు ననుసరించియ - సంధియు - యానంబును - నాసనంబును - ద్వైధీభావంబును సమాశ్రయంబును నను నైదువిషయంబులగు ప్రయోగంబులకును నవకాశంబు గలుగుటవలన విగ్రహంబొక్కటియ ప్రధానంబని స్వకీయాచార్యాభిప్రాయం బనుట. ... ... ... ... .. ౨౩



ఇట్లు కామందకము పన్నెండవ సర్గము.

ద్వాదశమసర్గప్రారంభము.



శ్లో॥ షాడ్గుణ్య నిశ్చితమతిస్స్యాద్గూఢప్రచారవాన్।
మంత్రయేదిహమంత్రజ్ఞో మంత్రజ్ఞైస్సహమంత్రిభిః॥౧

పూర్వసర్గోక్తంబులగు షడ్గుణంబుల ప్రయోగంబు లెరింగి రహస్యంబుల నెరుఁగు దూతలవలన నిసికిగలవాఁడగుచు ఆలోచనానిపుణులగు మంత్రులతోడ తాను నుక్కృత్యాకృత్యవివేకముగలవాఁడగుచు యిచ్చటనుండు నాచే నేమికార్యంబులు సాధింపంబడు మర్గంబులును - ౧పంటనేలలును - ౨ కృషికర్మంబులును - ౩ వర్తకంబులును రక్షాన్యగృహాదులంగల ఖనులును - ౫ యేనుగలయడవులును - ౬ తనకు సంభవించుటకును శత్రునకు సస్థివిలభించకుండుటకునుండగు నుపాయంబులును తనకృత్యంబుల సాధించుటయు శత్రుకృత్యంబుల విఘాతంబొనర్చుటయును విషయంబులతి రహస్యంబులుగ నాలోచించవలెనను ట.. ... ... ... ... ...౧

శ్లో॥ మంత్రార్థకుశలో రాజా సుఖం భూతిం సమశ్నుతే। విపరీతస్తు విద్విడ్భిః స్వతంత్రో వ్యవధూయతే॥ ... ... .. ...౨

పూర్వోక్తంబగు మంత్రకుశలుండగు రాజు శత్రువులనుల

భంబుగనాక్రమించి చిరకాలము సుఖైశ్వర్యంబులనుభవించున
నియు - నట్లుమంత్రబలములేని రాజుస్వతంత్రుండయ్యును పండితు
లచే నవమానమునొంది రాజ్యసుఖంబులక్షిప్రకాలంబునన బో
గొట్టుకొనుననియుఫల వాదము.. .. .... ౨

శ్లో॥ దుర్మంత్రమేనంరిపవ్రోయాంతి థానా ఇవక్రతుం।
సమంతతోవిలుంపంతి తస్మాన్మంత్రపరోభవేత్॥ 3

అలోచించు నెడలను - క్రమంబుదప్పినయదుర్మంత్రంబులం
బ్రయోగించినయాగకృత్యంబుల రాక్షసులాక్రమించునట్లు శత్రు
వులాక్రమింతురుగావుననట్లుగాకుండ దేశకాలకార్యంబు లెరింగి
నీతిమార్గమునతిక్రమించకమంత్రంబు ప్రయోగింపందగుననుట 3

శ్లో॥ మంత్రయేతేహకార్యాణి సహాప్తైన విపశ్చితా।
అప్తంమూర్ఖమనా ప్తంచవర్జయేన్మంత్రనిశ్చయే॥ ౪

రాజకార్యంబులు ప్రయోగము జేయుటను కుశలుండును
పండితుండును ఆప్తుండుననగువానితోడ నాలోచింపందగుంగాని
మూర్ఖుండగు ఆప్తునితోడనేనియు - పండితుండగు నాప్తుడుగాం
ని వానితోడనేనియునాలోచింపందగనుగాన నట్టివారల విడువం
దగుననుట ... ... ... .. .. ౪

శ్లో॥ మార్గంసన్మార్గగతిభిఃపూర్వైస్సంసిద్ధకర్మభిః। స్వ
హైరాచరితంసద్భిశ్శాస్త్రీయంనపరిత్యజేత్॥...౫

శాస్త్రవిధిచోదితంబును - సత్కర్మానుష్టానులగుచు సత్కా
ర్యంబుల సాధించి యుండెడు సన్మార్గప్రవర్తనులగు పూర్వరా
జులచే నాచరింపంబడిన మార్గంబు విడ్వలందగదని యనుశాస
నము... ... ... .. ... .. .. ... ౫

శ్లో॥ ఉచ్చాస్త్రపదవిన్యాస స్సహాసై వాభిసంపతన్।
శత్రుష్విద్ధముపన్యాసమాగత్యావనివర్తతే॥
శాస్త్రమార్గము నుల్లంఘించి యతిత్వరితవృత్తియగుచుం

బ్రవర్తించెనేని శత్రువిషయంబులం జెందకయదిరుగుననుట. శత్రు ననుస్వాధీనమ్మునందక తిరుగంజాలడనియునభిప్రాయాంతరము ౬

శ్లో॥ ప్రాభవోత్సాహశక్తిభ్యాం మంత్రశక్తిః ప్రశస్య
తే। ప్రాభవోత్సాహవాన్ కావ్యో జితో దేవపు
రోధసా॥ .. .. .. .. ..౭

కోశబలంబును దండబలంబును గలయది ప్రభుశక్తియు - శౌర్యంబును - అమర్షణంబును - దక్షత్వంబునుంగల యదియుత్సాహశక్తియునయ్యీ నీరెండునుమంత్రశక్తికన్న తక్కువయగుచుండు ననుట.. ... ... .. .. ... ... ...

ఇందులకుం దృష్టాంతరంబు పూర్వోదాహృతంబులగు ప్రభూత్సాహశక్తులుగలిగి తనమృతసంజీవనీ మంత్రబలంబునం దేవతలచేతం జచ్చు రాక్షసుల మరల బ్రతుకంజేయు శక్తియుంగల శుక్రాచార్యుండు మంత్రకుశలుండగు దేవతాచార్యునిచే ప్రయుక్తుండగు కచునికి నమ్మంత్రం బుపదేశించుటవలన వంచితుండగుచు - దేవాసురసంగ్రామంబున రాక్షసులుపరాజితులగునెడ నేమియు జేయంజాలక పరాజితుండయ్యెనని భారతకథానుసంధానమువలన దెలియంబడుట ప్రభుత్వోత్సాహంబులకన్న మంత్రశక్తి యధికంబనుట... ... ... .. ౭

శ్లో॥ పశ్యద్భిర్మార్గతోపాయానుపాయప్రతిపత్తిభిః।
భవంతీహ ఫలాఢ్యైవ విపశ్చిచ్చింతితాః క్రియాః॥౮

శుభకరంబులగు సామాద్యుపాయ సామగ్రులచే దూరంబుననుండి యాలోచించియు బుద్ధిమంతులచే నిశ్చితంబులగుక్రియలు వారలమనోనిశ్చయానుగుణంబులగుచు ఫలియించుచుండు ననుట... . ... ... ... ... .. ౮

శ్లో॥ ఉపాయపూర్వం లిప్సేత కాలంవీక్ష్యసముత్ప
తేత్। పశ్చాత్తాపాయ భవతి విక్రమైకరసజ్ఞతా॥౯

సామాద్యుపాయంబుల క్రమంబున నుపయోగింపం జేయుచు దేశకాలంబులెరింగి దండయాత్రోద్యుక్తుండుగాదగుంగాని

కేవలంబగు పరాక్రమముజూపించు నెడపశ్చాత్తాపము జెందుటక వకాశంబొసంగుగావుననాలోచించుటయవశ్యకర్తవ్యంబనుట.

శ్లో॥ శక్యాశక్యపరిచ్ఛేదంకుర్యాద్బుద్ధ్యాప్రసన్నయా। కే
వలందంతభంగాయకరిణాం గ్రావతాడనం॥ ౧౦.

పూర్వోక్తంబగు కేవల పరాక్రమం బొనర్చుట రాళ్లగొమ్ములచేబొడిచిన యేనుగకు రాళ్లంబగల్చుచికీర్షితముసఫలము కాకుండుటయెగాక తనకొమ్ములు బగులుటకుం కారణంబగునట్లు తొలుత సాధ్యాసాధ్య విభాగంబొనర్పక పరాక్రమించుట సఫలంబందకుండుటయెగాక పూర్వస్థితికిని హానికరంబగుననుట. ౧౦

శ్లో॥ యత్తుసమ్యగుపక్రాంతం కార్యమేతివిపర్యయం
పుమాంసంనైవదోషాయదైవాంతరితపౌరుషం॥ ౧౧

విధిప్రకారంబున ననుష్ఠింపంబడి నదియయ్యుదైవానుకూలము లేకుండుటచే వైకల్యంబైనను పురుషకారంబున లోపంబు లేకునికి దోషకరంబుగా నేరదనుట.. ... ... ౧౧

శ్లో॥ ప్రయత్నస్తావదారబ్ధఫలాయామలబుద్ధినా। అప
ర్వణ్యేవవైఫల్యం శేషందైవంసమాశ్రితం ॥ ౧౩

స్వచ్ఛబుద్ధిగలవానిచే నారంభింపంబడు కార్యంబుల ఫలాఫలంబులుదైవంబు నాశ్రయించిన దగుటం జేసి ప్రతికూలంబగుదైవముగలయెడ నిష్కారణంబుగ విఫలతయు - అనుకూలకాలంబు గలయెడ నిష్టానుగుణఫలప్రదతయు గలుగుచుండునట్లైనను మంత్రంబుయుక్తంబుగ నొనర్పఁదగుననుట... .. ... ౧౨

శ్లో॥ఆత్మానంచపరంచైవవీక్ష్యధీరస్సముత్పతేత్।ఏతదే
వహివిజ్ఞానంయదాత్మపరవేదనం... ... ౧౩

ధీరుండును మేధావియునగువాడు దైవతాధీనంబగుదానిం దెలియుటకశక్తుండైనను దేశకాలమంత్రబలంబులచేస్వకీయదేశకాలబలంబులును అన్యునికింగల దేశకాల బలదౌర్బల్యంబులును దెలిసియనుకూల కాలంబున దండయాత్రవెడలుటయుస్రతి

మూలకాలంబున మానుటయునను నదియుమంత్రంబునం గలము
ఖ్య ప్రయోజనంబనుట.. ... .. .. .. ౧౩

శ్లో॥ నిష్ఫలం క్లేశబహుళం సందిగ్ధఫలమేవచ నకర్మ
కుర్యాన్మతిమాన్ మహావైరానుబంధిచ ౧౪

ఫలములేనియట్టియు - అధిక దుఃఖముచే సాధించియుస్వల్ప ప్రయోజనంబగునట్టియు - సంశయఫలంబగునట్టియు - అధిక వైరముతోడసంబంధించినయట్టియు - కార్యంబుల బుద్ధిశాలియగున తండారంభింపందగదనుట ..... ... ... .. ౧౪

శ్లో॥ తదాత్వాయతి యచ్ఛుద్ధం రక్షణాదితథాగతం।
క్షత్రియస్యోభయహితం సద్భిఃకర్మప్రశస్యతే॥౧౫

తత్కాలంబునకును ఆగమన కాలంబునకునుమంగళకరంబునుపరిశుద్ధంబును రక్షణాది క్రమంబుల ననువర్తించునదియును - ఉభయలోక హితకరంబునునగు కర్మంబులొనర్పుట నీతిశాస్త్రాచార్యులచే ప్రశంసితంబులగుననుట .. ... ... ౧౫

శ్లో॥ హితానుబంధియత్కార్యంగ ఛద్యేననవాచ్య
తాం।తస్మిన్క మణీసజ్యేతతదాత్వేకటుకేపిహి॥౧౬

తత్కాలంబున కటుకంబయ్యు భావికాలంబున హితకరంబును నొరులచేనాక్షేపింపంబడనిదియు నగునేనియట్టికార్యంబుల ... .. .. ... ... .. ....

శ్లో॥ యత్తదగ్రేవిషమివ పరిణామేమృతోపమం। తత్సు
ఖంసాత్వికంప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజం॥... ...

అనుభగవద్వాక్యంబు ననుసరించియుపక్రమింపందగుననుట.౧౬

శ్లో॥ బుద్ధ్యైవోపక్రమశ్శ్రేయాన్ ఫలనిష్పత్తయేసదా।
క్వచిత్ప్రశస్యతే సింహావృత్తినాఫలదర్శనం॥ ౧౭

సింహావృత్తినాశ్రయించిన సాహసముచే ఫలంబబ్బుటకదాచిత్కంబగుంగాని సార్వత్రికంబుగాకుండుట ఫలప్రాప్తికొరకు యత్నంబొనర్చునెడ యుక్తంబులును శత్రుపక్షస్వపక్ష బలాబ

లంబులును తొలుత మంత్రబలంబునంగని యవ్వాల నారంభించు టయే శ్రేయస్కరంబగుంగాని కేవల సాహాస ముఫలకారిగా నేరదనుట... .. ... ... ... ...౧౬

శ్లో ॥ సహసాదుష్కరంకర్తుం నశక్యం సంపదార్జనం।
ఉపాయె నోపదేశేనమత్తందంతింవశంనయేత్ ॥౧౭

హఠాతుగసాహాసము చేనైశ్వర్యంబార్జించుటమదమేనుంగుపై సాహాసంబున నెక్కుటకుద్యమించునట్లగుటం చేసియట్లొనర్పక క్రమంబున నేనుంగులస్వాధీనంబొనర్చునట్లుమంత్రబలముచే తగునట్టికార్యంబులాచరించందగుననుట... ... ... ౧౭

శ్లో॥ అశక్యారంభవృత్తీనాం కుతః క్లేశాత్కృతేఫలం
ఆకాశమాస్వాదయతః కుతోవాస్యాత్కచగ్రహః॥౧౮

ఆకాశముముద్దుబెట్టుదునను తలంపుగలవాని నయ్యాకాశమునకు రూపములేకునికి దానిశిరంబందకుండునట్లు అశక్యంబులగుకార్యంబుల నారంభించువాడలుగష్టంబులందియు నేమియుసాధించజాలరనుట .. ... ... ... ... .. ౧౮

శ్లో ॥ నాగ్నింపతంగవద్గచ్ఛేత్ స్పృశ్యమేవహిసంస్పృశేత్ ।కిమన్యస్సొన్యదృతె దాహాత్ పతంగస్య నిమృచ్ఛతః ॥ .. ... ..౨౦

నిప్పులపైనింబడనరుగుమిడతకు అందుంబడికాలుట దక్కమిగతయేమియుం బ్రయోజనంబుగలుగంజాలదుగావుననట్టి భ్రమాత్మకంబగుసాహాసంబొనర్పకతాకందగు వస్తువిశేషంబులందాకునట్లు తనశక్తికిందగిన బలాబలంబుల నాలోచించి నిగ్రహింపందగుననుట.. ... .. ... ... ౨౦

శ్లో ॥ మోహాత్ప్రకుర్వతః శ్చేష్టాందుఃఖలభ్యేషువస్తుషు।
భవంతిపరితాపిన్యో వ్యక్తంకర్మవిపత్తయః॥౨౧

మోహముచేమంత్రవివేకములేక దుఃఖలభ్యంబులగు వస్తువులందుఆశజెందుచుతదను గుణంబులగుచేష్టల నారంభించు నతనికి

యాదుష్కర్మవిపాకంబులువశ్చాత్తాపహేతుకంబులగుచు దుః
ఖరూపంబులుగపరిణమించుననుట... ... ... ..౨౧

శ్లో॥ బుద్ధ్యాబోధానుమతయాపరీయాత్సంపదఃపదం।
శుద్ధింశుద్ధపదన్యాసఃపర్వతాగ్రమివోన్నతం॥ ౨౨

తెలియుటననుసరించియుండెడు తెలివిచేమంత్రవేత్తలతో
డ నాలోచించి శుద్ధంబగు నడతగలవాడగుచు పర్వతకూటము
పైకెక్కుక్రమపాదవిన్యాసముగలవానియట్లుసంపదలకునికిస్థా
నంబునకుఁజేరందగుననుట.. ... .. ౨౨

శ్లో॥ దురారోహంపదంరాజ్ఞాం సర్వలోక నమస్కృ
తం। స్వల్పేనాప్యపచారేణబ్రహ్మణ్యమివదుష్యతి॥౨౩

భూమికినింద్రుండనంబరగురాజస్థానంబులభించుటచే సర్వ
లోకనమస్కృతులకర్హుండగుటవలనను- అట్టిస్థానంబునం స్వ
ల్పదోషంబుగలిగినను- లోకపూజ్యంబగు భూదేవత్వం బనగా
బ్రాహ్మణజాతికింగలప్రభావవిశేషంబు స్వల్పంబగు సంధ్యావం
దనకాలాతిక్రమణమాత్రముచేతయు - దుష్టంబగునట్లు ఇదియు
దూషింపంబడుంగావునమంత్రధారణాదులగుక్రియా విశేషంబు
లచేనట్లుగాకుండరక్షించికొనందగుననుట. ... ... ౨౩

శ్లో॥ ఆరబ్ధానియథాశాస్త్రంకార్యాణ్యపివిచింతయేత్।
వనానీవమనోహారిప్రయచ్ఛంత్యచిరాత్ఫలం॥౨౪

నీతిశాస్త్రక్రమంబునప్రవర్తింపంబడుచుండెడుకార్యంబులు
యథాక్రమంబునరాజ్యంబుల సాధించుటయు - ప్రజా రక్షణయు
మొదలగు కృత్యంబులుసునీతంబులగుచుంబ్రవర్తిల్లెనేని మనో
హరంబులగువనంబులుత్వరిత కాలంబున ఫలియించునట్లు సకలై
హికఆముష్మికసుఖంబులొసంగునన్నుట.... ... ... ౨౪

శ్లో॥ సమ్యగారభ్యమాణంహి కర్మయద్యపినిష్ఫలం।
నతత్తథాతాపయతి యథాసాహసమీక్షితం॥ ౨౫

విధిప్రయోగాను గుణంబులగు మంత్రముచేనిష్పన్నంబుల
గు కార్యంబులారజంబులగుచు నొకకాలంబున దైవానుకూల్య

ములేకునికిని నిష్ఫలంబులైనను. సాహసంబున నొనరించిన కార్యవై కల్యంబులచే గలము ఖిలలోకాప వాదంబులు మనంబుం బాధించునట్లు బాధింపంజాలవనుట.. .. ... ... ౨౫

శ్లో॥ నకించిత్క్వచిదస్తీహావస్త్వసాధ్యం విపశ్చితాం।
అయో భేద్యముపాయేన ద్రవతాముపనీయతే॥౨౬॥

మంత్రకౌశలంబునం గల యుపాయంబులచే నుక్కు బంగరు మొదలగు కఠినద్రవ్యంబులు మూసలం కరగించి నీళ్లుగ నొనర్చునుపాయంబులు మనుష్యుని బుద్ధికింగలిగి యుండ, బుద్ధికుశలులును నీతిశాస్త్రపారంగతులును నగువారల కెద్దియును నెవ్వేడను నెక్కాలంబునను నసాధ్యంబుగలుగంజాలదనుట.. ౨౬

శ్లో॥ బాధ్యమానమయః ఖండం నచాణు నుపిక్ర్యంతతి।
తదల్పమపిధారావత్ భవేదీప్సితసిద్ధయే.. ౨౭

సంస్కారంబొనర్పక మొద్దుగనుండెడు నుక్కుతునియచే బలుమారు గొట్టినను నొకగడ్డి పోచనేనియు గోయజాలకుండుటయు నట్టి తునియ సంస్కరింపంబడియెనేని పర్వతాదులగు కఠినవస్తుజాతంబుల నెల్లయున శ్రమంబునం బురుషుని యిష్టానుగుణంబుగ ఖండించుటయె దృష్టాంతరంబులగు చుండమంత్రకుశలునిచే నెద్దిసాంధింపంబడకుండుననుట... ... ౨౭

శ్లో॥ నియామముపశమాకారం వారివహ్నేర్నయాత్మకం।
ఉపాయోపగృహీతేన తత్తుశేనోపశోష్యతి॥౨౮

నిప్పును స్వభావసిద్ధంబుగ నణచుచుండెడు జలంబు లోకపాత్రయందుంచి కాచుటచే శోషించునట్లు ఉపాయంబున సహజశత్రుండును స్వాధీనుండగుననుట.. ... ... ౨౮

శ్లో॥ విషం సవిషమాహారకబళం మారణాత్మకం। తదేవద్రవ్యసంయోగాదౌషధాయ ప్రకల్ప్యతే॥... ...౨౯

విషంబును విషముతో గూడిన భక్ష్యకబళంబును జంతువునకు మారణకరంబయ్యు దానిన యథావిధిచే సంస్కరించునెడ నతి విషమరోగంబుల మరలించు నౌషధవిశేషంబగుచుండు గావున మే

ధావియగువానికన్నియు సాధ్యంబులగుచు మంగళప్రదంబులగు
చుండుననుట... ... .. .. .. ౨౯

శ్లో॥ అవిజ్ఞాతస్యవిజ్ఞానంవిజ్ఞాతస్యవినిశ్చయః।విదుషాం
శాసనేతిష్టన్నావమన్యేతకంచన॥ ... ౩౦

దేశకాలాంతరంబులనుండి దెలియంబడకుండెడువృత్తాంతంబులంచారులుమొదలగునుపాయంబులచే తెలియుటయు - అట్లు తెలియంబడినవృత్తాంతంబుల మంత్రకాలంబులనగు తాత్పర్యభేదంబులు సమంజసంబోనర్చుటయు - శాస్త్రజ్ఞానముచే ఫలస్వరూపంబెరింగికార్యంబులనిశ్చయింపుచు పండితుల యనుమతంబున జరియించుచుహీనునినైనను నవమానంబోనర్పకుండుట రాజగుగువానికృత్యంబులనుట... .. ... ౩౦

మంత్రుల సంఖ్యానిర్ణయం.

శ్లో॥ మంత్రయేన్మంత్రిభిస్సార్థంత్రిభిర్వాచతుర్భిస్సహ।
సర్వస్యచాపిశ్రుణుయాత్సుభాషిత జిఘృక్షయా॥౩౧

ముగ్గురుమంత్రులతో నేనియు - నలువురుమంత్రులతో నేనియు నాలోచించునెడనట్టి మంత్రులు బలుకుచుండెడు యుపన్యాసంబులనంతయు ప్రయోజనకరంబగుయుక్తిదెలియుటకై యవధానుండగుచు వినందగు ననుట... ... ... ౩౧

శ్లో॥ నకంచిదవమన్యేతసర్వస్యశ్రుణుయాన్మతం। బా
లస్యాప్యర్థవద్వాక్యముపనీతంహిపండితః॥ ౩౨

పండితుండగు మంత్రసభాసనుండగువాడు యాలోచనసభాసీనులగువారి నెవ్వరియును నగౌరవింపక బాలుండుబలికినను నర్థబహుళంబులగు పలుకులయ్యేనేని దానినియునంగీకరింపుచు నందరితాత్పర్యంబులు సమంజసంబగుచిత్తంబుతోడ నవధరింపందగుననుట.. .. ... ... ౩౨

శ్లో॥ అలబ్ధమాహోలబ్ధార్థంగ్రసత స్తస్యచేక్షణం।ఇయ
త్యోవిజిగీషూణాంవీర్యవ్యాయామభూమయః॥౩౩

జయశీలులగువారల పరాక్రమస్థానంబులనన్యద్రవ్యంబులజ

యింపంబడనియెడ పూర్వద్రవ్యంబులకును హానిగలుగుంగావున నట్లుగాకుండ మంత్రనిష్పత్తియొనర్పందగుననుట... ... ౩౩

శ్లో॥ శోభాహీకృతకృత్యస్య రాజ్ఞోభోగావిభూతయః।
అప్రాప్తవిజిగీషోశ్చ తాప్వవహీవిడంబనాః॥ ...౩౪

జయశీలుండగుచు శత్రుజయముచే కృతకృత్యుండగు రాజున కు ఐశ్వర్యంబునుంభోగంబులును ప్రకాశంబునకు హేతుభూతంబులగుంగానియట్లుగాని వానికివిడంబనంబులయగుంగాని యాత్యంతిక ప్రయోజనకరంబులుగా నేరవనుట.. ... ౩౪

శ్లో॥ మదోద్ధతః క్రియామూఢో యోతిక్రామతిమంత్రిణాం।
అచిరాత్తంవృథామంత్రమతిక్రామంతివిద్విషః॥ ౩౫

మదముచే పండితుండననుచును నాకన్నియుం దెలుసుననుచును కార్యంబుల నిర్వహించుక్రమంబులందు మూఢుండయ్యెడు రభిమానముచే మంత్రులయభిప్రాయంబుల నాకర్ణింపకుండు వృథా తాత్పర్యముగలరాజును శత్రువులుపరాక్రమించియతని రాజ్యకోశాదులం గ్రహియించుటయెగాక వధబంధాదులచేతయుం బాధింపుచుందురనుట... ... ... ౩౫

శ్లో॥ సంరక్ష్యేన్మంత్రబీజంతుతద్బీజంహిమహీభుజాం।
తస్మిన్భిన్నేధ్రువంభేదో గుప్తేగుప్తిరనుత్తమా॥ ౩౬

రాజులకుఆలోచనజేయువృత్తాంతంబులకార్యంబునం పరిణమిల్లునంతకునొరులకుం దెలియనట్లు రక్షించుటయ మూలాధారంబగుటం జేసియదిభిన్నంబందకుండునట్లురక్షించుటచే సౌఖ్యంబును రక్షితంబుగానియెడనసౌఖ్యంబునునియతంబులుగావునదానినవశ్యంబుననతిప్రయత్నంబునరక్షింపందగునను.

గీ॥ మంత్రమాప్తపరంపరంబందిపోవు। నఖిలకార్యంబులకు విఘ్నమావహిల్లు। విఘ్నమునీ జేసికార్యంబువృద్ధిబొందదు। దట్లుగావునమంత్రంబులరయవలయు.

అనుపంచతంత్రోక్తినమపరించి తనకత్యంతాప్తులతోడను నిశ్చితార్థంబుపరిణమించునంతకు వెలిపరుపందగదనుట... ౩౬

శ్లో॥ సింహ్మావచ్చేష్టమానస్య కాలేకర్మవిపశ్చితః। క్రియమాణంస్వకుల్యాముంవిదురస్యపరేకృతం॥ ౩౭

సింహాస్వభావంబుపిల్లికరణితనయంగంబులంతయుం దాచికొని యొరులకుందృష్టిగోచరంబుగాకఅణగియుండి కార్యకాలంబున విజృంభించుంగావున పండితుండగువానిచే నాలోచితనిష్పన్నంబులగుకృత్యంబులు స్వకీయులగుకులీను లెరుంగందగుంగానియితరులా కార్యంబుముగిసినపిదప నెరుంగవలయుంగానితత్పూర్వంబెరుంగందగకుండుటనట్లుమంత్రగుప్తియొనర్పందగుననుట. ౩౭

శ్లో॥ అపశ్చాత్తాపకృత్సమ్య గనుబంధిఫలప్రదః। అదీర్ఘకాలోభీష్టశ్చప్రశస్యోమంత్రఉచ్యతే॥.. ౩౮

అనుబంధులగువారును కార్యపరిణామానంతరంబున నెరుంగందగునట్లుగూఢంబయినదియు - స్వల్పకాలంబుననల్పప్రయాసముచేనిష్టఫలావాప్తియగునదియు - నగుమంత్రంబు నీతిశాస్త్రవేదులచేస్తోత్రాహంబగుచుండుననుట.. ... ౩౮

మంత్రపంచాంగములు.

శ్లో॥ సహాయాస్సాధనోపాయాః విభాగోదేశకాలయోః॥విపత్తేశ్చప్రతీకారస్సిద్ధిఃపంచాంగఇష్యతే॥౩౯

ఇట్టివారలసహాయంబంగీకరించందగుననుటయు౧ ఇకార్యసాధనంబునకిట్టియుపాయంబులొనర్చుటచేసాధింపందగుననుటయు౨ యిట్టిసమయంబుననిట్టిదేశంబున నికార్యంబొనర్ప సులభసాధ్యంబగుననియు౩ దీనికింగలుగువైకల్యంబిట్లు సంభవించుననియుదానికింబ్రతిక్రియయిట్లొనర్పందగుననియు౪ కార్యంబీరీతిసిద్ధించుననియు౫ నిశ్చయించుటమంత్రపంచాంగంబులనంబరగు ౩౯

శ్లో॥ అనతిష్ఠేత్సమారబ్ధమనారబ్ధంప్రయోజయేత్।అనుష్ఠితంచసద్వృత్త్యావిశేషేణోపవాదయేత్॥౪౦

శత్రుదుర్గాదులసాధించుటకైమంత్రనిష్పన్నంబులగుకార్యంబులనారంభించి నంతయథావిధి ననుష్ఠించుటయు- అనుష్ఠించ

ని వాని ప్రయోగించుటయుం బ్రారంభించి సాధించబడినదా నిమంగళకరంబగుననుష్ఠానముచే విశేషప్రయోజనకరంబగున ట్లొనరించుటయుమంత్రంబులకుం గలప్రయోజనంబులనుట ౪౦

శ్లో॥ ప్రచారయేన్మంత్రవిదః కార్యద్వారైరనేకధా। తత్ర
యచ్చేతసాంసామ్యం తేనసాధుసముత్పతేత్॥ ౪౧

మంత్రవేత్తలగువారు నానావిధకార్యంబులయందుబుద్ధిమంతులగుచారులబ్రయోగించుచునాయాయికార్యాలోచనవిషయంబులనేకంబులగుతాత్పర్యంబులుగలయడయభిప్రాయబాహుళ్యపక్షంబనుసరించి యక్కార్యబనుష్ఠింపందగుననుట.... ౪౧

శ్లో॥ యత్రమంత్రిమనస్సామ్యంయత్రచేతోనశంకతే।
యచ్చసంతోనవిందంతి. తత్పరీయాచ్చికీర్షితం॥ ౪౨

మంత్రులమనంబుల యభిప్రాయంబులన్నియుం గలిశినయట్టియు - మనంబునకుం సందియంబుగలుగక ప్రసన్నతగలుగునట్టియు - ఆలోచనజేయు నవసరంబున దేహావయవచలనాదుల శుభలక్షణంబు లుత్పన్నంబులగునట్టియు - పెద్దలచేనిందింపబడనట్టియు కార్యంబులనొనర్చుటకు యత్నించదగుననుట... ౪౨

శ్లో॥ ధృతేపిమంత్రేమంత్రజ్ఞైః స్వయంభూయోవిచారయేత్। తథావర్తేతమంత్రజ్ఞో యథాస్వార్థం నపీడ్యతే॥ ... ... ... ... ౪౩

మంత్రులగువారియందును భిన్నంబుగలుగుచుతాత్పర్యంబులుభేదించుచుండుటగలుగుచుండుగావున తొలుతమంత్రులయాలోచనంబులచే నిష్పన్నంబులైననునాపిదపతనబుద్ధిచే మరలమరలచింతించి తనప్రయోజనంబు బాధింపంబడకుండునట్లు కార్యనిష్పన్నంబొనర్పందగునమట... ... ... ౪౩

శ్లో॥ మంత్రిణస్స్వార్థతాత్పర్యాద్దీర్ఘమిచ్ఛంతివిగ్రహం। మంత్రిణోభోగ్యతామేతి దీర్ఘకార్యాక్షులేనృపే॥ ... .. ... ౪౪

రాజగువాడు దీర్ఘంబగుకార్యంబుననాసులపాటొందుట

వలన మంత్రులకుం బ్రయోజనం బధికంబుగ గలుగుం గావున వార
లు స్వప్రయోజనంబులకై దీర్ఘవైరంబులు గలుగుట కిచ్చగిం
చు చుందురు గావున నట్లు విగ్రహంబులు పెరుగకుండు నట్లు తాను స్వ
బుద్ధి నాలోచించందగునని పూర్వసంబంధము... .. ౪౪

శ్లో॥ మనఃప్రసాదశ్శ్రద్ధాచతథాకరణ పాటవం। సహా
యోత్థానసంపచ్చకర్మణాంసిద్ధిలక్షణం॥.. ౪౫

కార్యంబుల మంత్రనిష్పన్నంబులో నర్పించి పిదప నయ్యనుష్ఠానా
రంభావసరంబున మనంబు తెలివిగలిగి యుండుటయు - ఇంద్రియంబు
లు ప్రసన్నంబుల గుచుండుటయు - తనయవయవంబులు పటుత్వం
బుల గుచుండుటయు - సహాయులగు వారును నట్లయుండుటయు -
నను పరికరంబుల విమలత్వంబు కార్యసిద్ధి యగుటకు లక్షణంబు
లనుట... ... .. ... ... ౪౫

శ్లో॥ లఘూత్థానాన్యవిఘ్నానిసంపతత్సాధనానిచ । క
థయంతిపురస్సిద్ధింకారణాన్యేవకర్మణాం॥ ... ౪౬

శీఘ్రంబుగ నతిసులభంబులగు నుత్థానంబుగలదియు - విఘ్నంబు
లు లేనివియు - సాధనంబులతివేగంబున నొనగూడుటయు - నను కా
రణంబులు కార్యంబు నిర్విఘ్నంబునం బరిసమాప్తియగుటకుం నిదర్శ
నంబులగు ననుట.... ... ... ... ౪౬

శ్లో॥ ఆవర్తయేన్మహుర్మంత్రం ధారయేచ్చ ప్రయత్న
వాన్ । అప్రయత్నకృతోమంత్రఃప్రచలన్నగ్నివ
ద్దహేత్॥.. .. ... ౪౭

అతిప్రయత్నంనంబుగా పాడనియాలోచనఆప్తపరం పరచే
బయిలు పడియె నేని - యిరిటియందునంటిన యగ్ని క్రమంబున నూ
రంతయుం గాల్చు నట్లు కార్యహానికరంబగు గావున నావిషయం
బు మరల మరల నాలోచింపుచు నతి ప్రయత్నంబున గావం దగు
ననుట. .. ... .. ... ౪౭

శ్లో॥ ఆప్తైస్తత్సంతతేర్మంత్రస్సంరక్ష్యోత్తత్పరస్తుసః ।

అరక్ష్యమాణంమంత్రంహిభినత్త్యాప్తపరంపరాత్ ॥౪౮

మంత్రగోపనంబు ప్రయత్నపరుండగుచు రక్షించవలయు న నుట - మంత్రులగువారును విహితులగువారునుమనకుం బ్రియులైయుండినను - వారలకుగలమంత్రులును విహితులునుమనలకాప్తులుగనుండజాలరు గాన వారలవలనభిన్నంబందునను తాత్పర్యము చేతొలుతజాగ్రతగలవాడుగనుండందగుననుట... ...౪౮

శ్లో॥ మదఃప్రమాదఃకోపశ్చ సుప్తప్రలపితానిచ । భిందంతిమంత్రంప్రచ్ఛన్నాఃకామినీన్యశ్శుకశారికాః॥౪౯

మద్యాదులగు పానకృత బుద్ధి ప్రమాదంబులచేతయు - బుద్ధి ప్రమాదమోహంబులచేతయు - అధికంబగు కోపపరవశతచేతయు - కలవరింతలచేతయు - గూఢప్రవర్తనలగు ప్రియాంగనలతోడంబలుకుటచేతయు - నట్టిమంత్రగృహంబునంగల చిలుకలు గొరవంకలు మొదలగు మాట్లాడుజంతు గణంబులచేతయు - మరియుం గౌటిల్యమతమునననుసరించి... ... .. ..

శ్రూయతేహిశుకశారికాదిభిఃమంత్రితోమంత్రః పశుభిరన్యైశ్చతిర్యగ్యోనిభిరవనతైః। తస్మాత్తస్యసంవరణంనామాయుక్తపురుషైరక్షణమాకార్యాకాలాత్॥ ... ... ... ..

అను ననుశాసనంబు ననుసరించి రోగులు మొదలగు నయుక్తపురుషులవలనను మృగాదులవలనను మంత్రంబు భిన్నంబులగు గావున ఆయా యికార్యంబులుఫలించునంతకుమంత్రంబతిగూఢంబున గాపాడవలయుననుట.. ... .. .. ౪౯

శ్లో॥ నిస్తంభేనిర్గవాక్షేచనిర్భిత్త్యంతరసంశ్రయే। ప్రాసాదాగ్రేహ్యరణ్యేవామంత్రయేత్తావిభావితః॥ ౫౦

శ్లో॥ నిచ్ఛిద్రేనిర్జనేదేశేఅనిరంతరసంగమే। నివాతేశుచిరస్తంభేమంత్రయేతగృహేతథా॥ ...౫౧

స్తంభంబులమరుగుననుండి మనుష్యులు వినుటకవకాశంబుగలుగుంగాన స్తంభశూన్యంబగునట్టియు-కిటికీలపంచనప్రచ్ఛన్నులగు

చుసిలుచు జనంబులచే వినుట కవకాశంబు గలుగుంగానకిటి కీ
లులేనట్టియు - అడ్డగోడలచాటున నిలుచుటకవకాశంబగుంగాన
నడ్డము లేనియట్టియు - క్రిందంగూర్చుండుట శబ్దంబులచే యాతా
యాతజనంబులువినుటకవకాశంబుగలుగుంగాననట్లు లేని పైమిద్దె
లయందును - విజనంబగునడవియందును - రంధ్రంబులు లేనియట్టి
యు - జనసంఘంబు చేవిడువంబడినట్టియు - జనంబులెల్ల కాలంబుం
దిగుగు నవకాశంబుగలుగనట్టియు రహస్యగృహంబున నైననుమం
త్రాలోచనంబొనర్పందగుననుట యిట్లున్న విధంబులన్నియును
మంత్రగోపనార్థంబయనివిచారింపందగు... .. ౫౧

మంత్రిమండలభేదము.

శ్లో॥ ద్వాదశేతిమనుఃప్రాహషోడశేతిబృహస్పతిః । ఉ
శనావింశతిరితిమంత్రాణాంమంత్రిమండలం । య
థాసంభవమిత్యేకేతత్ప్రవిశ్యయథావిధి । మంత్ర
యేతాహితమనాఃకార్యంబుద్ధివివృద్ధయే॥.. ౫౨

మనుశాస్త్రకారమతంబున విజిగీషు - అరి - మధ్యమ - ఉ
దాసీనులకు నొకరొకరికి వేర్వేర యిరువురుమంత్రులం!గూర్చు
నెడ పన్నెండుగురాలోచనకర్తలగుదురనియు - గురుమతంబు
నమువ్వురుమంత్రులుగలుగవలయుననియును - శుక్రమతంబున న
లువురుగలుగవలయుననియును - ఇంద్రుండుగూర్చుండు నాలో
చనసభాసీనులగువారు సహస్రసంఖ్యాకు లగుటవలనను వారి
యభిప్రాయంబులనంతయు వేర్వేరనవధరించి యన్నిమంది మం
త్రులమతంబును నైకమత్యంబొనర్చుశక్త్యతిశయము చేనింద్రుం
డు సహస్రాక్షుండనంబడియెననియును - ముప్వురు మంత్రులకు
దక్కువగాకుండునట్లుయథాసంభవముమంత్రులసంగ్రహింపం ద
గుననిి కొందరియాచార్యులమతంబనియును నట్టిపూర్వోక్తల
క్షణ లక్షితంబులగు మంత్రిసభం బ్రవేశించి స్వకీయబుద్ధికార్య
వృద్ధులకొరకు విధ్యుక్తలక్షణంబు నతిక్రమించకయాలోచింపం
దగుననియునను శాసనము... ... .. ... ౫౩

శ్లో॥ ఏకస్త్రిఃపంచసప్తాయాః వైషమ్యైః క్రియయాయుతః।
మంత్రిణోభూభుజాంకార్య ఇతికూనపదంత కైః॥ ౫౪

ఒకటి - మూడు - అయిదు - ఏడు మొదలగు బేసి సంఖ్యలంగలమంత్రులనిర్ణయింపందగునని కూనపదంతులను నీతిశాస్త్రాచార్యమతమనుట... .. .. .. ... ౫౪

శ్లో॥ ఏకైకేనహికార్యాణి ప్రవిచార్య పునఃపునః। ప్రవిశేత్స్వహితాన్వేషీ మతమేషాంపృథక్పృథక్॥
మహాపక్షోయథాశాస్త్రం దృష్టకర్మా హితస్సుధీః।
యద్బ్రూయాన్మంత్రరూఢ స్తత్తత్సాధుసమాచరేత్ ... ... ... ...౫౬

పూర్వోక్తసంఖ్యాకులగు ఆమంత్రులతాత్పర్యంబుల వేరువేరవిమర్శించియందు తనకుహితంబును శాస్త్రక్రమంబు ననుసరించునదియును - కార్యంబులగతి దెలిసినవారిచే నొడువంబడినదియును - అధికజన సమ్మతంబగునదియును నగుదాని ననుష్ఠింపందగుననుట.. ... .. ... ... ౫౬

శ్లో॥ నాతీయాత్కార్యకాలం హి కృత్వామంత్ర వినిశ్చయం। అతిక్రాంతే హితద్యోగో యథాయోగంప్రకల్పయేత్॥ ... ... ..౫౭

మంత్రనిశ్చయం బొనర్చిన పిదప ఏక్కాలంబున నేద్దాని జేయుటకునిర్ణయింపబడియె నక్కాలంబతిక్రమింపకుండ నారంభింపందగుంగానియట్లొనర్పక సావకాశంబొనర్చునెడ కాలభేదంబగు దోషప్రాప్తంబగుటమరలనిశ్చయింపంబడవలయుంగావున సావకాశంబొనర్పందగదనుట... ... ... ౫౭

శ్లో॥ నకార్యకాలమతిమాననతిక్రామేత్కథంచన। కథంచిదేభవతికాలయోగస్సుదుర్లభః। కాలేసమాచరన్సాధురసవత్ఫలమశ్నుతే। ఇతిచేతిచసంపశ్యన్ కాలేదేశేసహాయవాన్ .. ... ౫౮

దేశకాలసంయోగంబుకార్యంబునకు లభించుట దుర్లభం

బుగావుననట్టి దేశకాలంబు లెరింగి ప్రయుక్తంబులగు కార్యంబులు సుక్షేత్రంబున సుకాలంబులనను ప్తంబులగు బీజంబులకరణిర సవంతంబులగు ఫలంబులు సంభవించునట్లు దేశకాలసహాయ సంపన్నుండగుచు నిర్ణీత కాలంబతిక్రమించకుండునటుల మంత్రసిద్ధక్రియాకలాపంబు లొనర్పందగుననుట.. ... ౫౯

శ్లో॥ అవిచార్యబలాబలం ద్విషామహమిత్యేవ సముత్థితో బలాత్। చపలః స్వమతేన సంపతత్ప్రతిపత్యాల్ప మనానబుధ్యతే॥ ... ... ౬౦

శత్రువుల బలాబలంబు లాలోచింపక తనస్వబుద్ధిబలంబుచేతయ చపలుండగుచు దండయాత్రాదు లొనరించు నతండవమానంబొందినపిదప నెరుంగుంగాని యంతకు పూర్వంబున నెరుంగ జాలండనుట.. .. ... ... ... ౬౦

శ్లో॥ పరమంత్రబలాన్మహీపతిర్మహతోదుష్టభుజంగమానివ। వినమేన్నయమార్గమాస్థితో వశముద్యోగసమన్వితోరిపూన్॥ .. ... ౬౧

దుష్టులగు రాజులను శ్రేష్టంబగు మంత్రబలంబువలన దుష్టంబులగు సర్పంబుల వశీకరణంబొనర్చునట్లు నీతిమార్గంబు నతిక్రమింపక శత్రువుల స్వవశంబొనర్పదగుననుట.. ౬౧

ఇట్లు కామందకీయ ద్వాదశాస్సర్గము సంపూర్ణము.



త్రయోదశసర్గప్రారంభః.



శ్లో॥ కృతమంత్రస్తు మంత్రజ్ఞో మంత్రిణాం మంత్రసమ్మతం। యాతవ్యాయప్రహిణుయాద్దూతం దౌత్యాభిమానితం॥.. ... .. .. ౧

పూర్వసర్గోక్తక్రమంబున నాలోచితంబగు కార్యము నెరవేర్చుటకై యుక్తాయుక్తవివేకులగు మంత్రులయనుమతంబున వ

త్వ్యమాణలక్షణలక్షితుండగు దూతను శత్రుసమీపంబునకుం దౌత్య విధానంబునకై యనుపందగుననుట... ... ... ౧

శ్లో॥ ప్రగల్భస్స్మృతిమాన్ వాగ్మీ ప్రాజ్ఞశ్శాస్త్రే ప్రతిష్ఠితః।
అభ్యస్తకర్మా నృప తే దూతో భవితుమర్హతి॥ ౨

సభాకంపము లేక శత్రురాజసదంబున జడుపు లేక తన యజమానునియుక్తులుం బలుకువాఁడును - యేలికచే బలుకంబడిన పలుకులవిస్మృతినొందక సమయానుగుణంబుగ బలుకువాఁడును - సభారంజకంబులగు పదవాక్యప్రయోగచాతుర్యముగలవాఁడును - ప్రజ్ఞాబలశాలియును - ఆయుధశాస్త్రకుశలుండును - దూతకృత్యంబుల శాస్త్రక్రమంబున నభ్యసించినవాఁడును - నగు వేగరి రాజకార్యంబులకుం దగువాఁడనుట... ... ... ౨

శ్లో॥ నిసృష్టార్థోఽమితార్థశ్చ తథా శాసనహారకః। సామర్థ్యాత్పాదతో హీనో దూతస్త్రివిధస్స్మృతః॥ ౩

నిసృష్టార్థుండనగా విజిగీషుశత్రులబలాబలంబు లెఱింగి కాలదేశంబుల దెలిసి సర్వవిద్యాసమర్థుండగుచుండువాఁడు యెట్లన ధర్మజుని చే దుర్యోధనుకడకుం శ్రీకృష్ణుం బంపు నవసరంబునయిట్లని విన్నవించె... ... ... ... ... ...

శ్లో॥ అస్మాన్వేత్సి పరాన్వేత్సి యథావదనుభాషితుం।
యద్యదస్మద్ధితం కృష్ణ తత్తద్వాచ్యస్సుయోధనః॥ ..

మమ్ములనువారిస్థితియునుం దెలిసినవాఁడవునుం శత్రుని నెఱింగినవాఁడవును - బలాబలంబు లెఱింగినవాఁడవును సముచితవచనకుశలుండవునునగుట నాకెద్ది యెద్ది హితంబుగ దలంతువ దియంతయు దుర్యోధనుతోడం బలుకందగునని యెవ్వాని యెడ సంధియనియైనను విగ్రహంబనియైనను నియమములేక దూతయిష్టానుగుణంబున నడుపం దగుననునది దూతగుణసంపూర్తియగుటనిట్టిదూత యిరువదియైదుగుణంబులుగలవాఁడనియును - ౧ మితార్థుండను రెండవతరగతి దూతయజమానునిచే నాజ్ఞాపింపంబడిన సంధివిగ్రహంబులం దన్యతమంబగుదాని ప్రసంగంబలికియు

రు దేరందగునతండు పాదభాగన్యూనగుణంబులుగలవాడనియు౨ శాసనహారకుండను మూడవతరగతి దూతయేలికె చే నాజ్ఞప్తం బగుదానిబలుకువాడనుట నితండును రెండవతరగతి దూతకన్న పాతికెభాగము గుణహీనుండగుననుట౩ యిట్లు దూతలుమూడు దెరంగులుగుచుండుమరనుట... ... ... ... ౩

శ్లో॥ సభర్తుశ్శాసనార్థచ్ఛేద్గంతవ్యంహ్యుత్తరోత్తరం।
స్వవాక్యపరవాక్యానామితిచేతిచచింతయేత్॥ ౪

అట్టిదూతయగువాడు యేలికెచేబలుకంబడిన యర్థంబను వదించుటకై మనంబున నంతకంతకు యుక్తిప్రత్యుక్తులూహించుచు సాధక బాధకంబులవలోకించుచు మననంబొనర్చుచు శత్రు రాజుకడకరుగందగుననుట... .. ... .. ౪

శ్లో॥ అంతపాలాన్సచకుర్వీతమిత్రాణ్యాటవికాంస్తథా।
బల స్థానానిమార్గశ్చవింద్యాత్స్వబలసిద్ధయే॥ ౫

శత్రుదేశంబునకుం జుట్లనుండురాజులను వారలబలంబులను మరియుంగల యడవులవసించు బోయలు మొదలగువారలను తనకుంహితంబులొనర్చునట్లు స్నేహంబులొనర్చుచు శత్రుబలంబులుండెడు యిక్కలును గుల్మంబులునుం దండునడచు మార్గంబునకుంగల సాధక బాధకంబులును భావికాలంబునంగలుగు స్వకీయబలసమాగమనసిద్ధికొరకు గనిపెట్టుచు క్రమంబున నరుగందగుననుట... ... .. ... ... .. ౫

శ్లో॥ సారవత్తాంచరాష్ట్రస్య తథాతస్యప్తిమేవచ। ఛి
ద్రంచశత్రోర్జానీయాత్కోశంమిత్ర బలానిచ॥ ౬

దేశస్వాస్థ్యంబును - దానికింగలకోటలు దుర్గంబులు మొదలగురక్షణాసామగ్రివిశేషంబులును - శత్రునికింగలసంకటంబులును పౌరబాట్లును - బొక్కసపరిమాణంబును - మిత్ర బలాబలంబులును - సైన్యపౌష్కల్యాదులును నిదానింపందగుననుట...

శ్లో॥ ఉద్యతేష్వపిశస్త్రేషు యథోక్తంశాసనంవదేత్
రాగానురాగౌజానీయాద్దృష్టివక్త్రవిచేష్టితైః॥ ౭

శత్రుసమీపంబున నాయుధపాణులుగ నిల్పఁబడియుండినను తన యేలికచేనాజ్ఞప్తంబగువృత్తాంతంబంతయు జడియకబలుకుచునత నిముఖనేత్రచేష్టలవలన నతనికింగలతాత్పర్యతారతమ్యంబుల నె ఱుంగందగుననుట... .. .. .. ౭

శ్లో॥ నవిజ్ఞాతఃపురంశత్రోః ప్రవిశేన్నతుసంసదం। కా
లంసంవీక్ష్య కార్యార్థ మనుజ్ఞాతశ్చనిష్పతేత్ ॥౮

శత్రునికిం దెలియకనతనిపట్టణంబుం జొరందగుంగాని యతని యనుజ్ఞలేకసభామంటపంబున కరుగందగదు - అట్లనుజ్ఞలేకసభం జొచ్చి నయెడనతకింగలుగుసందియముచే నిజరాజకార్య హాని యగుంగావున దేశకాలంబులెఱింగియనుమతుండగుచు సభకుం ప్రవేశింపందగుననుట... ... .. .. ౮

శ్లో॥ సహితానిష్టవచనం కామంక్రోధంచ వర్జయే
త్। నాస్యైశ్వర్యయాత భావంస్వంకర్త్యే ద్వింద్వా
త్పరస్యచ॥.. ... .. ... ౯

కామక్రోధ మదాదులు మంత్రంబునుం భేదించునను పూ ర్వసర్గోక్తినమసరించి కామక్రోధంబులనడంచుకొని శత్రులచేబ లుకంబడు పరుష వచనంబులోర్చుచు స్త్రీ సాంగత్యము చే తయు కలవరింతలచేతయు మంత్రముభిన్నించునను పూర్వోక్తిన నుసరించి తానొంటిగబరుండుచు తనయభిప్రాయంబు బయలు పడకుండ రక్షించుచు నొరులయభిప్రాయంబులనరయుచువర్తిం పందగు... .. ... ... .. ... ౯

శ్లో॥ గాగాపరాగౌజాయెత హృద్గతంమదవిస్మృతః। త
స్మాదేకస్స్వపెన్నిత్యంద్యూతంపానంచవర్జయెత్॥౧౦

మదముచేవిస్మృతబుద్ధియగువాఁడు హృదయంబు నందుం డు కోపప్రసాదంబుల వెలిబుచ్చుంగావుననట్టిపానంబు నుద్యూ తాదులును విడిచియొంటిం బరుండుచుండం దగుననుట... ౧౦

శ్లో॥ కాలెప్రజెతమేధావీనభిద్యేతార్థసిద్ధయె ప్రక్షీ
యమాణంబుద్ధ్యేత కాలంనాతి విలోభనైః॥ ౧౧

రాజార్థసిద్ధికొరకు తనయుపకరణంబులలజడిజెందుటవల
ననుత్తరకాలీనంబులగు కార్యంబులుహాని నొందుగావున నట్లుల
జడినొందక కాలదేశంబులననుసరించి యతిదీర్ఘంబుగాకుండు
నట్లు బుద్ధిశాలియగుమాత కార్యసాధనంబొనర్పందగుననుట. ౧౧

శ్లో॥ కృతపక్షోనజ్యాయాంసంకుర్యాదనుపశిక్షితః। ప్ర
కృతీనాంచ్యుతింబ్రూయాత్స్వభర్తరికదాచన॥౧౨

తనరాజాజ్ఞలేకనిజపక్షీయులగు కోశదండ ప్రకృతులంగల
లోపంబుల్లనన్యునకుం దెలుపందగదనుట... ... ౧౨

శ్లో॥ కులేనామ్నా యథద్రవ్యేణకర్మణాచగరీయసా। కుర్యా
చ్చతుర్విధంస్తోత్రంపక్షయోరుభయోరపి॥...౧౩

శత్రుచిత్తరంజనసభ్యరంజనార్థంబుగ తనరాజిట్టి కులీనుం
డనియు - నీవునుకులంబుననట్టియౌన్నత్యముగలవాడవనియు- పే
రుచేనిట్టి యోగ్యతగలవాడనియు నీవునునట్టి శ్లాఘ్య నాముం
డవనియు - ద్రవ్యంబతని కనేకకోటులుగలవనియు - నీకునునా
క్రమంబునను దక్కువలేకగలదనియు - విజిగీషుండును నింతకు
మున్నేనేకులతోడ యుద్ధంబులొనర్చి యనేకరాజ్యంబులుజయిం
చియున్నవాడనియు నీవును నట్టి జయశీలుండవనియు నిదిమొ
దలగు నుత్సాహవార్తల సదస్సునంబలుకందగుననుట. ౧౩

శ్లో॥ మధ్యస్థతాఖ్యాపనార్థం సంశ్లిష్యోభయవేతనైః।
కృత్యపక్షంచజానీయాత్తద్భర్తుశ్చవిచేష్టితం॥౧౪

శత్రురాజ సమీపవర్తులగువారికి వేతనంబులొసంగుటమొ
దలగు తంత్రంబులచేనతని చికీర్షితంబులును ప్రయత్నంబులును
చేష్టలునుందెలియుటకై గలయందగుననుట.. .. ... ౧౪

శ్లో॥ విద్యాశిల్పాపదేశేన సంశ్లిష్యోభయవేతనైః। కృ
త్యపక్షంభేద్యపక్షం జానీయాద్భర్తృవృద్ధయే॥౧౫

ఆన్వీక్షిక్యాదులగువిద్యాభ్యాసంబులొనర్చినట్లును నానా
విధ గీతవాద్యశిల్పంబు లభ్యసించు వ్యాజంబునను స్నేహంబొ

నర్చి శత్రుమంత్రులకుం బసధనంబులొసంగి। వారలచేత నరా
జాభ్యుదయంబునకై శత్రువికీర్తితంబు లెఱుంగం దగునసుట. ౧౫

శ్లో॥ తీర్థాశ్రమసురాస్థానే శాస్త్రవిజ్ఞానహేతునా।
తపస్వివ్యంజనోపేతైస్స్వచరైస్సహసంవదేత్ ॥ ౧౬

తాపసవేషంబులు మొదలగు నానావేషంబులుధరియించి శ
త్రుపురంబునం బ్రచ్ఛన్నచారులగుచుండెడు స్వకీయులగు దూత
లచే నెఱుంగంబడిన వృత్తాంతంబు లెఱుంగుటకై నదీతీర్థాదిస్నా
నవ్యాజంబులచేతయు-పుణ్యాశ్రమంబుల శాస్త్రపఠనంబొనర్చు
మిషచేతయు - దేవాలయంబుల దర్శన కారణంబులను గలసి
యోచించి యుక్తాయుక్తంబుల నెఱుంగందగుననుట... ...౧౬

శ్లో॥ ప్రతాపంకులమైశ్వర్యంత్యాగముత్థానసౌష్ఠవం।
అక్షుద్రతాం భద్రతాంచ భర్తుర్ద్విడ్వ్యేషుదర్శ
యేత్॥ ... ... .. ... ... ౧౭

భేదోపాయంబులం బ్రయోగించు నవసరంబున తనరాజు
నకుంగల పరాక్రమాధిక్యంబును - కులీనతయు - ద్రవ్యసంపద
యు- దాతృత్వంబును - ఉత్సాహశక్తియు - సామర్థ్యంబును-
వంచనజేయుట మొదలగు పాపాభిప్రాయంబులు లేమనికియు -
కల్యాణ గుణంబులును - శత్రువులకుం దెలియం జేయందగు
ననుట... .. ... ... ... .. ... ...౧౭

శ్లో॥ ఏతేష్వహస్సుగచ్ఛత్సుకిమస్మత్పృథివీపతేః।పశ్య
తివ్యసనంకింతు స్వయంవాకర్తుమీహతే॥ ... ౧౮

ఇట్లుశత్రువృత్తాంతంబు లెఱుంగుచు దినంబులుగడుపుచుండె
డు నవసరంబున నీశత్రుండు తనరాజువిషయంబున వ్యసనా
దులగు కాలంబుల నీరీక్షించుచుండుననియు - తనబలంబులమొ
దలగువాటి యున్నసన్నాహంబొనర్చుననియు - మరియునెట్టివి
షమప్రయోగంబులు జేయుచుండు ననియు గనిపెట్టుచుండంద
గుననుట... ... ... .. ... ... .. ౧౮

శ్లో॥ స్వపక్షాభ్యుదయాకాంక్షీ దేశకాలావుదీక్ష్యచ।
యాత్రాకాలక్షయార్థీ వాతత్రచాయంవిలంబతే।
కాలేతుక్షీయమాణేతువిపత్తింభావినీంప్రభోః। తర్క
యేత్పండితోవ్యక్తంనిష్పతేత్ సహసాతతః॥ ౨౦

తనరాజపక్షంబునకుం శ్రేయంబుదలంచుచు దేశకాలంబులెరుంగుచు దూరంబుననుండియరుదెంచిన తనరాజునకు సాధనవైకల్యంబులగుటకు శత్రుండు కాలక్షేపంబు జేయుచుండుటయు నట్లగుటచే నృపునకు సంభవించదగు విపత్తులను నాలోచించుచునట్టి యనుమానంబులు దెలియునెడ నతిత్వరితంబుననిజరాజనికటంబునకుం జేరివృత్తాంత నివేదనం బతిశీఘ్రంబునం జేయం దగునను ట... ... .. ... ... ... ౨౦

శ్లో॥ రిపోశ్చ స్వపరిచ్ఛేదస్సుహృద్బంధువిభేదనం। దుర్గ
కోశబలజ్ఞానంకృత్యాకృత్యోపసంగ్రహః। రాష్ట్రాం
తవ్యంతపాలానామాత్మసాత్కరణంతథా। యుద్ధా
యసారభూజ్ఞానంమాతకైర్మతికీర్తితం॥ .. ...౨౨

శత్రువునకుంగలబంధువులను స్నేహితులను దానభేదాదులచేతన్నకుంస్వాధీనులనొనర్చుకొనుటయు- ఆయుధాదులవైకల్యంబులుగలుగం జేయుటయు- కోటలుయిట్టిబలంబుగలవనియు ఖజానాయింతగలిగియున్నదనియు- బలప్రమాణంబింతయనియు- నిట్టికార్యంబులొనర్చుటచేవిజిగీషునకుంబ్రయోజనంబు గలుగుననియు యిట్టికృత్యము జేయుటచే సంకటపాటుగలుగుననియు-రాజ్యసమీపంబుననుండువారిట్టివారనియు మండలబలంబిట్టిదనియు సామంతులస్వాధీనంబులొనర్చుకొనుటయుయిట్టి భూమియందుయుద్ధము జేయుటకుందగుననియునిది మొదలగు వృత్తాంతంబుల నెరుంగుటదూతకృత్యంబనుట· దీనికి దృష్టాంతరంబుగ శ్రీరామాయణయుద్ధకాండ రెండవసర్గంబుజూడందగు... .. .. ౨౨

శ్లో॥ దూతేనైవ నరేంద్రస్తు కుర్వీతారివిమర్శనం। స్వ
పక్షేపివిజానీయాత్పరదూతవిచేష్టితం॥.. ...౨౩

ఇట్లు దూతకృత్యంబులు విధించి పిదప రాజకర్తవ్యంబులు దెలుపుటకు బ్రక్రమించి - రాజగువాఁడు శత్రురాజవృత్తాంతంబులు దూతముఖంబున దెలియందగుననియు - తననికటంబుననుండెడు శత్రుపక్షీయులగు దూతలుంగూఢచారు లిట్లున్న వారలనియు దెలియుచుండవలయుననుట. ... ... ...౨౩

శ్లో॥ తత్కాలంగితజ్ఞః స్మృతిమాన్ధృష్టోలఘుపరాక్రమః।
క్లేశాయాససహో దక్షః చరస్స్యాత్ప్రతిపత్తి
మాన్॥ .. ... .. ... ౨౪

దూతలందు చరులనువారి భేదంబులు దెలియ జేయంబడి యెడు చరుండనువాఁడును - యుక్తిప్రత్యుక్తులుబలుకుబుద్ధిశాలియు అన్యునియాకారచేష్టలు దెలియువాఁడును - రాజవాక్యంబుల మరువనివాఁడును - స్వతంత్రంబులగు సమయోచితంబులగు పలుకులు బలుకుధృష్టనాయకుండును - త్వరితంబున నడువంగలవాఁడును - సంకటంబులును ఆయాసంబులును నోర్చువాఁడును - సమర్థుండునుం నవనవంబులగు బుద్ధివిశేషంబులచే హాజరుజవాబుగలవాఁడును - నమ్మకముగలవాఁడునుగాదగుననుట. .. ౨౪

శ్లో॥ తపస్విలింగినోధూర్తాశ్శిల్పపణ్యోపజీవినః। చ
రాశ్చరేయుఃపరితఃపిబంతోజగతాంమతం॥... ౨౫

శ్లో॥ నిర్గఛేయుర్విశేయుశ్చ సర్వత్రాపి హితాస్సహం।
చరాఃప్రకాశంనృపతేశ్చక్షుర్దూరంచరంహితే॥ ౨౬

సన్న్యాసివేషంబులధరియించినవారలును - ధూర్తులగు నానావేషధారులును - నానావిధశిల్పకళాకుశలుల వేషధారులును వర్తకుల వేషంబులు ధరియించిన వారలునునగుచు లోకంబులగలవృత్తాంతంబుల నెల్ల దెలియుచు అంతటనడ్డము లేక చరియించుటవలన చరులనువారు రాజునకుం దూరంబు నవతిలంచు కన్నులనందగియుందురనుట... ... ... ... ...౨౬

శ్లో॥ సూక్ష్మంతత్రప్రచారేణపశ్యేదరివిచేష్టితం। స్వపన్న
పిహిజాగర్తిచారచక్షుర్మహీపతిః। చారచక్షుర్న

రేంద్రస్సార్వత్సంపత్తిస్తేనభూయసాం। అనేనాసం
పతత్యోపాత్యతత్యంధస్సమెపిహి॥ ... ౨౮

అట్టిపూరోక్తలక్షణలక్షితులగు గూఢచరులచే శత్రుమిత్ర పక్షీయంబులగు రహస్య వృత్తాంతంబులెరుంగుటవలన కన్నుల చేనిదిరించినయైనను చారచక్షుస్కుండగుచు మేల్కొనియుండునను టనట్లుగాక చారప్రయోగకుశలుండుగాని రాజు మోహము నొం దినవాడగుచు సమకాలంబుననవిహ్వలుండగుననుట... ౨౮

శ్లో॥ సర్వసంపత్సముదయంసర్వావస్థావిచేష్టితం।చారే
ణద్విషతాంవిద్యాత్తద్దేశప్రార్థనానిచ॥ ౨౯

శత్రువునకుంగలయైశ్వర్యవృద్ధిక్షయంబులును నన్నికాలంబుల నడుచువృత్తాంతంబులును శత్రుదేశజనంబుల యభిప్రాయంబులును చారులవలనం దెలియుచుండందగుననుట.. ... ...౨౯

శ్లో॥ ప్రకాశశ్చాప్రకాశశ్చచరస్తుద్వివిధస్స్మృతః। అ
ప్రకాశోయముద్దిష్టఃప్రకాశోదూతఉచ్యతే॥...౩౦

చారులయందుప్రకాశంబునసంచరించువాడుదూతయనియు ౨౮వశ్లోకముమొదలుపన్యసింపంబడిన గూఢచారిచరుండనియుం రెండుదెరంగులుగదెలియందగు - దూతకువకీలనియు-చరునకుహ రకారాకోటగస్తయనియురూఢినామంబులు .. ... ౩౦

శ్లో॥ చనేణప్రచరేద్రాజాసూత్రేణత్విగివాధ్వరే।దూ
తెసంధానమాయత్తంచరేచర్యాప్రతిష్ఠితా॥...౩౧

వేదసూత్రంబులననుష్ఠించురుత్విక్కులచందంబునచరులయందన్ని రాజకార్యంబులనగా రాజ్యలాభంబును రాజ్యపాలనంబును ప్రతిష్ఠింపంబడియుండుటయెగాక దూతయందుగలకృత్యముసంధియొనర్చుటయుచెరునియందువృత్తాంతంబులు దెలియంజేయుటయునియతంబులనుట.. .. ... ...౩౧

శ్లో॥ సంస్థానవత్వసంస్థాశ్చ కార్యోకార్య సమృద్ధ
యే। తిష్ఠేయుఃపరసంచారాః పరచర్యాపవాహి
వః... ... .. ... ౩౨

ఈచరులయందు నిలకడగలవారు సంస్థాన సంజ్ఞులనియు నిలుకడలేనివారు అసంస్థానసంజ్ఞకులనియు రెండుదెరంగులగుచు రాజకార్యసాధనముకొరకుశత్రుస్థానంబులంజరియించందగు నని నందమసంస్థానస్వరూపము - కౌటిల్యమతంబున. ... ...

శ్లో॥ మర్త్యేషువణిజస్సంస్థాదుర్గాంతెసిద్ధతాపసాః। కిథ
కోథాస్థితారాష్ట్రే వనేష్వనవాసినః। ఎవంయ
త్నేనసంస్థాశ్చ కార్యాః కార్యసుసిద్ధయే॥... ..

కోటలలోన వర్తక వేషధారులును - కోటల్వబయుల సన్న్యాస వేషధారులును - పట్నంబుల పురాణిక వేషధారులును - అడవులవానప్రస్థబోయల వేషంబులవధరించినవారలును - నగుచరులయత్నముచేనిలుపందగుననుట-మరియునన్నిభాషలుదెలిసిన వారలును- ప్రజ్ఞావంతులును- లంచంబులకులోబడని పరిశుద్ధ చేష్టలుగలవారలును - దేహపటుత్వముగలవారలును సర్వవార్తప్రతిష్టాకార్య స్థానంబులనుండుచు పట్టణంబుల బంగారపు సొమ్ములుజేయించువ్యాజముచేత యధికధనంబుల క్రయించుచుసన్న్యాసులకు గ్రముంబునంగల వస్త్రభోజనంబులొసంగుచు- మరియు నాయాలపనులకుం దగిన వేతనంబుల నొసంగుచు రాజకార్య సిద్ధికొరకు సంబళంబుల గ్రహించుసమయంబుల రాజసమీపంబున కరుదెంచి తమతమ వర్తనలు దెలియజేయుచుసంచరింపందగుదునుట... ... ... .. ౩౨

శ్లో॥ వణిక్కృషీవలోలింగీ భిక్షురధ్యాపకస్తథా। సం
స్థాప్యశ్చరసంసిద్ధ్యైదత్తదాయాశ్చభాశయాః॥౩౩

చిరకాలసంబళంబులు పుష్కలంబుగ నొసంగివర్తక వేషముచేతయు - మన్నివయిరుజేయు శేద్య గాండ్ల వేషముచేతయు- నానావిధవేషములు ధరించియు - సన్న్యాసి వేషముచేతయు - ఉపాధ్యాయ వేషముచేతయు - నుండునటులబుద్ధి కుశలులగునను రక్తులనంపె యుండందగుననుట... .. .. .. ౩౩

శ్లో॥ స్వపక్షేపరపక్షేవాయావార్తకశ్చిద్విలక్షితాః।
సర్వస్మిన్గుప్తసంచారాస్తిష్టేయశ్చిత్తవేదినః॥౩౪

తన పక్షీయులగువారి యంతర్వర్తనంబు నెఱుంగుటకును శత్రుపక్షీయుల వృత్తాంతంబు నెఱుంగుటకును మానంబు నెఱుంగు కుశలబుద్ధులగూఢ చరులం జేసియంతట త్రిప్పుచుండందగుననుట యింతపర్యంతంబును స్థిరంబుగనుండెడువారివిషయము...... ౩౪

శ్లో॥ తీక్ష్ణః ప్రవ్రజితశ్చైవఛత్రీసంధపవచ | పత్తెజ్ఞె
యాస్తు సంచారాస్సర్వే నాన్యోన్యవేదినః ౩౫

క్రూరకర్మముగలిగి సమయంబున శస్త్రాదులచేప్రహరింపం దగువారలను - నిస్సంగులను సన్న్యాసవేషధారులును - గొడుగు లుచేతంగలవారలును - యథోచితయానంబులు గలవారలును - నగుచు నొండొరులకుం దెలియకుండ దిరుగుచుండ వలయునను ట... ... .. ... ... .. ... ౩౫

శ్లో॥ స్వపక్షేపరపక్షేచ యోనవేదచికీర్షితం। జాగ్ర
ద్రిపుషుసుప్తోసౌన భూయఃప్రతిబుధ్యతే॥... ౩౬

తనపక్షంబులగు నమాత్యభృత్యాదులయొక్కయు శత్రుసామంతుల యొక్కయు వృత్తాంతంబు నెఱుంగక మూఢుండగుచు నిదురించినట్లుండెనేని శత్రువులు జాగరూకులై యుండుట వలన మరల క్షేమంబంద నేరండనుట... ... .. .. ౩౬

శ్లో॥ కారణాకారణాత్క్రుద్ధాః బుధ్యేతస్వపరిగ్రహాః।
పాపాన కారణక్రుద్ధాః స్తూష్ణీందండేన దండ
యేత్॥ ... ... ... .. ... ౩౭

తనభృత్యులయందెవ్వరేనియునొకకారణంబున రాజుచేనా సగల్పించియా కార్యానంతరంబున నదియొసంగకపోవుట మొద లగు హేతువులచె కుపితులైనను- కారణములేకయె కుపితులగువా రలనుం దెలిసి కారణక్రుద్ధుల దానమానాది సత్కారంబులచేత యు నకారణక్రుద్ధుల ఉపాంశువధంబులచేతయు కారాగారప్ర వేశాదిబాధలచేతయు దండింపందగు... ... ...

శ్లో॥ ఉద్యంతేవైత్రయఃపక్షా మిత్రోదాసీన శత్రవః॥

అనగా సన్యాసియైనవానికిని స్నేహితుండును మధ్యస్థుండును శత్రువునంగలిగియుందురను పూర్వోక్తినూహించు నెడ రాజునక ట్లుగలుగుటయాశ్చర్యముగా నేరదుగావున నట్టిక్రూరుల దండింపం దగుననుట.... .. .. ... ... ... ...౩౭

శ్లో॥ యేతు కారణ క్రుద్ధాస్తాన్ స్వవశీకృత్య సంవశేత్। స్వ మయొద్దానమానాభ్యాం ఛిద్ర మేతద రేర్ముఖం॥...౩౮

పూర్వోక్తంబులగు కారణములచే కుపితులగువారు తనచే దానమానాది సత్కారంబుల మన్నించంబడనియడ నారలయాశ్రయముచే శత్రులు ప్రవేశించుట కెడగలుగుంగావున నట్టివారి మన్నించి తనయెడ ననుపందగుననుట.. .. ౩౮

శ్లో॥ కంటకానాముఖభంగేన రాజ్యస్య ప్రశమంనయేత్। ఇత్యుక్తస్సామదానాభ్యాం ఛిద్రంచ పరిపూరయేత్॥... .. ... .. ... ౩౯

ముండ్లకొనలుత్రుంచిననది యుపద్రవంబొనర్పం జాలని యట్లుదుష్టులగు రాజద్రోహుల నవమానవధ బంధాదులవలన రాజ్యకంటకంబులను ఛిద్రంబులనుంబూడ్చందగుననుట... ... ౩౯

శ్లో॥ అణునాపిహిఛిద్రేణ ప్రవిశ్యబలవత్తరం। ఆప్తైవవిపదంభోధౌ మజ్జయేద్యానపాత్రవత్॥........౪౦

కొంచమగు గంధ్రంబునం బ్రవేశించిన జలంబులు క్రమంబున నోడను సముద్రంబున ముంచునట్లు కొంచము సందుగలిగినంత శత్రువులందు ప్రవేశించి బలవంతునినైనను ఆపత్సముద్రంబునముసుగంజేయుదురనుట... .. .. ... .. ౪౦

శ్లో॥ జడమూకాంధ బధిరకుబ్జకైరాతవామనాః। భిక్షుకృశ్చారణాదాస్యో మాలాకారాః కళావిదః॥ అంతఃపురగతాం వార్తాం నిహారేయురలక్షితాః॥౪౧

మందులగువారును- మూగవారును- చెవుటివాండ్రును- గుడ్డివాండ్రును- మరుగుజ్జులును- కిరాతులనువీపుల గూనుగలవాండ్లును- అవయవవక్రంబులుగలవారలును - బిచ్చమెత్తుదు ఆడస

న్యాసివేషంబులు ధరియించినవారలును - దిగంబరసన్యాసులును- దాసీజనంబులును- పువ్వులుదెచ్చువారును- కమసలవారును నగునంతఃపురపరిచారక జనంబులు శత్రుజనంబులకుం స్వాధీనులగుచు నంతఃపుర వృత్తాంతంబులు వెలిజేయుచుంద్రుగావున నట్టివారలు గనిపెట్టియుండవలయుననుట... •• ... ౪౧౫

శ్లో॥ ఛత్రవ్యంజనభృంగారు యానవాహనధారిణః।
మహామాత్రా బహిర్వ్యాప్తాం విదురన్యేబహిశ్చ
రాః॥ •• •• ... ౪౨౫

గొడుగులుబట్టువారును - సురుటీలువిసరువారును - జలపాత్రంబులుధరియించినవారును - పల్లక్కులు అందలంబులు మొదలగువవారీలమోయువారును - గుఱ్ఱంబుల- బట్టువారును - యేనుగులందోలు మాహుత్తులును - మరియుగలపరిచారకులును రాజసమీపవృత్తాంతంబులనెరింగి వెలిబుత్తురనుట.. •• ౪౨౫

శ్లో॥ సూదవ్యంజన కర్తారఃకల్పకాస్నాపకాస్తథా। ప్రసాధకాబోధకాశ్చ గాత్రసంవాహకాఅపి । ఫలపుష్పప్రదాతారోజలతాంబూలదాయకాః॥కర్వ్యారసదాహ్యాతేయెచాన్యేభ్యాశవర్తినః॥... ...౪౪౫

వంటలవాండ్లును - చందనాదులలందు వారలు స్నానంబులొనరింపంజేయువారును- దేహముగడుగువారును- మేల్కొలుపువారును- దేహముపాదంబులు నొత్తువారును- పండ్లుపువ్వులుజలంబులు తాంబూలంబులు మొదలగు భోగ్యపదార్థంబులొసంగువారును మరియును సమీపంబునంగలవారును విషాదిప్రయోగంబులొనర్చుటకుం గనిపెట్టియుంద్రుగాన వారిం గనిపెట్టియుండందగుననుట.. ... ... •• ... ౪౪౫

శ్లో॥ సంజ్ఞాభిర్ముద్రితైర్లేఖైరాకారైరింగితైరపి। సంచారయేయుకవ్యగ్రాశ్చరాశ్చర్యాంపరస్పరం॥౪౫౫

జాడలచేతయు- మొహరులుజేసినరహస్యపత్రికలచేతయు దేహవిన్యాసాభినయములచేతయు-తాత్పర్యంబులు వెలిపుచ్చు

చు హంసకారాలోండొరులకుం దెలుపుచుం జెరియింతురుగాననట్టి విగనందగుననుట.. ... ... ... ... ... ౪౫

శ్లో॥ సమాపిబంతో జగతాం మతానిజలానిభూమేరివ సూర్యపాదాః। అనేకశిల్పాధ్యయన ప్రవీణాశ్చ రాశ్చరేయుర్బహులింగరూపాః॥ .. ౪౬

సూర్యకిరణంబులు భూమింగల జలంబులుంబీల్చునట్లు నానావిధ విద్యాభ్యాస కుశలులును వేదాధ్యయన పరులును నానా వేషధారులునునగుచు జగద్వృత్తాంతంబులం దెలియుచుందురనుట .. .. .. .. ... ... .. ౪౬

శ్లో॥ యేనప్రకారేణ పరాను పేయాత్పరాన్నజ్ఞస్స్వసమృద్ధిహేతోః। తమాత్మనిస్వచ్ఛమతి స్తత్జ్ఞైర్ని యుజ్యమానంచపరేణవింద్యాత్... ౪౭

యిహపర అంతర్బాహ్య వృత్తాంతంబుల నెరింగితనకుం జయంబుగలుగునట్లును- ఆపదసంభవించనియట్లును శత్రులవృత్తాంతంబులు దెలియుటకు గూఢచరులం బ్రయోగించుటయు నట్టిచరులవలన నిజవృత్తాంతంబులు వెలిగాకుండ రక్షించుటయు నవశ్యకర్తవ్యంబులుగాన నట్లుజాగరూకుండగుచుం గార్యంబుల నిర్వహించుచుండందగుననుట... ... ... ౪౭

ఇట్లుదూతప్రయోగము పదమూడవ సర్గము.



చతుర్దశసర్గప్రారంభః.



శ్లో॥ అన్వాహంచ రచర్యాభిః విఫలేదూతచేష్టితే। యానాఖ్యంగుణమాతిష్ఠేత్సూక్ష్మబుద్ధిపురస్సరః॥ ...౧

పూర్వసర్గోక్త క్రమంబున నగుదూతప్రయోగముచే కార్యము సఫలతనొందక విఘటించినయెడ సూక్ష్మబుద్ధిచే నాలోచించియాన సామగ్ర్యాదుల సంవిధానంబొనర్చి దండయాత్ర వెడలదగుననుట.. ... ... ... ౧

శ్లో॥ సూక్ష్మాసత్వ ప్రయత్నాభ్యాం దృఢాబుద్ధిరధిష్ఠి
తా॥ ప్రసూతేహిఫలంశ్రీమదరణీవహుతాశనం॥౨

రెండుకొయ్యలు క్రమవిధంబుననొండొకటి నొరయంజేయు
నెడ నుత్పన్నంబగు నగ్నికరణిసూక్ష్మంబగుబుద్ధిబలము చేతయుయ
త్నముచేతయు సుష్టుప్రయుక్తంబగుచు ప్రబలంబగుచు నైశ్వర్యం
బొసంగుననుట... ... ... ... ౨

శ్లో॥ ధాతోశ్చామీకరమివ సర్పిర్నిమఽథ్య వై దధి। బుద్ధి
ప్రయత్నోపగతాద్వ్యవసాయాద్ధ్రువంఫలం॥ ౩

ఒరగల్లుననంటు బంగారముకరణిని - పెరుగు చిలికి వెన్నదీ
యునట్లును - బుద్ధిప్రయత్నముచే నగువ్యవసాయముచే ఫలంబు
నిష్పన్నంబగుననుట.. ... .. .. ... ౩

శ్లో॥ ధీమానుత్సాహసంపన్నః ప్రభుశక్త్యాసమన్వితః। ప్రి
యస్సాన్యత్పరమంపాత్రం అపామివమహార్ణవః॥౪

ప్రభుత్వమంత్ర ఉత్సాహయుక్తుండగురాజు సముద్రంబునం
జేరు జలంబులభంగి సకలైశ్వర్యంబులకుంపాత్రుండగుననుట.౪

శ్లో॥ ఉత్థానాధ్యవసాయాభ్యాం విస్తారముపనీయతే।
నళినీవాంబుసంగత్యాబుధ్యాగ్నిః పరిపాల్యతే॥ ౫

జాగ్రతయు - ప్రయత్నంబునునగు వానిచే నీటిలోనం వృ
ద్ధినొందు తామరలభంగిని పొట్టు మొదలగువాటిచే వృద్ధిబొం
దునగ్ని కరిణిని ఐశ్వర్యముప్రబలుచుండుననుట.. ... ౫

శ్లో॥ లక్ష్మీరుత్సాహసంపన్నా బుద్ధిశ్శుద్ధాప్రసర్పితా।
నాపైతికార్యస్తావేవ విస్తారంచోపగచ్ఛతి॥ .. ౬

ఉత్సాహముతోడంగూడిన లక్ష్మియు పరిశుద్ధబంగుబుద్ధియు
ప్రయోగింపంబడినవగుచు రాజ్యాములవృద్ధిజేయుచుండుననుట.౬

శ్లో॥ వీతవ్యసనమశ్రాంతం మహోత్సాహంమహా
మతిం॥ ప్రవిశంతిసదాలక్ష్మ్యః సరిత్పతిమివాపగాః॥౭

వ్యసనంబుల నొందనివాడును - నెల్లప్పుడుశ్రమజేశియు న

లసటనొందనివాడును - ఉత్సాహవంతుండును - మహామేధావి యునగు నతని సముద్రంబునంజొచ్చు నమలకరణిని సర్వకాలంబులందును సంపదలు జేరుచుండుననుట... ... ... ౭

శ్లో॥ సత్వబుద్ధ్యుపపన్నోపి వ్యసనాసక్తమానసః। శ్రీ
భిష్షండ ఇవ స్త్రీభిరలసః పరిభూయతే ... ౮

బలంబునుం బుద్ధియుంగలిగి - వ్యసనంబులయందాసక్తుండయ్యేనేని నపుంసకు నవమానంబొనర్చువని తెలతెరంగున సంపదలవమానంబొనర్చుననుట... ... ... ... ౮

శ్లో॥ ఉత్థానైరాధయేత్సత్వమింధనైరివపావకం। శ్రీ
యంహి సతతోత్థాయీ దుర్బలోపి సమశ్నుతే॥ ౯

కట్టెలచేత వృద్ధినొందించునిప్పు కరణి సతతయత్నముచే బలంబును వృద్ధి జేయుచుండ - దుర్బలుండయ్యును సతతప్రయత్నము వలన నైశ్వర్యంబందుననుట.. .. ... ... ౯

శ్లో॥ భోక్తుంపురుషకారేణ దుష్టాం స్త్రియమివ శ్రియం।
వ్యవసాయం సదేవేచ్ఛన్న హి క్లీబవదాచరేత్॥ ౧౦

పురుషప్రయత్నముచేత దుష్టురాలగునంగనం స్వాధీనము జేసికొనునట్లు యత్నించందగుంగాని నపుంసకవృత్తినంగీకరించందగదనుట... .. .. ... ... ౧౦

శ్లో॥ కచేశ్రియం సదోత్సాహీ సైంహీం వృత్తిముపాశ్రి
తః। కచగ్రహేన కుర్వీత దుర్వినీతామివ స్త్రియం॥ ౧౧

ఉత్సాహవంతుండగు పురుషుండు సింహవృత్తిననుసరించి పరాక్రమాతిశయముచే దుష్టురాలగు నాయికంగొప్పు బట్టి వంచునట్లు జయశ్రీనాక్రమించందగునమట - యిట్లు జేయుటమహా పరాక్రమశాలియగు వాడును నొకానొక కాలంబునం జేయంపగుంగాన సర్వత్రప్రయోగించుట కుందగదనియు నన్నికాలంబుల మంత్రపూర్వకానుష్టానంబు యుక్తంబనియుం దెలియవలయు... ... .. ... ... ౧౧

శ్లో॥ కిరీటైస్సశిరస్త్రాణైః ఖడ్గైమూర్ధ్నినిపాతితైః।
నాకృత్వా విద్విషాం పాదంపురుషో భద్రమశ్నుతే॥ .. ... ... ... ౧౨

కిరీటంబులుగలదియు శిరస్త్రాణాదులగు పరికరములుగలదియు నగుశత్రుశిరంబులం బడద్రోయకయు పాదాక్రాంతులం జేయకయు నరుండధికైశ్వర్యంబు నొందజాలండనుట... ౧౨

శ్లో॥ ప్రయత్నైః ప్రేర్యమాణేనమహతా చిత్తహస్తినా। రూఢద్విట్ద్రుమ మోత్పాటమకృత్వాహనుత స్సుఖం॥ .. .. .. ౧౩

నానావిధంబులగు ప్రయత్నములచేనుత్సాహమునొందినమనంబను గజముచేశత్రువైరంబులను వ్రేళ్లుబారిన వృక్షంబులం బెకలించక నీలోకంబున సుఖంబెట్లుగలుగుననుట... ౧౩

శ్లో॥ హేలాకృష్టస్ఫురద్దీప్తఖడ్గాంశుపరిపంజరైః। శ్రీమత్కరికరాకారైరాశ్రయంతెభుజైశ్శ్రియః॥౧౪

అతిలాఘవముచేనీడ్వంబడుకత్తి మెఱుగులచే శోభాయుక్తకరికరాకారంబగుభుజంబును లక్ష్మియాశ్రయించుంగాని నితరులభుజంబాశ్రయింపదనుట.. .... .. ... ౧౪

శ్లో॥ దదాత్యుచ్చైః పదన్యాసానారురుక్షుర్గిరేశ్శిరః।అన్యథానిపతంతీహభయాన్నైచైః ప్రవర్తనాత్॥౧౫

పొడవగుకొండపై కెక్కువాడు పైపైనిగుడింపందగుపాదవిన్యాసంబులు జేయుచునడచే నేని జేరుననియు - నట్లులేక భయముచేపందయగువాడుక్రిందియడుగు లిడుటవలనక్రిందంబడుననియు నుండుంగావున యుత్సాహియగువాడు సంపదల ననుభవించుననుట... .. .. ... .. ... ... ...

శ్లో॥ ప్రమాణాభ్యధికస్యాపిమహోత్సత్వమధిష్ఠితః।గతభీర్భీతిజనననంభోగంభోగీవదశేఱయొత్। యథాబలంచకుర్వీతరిపౌదండనిపాతనం॥ .. ..౧౬

తనకన్న నధికుండగువానినైనను పూర్వోక్తంబగు నుత్సాహియగువాడుక్రిందుపరచుననుట - అట్లయ్యును నితరులబలాబ

లంబులు దెలిసి భయము విడిచి సర్వస్వభావంబనుసరించి బెదరు గనంబరచుచు తనబలంబున కనుగుణంబగు దండప్రయోగంబు జేయందగుననుట... ... .. ... .. ౧౬౫

శ్లో॥ ప్రకృతివ్యసనంయస్మాత్తత్ప్రశామ్యసముత్పతేత్।
అనయాపనయాభ్యాంచజాయతే దైవతోపివా॥౧౭౫

దైవప్రాతికూల్యము చేతయు నీతిమార్గంబను సరింపమి చేతయు - దుర్మార్గప్రవర్తనము చేతయు రాజ్యము మొదలగు సప్త ప్రకృతులకును వ్యసనంబులుత్పన్నంబులగుంగావున నెట్టి విషయంబున కెట్టివ్యసనంబుత్పన్నంబయ్యెనట్టి దానిందెలిసి దానికిం బ్రతిక్రియ యొనర్చి యనంతరంబున దండయాత్ర వెడలం దగు ననుట. .. ... ... .. ... ... ౧౭౫

శ్లో॥ యస్మాద్విపత్తిపేత్ శ్రేయా త్తస్మాద్వ్యసనము
చ్యతే।వ్యసన్యధోధో వ్రజతితస్మాత్తత్పరివర్జయేత్॥౧౮౫

వ్యసనంబను శబ్దంబునకు శ్రేయస్కరంబగు కార్యంబులనుండి దూరంబున మనుజునిం దొలంగించుగాన వ్యసనంబని ర్వాఢియయ్యెండుగాన... ... .. ... .. ... ...

హింస్యటం జస్యతిదూరంక్షిపతి శ్రేయః పరమాభ్యు
దయంయస్మాద్వ్యసనముచ్యతే॥.. ... ..

అని పదవిభాగము.

గాన వ్యసనియగు పురుషుండధోగతి నందుచుండుంగావున నట్టి వ్యసనంబుల విడువందగుననుట.. ... ... ౧౮౫

శ్లో॥ హుతాశనోజలంవ్యాధి ర్దుర్భిక్షో మారకస్త
థా। ఇతిపంచవిధం దైవం మానుష్యం ద్వివిధం
మతం॥ ... .. ... .. ౧౯౫

నిప్పుబడి కాలుటయు - నీటిచే మునుంగుటయు - రోగముల చే బాధం జెందుటయు - కరువు చే నలజడినొందుటయు - మారి మొదలగు వాటి చే జచ్చుటయు ననునది యగు దైవకృతంబులగు వ్యసనంబు లైదువిధంబులును పదియేడవశ్లోకంబున నుదహరింపంబడిన అనయ-

అపనయకృతంబులగు రెండు దెఱంగులగు మనుష్యకృతవ్యసనంబు
లుగలిగియుండు... ... ... ... ౧౯౪

శ్లో॥ దైవంపురుషకారేణశాంత్యాచప్రశమంనయేత్ ।
ఉత్థాపితేననీత్యాచమానుషంకార్యతత్వవిత్ ॥౨౦౪

పూర్వోక్తలక్షణలక్షితంబులగు దైవకృతంబులకు జలసేచ
నాదులనగా- నిప్పుబడి కాలుటకు నీళ్లుజల్లుటచేశమింపంజేయుట
యు- నీళ్లమునుకపు నీరుదీశిపోవుటకుండగు నుపాయంబులొనర్చు
టయు - రోగంబులకౌషధంబులొనర్చుటయు- కరువునకు। వరుణ
జపాదులగు క్రియలచే వానలుగలుగంజేయుటయు - మారిమొ
దలగువాటికి యాథర్వణోక్తక్రమంబునశాంతికాదులొనర్చుట
యునను మానుష ప్రతిక్రియలొనర్చుటయునను దైవవ్యసనప్రతి
కారంబును - అనయరూపంబగుదాని నీతిశాస్త్రానుష్ఠానము చేత
యు- అపన్యాయంబునకును నీత్యనుష్ఠానముచేతయుప్రతిక్రియలొ
నర్చి యటుపిదప కార్యస్వరూపానుగుణంబుగ యాత్రజేయం
దగుననుట.. ... ... .. .. ... ౨౦౪

శ్లో॥ స్వామ్యాదిమిత్రపర్యంతంప్రాకృతం మండలంచ
యత్ । తస్యకర్మప్రవక్ష్యామివ్యసనంచ యథాక్ర
మం॥... .. ... ... ౨౧౪

రాజు మొదలు మిత్రునిపర్యంతంబగు రాజ్య సప్తాంగంబులకు
నుగలకార్యవిభాగంబులును దానికింగలవ్యసనస్వరూపంబులును
దానికింగలప్రతిక్రియలును క్రమంబుననొడువంబడుననుట. ౨౧౪

అందు రాజవ్యసనంబులును పరిహారంబులునుకృత్యం
బులును విస్తరంబులగుటంజేసియనంతరంబు ప్రత్యేకం
బుగ దెలుపంబడి యెడుగాననదిదక్క-మిగులంగలయ
మాత్యాదిప్రకృతిమండలంబునకుంగల కార్య వ్యసనా
దులయథాక్రమంబుగ దెలుపంబడియెడు.. .. ...

అందు అమాత్య విషయము.

శ్లో॥ మంత్రోమంత్రఫలావాప్తిః కార్యానుష్ఠానమర్థ
తః | ఆయవ్యయేదండనీతిరమిత్రప్రతిషేధనం| వ్య
సనస్యప్రతీకారోమంత్రికర్మైతికీర్తితం॥... ..౨౩

పంచాంగలక్షణ లక్షితంబగు మంత్రసర్గోక్తవిధానంబయి
యుండెడు నాలోచనంబొనర్చుటయు - మంత్రనిశ్చితంబులగు వ్య
వహారంబులచే నదిసఫలంబందంజేయుటయు - రాజ్యపాలన పో
షణవృద్ధ్యాదులగుక్రియల నాయాయికాల దేశంబులెఱింగియా
లస్యంబందక కార్యంబులంబ్రయోగించుటయు - ఆదాయము గ
లుగజేయుమార్గంబులచింతించుటయు రాబట్టుటయు - విషయంబు
లం దెలిసివ్యయంబొనర్చుటయు - దండనీతిశాస్త్రంబునంగల క్ర
మంబునవధపరిక్లేశధనగ్రహణాదులగుకృత్యంబులనుష్ఠించుటయు
శత్రులగువారిని షేధించుటయువక్ష్యమాణంబులగు వ్యసనంబు
లకుప్రతిక్రియ లొనర్చుటయుమంత్రికృత్యంబులనుట.. ..౨౩

మంత్రివ్యసనంబులు.

శ్లో॥అమాత్యేవ్యసనోపేతే శక్తియుక్తోపిభూపతిః|అశ
క్త ఏవోత్పతితుం ఛిన్న పక్ష ఇవాండజః॥ .. ...౨౪

మంత్రిధూర్తులగుశత్రువులచే పట్టుబడినను లంచంబులాది
యగుక్రియావిశేషంబులచే శత్రుపక్షీయుండైననునగు నెడ రాజు
సమర్థుండయ్యును రెక్కలు లేనిపక్షి భంగియుద్ధతుండగుట క
శక్తుండగుననుట... .. .. ... ౨౪

రాష్ట్రకర్మము.

శ్లో॥ హిరణ్యధాన్యవస్త్రాణివాహనానితథైవచ। తథా
న్యేద్రవ్యనిచయాఃప్రజాతస్సంభవంతిహి। వార్తా
ప్రసాధయేన్నిత్యంవార్తావైలోకసంశ్రయః। ప్రజా
యాంవ్యసనస్థాయాంనకించిదపిసిధ్యతి॥... ...౨౫

ధనంబును- ధాన్యంబులును- వస్త్రంబులును - గజతురగరథా
దులును- కాంస్యలోహతామ్రాదులగు నానావిధవస్తువులుసుజనం

బులవలనసుత్పన్నంబులగునదియు నట్టిజనంబులుప్రాణ
౹లక్షితంబుగా వార్తయనగా కొలుకరాళ్ణాననుసరించియుండు
దురగుటనట్టివారలభేదాదులగు వ్యసనంబులంబొందకుండగాపొ
డందగుననుట.. ... ... ... ..

దుర్గప్రయోజనము.

శ్లో॥ ప్రజానామాపదిస్థానాంరక్షణంకోశదండయోః। పౌ
రాశ్చైవోపకుర్వంతిసంశ్రయాంయెహదుర్గిణః॥ తూ
ష్ణీంయుద్ధంజనత్రాణంమిత్రామిత్రపరిగ్రహః। సా
మంతాటవికాబాధాసంరోధోదుర్గఉచ్యతే। స్వప
క్షైః పరపక్షైశ్చదుర్గస్థః పూజ్యతేనృపః। ఏతద్ధి
దుర్గంవ్యసనాత్సర్వమేవవినశ్యతి॥.... ...౨౯

చాతుర్వర్ణవిశిష్టులగు రాష్ట్రపురజనంబుల కాపదగలుగు నె
డరక్షించుటయు -బొక్కసముగా పాడుటయు- దండవిషయంబ
గు నాయుధాదుల రక్షించుటయు-పౌరజానపదులగు వారింబొ
క్కసద్రవ్యాదులచేనాపత్కాలంబునంగా పాడుటయు - దుర్గం
బునం దాశ్రయించియుండువారల సంకటపాటునొందకుండంగా
పాడుటయు -యుద్ధము జేయకుండు నెడనుకొరతగా పాడుటయు
జనంబుల రక్షించుటయు - ఆపదనొందిన మిత్రులనుశరణు జెం
దిన శత్రువులనుం గాపాడుటయు- సామంత రాజులచేనగు బా
ధయు - ఆటవికులగు దొంగలుమొదలగు వారిచేనగు బాధయు
నివారించుటయును - నిదియుంగాక దుర్గస్థుండగు రాజుతనవా
రిచేతయు - శత్రుపక్షీయులచేతయు- పొగడ్తకెక్కుటయు ననుగు
ణంబులు కోటలను దుర్గంబులను నాశ్రయించియుండుంగావు
న నట్టిదానికిసంకటంబు లేనియట్లుగా పాడందగుననుట.. ౨౯

బొక్కస ప్రయోజనము.

శ్లో॥ భృత్యానాంభరణాద్దానం భూషణంవాహనక్ర
యః। స్థైర్యంపరోపజాపశ్చదుర్గసంస్కారఏవచ।
సేతుబంధోవణిక్కర్మప్రజామిత్రపరిగ్రహః। క్షీ

ణః ప్రజాశ్చమిత్రాణికోశేనైవచ గృహ్యతే। ధర్మ
కామార్థసిద్ధిశ్చకోశాదేతత్ప్రవర్తతే। పతత్స
ర్వంజహాతీహకోశవ్యసనవాన్నృపః॥... ...౩౨.

భృత్యులరక్షించుటయు- సంబళంబులొసంగుటయు - భూష ణంబులం జేయించుటయు గుఱ్ఱములు యేనుగలు రథములుఆందోళి కంబులు మొదలగువాహనంబులంగొనుటయు- నిలుకడగలుగుట యు. శత్రుబలాదులదానాదికృత్యంబులచే స్వాధీనంబొనర్చుట యు - కోటలమరమ్మతులును- వంతెనలుగట్టుటయు - వర్తకంబు లొనర్చుటయు- ప్రజలను స్నేహితులనుంగూర్చుటయు - బలాదు లచేక్షీణుండయ్యును ప్రజలు సైన్యము మిత్రులు మొదలగువారిప రలంజేర్చుటయు - ధర్మసిద్ధియు- కోరికెలంబూరించుటయు - నా నావిధప్రయోజనంబులనెరవేచుటయు - బొక్కసంబువలనం గలుగు ప్రయోజనంబులుగావున నదిక్షీణంబగునెడ నెద్దియు నె రవేరకుండుటంజేసి దానినతిప్రయత్నమువలన వృద్ధినొందింపంద గుననుట... ... ... ... ... ..౩౨

బలప్రయోజనము.

శ్లో॥ మిత్రామిత్రహిరణ్యానాంభూమీనాం చప్రసాధ
నం। దూరకార్యాశుకారిత్వంలబ్ధస్య పరిపాలనం।
పరచక్రవిఘాతశ్చ స్వదండస్య పరిగ్రహః। దండా
దేతత్ప్రభవతి యాతితద్వ్యసనే క్షయం। అర
యోపిహిమిత్రత్వంయాంతిదండవతోధ్రువం। దండ
ప్రాయోహినృపతిర్భువనత్వాక్రమ్య మేదినీం॥౩౫

బంధువుల స్నేహితులంగూర్చుటయువారలకుపకారంబు లొ నర్చుటయు - శత్రుజనంబులని గ్రహించుటయు - ధనంబులం గా పాడుటయు - భూములరాజ్యంబులసాధించుటయు - శత్రు చతు రంగంబులంబగల్చుటయు తనబలంబులగాచికొనుటయు శత్రువు లునుభయముచేమిత్రులగునట్లొనర్చుటయు-దండధారుండగు రా జుబలాత్కారంబున రాజ్యంబులనాక్రమించియనుభవించుంగావు

ననుఅట్టిబలంబులువ్యసనంబులచేకృశించె నేనియన్ని కార్యంబులునశించుంగావునదండంబునతిప్రయత్నంబునం గాపాడందగు ననుట.. .. ... ... ... ...౩౫

మిత్రజనప్రయోజనము.

శ్లో॥ సంస్థంభయత్య మిత్రాణిచలనాదచలంయథా।
తత్తత్కరోతిసుబహు మిత్రం స్నేహనిబంధనం।
తస్మిన్వ్యసనమాపన్నే మిత్రకర్మనవిద్యతె। ఉప
కారాద్ఛతెప్యాశు మిత్రంశ్రేయసితిష్ఠతి। మిత్ర
వాక్సాధయత్యర్థాన్దుస్సాధ్యాన్సృథనాన్యపి॥౩౬

మిత్రుండగువాడుశత్రునిని స్నేహమువలన నిలుపుటయు- ఆయాయివిషయంబుల స్నేహపాశబద్ధుండగుచునతిశయంబుగ ఫలము నొందంజేయుటయు- తనచేసుపకారం బొనర్పంబడకయు- స్నేహితుండగువాడు తనయభ్యుదయంబు గోరుచుండుటయు- దుష్కరంబులగు ప్రయోజనంబులును ప్రభూతధనంబులునుసహాయమువలన సాధించుటయు - నట్టిమిత్రునకు వ్యసనముసంభవించు నెడనివియన్నియు హీనంబులగుంగావున మిత్రునిసౌహార్దము వృద్ధిజేయుటయు యత్నావశ్యకంబనుట... ... ౩౬

ఇట్లు అమాత్యాదిమిత్రాంతంబగు సప్తప్రకృతులప్రయోజనంబులువివరించియింక ప్రధానుండగు రాజప్రయోజనంబు దెలుపంబడియెడు.. ... ... ...

రాజువలననగు ప్రయోజనము.

శ్లో॥ అన్వీక్షణంచవిద్యానాం సద్వర్ణాశ్రమరక్షణం।
౧ ౨
గ్రహణంయుద్ధశాస్త్రాణాంయుద్ధమార్గోపశిక్షణం।
౩ ౪
వ్యాయామశ్శాస్త్రవిజ్ఞానం కర్మణాం లక్షణాని
౫ ౬
చ గజాశ్వరథపృష్ఠేషు యథావత్సం ప్రవ
౭
ర్తనం। నియుద్ధకౌశలంమాయా పరచిత్తప్రవేశ
౮ ౯ ౧౦ ౧౧

నం। ధూర్తతాశాపయుక్తేషు[౧౨]సత్సుసద్వృత్తదర్శ[౧౩]
నం।మంత్రోద్యో[౧౪]గోనుమంత్రత్వం[౧౫]తద్వతోరక్ష్యమే
వచ[౧౬]। ఉపేక్షా[౧౭]సామ[౧౮]దానే[౧౯]చభేదో[౨౦]దండప్రసాధనం[౨౧]।
సమ్యక్చ్ఛారవిజ్ఞానం[౨౨]దుష్టానాంచావరోపణం[౨౩]ప్రశా
స్త్రసైన్య[౨౪]ప్రాసాదగతాగతపరీక్షణం[౨౫]ప్రకృతి వ్యస
నాపాయః[౨౬]క్రుద్ధప్రశమనానిచ । కార్యాణాం[౨౭]రధకా
రాణాంగతాగతపరీక్షణం[౨౮] ప్రశాస్త్రధ్యక్షసేనానాం
మంత్ర్యమాత్యపురోధసాం[౨౯]।గురూణామనువృత్తిశ్చ[౩౦]
పూజ్యానాంచాపిపూజనం[౩౧]। ధర్మాసనప్రతిష్ఠానం[౩౨]
రాజ్యకంటకశోధనం[౩౩]। భృత్యాభృత్యపరిజ్ఞానం[౩౪]।కృతా
కృతపరీక్షణం[౩౫]। తుష్టాతుష్టవిచారశ్చ[౩౬] సర్వేషామను
జీవినాం। మధ్యోదాసీనచరితజ్ఞానం[౩౭]తత్సంధిపాల[౩౮]
నం[౩౯]। ప్రతిగ్రహస్తుమిత్రాణా మమిత్రాణాంచనిగ్ర
హః[౪౦]। పుత్రదారాదిభిర్గుప్తి[౪౧]ర్బంధువర్గపరిగ్రహః[౪౨]।ఖని
ద్రవ్యవనాదీనాం స్వవృత్తీనాంప్రవర్తనం[౪౩]। అస
తాంచపరిక్షపణ[౪౪]సతాంచ పరిగ్రహణం[౪౫]। అభృతా
నాంచవా స్త్రీణాం అధమానాంచవర్జనం[౪౬]। అధ

౪౭ ౪౮
స్త్యాణామగ్రహణంగ్రాహ్యాణాంగ్రహణంతథా।
౪౯ ౫౦
అర్థస్యయుక్తస్యకరణంఅనర్థస్యచవర్జనం। వై
౫౧ ౫౨
షమ్యాణాంప్రశమనంభృత్యానామనిరోధనం। అ
౫౩ ౫౪
ర్ఘనిర్ధారణంచైవప్రధానకరణాదనం। న్యాయ
౫౫ ౫౬
తశ్చకరాదానంస్వయంవాప్రతిమోక్షణం। అవి
౫౭ ౫౮
జ్ఞాతస్యవిజ్ఞానంవిజ్ఞానస్యచనిశ్చయః।ఆరంభఃకర్మ
౫౯ ౬౦ ౬౧
ణాంశశ్వదారబ్ధస్యాంతదర్శనం।అలబ్ధలిప్సాన్యా
౬౨
యేనలబ్ధస్యపరివర్ధనం।పరివృద్ధస్యవిధివత్పాత్రే
౬౩ ౬౪
షుప్రతిపాదనం। అధర్మప్రతిషేధశ్చ న్యాయమా
౬౫ ౬౬
ర్గానువర్తనం। ఉపకార్యుపకారిత్వంవృత్తమేతన్మ
హీపతేః।ఏతత్సర్వమమాత్యాదిరాజ్యంనయపురస్స
రం। నయత్పృష్ణాతియస్సశ్త్రోవ్యసనైక్షయమేవతు॥౫౫

త్రయీవార్తాదండనీతుల అనుమానంబులచే మనంబునయుక్తిప్రత్యుక్తులంగల్పించుచు నిదిప్రత్యక్షంబుగ గనంబడునేయనియు-ప్రత్యక్షంబుగాని విషయంబులగుదానినాగమప్రామాణ్యంబులవలన గ్రహింపందగినదనియు - అర్థవాదంబయినదియు - విపరీతంబులగునదియు - ననుతర్కవిధానంబగు యుక్తిబలముచే విమర్శించుచుండుటయు౧-శాస్త్రంబులనంబడు ధర్మశాస్త్రనిర్ణయంబులగు యోగ్యతగలవారల యాశ్రమాచారంబులును వర్ణనియమంబులును దప్పకుండ రక్షించుటయు౨- పరిశుద్ధంబులగు ధనుర్విద్యాగమాదుల గ్రహియించి యనుష్టించుటయు౩- ప్రకాశయుద్ధంబులును - మాయాయుద్ధంబులును ఉదాసీనయు

ద్ధంబులు మొదలగు యుద్ధకౌశలంబు లెఱుంగుచు కసరతులొనర్చు టయు౪-సాము జేయుటయు౫-శస్త్రభేదంబులు దెలియుటయు౬-ఆయాయి జాతులకర్మ భేదంబులుందారతమ్యంబు లెఱుంగుటయు కవచంబులు జేయించుటయు బాణంబులు ధనుస్సులు మొదలగు నదియు నెడమచేతంధరియించు డాలు మొదలగు సాధనంబుల ప్రమాణభేదంబులు మొదలగువాటిం దెలియుటయు౭-గుఱ్ఱంబుల నెక్కుటయు గజస్కంధారోహణంబును రధచర్యయు వీటి మీద యుద్ధంబులొనర్చు నేర్పుల నభ్యసించుటయు౮-మల్లయుద్ధంబుల నేర్పును౯-మోసంబులు జేయు విధంబు లెఱుంగుటయు౧౦-అన్యులచిత్తంబు లెఱుంగుట అన్యులమనంబునం బ్రవర్తిల్లుటయొట్లన.. .... .. .... ..

శ్లో॥ యస్యయస్యహియోభావ స్తేనతేనహితంనరం।
అనుప్రవిశ్యమేధావి క్షిప్రమాత్మవశంనయేత్॥

అను న్యాయంబున నెవ్వని కెద్దియిష్టంబగుచుండు దాని ననువర్ణించుచు నతనిలో నొనర్చుకొనందగుననుక్రమంబున నెఱుంగుటయు౧౧-దుష్టులగు శాపంబులు మొదలగు దుష్కృత్యంబులొనర్చు వారలవిషయంబున ధృష్టతయు౧౨-యోగ్యులయెడ ననురాగంబు జూపించుటయు౧౩-పూర్వోక్తలక్షణపంచకయుతంబగు మంత్రంబు జేయ యత్నించుటయు౧౪-మంత్రులచే నాలోచిత నిశ్చితంబులగుదాని మరల తానునుగూడి యాలోచించి స్థిరపరుచుటయు౧౫-అట్టినిశ్చితమంత్రంబుల రక్షించుటయు౧౬-ఉదాసీనుండగు సమయంబులనూరకుండుటయు౧౭-సామప్రయోగకాలంబెరింగి సామవాక్యంబులం బ్రయోగించుటయు౧౮-దానసాధ్యంబులగు నెడ నాతంత్ర్యప్రయోగంబును౧౯-మిత్రభేదంబులొనర్చు కౌశలంబును౨౦-దండయాత్రా విధానంబొనర్చుటయు౨౧-మంత్రియు అమాత్యుండును సేనాధిపతియు పురోహితుండును మొదలగు తీర్థంబుల మనంబులుతనయందను రాగంబు గలిగియుంటయు నన్యవిధంబులగుటయు ననువృ

త్తాంతంబుల గూఢచారులచే విమర్శించుచుండుటయు ౨౨ దుష్టు
లగు పూర్వోక్తాదుల నాయాయి కృత్యంబులనుండి తొలంగిం
చుటయు ౨౩ - ఆయుధంబులు - ధరియించువారలను - అధికార ని
యుక్తులనగువారల రాకపోకడలుగని పెట్టుటయు ౨౪ - కోటలు మి
ద్దెలు మందిరంబులు మొదలగు దానిచక్కఁబెట్టించుటయు ౨౫ - స
ప్తప్రకృతులకును సంభవించెడు దైవమానుషవ్యసనంబుల నుప
శమింపంజేయుటయు ౨౬ - కారణక్రుద్ధులగువారి తృప్తులంజేయు
టయు ౨౭ - నానావిధంబులగు కర్మకారులును రథములునిర్మించువా
రలు మొదలగువారు నియతవిధిని కార్యంబులొనర్చుటయు యూ
రకుంటయు మొదలగు హాజరుగైరుహాజరీల విమర్శించుటయు ౨౮ -
మంత్రిపురోహిత సేనాపతిధర్మాధికారులు మొదలగు గౌరవింపం
దగినవారల గౌరవించుటయు ౨౯ - గురువులకణకువయు ౩౦ -
మన్నింపందగువారి మన్నించుటయు ౩౧ - న్యాయాన్యాయ వి
చారణధర్మాసనంబునం గూర్చుండుటయు ౩౨ - రాజ్యకంట
కులగు జారచోరాదుల వధబంధ[illegible]కండ హిరణ్యగ్రహణా
దులచే నిగ్రహించుటయు ౩౩ - నౌకరులను నౌకరులుగాని
యుమైదువాలకాను విమర్శించుటయు ౩౪ - చేసినపనులనుచేయ
ని పనులనుం దెలియుటయు ౩౫ - ఆయాయి జనంబులకుంగల
తృప్తిఅతృప్తుల విమర్శించుటయు ౩౬ - మధ్యస్థులగు వారియొ
క్కయును దాసీనులగు వారియొక్కయు వృత్తాంతంబుల చారు
లచే విమర్శించుటయు ౩౭ - అట్టివారలతోడ నొనర్చిన త్రీటీ
లనిబంధనలంగా పాడుటయు ౩౮ - ఆప్తులంజేర్చుటయు ౩౯
అనాప్తులగు వారినిగ్రహించుటయు ౪౦ - పుత్రులను అంతఃపు
రస్త్రీలను పూర్వోక్త విధానంబున రక్షించుటయు ౪౧ - బంధు
గణంబుల దానమానాదులచే తన్ననువర్తించు నట్లొనర్చుట
యు ౪౨ - స్వర్ణరత్నాదులుత్పన్నంబులగు ప్రదేశంబులను -
గజంబులుత్పన్నంబులగు నరణ్యంబులను నానావిధవస్తువులబ్బు
ను పద్విపంబులు లంకలు మొదలగు దానిరక్షించి దిములవలనయు

బొక్కసము నిండించికొనుటయు ౪౩ - దుర్మార్గులనరసిదోలం గండ్రోయుటయు ౪౪ - సన్మార్గప్రవర్తనుల జేర్చుటయు ౪౫ - భరించతగని స్త్రీజనంబులను అధర్మకృత్యంబులను విడుచుటయు ౪౬ - ధార్మికులుగాని వారి సమీపంబున జేర్పమియు ౪౭ - తగు వారల బరిగ్రహించుటయు ౪౮ - ధర్మార్థకామంబులను త్రివర్గ బులకుందగిన వాటిం జేయుటయు ౪౯ - ప్రయోజనము లేని వాని విడుచుటయు ౫౦ | దైవకృతంబులగు దుర్భిక్షమరణాదుల నెరింగి దానికిందగిన ప్రతిక్రియలచే శమనంబొనర్చుటయు ౫౧ - భృత్యులగు వారినిబాధించక యధోచితంబులగు కార్యంబులు సాధించుటయు ౫౨ - పట్టణంబులంగల నానావిధవస్తుజాలంబులకు వెలలనిర్ణయించి వర్తకుల న్యాయంబుగ బ్రజలహింసించిధనార్జనంబొనర్చునట్లు జేయకకనిపెట్టియుండుటయు ౫౩ - ముఖ్యంబులగు నన్నివిషయంబుల నిరీక్షించుటయు ౫౪ - న్యాయంబగు దేశకాలావిరోధంబులగు తీర్పులు పన్నులు ఉపాయనంబులు మొదలగు దాని నా[illegible]ంచుటయు ౫౫ - అట్టివిషయంబులకృషీవలాదుల శక్త్యశక్తులవిమర్శించియనుగ్రహించుటయు ౫౬ - తెలియకుండువిషయంబుల ప్రయత్నముచేతం దెలియుటయు ౫౭ తెలియబడినవిషయంబుల శాస్త్రదృష్టాద్యనుమానంబులచేనిష్పన్నంబొనర్చుటయు ౫౮ - మంత్రికార్యంబులు మంత్రపూర్వంబుగ నారంభించుటయు ౫౯ - ఆరంభించువాని తుదపర్యంతబును నెరవేర్చుటయు ౬౦ - దొరకనివస్తువుల నాశించిసాధించుకోరికెయు ౬౧ - న్యాయక్రమంబున లభించినవస్తువిశేషంబుల వ్యర్థవ్యయనాశహరణంబులుగాకుండునట్లు రక్షించుటయు వృద్ధి జేయుటయు ౬౨ - అట్లు వృద్ధినొందు భాండాగారాదుల నాయాయు పాత్రంబులెరింగి పూర్వోక్తవిధంబున వ్యయించుటయు ౬౩ - ధర్మవిరోధంబులగు వానిని షేధించుటయు ౬౪ - నీతిమార్గము ననువర్తించుటయు ౬౫, తనకుపకారులగు వారలకుందగినయుపకారంబుల కాలదేశంబు లెరింగి యొనరించుటయు ౬౬ - సమునీ

గుణంబులు రాజునకవశ్యంబునుం గలిగియుండవలయుననుట-ఇట్టి యశేషవిషయంబుల నెఱింగి ప్రవర్తించువాడు రాజసప్తాంగంబు లరక్షించుచువృద్ధినొందుంగానియట్లు లేకవక్ష్యమాణంబులగు వ్యసనంబులం దగుల్పబడియె నేనిక్షయించుననుట తాత్పర్య సిద్ధంబ యనుట. ... .. .. .. ... ౫౫

శ్లో॥ తస్మిన్ధర్మార్థయోర్వ్యగ్రే తద్దైవస్య స్థచేతసి।
సర్వమేతదశేషేణమంత్రీసన్నేతుమర్హతి॥ ౫౬

పూర్వోపన్యాసితంబులగు గుణంబులుగలరాజుధర్మార్థంబులయెడ జాగరూకుండయియుండె నేని మంత్రియుతదనుగుణ ప్రకృతిగలవాడగుచునన్నికార్యంబులును విధిప్రకారంబున ననుష్ఠించుచుండుననుట.. ... .. .. ...౫౬

ఇట్లు సప్త ప్రకృతులకుంగలకృత్యంబులుపన్యసించియట్టివానికిం గలవ్యసనంబుల వేర్వేరం దెలుపంబడియెడు... .. ...

అందు రాజ వ్యసనంబులు.

శ్లో॥ వాగ్దండయోశ్చ పారుష్యం అర్థదూషణమేవచ।
పానం స్త్రీమృగయాద్యూతంవ్యసనంపృథివీపతేః॥ ౫౭

మాటలచే పరుషంబులు బలికి యొరులకుం దుఃఖంబులు గల్పించుటయెట్లన... .. ... ... ...

శ్లో॥ వాక్సాయకావదనాన్నిస్సరంతియైరాహతశ్శోచతి రాత్ర్యహాని। పరస్యనామర్మసుతేపతంతి తాన్ పండితోనావసృజేత్పరేషు. .. .. ... ...

అనువిమర్శోక్తిననుసరించకుండుటయు - ౧ - తప్పునకధికంబగు దండనమొనర్చుటయు౨- ద్రవ్యనాశంబొనర్చుట- ద్రవ్యంబు తానెంతమైనను నొసంగకుండుట- ౧ - యిత్తునని కాలంబున నివ్వకయతనికిం గ్రౌర్యంబుత్పన్నంబయినపిదపయిచ్చుటనిట్లిచ్చుటవలన నిచ్చియు ప్రయోజనకారిగా దనుట - ౨ - యిచ్చిన దానిమరలగుంజుకొనుట- ౩ - యనునీమూడుదెరంగులునుననర్థజనకంబులు గావున నట్లొనర్చుటయు - చోరులచేనపహృతంబులగుదానిందిగివి సంసారులకిప్పింపక యుపేక్ష యొనర్చుటయు

నను నర్థ దూషణంబును ౩-మద్యమధుపానంబులు జేయుటయు ౪-కేవల కామినీ జనాసక్తి జెందుటయు - ౫ - వేటలాడు చుండుటయు - ౬ - జూదంబులాడుటయు ౭ - ననుసివియేడును రాజవ్యసనంబులనుట... ... ... ... ..

మంత్రివ్యసనము.

శ్లో॥ ఆలస్యంస్తబ్ధతాదర్పః ప్రమాదో వైరకారితా। ఇ
తిపూర్వోపదిష్టంవా సచివవ్యసనం స్మృతం॥... ౫౭

యత్నపరుండుగామియు - ౧ - మొండితనంబును ౨-గర్వంబును- ౩ - పెద్దలయందడకువ లేమియు - ౪ - పొరబాటును మరుపులును - ౫ - కోపాదులగు నహంకారములచే విరోధంబుల వృద్ధినొందించుటయు ౬ - కారణము లేకయ కలుషితుండగుట ౭ యిదియు రాజదోషోక్తవిషయంబులును మంత్రికిముఖ్యంబగుదోషంబులు ఇవియందరుపురుషులకును సామాన్యంబుగావున మేధావియగునతండీయన్నియునువిడువందగుననుట... ...౫౭

దేశవ్యసనంబులు.

శ్లో॥ అతివృష్టిరనావృష్టిర్మూషకాశ్శలభాశ్శుకాః॥అస
త్కరశ్చదండశ్చపరచక్రాణితస్కరాః॥.. ౫౮

అతివానచే చెరువులు మొదలగునవివిచ్ఛిన్నంబులగుచు రాజ్యముపాడగుటయు - ౧ - వానలేమిచే క్షామము సంభవించుటయు - ౨ - యెలుకలుమిడతలుచిలుకలు పైరులపైంబడినాశంబొనర్చుటయు - ౩- తగనిపన్నుగొనుటయు - ౪ - తప్పునకధికంబగు దండనజేయుటయు మరియుమతవ్యాజంబుల బలవంతంబున నాయాయికాలమర్యాదలజెరుచుటయు - ౫ - రాజవిద్వారంబులచే హానిగలుగుటయు - ౬- దొంగలు మెండగుచు గొల్లబెట్టుటయుననునది రాష్ట్రవ్యసనంబులనుట.. .. .. ... ౫౮

దుర్గవ్యసనంబులు.

శ్లో॥ విశీర్ణయంత్రప్రాకారపరిఘాతమశస్త్రతా। ప్రక్షీ

ణషూసైంధనవద్దుర్గవ్యసనముచ్యతే॥ ...౬౦

నానావిధంబులగుశత్రుమారణయంత్రంబులుపడలుటయు ౧ గోడలుగూలుటయు - అగడ్తలుబూడుటయు - ౩ - ఆయుధంబులులేకునికియు - ౪ - కనువుకట్టెలునీళ్లు ఉలవలుబియ్యము మొదలగుసామగ్రులుక్షీణంబులగుటయునను నివి కోటలకుంగల సంకటంబులనుట... ... ... .. ...౬౦

బొక్కసవ్యసనము.

శ్లో॥ వ్యయీకృతఃపరిక్షిప్తో భక్షితోసంచితస్తథా। ముషితోదూరసంస్థశ్చకోశవ్యసనముచ్యతే... ..౬౧

వ్రయంబగుటయు - ౧ - భృత్యులు మొదలగువారిచే హరింపంబడుటయు - ౨ - రక్షాధికారులచేనపహరింపంబడుటయు - ౩ - కూడబెట్టమియు - ౪ - దూరంబుననుండుటవలనసమయంబున నక్కరకు రాకుండుటయు ననునదికోశవ్యసనంబులు... ...౬౧

బలవ్యసనంబులు.

శ్లో॥ ఉపరుద్ధం౧ పరిక్షిప్తం౨ విమానిత౩మమానితం౪। అభవ్యం౫ వ్యాధితం౬ శ్రాంతం౭ దూరాయాతం౮ నవాగతం౯। పరిక్షీణం౧౦ పరిహతం౧౧ ప్రహ్వతాగ్ర౧౨జనంతథా। ఆశానిర్వేదభూయిష్ఠం౧౩ ౧౪ అనృపప్రాప్తమేవచ౧౫। కళత్రగర్భం౧౬ విక్షిప్తం౧౭ అంతశ్శల్యంతథైవచ౧౮। మిత్రగర్భంహ్యపసృతం౨౦ పరిమృష్టం౨౧తథైవచ। క్రుద్ధమౌల౨౨విమిశ్రం౨౩ చనివిష్టం౨౪చాపివిద్విషి। దూష్యయుక్తం౨౫ స్వవిక్షిప్తం౨౬ మిత్రవిక్షిప్తమేవచ౨౭। విచ్ఛిన్నవీవధాసారం౨౮ భిన్నమూలం౨౯తథైవచ। అస్వామిసంగతం౩౦ చాపిభిన్నకూ

౩౧ ౩౨
టంతథైవచ। దుష్పార్ష్ణిగ్రాహమంత్రంచబలవ్య
సనమిష్యతే॥... ... ... ౬౬౪

బలవ్యసనంబులు బలుకంబడియెడు నిందుకొన్నియసాధ్యంబులనియు కొన్ని సాధ్యంబులనియునుండునైనను యథాక్రమంబుగ నుదహరింపంబడియెడు శత్రుచే నిబంధింపం బడుటయ న్యాయముచే బలవంతుండగుంగావున నతని నక్కాలంబున దొడరవలయుననుట౧- అంతట ద్వేషము బలశియుండుట యిట్టిసమయంబున యుద్ధము జేయందగదనుట అట్టిసమయంబునవారి దానగౌరవంబులచే స్వాధీనులం జేశికొనందగు౨- అవమానము జెందుటయు౩- వారివారికిందగిన గౌరవముబడయనిదియు౪- మంగళకరంబులగు నుత్సాహము లేనిదియు౫- రోగపీడితంబగు నదియు౬- అలసటనొందినదియు౭- తత్కాలంబున నుంచినదియు౮- కూలికి పెట్టినదియు౯- బక్కబడినదియు౧౦- బేలయయినదియు౧౧- సరదారులుజచ్చినదియు౧౨- మిక్కిలిద్రవ్యాసగలదియు౧౩-ప్రమాన్ప డినదియు౧౪-రాజక్రమంబెరుంగనిదియు౧౫-భార్యగర్భిణియగునట్టిదియు స్త్రీలుబలమధ్యంబునగలదియని యు తాత్పర్యంతరము౧౬- దూలనాడంబడినదియు౧౭- చిత్తరువులు వ్రాయనేర్చినదియు౧౮-అన్యసైన్యంబునమిత్రులుగలదియు౧౯-తొలంగినదియు౨౦-దెబ్బలుబడినదియు౨౧-కోపముగలదియు౨౨-మూలబలంబునంగలశినదియు౨౩- శత్రువులయపూర్వంబు నంగొలువుగొలిచినదియు౨౪- బహిష్కరింపంబడినదియు౨౫- తనచేతొలంగింపంబడియున్నదియు౨౬- తనవిహితులచేతొలంగింపబడినదియు౨౭- అన్నపానంబులు లేనిదియు౨౮-తమమూలబలంబులు విచ్ఛిన్నంబులగునదియు౨౯- యజమాన సంబంధమయినదియు౩౦-కట్టులేనిదియు౩౧- సరదారులచేదు బోధనచేయంబడినదియు౩౨- ననునివి బలవ్యసనంబు లనంబరగు... ...౬౬౪

దీనంగల పర్యాయప్రకటనము.

శ్లో॥ ఉపరుద్ధంపరిక్షిప్తమమానితవిమానితం।

పరిక్షీ_ప్తంవిమార్గస్థం సర్వతఃపాపవేష్టితం। యు
ధ్యేతామృతమత్యర్థం తదాత్వేకృతవేతనం॥౬౫
శత్రుని చేనిర్బంధింపంబడినదియు౧-అన్యంబగు గతి లేనిదియు
౨- రూఢమూలంబగునదియు౩- ఆక్షేపింపంబడినదియు౪- తప్ప
దోవనన్నుండునదియు౫- పాపాత్ములచేనంతటం జుట్టబడినదియు
౬- బ్రతికియుండునదియు౭- క్రొ_త్తగగూర్చినదియు౮ - నగుబలం
బులతోడ యుద్ధము జేయందగుననుట...   ...   ...   ౬౫

శ్లో॥ నవ్యాధితమకర్మణ్యంవ్యధితం పరిభూయతే। పరి
శ్రాంతంహియుధ్యేత పరిశ్రాంతంసువిధానతః।మూ
రాయాతంహ్యాత్రప్రాణంనశ_స్త్రగ్రహణక్షమం।
నవాగతంహితద్దైశ్యేర్మిత్రైర్యుధ్యేతతన్న యా
త్।హతముఖ్యప్రవీరంతుపరిక్షీణంనయుధ్యతే।యు
ధ్యేతే హప్రతిహతంప్రవీరైస్సహసంగతం।హతా
జంచనాశక్తంప్రమాథితపురస్సరం। ఆశానిర్వేదిల
బ్ధార్థం ప్రాణాశంచాత్రయుధ్యతే। నాభూయి
ష్టంప్రసారంతు నిరుద్ధాల్పతరంభువం। యుధ్యేతా
మృత్యుసంప్రాప్తంసహాయాయుధవాహనం। స
త్వానురూప సంవాదివాహనాయుధధారణం। అం
తర్గతామిత్రశిల్పంఅంతశ్శిల్పంతఉచ్యతే। అన్యో
న్యమేవనిర్గర్భంభిన్నగర్భంనయుధ్యతే। తథాచాప
సృతంచైవతథారాజ్యాంతరీకృతం। పరిస్పృష్టంహ్యా
పక్రాంతంయుధ్యంతంనక్షమంయుధి। పిత్రుపైతా
మహంమౌలంతత్కృద్ధంసాత్వికక్షమం।ప్రధానా
రూఢసంగుప్తంఅపియుద్ధార్థసంపతేత్। స్వవి
క్షిప్తంస్వవిషయేక్షి_ప్తమాపద్యోదాహృతం। ప్రస్పృ
ష్టదేశకాలత్వాత్ మిత్రాక్షిప్తమయోగికం। ధా
న్యాదేర్వివధాప్రాప్తిరాసారస్తుసుహృద్బలం। అ
స్వామిసంహతంచైవస్వామినాయద్వినాకృతం।

భిన్నకూటమయ స్యైవ స్యాత్ క్షయకూటము నాయ
కం। బలవ్యసనమిత్యాదితత్సమీక్ష్యసముత్పతేత్ ॥ ౭౯

ఇత్యాదిబలంబులకుంగల వ్యసనంబులుగలయడతత్తత్కాలా నుగుణ్యంబులగు నదియోచించి గ్రాహ్యాగ్రాహ్యాబు లెరుంగంద గుననుట... ... ... ... ... ... ౭౯

శ్లో॥ దైవోపపీడితంగ్రస్తంమిత్రంశత్రుబలేనచ। కామ
క్రోధసముత్థైశ్చదోషైస్సంపరికీర్తితైః॥ .. ౮౦

దైవోపహతంబును శత్రువులచే నాక్రమింపబడినదియు కామక్రోధ జన్యంబులగు పూర్వోక్తదోషంబుల గూడినదియు నుపయోగించవనుట... ... ... ... ౮౦

శ్లో॥ నరేంద్రాద్యాః ప్రకృత యస్సప్తాద్యాః పరికీర్తి
తాః । పూర్వంగురుతరంతాసాం వ్యసనంసము
దాహృతం॥ .. ... ... ...౮౧

రాజు మొదలగు సప్తాంగంబుల ప్రయోజనంబులును దాని దానికింగల వ్యసన విభాగంబులునునందుంగల గొప్ప కొద్దియగు తారతమ్యంబులునుం దెలుపంబడియె... .. ... ౮౧

## సర్గోప సంహారము.

శ్లో॥ ప్రకృతివ్యసనా న్యుపేక్షతేయోనచిరాత్తం రిపవః
పరాభవంతి। ప్రకృతి వ్యసనానిభూతి కామస్సము
పేక్ష్యేతనహిప్రమాదదర్పాత్॥ ... ౮౨

యేరాజు పూర్వోక్తంబులగు ప్రకృతివ్యసనంబులను పేక్షించు నారాజును శత్రువులగు వారతిశీఘ్రంబుననవమానంబొనర్తురు గావున నైశ్వర్యకాముండగు రాజు ప్రకృతివ్యసనంబులుగలయడ గర్వప్రమాదంబులచే నుపేక్షింపక దానికిందగు ప్రతిక్రియల నొనర్పందగుననుట.. ... ... ... ... ... ౮౨

శ్లో॥ ఇదమిత్థమితి సమ్యక్కర్మణా యోజనీయంనియ
తమితివిచింత్యప్రాపయేదీహమానః। సునయవిది

తరంధ్రః ప్రాకృతోయస్యవర్గః క్షితిపతిరపిభుంక్తేస
త్రివర్గంచిరాయ॥ ... ... ... ౮౩

స్వామిదుర్గామలగు క్రియావిశేషంబులనాయాయి దేశకాలంబులెరింగి మంత్రనిర్ణయపూర్వకంబుగ పౌరజాటులెరింగి ప్రతిక్రియల్గూర్చుచుతనభృత్యగణంబులనీతిశాస్త్రవిధానంబున రక్షించుచుండునతండు రాజ్య త్రివర్గంబుల చిరకాలంబనుభవించుచుండునని ఫలితార్థము... ... ... ..౮౩

ఇట్లుకామందకప్రకృతిప్రయోజనవ్యసనవిభాగము ౧౮ సర్గము.



పదియైదవసర్గప్రారంభః.



శ్లో॥ అమాత్యాద్యాఃప్రకృతయోమిత్రాంతంరాజ్యము
చ్యతే। అశేషరాజ్యవ్యసనాత్పార్థివవ్యసనం
గురు॥ ... ... ... ౧

ఇట్లుపూర్వ సర్గంబున రాజు మొదలగు సప్త ప్రకృతుల ప్రయోజనంబులును వ్యసనంబులం బలికి యున్న నురాజ వ్యసనంబు లేదని సమష్టిగ బలుకుటం జేసియు దాని దోషంబుల పరిమితంబులగుటం జేశియునది రాజునకుపయోగించునది యైనను దానంగలదోషంబులందరకునునత్యుపయోగంబుగ దెలియుటయు నట్టిదోషంబులు పరిహరించుటయు నత్యావశ్యకంబులగుట యీసర్గంబున తద్వివరణంబువక్ష్యమాణంబగుటం జేసి రాజ్యసప్తాంగంబులయందును అమాత్యాదిమిత్రాంతంబగు షట్ప్రకృతులకుంగల వ్యసనంబులకన్నను రాజవ్యసనంబధికంబని యవతారికె యుపక్రమింపంబడియె.. .. .. ...౧

శ్లో॥ రాజాత్వవ్యసనీరాజ్య వ్యసనైః పోహనక్షమః।న
రాజవ్యసనాపోహసమర్థోఽరాజ్యమూలితం॥ ౨

అందుకు హేతువు పున్యసింపంబడియెడు ఎట్లనరాజు దుఃఖితుండగునెడనితరంబులురాజుంగాపాడుటకశక్తంబులగుటను రా

జగువాఁడు వ్యసనంబులందవ్రులంబడకుండు నెడనమాత్యాదుల దు
ర్మార్గప్రవర్తనంబులనిగ్రహించుటకు శక్తుండగుంగావునను రాజ
గువాఁడువక్ష్యమాణంబులగువ్యసనంబులదవ్రులంబడంజనదనుట. ౨

శ్లో॥ అశాస్త్రచక్షున్నృపతిరంధ ఇత్యభిధీయతే। వర
మంధో నచక్షుష్మాన్మదాదాక్షి ప్తసత్పథః॥ ...౩

కన్నులు లేకుండెడుగుడ్డివాఁడగు మనుజునికన్న శాస్త్ర దృష్టి
లేకమదాంధుండగుచు మంచిమార్గంబులనాక్షేపించురాజుమిక్కి
లియుంజాత్యంధుండనందగుననుట. ... .. ౩

శ్లో॥ మంత్రిభిర్మంత్రకుశలైరంధస్సంవార్య తేనృపః।చక్షు
ర్వ్యక్తోమదాంధస్సన్ ఆత్మానంహంత్య శేషతః॥ ౪

కన్నులుగుడ్డియగుచుండువాఁడు రాజగునేని ధృతరాష్ట్రుని
చే రాజ్యముపాలింపంజేయుభీష్మవిదురాదులగు మంత్రుల కరణి
మంత్రకుశలులగువారిచేరాజువారింపంబడుంగానికన్నులు గలిగి
యునీతిశాస్త్రాంధుఁడగుదుర్యోధనునట్టిమూర్ఖుండగురాజు తన
దగున్నన్ని ప్రయోజనంబుల తనతోడం గూడన నశింపం జేయున
నుట.... .... .. ... .. ..౪

శ్లో॥ సరాజా శాస్త్రచక్షుష్మాన్మహామాత్య మతేస్థితః।
ధర్మార్థపరిఘాతానివ్యసనానిపరిత్యజేత్॥ ..౫

కావుననట్టిమూర్ఖుఁడుగాక శాస్త్రనిపుణతగల రాజగువాఁడు
నీతిశాలియగుమంత్రితాత్పర్యంబునను సరించుచుధర్మార్థ ఘాత
కంబులగువ్యసనంబులవిడువందగుననుట .. ... ... ...౫

వ్యసనవిభాగము అందుక్రోధంబునంబుట్టునవి.

శ్లో॥ వాగ్దండయోశ్చ పారుష్యమర్థదూషణమేవచ
స్మృతంవ్యసనతత్వజ్ఞైః క్రోధజంవ్యసనంత్రయం॥ ౬

వాక్పారుష్యంబును౧ దండపారుష్యంబును౨ అర్థదూష
ణంబును౩ ననునీమూడును నీతిశాస్త్రజ్ఞులచే కోపంబునంబుట్టు
నవియనంబడు.. .. ... ... ... ... ౬

కామంబునంబుట్టినయవి.

శ్లో॥ కామజంమృగయాద్యూతం స్త్రియఃపానంతథైవచ।
వ్యసనంవ్యసనార్థజ్ఞైశ్చతుష్టయముదాహృతం॥ ౭

వేటయు • ద్యూతంబును • వెలదియును సారాయిద్రావుట
యు ననునాలుగువ్యసనంబులును కామజంబులనునది... .. ౭

వాక్పారుష్యవిషయము.

శ్లో॥ వాక్పారుష్యంపరంలోకె ఉద్వేజనమనర్థకం।
నకుర్యాత్ప్రియయావాచాకుర్వీతజనమాత్మసాత్।
అకస్మాదేవయః కోపాత్పరుషంబహుభాషతే। త
స్మాదుద్విజతేలోకస్సస్ఫులింగాదివాంజనాత్।
హృదయేనాగసాతీక్ష్ణంమర్మస్వతి పతన్ముహుః।
తేజస్వినంకోపయతిసదీప్తోయాతివైరితాం। నో
ద్వేజయేజ్జగద్వాచారూక్షయాప్రియయా వాగ్భవేత్।
ప్రాయేణప్రియవాగ్లోకేకృపణోపిహిసేవ్యతే॥౧౧

లోకంబునవచనంబులచే పరుషంబులుబలుకుటయు - నిష్కా
రణంబుగదూషించుటయు - క్రోధహృదయతచే మర్మంబులుసో
కనాడుటయు - యోగ్యుండగుపురుషునినిందించుటయు కటుకం
బులుబలుకుటయు నివిక్రోధంబునంబొడముటయెట్లన...... ...

శ్లో॥ క్రుద్ధఃపాపంనకుర్యాత్కః క్రుద్ధోహన్యాద్గురూనపి।
క్రుద్ధఃపరుషయావాచా నరస్సాధూనధిక్షిపెత్।
వాచ్యావాచ్యంప్రకుపితోనవిజానాతికర్హిచిత్।
నాకార్యమస్తిక్రుద్ధస్య నావాచ్యంవిద్యతేక్వచిత్॥

అనురామాయణోక్తినిక్రోధంబునొందక.. ... ...

శ్లో॥ యస్సముత్పతితంక్రోధంతుమత్తైనిగ్రహ్యతి। య
థోరగస్త్వచంజీర్ణాంసవైపురుషఉచ్యతే॥... ...

అనున్యాయమునను సరించి యోర్పుగలవాడగుచుప్రియవా
క్కులచేజనులదనయందతిమైత్రింగలవారింగావించుచుండుటవల

న కృపణుండగువాడును ప్రియవచనంబులకు బద్ధుండగుచు స్వాధీనుండగుగోవున... .. ... .. ... ...

శ్లో॥ వాక్పారుష్యంసర్వకార్యేషునష్టంవాఙ్మాధుర్యంస
ర్వలోకప్రియత్వం॥... ... .. ...

అనుచాటూక్తిననుసరించియు... ... .. ...

ఉ॥ మాటలచేతదేవతలు మన్ననఁగాంచివధనంబులిత్తురా।
మాటలచేతభూపతులుమన్నన జెందిధనంబులిత్తురా। మాటలచేతకామినులు మన్ననబొందిసుఖంబులిత్తురా। మాటలు నేరకున్న నవమానమునూనమువూనభంగము॥ ... .. ..

అనులోకోక్తిననుసరించిప్రియవంచుంచుగాదగుననుట. ౧౧

దండపారుష్యవిషయము.

శ్లో॥ అసిద్ధసాధనంసిద్ధి శ్శాసనందండఉచ్యతే।తంయు
క్త్యైవనయేద్దండ్యే యుక్తదండః ప్రశస్యతే। ఉ
ద్వేజయతిభూతాని దండపారుష్యవాన్ నృపః।
భూతాన్యుద్వేజమానానిద్విషంతంయాంతి సం
శ్రయం। సంశ్రయాచ్చైవలోకస్య వివృద్ధింయాం
తివిద్విషః। వివృద్ధిస్తువినాశాయతస్మాన్నోద్వే
జయేత్ప్రజాః। లోకానుగ్రహకర్తారఃప్రవర్ధంతే
మహీభుజః। లోకవృద్ధ్యానరేంద్రాణాం వృద్ధి
స్తత్సంక్షయేక్షయః। మహత్స్వప్య పరాధేషు
దండంప్రాణాంతి కంత్యజేత్। ఋతేరాజ్యాప
హారాత్తు తత్రదండఃప్రశస్యతే॥.. ... ౧౨

దండనీతిశాస్త్రజ్ఞులచే న్యాయమున్నదువనియెడ బలాత్కారంబుచే న్యాయంబున్నంబ్రవర్తిల్లునట్లొనరించుట దండనీతియనంబడియె నట్టిదండనీతిఆయాయి యపరాధంబునకుం దగినట్లు జేయుటయుక్తంబగునట్లుగాక నతిశయదండము జేయురాజు భూతంబులననగా రాజ్యంబునంగలజనంబులదుఃఖింపంజేయుగావున నట్లుడికింపంబడిన జనంబుల తనికింగల శత్రురాజు నాశ్రయించి

యతనింజంపుటను యత్నంబొనర్చుటచే శత్రుండగు రాజురూధ
మూలుండగుచునితనినున్మూలించుంగావున నట్లు జేయందగదనియు
జనంబులందయగలిగిపరిపాలించు రాజువృద్ధినొందుంగావున రా
జద్రోహము రాజ్యనాశనము మొదలగు నతిసాహసంబులగు విష
యంబులందక్కమిగతతప్పుల ప్రాణాంతికంబగు దండంబొనరిం
పక యుక్తదండధారియగుటయు క్తంబనుట.. ... .. ౧౬

అర్థదూషణం.

శ్లో॥ద్మూష్యస్య దూషణార్థంచ పరిత్యాగో మహీయసః।
అర్థస్యనీతితత్వజ్ఞైరర్థదూషణముచ్యతే। తదక
స్మాత్సమావిష్టః కోపేనాతిబలీయసా। నిత్యమాత్మ
హితాకాంక్షీనకుర్యాదర్థదూషణం॥.........౧౭

ఇవ్వకుండుటయు-వరుంబడులం జెరుపుటయు- కోపించియొ
సంగుటయు - యిచ్చినదిమరలంగొనుటయు - తప్పుజేసినవానిచే
నధికదండగలుగొనుటయు - యిండ్లుగొల్లబెట్టియంతయుం దోచు
కొనుటయునను విధంబులన్నియు నర్థదూషణంబులగుం గావున
కోపపరవశుండగుచునట్టి కృత్యంబులనుష్ఠించం దగదనుట.. ౧౭

పానవిషయం.

శ్లో॥ పానక్షోభో పానరతౌ పానాభిహరణంతథా।
క్షుత్పిపాసాశ్రమాయాస శీతవాతోష్ణపీడనం।
అభిపానస్యసంపత్త్యాపాన వ్యసనజంమహత్।
గమనేవిహ్వలత్వంచ సంజ్ఞానాశో విషణ్ణతా। ప్రా
ణగ్లానిస్సుహృన్నాశః ప్రజ్ఞా శ్రుతి మతిభ్రమాః।
సద్భిర్వియోగో హ్యసద్భిశ్చ సంగోనర్థేనసంగమః।
స్వగ్లానిర్వేపథుస్తంద్రా అతీవ స్త్రీ నిషేవణం।
ఇత్యాదిపానవ్యసనమత్యంతం సద్విగర్హితం।
శ్రుతశీలబలోపేతాః పానదోషేణ భూయసా।
క్షయముక్షీణ నామానో జగ్మురంధ కవృష్ణయః।

యోగీశ్వరస్సభగవాన్ భార్గవో భృగురల్పధీః।
శుక్రః పానమదాంధత్వాద్బభుజే శిష్యమౌరసం।
పానాసక్తో హి పురుషో యత్రయత్ర ప్రవర్తతే।
యాత్యసద్వ్యవహారిత్వం తత్రతత్ర ప్రవర్తనాత్।
కామం స్త్రియం నిషేవేత మృగయాం సాధుమాత్ర
యా। నద్యూతపానే సేవేత హ్యత్యంతవ్యసనా
హితౌ॥ .. .. ... .. ౨౫

నడుచుచుండు నెడతడబడుటయు - బుద్ధిజ్ఞాపకము జెడుటయు దుఃఖించుటయు - ప్రాణంబులకు సంకటంబును - స్నేహితులన శింపంజేయుటయు - ప్రజ్ఞయు - వివికియు బుద్ధియు భ్రమంబు లొందుటయు - పానంబు నక్షుభితంబందుటయు - అత్యంతాసక్తినొందుటయు - అందువలన ఆకలియు దాహంబును - శ్రమయును అలసటయు - ఎండగాలిచలి మొదలగుపీడలును - తాగుపోతులం గలయుటయు - యోగ్యులగు వారివిడుచుటయు - దుష్టసంగతియు అనర్థంబులగాకడయు - తనదేహము వాడుటయు - వణుకును - తోట్రుపాటును అసంబంధలగునీచ స్త్రీసాంగత్యంబును - నగుచు నధికదుఃఖంబులకు కారణంబులగుచుండు నిందులకు దృష్టాంతరంబులుగ యాదవసార్వభౌములగు అంధకసోమవృష్ణివంశ్యులందరు నొకక్షణంబున పానమువలన మడియుటయు - యోగీశ్వరుండును భృగువంశోత్పన్నుండును గ్రహంబులయందన్యతముండును దైత్యగురుండును మహానీతిశాస్త్రవేదియు నగుశుక్రుండు పానాసక్తుండచు తనశిష్యుని ద్రావుటయు - మరియును - పానము చేమత్తుండగువాడు ప్రవర్తించు నెడల నంతటనునవమానంబునొందుటయు. అందువలన ద్రవ్యంబులంతయు గోల్పోయి దరిద్రులగుటయు - ననుననేకదోషంబు లిప్పానమువలనంగలుగుగావున వక్ష్యమాణదోషదూషితంబులగు స్త్రీలయాసక్తియు వేటలాడుటయునైన నొకపక్షంబున యథోచితంబంగీకరింపందగుంగాని గుణలేశంబైనను జెందక యత్యంతదోషదూషితంబగు నీపా

నద్యూతంబులకొంచ మేఁయు నాశ్రయింపఁదగదనుట...　　౨౫

వేటదోషంబులు.

శ్లో॥ దుఃఖప్రతప్తసికతాకుశకంటక భూమయః। తీక్ష్ణ సంకటజాదోషాఃలతాకంటకస్ఫాటనం । శలపాద శిలాజాలస్థాణువల్మీకపీడనం।ప్రభగ్నోన్నపగత్యశ్చ లసరిద్విపినకః క్లేషు। వధబంధపరిక్లేశాస్స్వామంతా టవికాదిభిః। స్వసైన్యైశ్చస్వకల్పైశ్చ పరమిత్రై శ్చమారణం।ఋక్షాజగరమాతంగసింహవ్యాఘ్ర భయానిచ । దవాగ్నిగ్రామ సంరోధోదిఙ్మోహ భ్రాణానిచ । ఇత్యాద పృథివీంద్రాణాం మృగయా వ్యసనేభృతం॥..　　...　　..　　౨౬

ఎండచేకాలిన యిసుకలయందు నడుచుటయు- ముండ్లురాళ్లు గడ్డిమొదలగు కఠినభూములద్రొక్కుటయు - చురుకుచేతయు సందులదూరుటచేతయునగు సంకటంబులును - తీగెలుముండ్లు విరుచుటయు - రాళ్లుపొదరిండ్లు పుట్టలుగుల్మంబులు పదముండ్లు మొదలగుదానిం దాటుటయు - అడవులుకొండలు గుహలు మొదలగువాటిలోనం దూరుటయు - చంపుటయు - కట్టుటయు దుఃఖంబందంజేయుటయు - మంత్రులు - సామంతులు - బోయలు మొదలగువారల కాయాసంబులుగల్పించుటయు- తనసైన్యంబునకును తనయట్టివారలకును సంకటంబులుగలిగించుటయు - ఎలుగు- కొండచిలువ - ఏనుగ- సింహము - పులి - యిట్టిక్రూరజంతువుల భయంబులును - అడవిగాల్చునవసరంబుననగు పొగచే నరికట్టంబడుటయు - దిక్కులుదెలియక నల్లాడుటయు - నిదియును- మరియునువక్ష్యమాణంబులగుదుఃఖంబులును - వేటవలనంగలుగుచుండుననుట..　　..,　　..　　...　　..　　...　　౨౬

ఇట్టివేటనుగలగుణంబులు.

శ్లో॥ జితశ్రమత్వంవ్యాయామాత్స్వస్యమేదస్యసంక్షు

యః। చలాస్థిరేషులక్ష్యేషు బాణశుద్ధిరనుత్తమా।
ఉత్తమానాంవిహంగానాంమృగాణాంచైవదర్శ
నం । మృగయాయాంగుణానేతా।నాహురప్యే
తదక్షమం॥ ... ... .. ... ...౩౧౪

అడవులందు మృగంబులం బక్షులను ననుసరించి పరువులె త్తుటవలన దేహములివగలుగుటయు - క్రొవ్వుదరుగుటయు - చలలక్ష్యంబులును అస్థిరలక్ష్యంబులును గొట్టునేర్పు గలుగుటయు. ఉత్తమంబులును క్రొత్తలునునగు -మృగంబులంబక్షులంజూచుటయునను కొన్నిగుణంబులు వేటలోనంగలిగినను ఉక్తంబులును వక్ష్యమాణంబులుననగు దోషంబు లధికంబులగుటంజేశి యది యనుష్ఠింపం దగదనుట.. ... ... .. .. ౩౧౪

శ్లో॥ దోషాఃప్రాణహరాఃప్రాయఃతస్మాత్తద్వ్యసనం
మహత్ । ఆమాదయోహిజీర్యంతెయోత్తిచైవ
దివానిశం। చలేషుపశులక్ష్యేషుషాణాసిద్ధిశ్చజా
యతే। ... ... ... ...౩౩

ప్రాణంబులు దోలంగించుదోషంబులు అధికంబులుగనుండుట వలన నిదియత్యంతవ్యసనంబు లెయగునైనను - గురుపదార్థంబులుజీర్ణంబులగుటయు - శస్త్రములుదొడుగుకసరతు గలుగుటయు పరువెత్తుమృగంబులంగొట్టు లాఘవముగలుగుటయు - ననుగుణంబులుగలిగియుండుటనట్టివేటలాకుతలంపుగలుగు నెడదానికివిధి...

శ్లో॥ అథాచమృగయాక్రీడాంవాంఛేత్తన్నగరాంతికె।
కారయెన్మృగయాంరమ్యాంక్రీడాహేతోర్మనో
రమాం। పరిక్షిప్తంపరిఘయా సముద్రస్యాప్యగస్య
వా। ఆయామపరిణాహాభ్యామర్ధయోజన సం
శ్రితం। గిరేరుపాంతేనద్యావాపర్యాప్తజలశాద్వ
లం। అకంటకలతాగుల్మంవిటపాదపవర్జితం।పా
దపైఃపుష్పఫలితైఃప్రఖ్యాతైశ్చోత్తమోరిభిఃస్నిగ్ధనీ
లఘనచ్ఛాయైర్విరళైరుపశోభితం। పాంసుపూరి

తనిచ్ఛిద్ర శ్వభ్రప్రదరకందరం। దళితస్థాణువల్మీక పాషాణమయభూతలం। శోభితగ్రాహసలిలమగంభీరజలాశయం। నానాపద్మవనాకీర్ణంనానావిహగశోభితం। శ్వాఖ్వాదిమృగసంపూర్ణంహస్తినీకలభాన్వితం। భగ్నదంష్ట్రమృగవ్యాళం ఛిన్నశృంగవిషాణిచ। సుఖసంసేవ్యలతయాపుష్పవల్లీపినద్ధయా। అగమ్యంరిపుసైన్యానాంమనసఃప్రీతివర్ధనం। బహ్వా నేచరచిత్తజ్ఞైఃక్లేశాయాససహైదృఢైః। రక్షితంరక్షిభిశ్చాస్తైభూభుజాం భూతమేధవేత్॥... .. ... ...౪౨

వేటలాడుటకైనగరసమీపంబుననెద్దియేనియునొక కొండప్రక్కనైనను-నదీతీరంబుననైనను - సముద్రమువెంబడినైనను- చుట్టునగడ్డలగలదియు - ప్రాకారముచేచుట్టంబడినదియు-ముండ్లురాళ్లు పుట్టలుమొదలగుదానిశోధించియిసుకనిండించియందు ముండ్లులేనిదియు - విషస్పర్శముగానిదియునగుచుమనోహరంబులగుపుష్పఫలంబుల నొసంగంజాలిన వృక్షలతాగుల్మంబులనుంచియధికలోతునునానావిధపంకంబులునులేక మనోహరంబులగుకమలంబులు కుముదంబులు మొదలగుజలపుష్పంబులచేరమణీయంబులగు కొలనులరచియించియందతిక్రూరస్వభావంబులుగానిపక్షిమృగజాతులనువిడిచిశత్రులకగమ్యంబులగునట్లు సమర్థులగు కావలివాండ్రచేగుప్తంబగువనంబురాజులవేటలకుండగియుండుననుట... ... ... ...౪౨

శ్లో॥ తత్కామానసరేంద్రస్యజాయతేనపరిశ్రమః। క్రీడనాయనరేంద్రస్యమృగజాతీఃప్రవేశయేత్॥౪౩

అట్టివ్యాయామస్థలంబున అతిశ్రమంబుగలుగంజేయకుండునట్టి మృగజాతుల్లబెంపవలయుననుట.. ... ౪౩

శ్లో॥ ధర్మార్థాద్యవిరోధేన ప్రాతశ్చంక్రమణక్షమః। క్రీడనాయవిశేద్రాజాతదాప్తైస్సహితోమిత్రైః

యదాచప్రవిశే ద్రాజా క్రీడనార్థంతదాబహిః।
సన్నద్ధయర్బహిస్తిష్ఠే త్సైన్యందూరాంతరేచరం।
సద్భిర్వ్యాఖ్యాయమృగయాయాం వైగుణాస్సంపరికీర్తితాః।
క్రీడన్త్సన్త్త్వవన్నృపతి స్తతస్తాం సమవాప్నుయా
త్। విధిరేషసముద్దిష్టోమృగయాక్రీడనేపరః॥౪౬॥

ధర్మంబునకునర్థ వ్యార్జనంబునకును రాజ్యతంత్రంబు నకును విరోధంబుగాకుండు విధంబున కసరతు జేయుటకై బరువెత్తుట మొదలగులాఘవంబులు దెలియుకొరకు ఉదయకాలంబున పూర్వోక్తలక్షణ లక్షితంబగు మృగయాకాంతారంబునం బ్రవేశించు నవసరంబున పరులకు రంధ్రంబుగలుగుంగావున నట్టిదాని నివారణముచేయుటకై యాప్తులగు చతురంగబలంబులు యుద్ధసన్నద్ధంబులగుచుచుట్లనుండు నట్లాజ్ఞాపించియందు బ్రవేశించియం దాజింపందగులాఘవ లక్ష్య వేధనాదులు మొదలగు గుణంబుల నభ్యసింపందగునన్నట .. ... ౪౬

శ్లో॥నగచ్ఛేదన్యథారాజా మృగయాంమృగయుర్యథా॥౪౭

ఇట్లువిధిపూర్వంబగు వేటజేయంవలెగాని బోయవానివడువున స్వతంత్రంబుగ నశోధితంబులగు నరణ్యంబుల జొరందగదనుట .. ... ... .. .. ౪౭

ద్యూతదోషంబులు.

శ్లో॥ మహతోప్యర్థసారస్య క్షయః సద్యోహివిముక్తతా। నిస్సత్యతా నిష్ఠురతా క్రోధో వాక్పారుష్యం ఖండనః।లోభో ధర్మక్రియాలోపః। కర్మణామప్రవర్తనం। సత్సమాగమవిచ్ఛిత్తిరసద్భిస్సహవర్తనం। అర్థనాశక్రియావైరంనిత్యం వైరానుబంధనం। పరార్థగృధ్రక్రియాలోపోమత్సరంవాసి ఇాగితా। చిత్తాను

౧౮
కూలభావశ్చ సందిగ్ధచాక్షుపాతనే । ప్రతిక్షణం
క్రోధహర్షౌ సంతాపశ్చ ప్రతిక్షణం । ప్రతిక్షణంచ
౧౯
సంక్లేశ స్సాక్షిప్రశ్నైః ప్రతిక్షణం । స్నానాదిగాత్ర
౨౦
సంస్కారేష్వప్యుపభోగ్యేష్వనాదరః । అవ్యాయా
౨౧ ౨౨ ౨౩
మోఙ్గదౌర్బల్యం శాస్త్రప్రతివిఘేక్షణం । గూహనం
౨౪ ౨౫
మూత్రశకృతోః క్షుత్పిపాసాదిపీడనం । ఇత్యాదీ
స్తత్రనిపుణా ద్యూతదోషాన్ప్రచక్షతే ॥ ... ౫౩

ద్యూతాసక్తునకుం గలదోషంబులు ధనంబులబోకడయు ౧- సాత్త్వికగుణంబు విడుచుటయు ౨- నిష్ఠురత్వంబును ౩- కోపంబును ౪- నోటిచే శపించుటయు ౫- ఆయుధంబులచే నరుకుటయు ౬- లోభగుణంబును ౭- ధర్మకార్యంబులు జెడుటయు ౮- కర్మంబుల నసంభావ్యాదుల యథావిధి ననుష్ఠింపమియు ౯- పెద్దలంజూచుటకవకాశము లేకునికియు ౧౦ - దుష్టులతోడ గూర్చుండుటయు ౧౧- నానావిధద్రవ్యంబుల నొడ్డి మోడుటయు ౧౨- వైరభావంబును- ౧౩- ఎప్పుడును క్రూరంబులు దలంచుటయు ౧౪- గర్వముచే ధర్మకార్యంబులం జేయమియు ౧౫- ఈర్ష్యయును ౧౬- మత్సరంబును ౧౭- సాక్షికలు సందేహాస్పదంబుగ నిలుచునపుడు తనమనంబునకు నిష్టంబగునట్లు బలుకుటయు ౧౮- ప్రతినిమిషంబునకును కోపంబును - సంతసంబును- దుఃఖంబును- నోర్వమియు- తప్పుసాక్షుల గోరుటయును ౧౯- స్నానాదిక్రియలయందును భోజనాదులయందును నాసక్తిలేమియు ౨౦ - ఇతరకార్యంబుల నుత్సాహము లేకునికియు ౨౧- దేహదుర్బలంబును ౨౨- శాస్త్రంబులకు బదులగు కుయుక్తులు బలుకుటయు ౨౩- మలమూత్రంబుల గట్టుటయు ౨౪ అకలిదప్పుల నడంచుటయు ౨౫- ననుదోషంబులు ద్యూతంబునం గలదనుట.. .. ... ... ... .. ౫౩

దృష్టాంతరప్రతిపాదనం.

శ్లో॥ పాండవోధర్మరాజోపిలోకపాలఇవాపరః। ద్యూతవ్యసనమాపన్నః కళత్రమపిహారిచ। నళశ్చరాజాద్యూతేనహృతే రాజ్యేమహావనే। ధర్మదారాన్ పరిత్యజ్యపర కర్మపరోభవతి। తుల్యోభూపోపి ఇంద్రస్యయస్యనాస్తిధనుర్ధరః। సరుక్మీరుక్మశైలాభోద్యూతవోషాత్ క్షయంగతః। రాజాకాశికరూషాణాంచక్రేచ క్రోపిమందధీః। తీవ్రద్యూతకృతాద్దోషాద్దంతభగ్నత్వమాప్తవాన్॥... ... ౫౭౪

లోకపాలతుల్యుండగుధర్మరాజుద్యూతాసక్తుండగు ధర్మము మరచియైచుదుగురకును సామాన్యయగునట్టిద్రౌపదినోడుట భారతప్రసిద్ధము - చక్రవర్తియగునళుండు ద్యూతక్రియచేరాజ్యము దొలంగి భార్యంగాఢారణ్యంబునవిడిచిరుతు పర్ణవంటలవాడగుట అరణ్యపర్వ ప్రసిద్ధము- అతిసమర్థుండగువిదర్భ రాజగు రుక్మిబలరామునితోడం ద్యూతంబునజచ్చుటయు- కాశికరూశాధిపతియగుదంతవక్రుండాద్యూతంబున ననాటిబలికిపండ్లురాలం గొట్టుబడుటయు భాగవతప్రసిద్ధము... .. ... ౫౭౪

శ్లో॥ ద్యూతాదనర్థసంరంభోద్యూతాత్ స్నేహక్షయోభవత్। సంహతానాంచపౌరాణాంద్యూతాద్భేదఃప్రవర్తతే। ఇతికేవలదోషం హిద్యూతం రాజాపరిత్యజేత్। సమారబ్ధంచమేధావీ ద్యూతానాంవినివారయేత్। కేవలోదోషఏవాత్రగుణలేశోనవిద్యతే॥.. .. ... ౬౦

అనర్థంబుల బిలుచుటయు- స్నేహంబునకు వైకల్యంబును - సంధియగువారలకు భేదంబులుగలుగుటయు - ననునన్నియు దోషంబులుగానిగుణంబొక్కటియైనియుదీనలేకుండుటరాజగువాడు దానారంభించుట మానుటయెగాక యావ్యసనంబులుగల వారలను నిరోధింపందగుననుట... ... ... ౬౦

స్త్రీసక్తిదోషములు.

శ్లో॥ కాలాతిపాతః కార్యాణాం ధర్మార్థపరిపీడనం।సు
త్యాభ్యంతరవర్తిత్వాత్సర్వ ప్రకృతికోపనం। స్త్రీ
పక్షపాత స్తజ్జైష్ఠ్య అకార్యేషు ప్రవర్తనం। ఈ
ర్ష్యామర్షౌ తథా క్రోధో విరోధోసహసాపి వా।
తత్సాక్తి స్త్రీవ్యసనం రాజా రాజ్యకామః పరి
త్యజేత్॥ ... ... ... ౬౨౫

అంతఃపురంబుననుండుటవలన ఆయాయిపనుల కాలంబులు దొలంగుటయు- ధర్మపీడయు- ద్రవ్యనాశంబును. నెల్లప్పుడులోపలయుండుటవలన మంత్రులు మొదలగువారలకుసమయంబబ్బకుండుట కోపముగలుగుటయు- ఆడవాండ్లయం దాసక్తుండగుటనట్టి జార స్త్రీసంగమవిషయంబునబొడము ఆగ్రహము చేదుష్కార్యంబుల ప్రవేశించుటయు - అవమానంబును క్రోధంబును కోపంబును- హఠాత్తుగవిరోధముగలుగుటయు- నను ననేకదోషంబులుగలుగుంగాన రాజ్యకాముండగు రాజు స్త్రీవ్యాపారంబును మితంబొనర్పందగుననుట... ... ... .. ౬౨౫

సముదాయవిషయము.

శ్లో॥ స్త్రీద్యూతపానమృగయావ్య గ్రాణామల్ప చేత
సాం ॥ ఈహితానిచగచ్ఛంతియాః వనేనసహక్ష
యం॥ .. .. .. ౬౩౫

కామోత్పన్నంబులగు స్త్రీగ్రహణంబును- జూదంబాడుటయు వేటయు - సారాయిద్రావుటయుననునాల్గు దుష్కృత్యంబులం దాసక్తులగు నల్పబుద్ధులకు యవ్వనంబును ద్రవ్యంబును నాశయు నుంగూడ మొక్కసారిగ నాశంబులందుంగావున మేధావియగు వాడందాసక్తినొందగదనుట.. .... ... ౬౩

## ఉపసంహారము.

శ్లో॥తదపనయవిధిజ్ఞైశ్శ్రేయసాంవిఘ్నకారీవ్యసనమిద
ముదారంసప్తధైవోపదిష్టం । జనయతిహినిషంగా
దేకమేవాశుతాపంకిముతభవతి హంతాయత్నాగప
ద్యోదయేన॥... ... .. .. ౬౪౪

ఇట్లునీతిశాస్త్రవిదులగువారిచే వ్యసనసప్తక స్వరూపంబు
లెఱింగించి యివియొక్కొక్కటియె శ్రేయస్సులనన్నియు విఘ్నం
బొనర్చుననియుపదేశంబులు సదృష్టాంతరంబులుగ బలుకునెడని
వియన్నియు నొకండయనుష్టించునెడ జెప్పనేలననుట... ౬౪౫

శ్లో॥పటుతరపరిభోగగ్రాహతామింద్రియాణాంశ్రుతమ
పివినిహంతిప్రష్టతాంశ్రేష్టతాంచ । చలయతిచవి
భూతింభూయసీంచాపినీచైరపివిబుధ మతీనాంసప్త
కోయందురంతః॥ .. .. .. ౬౫౫

పటుత్వంబులగు నింద్రియబలంబుల నశింపం జేయుటయు
మంచివినికిడియు అధిక్యంబును- శ్రేష్ట్యంబును వైకల్యంబొనర్చు
టయునతివిస్తృతంబగునైశ్వర్యంబు స్వల్పకాలంబుననశింపంజే
యుటయు మహావివేకుల నైననుంహీనులంజేయుటయు నీవ్యసన
సప్తకంబునకు స్వభావంబగుగుణంబనుట.. ... ౬౫౫

శ్లో॥ అరిగణానియతం వ్యసనెస్థితం పరిభవంతిభవం
తిచదుచ్ఛిదః। అపగతవ్యసనాశ్చ బుధారిపూ
పరిభవంతి భవంతిచదుశ్ఛిదః॥ .. ౬౬

పూర్వోక్తంబులగు వ్యసనంబులందగులువాడు శత్రువుల
చే నవమానింపంబడి శత్రుస్వాధీనుండగుననియు - నట్లుగాకదా
నింజయించినవాడు శత్రులనవమానరేం బొనర్చివారలంజయిం
చుననియు ఫలితార్థము.. .. .. .. ...

ఇట్లు కామందకము సప్తవ్యసనవిభాగంబులు
పదియేనవసర్గము ముగిసె.



## పదియాఱవసర్గప్రారంభము.



శ్లో॥ ప్రాయేణసంతోవ్యసనేరిపూణాం యాతవ్యమే
వేతిసమాదిశంతి । తన్నైవపక్షోవ్యసనోహ్యా
నిత్యఃశక్తస్తుసన్నభ్యుదితోహియాయాత్॥ ౧

రాజసప్తాంగప్రయోజనంబులును వానికింగలవ్యసనంబులును పూర్వసర్గంబులం దెలుపుటశత్రువులకట్టివ్యసనంబులు సంభవించియుండుకాలంబునదండయాత్ర జేయందగు ననియ నేకనీతిశాస్త్రాచార్యమతస్పన్నంబయ్యున్నను అట్టివ్యసనంబులు సంభవించుటనియతంబులుగామింజేసియదియేనిరీక్షించక విజిగీషునకుం జయించునుత్సాహంబులును వ్యసనాభావంబులుంగలుగు నేడఁ దండయాత్ర జేయందగునని కౌటిల్యమతమనుట - ఈసర్గంబంతయు రాజవిషయంబుగనున్నను వీటియందుండు కొన్నివిషయంబులు సంసారులకును నుపయోగంబుగ నుండుటవలన వ్యాఖ్యానింపంబడియెడు... .. ... ... .. ౧

శ్లో॥ యదాతుమస్తుప్రసభంనిహంతుంపరాక్రమాదూ
ర్జితమప్యమిత్రం । తదాభియాయాదహితానికు
ర్వన్పరస్యవాపీడనకర్శనాని॥... ... ౨

శత్రుండుసమర్థుండును జాగరూకుండునునై యున్నను అట్టివానిబలముచేజయించుశక్తిగలుగు నేడశత్రునకుఅహితంబులొనర్చుచుదండయాత్ర వెడలందగుననుట ... ... ౨

శ్లో॥ సంపన్నసస్యంవిషయంపరస్యయాయాద్విభూతిం
విజయాయరాజా । సస్యోపఘాతేనపరస్య వృత్తి
చ్ఛేదస్స్వసైన్యోపచయశ్చసాధు॥ ... .. ౩

శత్రుదేశంబు సుభిక్షంబుగ పంటలుఫలియించియుండు సమయంబున దండయాత్ర జేయుటవలన నంతకుముందరి ధాన్యసంచయాదులు వ్యయింపంబడియుండుటవలన నూతనసస్యనిర్బంధమువలన శత్రుండు సులభసాధ్యుండగుటయు తనపగలసైన్యం

బులకు సస్యాదులు సులభంబుగ నబ్బుటయు - గలుగు గావున నట్టికాలంబు యాత్రకుపయుక్తంబనుట.. .. ... ... ౩

శ్లో॥ విసృష్టపృష్ఠఃపురతో విదిక్షా భయప్రదేశాంశ్చ పర
కర్మ వేదీ। స్వవీవ థాసాంవిశుద్ధ మార్గో విశేద్ధరిత్రీం
ద్విషతోప్రమత్తః॥ ... .. .. .. ౪

సైన్యంబునకు ముందునడచుజనంబులును- వెనుకవచ్చువారునుభయస్థానంబులునుజలస్థలపారిశుధ్యంబులెరుంగునట్లును నాజ్ఞాపించుచు అతిజాగ్రతగలవాడగుచు శత్రురాజ్యంబునం జరించవలయుననుట... ... ... .. ... ౪

శ్లో॥ గ్రీష్మేప్రభూతాంబువనేన యాయాన్నిర్గ్వపణా
ధఃంకిరణాంనయాతు। బుతేమయో గ్రీష్మకృతా
త్పృతీపాధ్భవంతికుష్ఠాని మతంగజానాం॥... ౫

గ్రీష్మ కాలంబన జ్యేష్టాషాఢమాసంబు లతియెండలుగల కాలంబగుట అట్టికాలంబున శుష్కమార్గంబున నడచుటవలన నెండచే నగుపరుసదనముచే నేనుంగులకు వ్యాధిసంభవించుం గావున నట్టికాలంబున నీరును చెట్లనీడలునుగల మార్గంబున సేనన డిపింపం దగుననుట... ... ... ... ... ౫

శ్లో॥ స్వస్థక్రియాణామపికుంజరాణా మూష్మాశరీరేషు
కింజాజ్వలీతి। తథాప్యయోగ్యేనచసంప్రవృద్ధః ప్ర
సహ్య హంతిద్విరదానతోయాత్.... ...౬

స్వభావంబుగనుండు నెడను యేనుంగులశరీరంబులత్యుష్ణస్వభావంబులగుటంజేసిపూర్వోక్తక్రమంబు లేక యండ పెట్టుబడియె నేని నీరు లేకునికి యేనుంగులుపీనుంగులగుననుట... ...౬

శ్లో॥ సర్వాణిసత్వానిఖలూష్మకాలె షినాంబునాయాం
తిపరాభవంస్వం। అంశీత్వముష్ణప్రతితప్తకాయాః
ప్రయాంతిసద్యఃకరిణోపిబంతః॥ ... ౭

సాధారణంబుగ నెండకాలంబుననన్నిజంతువులును కృశించుటయు యెండదెబ్బగల్గునెడకండ్లు చీకట్లుగమ్ముటయు గలుగుట

యట్లుండ నేనుంగులు కుకునీరు ద్రావినంతన యెండ చేగ్రాగి నంతన గుడ్డియగుటకు జెప్ప నేలననుట... ... ... ౭

గజంబులవలననగు ప్రయోజనము.

శ్లో॥ సుగంధిదానస్రుతిశీకరేషు నంతాభిఘాతస్ఫురితోపలేషు। గజేషు లీలాభ్రసమప్రభేషు రాజ్యం నిబద్ధం పృథివీపతీనాం। తురంగమాణాం పరికల్పితానాం మేకోగజోహంతిశతాని షష్టిం।జలే స్థలే చ ద్రుమసంకటే చ సమే చ వల్మీకనిపాతనే చ। ప్రాకారహర్మ్యాదివిదారణేన నేరయోద్ధనం నాగవతాం బలానాం యస్మాద్యతో భూరిజలస్తు పంథా యాతాన్నపానోపచితోపిశక్యః॥ .. ... ..౧౦

అతిప్రమాణంబులగు జంతువిశేషంబులగుట కొమ్ములచే రాళ్లు మొదలగుదానిం బగుల్చుటకును - ప్రాకారంబుల నిడియగొట్టుటకును సంకటంబులగు త్రోవలసామగ్రుల నిర్వహించి మోయుటకును యుద్ధంబున యథావిధకల్పితంబగులగు నూటయరువదిగుర్రంబులనొక్కసారిగ జంపుటకుందగినదగుట యేనుంగుల దళంబునతిజాగరూకత చే గాపాడియుద్ధంబునకుం గొనిపోవందగు ననుట... ... .. .. ... ... ... .. ౧౦

శ్లో॥ తతోభియాయాజ్జనయన్ ప్రతాపంశనైశ్శనైరత్రపుయన్ బలాని। అభ్యున్నతానామణురప్యదారం పశ్చాత్ప్రకోపం జనయేదరీణాం॥... ... ౧౧

తనబలంబు నలజడినొందించక యుత్సాహంబునుపరాక్రమంబును వృద్ధియగు నట్లొనర్చుచు తానుబలంబున శత్రునికన్న తక్కువయయినవాడైననుసుత్సాహాధిక్యతచే శత్రునకుం గోపంబు గలుగునట్లు జేయందగుననుట... ... ... ...౧౧

శ్లో॥ తంవాప్రమత్తః ప్రసమీక్ష్యయాయాన్నవాశయేద్దృష్టమదృష్టహేతోః। పశ్చాత్ప్రకోపంపురతః ఫలంచపశ్చాత్ప్రకోప స్తుతయోరరీయాన్। ౧౨

జాగ్రతగలవాడగుచు బలాబలంబులనుజూచుచు ఆగామియగు ఫలంబునకై యాలోచించుచు నుత్సాహముగలిగి నడిపించందగుననుట... ... ... ... ... .. ౧౨

శ్లో॥ రంధ్రేహితద్విప్రకృతాం మహత్వంనయంతితస్మాత్ప్రవిధాయ యాయాత్ । పురశ్చపశ్చాత్సయదా సమర్థ స్తదాభియాయాన్మహతేఫలాయ॥ ౧౩

శత్రువులసామర్థ్యంబులంతయు పోరబాటుగలయెడంబరిణమించుంగానస్వరథ్రంబులగోపనంబులానర్చుచుముందు వెనకసైన్యంబులు జాగ్రతవహించునట్లు జేయుచు ప్రబల ఫలంబుకొరకై యత్నించియాత్ర జేయందగు.. .. ... ౧౩

శ్లో॥ పురస్సమృద్ధాన్నవిశుద్ధపృష్టః ప్రాప్నోతి తీవ్రంఖలుపార్ష్ణిభేదం । అవశ్యయాతవ్య తయోద్యతస్సపశ్చాత్ప్రకోపం హితయానశంకః॥ ౧౪

ముందుమాత్రము బలముగలిగి వెనుకనుండు బలంబులు పరిశుద్ధంబులగావయ్యేనేని యనగా జాగరూకత లేనియెడ శత్రుభయంబవశ్యంబును గలుగుంగాన యానముననన్నియెడల సందియముగలవాగుడచునతిజాగరూకుండుగ నుండవలయుననుట..౧౪

శ్లో॥ యాయాత్పురోరక్షు మనేకవర్గంహస్త్యశ్వపాదాతవరప్రధానం।బలంవిదధ్యాచ్ఛతదైవపృష్ఠేపార్ష్ణిద్వయోశ్చాపి స్వభూతికామః॥ .. ౧౫

అష్టవర్గంబనియు నేకాదశ వర్గంబనియుం గలుగువత్యమాణనిష్పన్నంబులగు గజతురగపదాతి బలంబుల నలుప్రక్కల రక్షణంబొనర్చుటకై తనకు నమ్మకముగలవారినియోగింపందగుననుట.. ... ... ... ... ౧౫

నగర రక్షావిధానము.

శ్లో॥ సేనాపతిం వాప్యథవాకుమారంబ్బలైకదేశేనపురేనిదధ్యాత్ । పురంహితామాత్యకుమారకుల్యాస్సేనాధిగోప్తార ఇమేప్రధానాః । తేషాంహిసాం

తాన్యతర ప్రకోపమంతఃప్రకోపం సముపాదిశంతి।
అభ్యంతరా ద్బాహ్యతరాచ్చ కోపాదాభ్యంతర
స్త్వేవతయోర్గరీయాన్॥ .. ... ౧౭

వెలపటి సేనలను గాపాడుటకన్న నంతః పురపట్టణకోశ రక్షణాదులధికంబులుగావున సేనాపతియైనను తనకుమారుఁడైనను తగునట్టిబంధుజనంబులైనను మంత్రి సేనాపతి మొదలగు వారల సంబంధులగు వారలనేనియు నగువారినియమించి సకర రక్షణంబు జేయందగుననుట... ... .. ౧౭

శ్లో॥ ఆదాయగచ్ఛేద బహిఃప్రచారాన్ బాహ్యైశ్చకృ
త్వాపిహితార్థమానాన్॥ .. ౧౮

అంతఃపురచరులగు నమ్మకముగలపరిజనంబుల దానమానంబులచేమన్నించికొని యరుగందగుననుట.. ... ౧౮

శ్లో॥ రాష్ట్రాంతపాలాటవికాదిసీమ్నాంబాహ్య ప్రకో
పాన్యతమః ప్రకోపః॥ ఉత్పద్యమానంనిపుణప్రచా
రైస్తంమంత్రిభిస్సమ్యగుపాదదీత॥ .. ౧౯

రాజ్యమునందుండువారును సమీపంబులనుండువారును అడవియందుండు బోయలబలంబులును యెల్లహద్దుల యందుండు వారును ప్రత్యంతవాసులగు తురకలుమొదలగు సైన్యంబులును నగువారియందుత్పన్నంబులగు కోపంబులునుం గలహంబులు నెరింగిదానికిందగుప్రతిక్రియలోనర్చుచుండవలయుననుట... ౧౯

శ్లో॥ సామాదిభిస్సంశమయేత్ప్రకోపం పరస్పరావగ్ర
హభేదనైశ్చ । తథాచధీరశ్శమయేద్వికారంయ
థాభజేరన్నపరాన్ప్రదీప్తాః॥.. ... ౨౦

సామదానాదులచేతయు భేదంబులొనర్చుటచేతయు ననుసమయోచితంబులగు నుపాయంబులచే వారలకుంగల కోపంబులును వికారంబులును శమియింపజేశి తనమంత్రియులగునట్లును శత్రునకు సహాయంబందని యట్లునుంజేయందగు... .. ౨౦

శ్లో॥ మనుష్యయుగ్యాపచయఃక్షయోహిహిరణ్యయో
ధాన్యచయోవ్యయశ్చ । తస్మాదిమం నైవవిదశ్చబు
ద్ధిః క్షయవ్యయాయాసకరీంహియాత్రా॥ ... ౨౦౪

యాత్ర జేయుటవలననలసటయు - మనుష్యులకును - గుఱ్ఱం
బులు మొదలగు చతురంగంబులకును సంకటంబులును - ధనధాన్య
ఆయుధాదుల[వ్యయం]బునుంమరియు నానావిధ సంకటంబులును
యాత్రచేసంభవించుంగాన విజిగీషుండగువాడు తనయుత్సా
హముచే శత్రువులజయింతునను బలాధిక్యముగలయప్పుడు తక్క-త
క్కినసమయంబులయాత్రజేయుండగదనుట .. ... ౨౦౪

శ్లో॥ అవశ్యనిష్పత్తిమహాఫలాఢ్యామదీర్ఘసూత్రాం
పరిణామకల్యాం । కామంవ్యయాయాసకరీముపే
యాన్నత్వేవజాతుక్షయకోపయుక్తాం॥ ...౨౧౪

మంత్రప్రభూత్సాహశక్తులచే నిష్పన్నంబగు నతిఫలంబుసా
వకాశములేక గలుగుటనిశ్చితంబగు నెడపూర్వోక్తదుఃఖాయా
సకరంబైనను వెడలందగుంగాని జయము సంశయాస్పదంబగు
నెడ వెడలందగదనుట .. .. ... ..... ౨౧౪

కార్య వ్యసనంబులు.

శ్లో॥ వస్తుష్వశక్యేషుసముద్యమశ్చ శక్యేషు మోహాద
సముద్యమశ్చ । శక్యేష్వకాలేషుసముద్యమశ్చత్రి
ధైవకార్యవ్యసనంవదంతి॥ ... ... ౨౨౪

అశక్యంబులగుకార్యంబులకు యత్నముజేయుటయు శక్యం
బులగుకార్యంబుల మూఢతచేయత్నముజేయకుంటయుకాలదే
శంబులెరుంగక యత్నముజేయుటయు ననుమూడువిధంబుల కార్య
వ్యసనంబులుగలుగు ననుట .... .. ... ... ౨౨౪

కార్యవిఘ్నంబులు.

శ్లో॥ కామోక్షమాదక్షిణతానుకంపా హ్రీస్సాధ్వసం
[క్లైబ్య]మనర్థతాచ । దంభోభిమానోపిఅధార్మిక

[౧౧] త్వం [౧౨] దైన్యం స్వయూథస్య [౧౩] విమాననంచ | [౧౪] ద్రోహో
[౧౫] భయశ్శ [౧౬] శ్వగుణేత్రుణంచ శీతోష్ణవర్షా ప్రసహిష్ణు
[౧౭] తాచ | ఏతానికాలే సముపాహ తాని కుర్వంత్య
వశ్యంఖలుసిద్ధివిఘ్నం॥ .. ...౨౪౫

కామజన్యంబులగు సంగీతమువినుటయు. చందనాదులగు సౌ
ఖ్యంబులెలగ్నుండగుటయు స్త్రీద్యూతపాన మృగయాదుల ప్రీతి
యు ౧ కోపజన్యంబులగు వాక్పారుష్యదండపారుష్యద్రవ్యదూ
షణాదులును ౨ ఓపుఃలేమియు ౩ అతిదయయు ౪ లజ్జ చేయ
ధోచితకార్యంబులొనర్పకుండుటయు ౫ వణుకును ౬ అతిక్రూర
తయు ౭ అనర్థంబులగునుపక్రమంబులనగా ప్రయోజనకరంబు
లుగానివియారంభించుటుః అన్యులవంచనము జేయుట ౯ స్వాభి
మానంబును౧౦ గర్వంబును ౧౧ కొంచమైననుధర్మగుణములేక
దురోర్యధనుకరణి.., .. .. ... ...

శ్లో॥ సూచ్యగ్రేణసుతీక్ష్ణేనయావద్భిద్యేత మేదినీ। తా
వహంనాభిదాస్యామివినాయుద్ధేన కేశవ॥.........

అనునతిలోభంబును౧౧- దీనతయు౧౨- తనసరదారలః నవ
మానం బొనర్చుటయు౧౩- మిత్రద్రోహము జేయుట౧౪- తనబ
లంబులయందు [illegible]కము లేకుండుట నంతర్భయంబును౧౫- మ
ధ్యస్థులగు మన్ననగలవారి మన్నించకుండుట౧౬- చలియండవా
నగాలి యిట్టివాని నోర్వకుండుటయు౧౭ - నను మొదలగు వి
కారంబులన్నియు కార్యనాశకరంబులనుట... ... ౨౪౫

బలపతు భేదంబులు.

శ్లో॥ [౧] నిజో [౨] ధ మైత్రశ్చ [౩] సమాశ్రితశ్చ [౪] సంబంధ [౫] జస్సొచక్రి
[౬] హారాధ్యవశ్చ। భృతోగృహీతో వివిధోపచారైః ప
తుంబుధాస్స ప్తవిధంవదంతి॥.. .. ౨౫౫

స్వకీయులును ౧- స్నేహితులుచేపంపంబడినదియు౨- శత్రునివలనగిట్టమిచే నాశ్రయించినవారును ౩- సంబంధంబులనగాకన్యాదానాదివిషయంబులవలన బంధుత్వంబుజెందిన వారును౪- శ్రౌచులనగా గురుశిష్యసంబంధంబులుగలవారలును౫- ఒకకారణంబునగలశినవారలును౬- నానావిధోపచారంబులచేభరణంబొనర్చిగ్రహియింపంబడినవారలును ౭- నను నేఁడువిధంబులు సంబంధంబులనుట... ... ... .. ... ౨౫౪

అనురాగవిధి.

శ్లో॥ సదానుసృత్యాగుణకీర్తనేన నిందాసహత్వేన చరంధ్రగుప్త్యా । తదర్థమేవోద్యమసత్కథాభిః పక్ష్యోనురాగీతిని వేదితవ్యః॥ ... ౨౬౪

యెల్లప్పుడుననుసరించియుండుటయు౧-గుణంబులనెన్నుటయు తన్నునిందిచినను నోర్చుటయు - యజమానుని నొరులు నిందించునెడసహింపమియు· మర్మంబులదాచుటచేతయు - అతనినిమిత్తంబగు కార్యంబులయం దెల్లప్పుడు నాసక్తుండగుటచేతయు- ప్రకృతవిషయంబులగు ప్రసంగంబుల మంగళకరంబుగ నొనర్చుచుండుటచేతయు- ననురక్తుండని దెలియందగు·· .. ౨౬౪

గుణంబులు.

శ్లో॥ ౧కులీన ౨మార్య్యం ౩శ్రుతవ ౪ద్వినీత ౫మలోభ ౬మపంసత్యమహార్య్యబుద్ధిం ౭కృతజ్ఞ ౮తోర్జ ౯మతి ౧౦సత్వయుక్తం ౧౧సద్ధ్వపత్కుంభలుతంచవింద్యాత్॥ .. ... ౨౭౪

మాత్రుకుల పిత్రుకులశుద్ధుండగుకులీనుండును - ఆరోగ్యగుణంబులు గలవాడును౨- శాస్త్రాభ్యాసముగలవాడును౩ - అణిగినవాడును౪- పరధనదారలయందాస క్తుండుగావివాడును౫-అబద్ధంబులుబలుకనివాడును౬- శత్రులకులోబడని గుణంబులుగలవాడును౭- తనకువిజగీషునిచే నొనర్పంబడిన యుపకారంబులమరువనివాడును౮- బలశాలియును౯- తెలివిగలవాడును౧౦ శక్తి

సంపన్నుండును ౧౧- మంచిపక్షంబున వలవించినవాడును ౧౨-
నగువాడు జయశీలునికిం గూర్చువాడని దెలియందగుననుట. ౨౬౪

## గుణత్రయ భేదములు.

శ్లో॥ ఉద్యోగమేధాధృతిసత్వసత్యత్యాగానురాగస్థితి
గౌరవాణి। జితేంద్రియత్వం ప్రసహిష్ణుతా చ ప్రా
గల్భ్యమిత్యాత్మగుణప్రవేశః॥ .. .. ౨౬౫

యత్నము జేయుట్టయు - వివేకంబును౧- ధైర్యంబును౨- స
త్యవాదితయు౩ - సత్త్వగుణంబును౪- పాత్ర మెఱింగి వ్రయము జే
యుటయు౫- గుణంబులుగలవారలయడ పక్షంబును౬- చలనము
లేనిబుద్ధియు౭- గొప్పబుద్ధియు౮- యింద్రియజయ లక్షణము క్షితంబ
గు నింద్రియజయంబును౯- ఆపదల క్లేశంబుల నోర్చుటయు- ఓ
ర్పును౧౦- సభయందు త్రాసములేక సభారంజకంబగు ప్రకృత
విషయంబుల ప్రసంగించుటయు- నను౧౧- గుణంబులు విజిగీషు
నకుంగలుగవలయుననుట... ... .... .. ౨౬౫

## శక్తిత్రయస్వరూపము.

శ్లో॥ మంత్రస్యశక్తింసునయప్రచారం కోశదండౌ ప్రభు
శక్తిమాహుః। ఉత్సాహశక్తిర్బలవృద్ధి చెష్టాంత్రి
శక్తియుక్తో భవతీహ జేతా॥ .. ... ౨౬౬

మంత్రపాడ్గుణ్యంబుల నెఱింగి నీతిశాస్త్రమును ననుసరించియా
లోచన సేయుటను మంత్రశక్తియనియు ౧- ద్రవ్యంబును రక్షిం
చుటయు దండనీతివలన దేశంబులు ప్రజలంగాపాడుటయు ప్రభుశ
క్తియనియు ౨ - కార్యత్వరితక్రియయు - మంత్రిసమర్థతయు - ధీర
త్వంబును - [illegible] మఱియు -

శ్లో॥ శౌర్యమనుషోత్సాహమ్యంచోత్సాహగుణా[illegible]॥ ..

పరాక్రమంబును - [illegible] మోర్పుయు, ఆలోచించ
కయు క్తక్రియయు [illegible] శేషంబున్ను... ..

శ్లో॥ స్మృతిర్వ్యతీత [illegible]

బుద్ధిస్తాత్కాలికీజ్ఞేయాప్రజ్ఞాత్రైకాలికీమతా। బు
ద్ధింనవనవోన్మేషశాలినీంప్రతిభాంవిదుః॥ ...

అనుక్రమంబున గడిచినసంగతుల జ్ఞాపకంబుననుం చుస్మృతియు- ముందుగడువ బోయ్యేకవృత్తాంతబుల నూహించుమతియు- తత్కాలంబున నడువందగు విషయంబుల నిష్పన్నంబులొనర్చు బుద్ధియు భూతభవిష్యద్వర్తమానంబులనూహించుప్రజ్ఞయు- పైపైనియుక్తుల దెలుపు ప్రతిభయుననులక్షణలక్షితంబగు నన్నియు నుత్సాహస్వరూపంబులనియు నిట్టిశక్తిత్రయయుక్తుండగువాడు శత్రువులజయించుననియువిచారించవలెను. ౨౯౪

శ్లో॥ శౌర్యంసు దాక్ష్యంవ్యసనేష్వదైన్య ముత్సాహ
సంపత్స్మృతి ధీరతాచ। ఉత్సాహికీ శాస్త్రసముద్భ
వాచసాం సరిణికీధీః పరిణామితాచ। ఉత్సాహస
త్త్వవ్యవసాయ చెష్టాదార్ఢ్యంచ కర్మణ్యాతి
పౌరుషంహి। అశోగతాకర్మఫలోపపత్తిర్దైవ
వానుకూలంచని రాధితాచ। ఇతిప్రసర్పన్నయతం
సముద్రప్రక్షాళితానాం లభతేధరిత్రీం॥ ౩౨

పరాక్రమంబును౧- మంచిసమర్థతయు౨- దుఃఖకాలంబున వేలతనంబు లేకునికియు౩ ఉత్తలక్షణలక్షితంబగు నుత్సాహము కలిగియుంటయు౪ - యుద్ధంబునధైర్యంబును౫ - శాస్త్రంబునంగల పటిమెచేనిశ్చయంబొనర్చుటయు౬ - బుద్ధిశాలులతోడసహవాసముచేయుటవలన బుద్ధిదేరియుంటయు౭ - యత్నంబొనర్చుటయు౮ - బలంబున౯ - ప్రేరేపించుటయు౧౦- రథాదులక్రియావిశేషంబును౧౧- దృఢతయు౧౨- ఎట్టియసాధ్యంబులైనను సాధింతునను మహోత్సాహంబును౧౩- రోగము లేకునికియు౧౪

కార్యంబు సఫలంబందుట కన్యుని సహాయం బపేక్షించకుండు
ట౧౫ - దైవసహాయరూపంబగు మనోనిర్మలత్వంబును౧౬ -
మనోవ్యసనంబులు లేకుంటయున్ను౭ - ననుగుణంబులుగలిగియిట్టి
గుణంబులచే హీనుండగుశత్రునిపై దండయాత్ర యొనర్చు రాజు
చతుస్సముద్రముద్రిత భూవలయం బాక్రమించుననుట... ౩౨

కాలభేదంబులు.

శ్లో॥ కాలోగజానాంసజలాం బుదౌతౌయాతుంత ద
న్యశ్చతురంగమాణాం। నాత్యుష్ణశీతంసుసమృద్ధ
సస్యంకాలంతమాహుర్విజిగీషువృద్ధ్యై॥ ... ౩౩

మిక్కిలిజలంబులును వానలునుం గలుగు కాలంబులందేనుం
గులు వెడలుట కుచితంబైనను నట్టి కాలంబు గుఱ్ఱంబులు మొదల
గువాటికి ప్రసర్పణయోగ్యంబు కామింజేశి సమ శీతోష్ణంబును
సమృద్ధ సస్యంబును నగు కాలబు దండయాత్ర కుచితంబగు
ననుట... ... .. .. ... .. ... ౩౩

కాలప్రయోజనము.

శ్లో॥ రాత్రావుల్కోవినిహంతి కాకంకాకోప్యులూ
కం రజనీవ్యపాయే। ఇతిస్మ కాలంసముదీక్ష్యయా
యాత్కాలేఫలంతీ హాసమీహితాని॥ .. ౩౪

రాత్రివేళ గ్రుడ్లగుబ్బలు కాకులంజంపుటకు సమర్థంబులగు
టయు - నట్టి కాకంబులు పగలిటివేళ గ్రుడ్లగుబ్బలంజంపుటకు శ
క్తంబులగుటయు సాదృశ్యంబులు గాననెట్టివేళ నెవనిమీదంబ
రాక్రమింపందగునట్టిదాని. యాలోచింపం దగుననుట... ౩౪

దేశప్రయోజనము.

శ్లో॥ శ్వానక్రమాకర్షతికూల సంస్థంశ్వానంచనక్రస్స
లిలాభ్యుపేతం। వ్యాయచ్ఛమానోధ్రువమభ్యు
పైతిదేశస్థితఃకర్మ ఫలోపభోగం॥ ... ... ౩౫

గట్టున మొసలి బరుండు నెడ కుక్కదానింటట్టుటయు నీటి
యందు కుక్కప్రవేశించు నెడ మొసలియీడ్చుటయు నిదర్శనం

బులుగాన శత్రునకుంబలంబుగలయెడ దొరకొందగదనియు తన కుంబలంబుగలయెడ దొరకొందగుననియు నాదేశము... ౩౫

సమవిషమ మిశ్రమార్గంబుల నడచువిధి.

శ్లో॥ సమంతురంగై ర్విషమంతు నాగై ర్గచ్ఛేజ్జలాఢ్యం
సమహీధరంచ। నావావృతై శ్చైవజలానియానై
ర్మిశ్రోవ్రజేచ్చైవమరుప్రగాఢం॥ .. ... ...౩౬

సమంబగు భూమియందుగుఱ్ఱంబులమీదను- విషమంబులగు నెడలను జలంబులుగలయెడను పర్వతప్రదేశంబులను నేనుగులమీదను - నీటియందు పాడలదోలువారల సహాయము మెండుగగలిగియును- మరుభూములనగా నిర్జలప్రదేశంబులమిశ్రబలంబుల చేతయునడువంగుననుట .. ... .. ..౩౬

శ్లో॥ మరుప్రగాఢంపతతిస్మతోయె గ్రీష్మేతుశుష్యేజ్జల
విప్లవంచ। పీత్వానయోర్భేదమతీవదక్షో గచ్ఛే
న్నరేంద్రోవిజయాయదేశం॥ ... ..౩౭

నిర్జలభూమియు వర్షకాలంబున చెమర్చుచుండుటయు - జలసమృద్ధియగు భూమియు గ్రీష్మంబున నెండంబారుటయునను భేదంబులం దెలిసి జాగరూకుండగుచు విజయముకొరకు దేశ కాలంబు లెరింగి బలంబులనడిపింపందగుననుట.. .. ..౩౭

శ్లో॥ నచాతితోయంనచతోయహీనంయు క్తంచసమ్యగ్య
వసెంధనేన। ఉపేత్యమార్గంబహుతజ్జయు క్తం సు
ఖప్రయాణైరిపుమభ్యుపెయాత్॥.. ...౩౮

ప్రయాణంబులకువిఘ్నంబులుగలుగంజేయుగావున నధిక జలంబులుగలయెడ దరలకుండుటయు - జలంబు లేనియెడ దాహాదిభయంబు లొదవుంగావుననట్టిదిగాక యున్న - సమకాలంబును- సామగ్రులునుకట్టెలుగడిమొదలగు మార్గోపయోగవస్తు విశేషంబులుసమృద్ధంబులగుచుండద్రోవ దెలిసియుండెకువారలంగూడి సేనలనలజడినొందించక సుఖంబులగు ప్రయాణంబులచే దండయాత్ర జేయందగుననుట. ... .. .. ౩౮

శ్లో॥ సువీవధాసారము పేతతోయంవిశ్వాసితాక్రాంతజ
నంవిశుద్ధం। తన్మాత్రమేవద్విషతాము పేయాత్
యస్మాన్నకుర్యాదపయానమాతః॥ .. ౩౯

పూర్వోక్తలక్షణలక్షితంబగు మార్గంబున దండునడిపించు
నెడ ప్రజ యలసటనొందెనేని యాసమయంబున హఠాత్తుగసం
భవించు యుద్ధంబున నుపయోగింపజాలక శత్రువులకులోబడు
గావునఅలజడిచే నడవంజాలకుండునట్లునడుపింపందగుననుట ౩౯

శ్లో॥ ఘోరమార్గంసహసా విశంతియూథారిపూర్వా
మవిచార్యభూమిం। తేయాంతితేషామధిరేణఖడ్గ
ధారాపరిష్వంగ మయత్నసాధ్యం॥ .. ...౪౦

శత్రువుల యిక్కలుదెలియక నతిసాహసంబున ప్రజలనల
జడినొందించుచు యుక్తాయుక్తంబులు దెలియక బలంబులునడిపించు
వారలు శత్రుప్రయత్నంబులులేక సులభంబున శత్రుశస్త్రపీడి
తులగుదురనుట... .. ... ... ...౪౦

రాత్రులందు విడియువిధానము.

శ్లో॥ మార్గేచదుర్గోపనివిష్టసైన్యో విధాయరక్షాంవిధి
వద్విధిజ్ఞః। సన్నద్ధపార్శ్వస్థితధీరయోధః సెవేత
సాధ్వంనిశియోగనిద్రాం॥ .. .. ... ౪౧

దుర్గమంబులగుకొండలు చరియలు నదులు మొదలగు నెడల
జాగ్రత్తగలిగి సన్నద్ధులగుసైన్యంబుల చుట్లునునిచి యామక్రమం
బుననుండునట్లు విధించితనచుట్లను నాక్రమంబుననమ్మకముగలవా
రిబన్నిలిచియుంచునట్లా జ్ఞాపించియతిజాగ్రతగల నిద్ర జేయం
దగుననుట... ... .. ... ... ౪౧

శ్లో॥ భ్రమత్తురంగద్విరదేంద్రహేషాఘంటారవాస్వాది
తకర్ణరంధ్రః। తదంతరాళే ప్రతియోధవర్జీ కేజాగ్ర
తీత్యాదరమాద్రి యెత॥... ... .. ౪౨

పారాడిగురుచుండెడుగుర్రంబుల హేషారవంబులచేతయుప
నుంగులఘంటలశబ్దముల చేతయు - మెలుకువగలవాడగుచు నెడనెడ

యీంజామున నేసరదారుడుపాం రాయచ్చుచున్నవాడని ప్రియపూ
ర్వకంబుననడుగుచు మెలుకువగల నిద్రయొనర్పందగుననుట. ౪౨

శ్లో॥ తతఃప్రబుద్ధశ్శుచిరిష్టదైవ శ్శీఘ్రమద్వ్యాభూషోజ్వలితః
ప్రహృష్టః। సేవ్యేతమంత్రి ప్రవరైర్యథావత్పురో
హితామాత్యసుహృద్గణైశ్చ। కర్తవ్యతాంతైస్స
హసంప్రధార్యయానంస మాఖ్యాయపిచిత్రయా
నం। కులోద్గతైఃపత్తిభిరాత్మతుల్యైర్బహిఃనిశ్చ
చ్ఛేత్పరివారితస్సః॥... ... ..౪౪

ఉషఃకాలంబున నిదురమేల్కని స్నానాదులొనర్చి పరిశు
ద్ధుండగుచునగ్న్యారాధనాదులొనర్చి శోభనకరంబులగు చతు
ర్విధాలంకారంబులంగీకరించి మంత్రిసేనాధిపులు మొదలగువా
రింగలశి జేయవలయు కార్యంబుల నిర్ణయంబొనర్చియానము
వెడలుట కాజ్ఞాపించి తనదేహ సంరక్షకులగు నాప్తయోధగణం
బులచే రక్షితుండచు విచిత్రయానంబున వెడలందగుననుట. ౪౪

శ్లో॥ ప్రియేణదానేనచ సంగ్రహీతా భృత్యాజహుశ్చ
త్తిరిజీవితాని। పశ్యేన్నృపోహస్తినృపాశ్వవ
ర్గాన్సామూహికంబోధనకారణంపృథక్॥...౪౫

ప్రియవచనంబులచేతయు మన్ననలచేతయు యినాములచే
తయు మర్యాదలచేతయు సంగ్రహింపంబడు యోధులు.........

శ్లో॥ రాజాతుష్టోపిభృత్యానాం మానమాత్రంప్రయచ్ఛ
తి। తేతుసన్మానితాస్తేనప్రాణైరప్యుపకుర్వతే॥...

అనున్యాయంబున ప్రాణంబులొసంగియైనను రాజునకు న
భ్యుదయము గోరుచుండ్రుగావుననట్లు మన్నింపుచును యేనుం
గులను గుర్రంబులను పదాతిజనంబులను నిత్యంబును విమర్శిం
చుచుండవలయుననుట.. ... ... ... ... ౪౪

శ్లో॥ రథాశ్వనాగకుంజరయానయుగ్యాన్నిత్యంక్రియా
స్వర్థనుషిద్రుగల్భః। సుమేధసాంశర్మణి సుష్కరే
పినిత్యక్రియాలాఘవమాదధాతి॥... ... ౪౫

ప్రతిదినంబును కవాయతులు రెండుకాలంబుల జేయుచుం డుటవలన బుద్ధిమంతులగువారలకు మరియును లాఘవంబుగలు టంజేశి చతురంగబలంబుల రెండువేళలను కవాయతులు జేయిం చుచుండదగుననుట.. ... ... ... ౪౫

శ్లో॥ ఆలోకయేచ్చుద్ధగుణోపపన్నైశ్చారైస్సగూఢైశ్చపర
ప్రచారం। ఏతైర్విముక్తో భవతి క్షితీంద్రో జనైరనైత్రై
శ్చసమానధర్మా॥... ... ... ౪౬

పూర్వోక్తలక్షణ లక్షితులగుగూఢ చరులనగా నానావేష ధారులగుహరకారాలచే శత్రుపక్ష వర్తనంబులు దెలియకుండు రాజు గ్రుడ్డివాడగుంగావునది విచారించి తెలియదగుననుట ౪౬

శ్లో॥ విలోభయన్ కించిదపి ప్రయచ్ఛన్ కుర్వీతమిత్రం
ద్విషతోంతపాలం। రాష్ట్రాదభిన్నం ద్విషతః ప్రప
న్యాంపణ్యైర్హరేతం నాలికయాదదాతి॥... .. ౪౭

శత్రురాజ్యవిషయంబులంతయు నంతపాలులస్వాధీనంబున నుండుగావునతనికిబహుద్రవ్యంబులొసంగుచునని బాసలొనర్చు చుకొంచంబొసంగి జలాశయంబునందలి జలంబుల నళికాయం త్రముచే నీడ్చునట్లుపరవృత్తాంతంబుల నెరుంగందగుననుట. ౪౭

శ్లో॥ ఉపక్రమంవాంఛితమాశుకుర్యాద్దూతోపయానా
త్క్రియమాణసంధిః । దానాదికైస్సాన్యతస్తుత
స్యభేదఃకృతోభవత్యాత్మసముచ్ఛ్రయశ్చ॥... ౪౮

దూతలనంపుటచే జేయంబడుసంధియును- దానమిత్ర భేదం బులచేతయు తనచే నారంభితంబగు కార్యంబ శ్రమంబున సిద్ధిం చుగావున నట్లుదగుయత్నంబులు జేయదగుననుట... ౪౮

శ్లో॥ దుర్గాణ్య థాప్యాటవికాంతపాలాన్ సంశ్లేషయే
ద్దానవతాభిశస్తాన్। విశుద్ధదేశేషుహితన్నిరోధే
తేతస్యమార్గోపదిశో భవంతి॥ ... ..౪౯

దుర్గపాలకులనగా కోటల యధికారులును - అడవులనుం డెడు బోయసరదారులను - సమీపస్థలంబులనుండు వారలును

నగు యోధులదాన సామభేదాదులచే తన్నుంగలపికొనిన సం
కటంబులగునెడల వారలుమిక్కిలియు సహాయులగుచు మార్గం
బులదెలుపుదురనుట... ... ... .. ... ..౪౯

శ్లో॥ అకారణాదేవహికారణాద్వాయ ప్రతికశ్చిత్పురు
షారిసేవాం। నిజశ్చవిశ్లిష్యఉపేత్యశత్రుమాయా
తీయ స్తన్యగతింవిపశ్యేత్॥.. ... ..౫౦

శత్రునికడనుండివెద్దియేనియు నొకహేతువచేనేనియు ని
ష్కారణముగనేనియు తనకడకరుదెంచునెడ నతని విషయంబి
ట్టిదనియునతండుతనయందు గలిపికొనందగు వాడనియు-దగని
వాడనియు విచారించిగుణదోషంబు లెరింగి సంగ్రహింపందగు
ననుట——ఇందువిభీషణసంగ్రహవిషయంబంతయు నుపయో
గింపందగు. ... ... .. ... ౫౦

శ్లో॥ ఆరప్సునామంత్రబలాన్వితేనప్రాగేవకార్యేనిపుణ
ప్రచారః। దోష్ణాంబలాన్మంత్రబలంబలీయః శుక్ర
స్సురాన్మంత్రబలాద్విజిగ్యే॥ ... ౫౧

కార్యారంభంబుననేమంత్రసర్గోక్తక్రమంబున మంత్ర నిష్ప
న్నంబగుకార్యంబులబ్రవర్తించుట బాహుబలముచే సాధించుట
కన్నబలీయంబగుగానకౌటిల్యమతముననుసరించి

శ్లో॥ ఏకంహన్యాన్న వాహన్యాదిషుర్ముక్తోధనుష్మతా।
ప్రాజ్ఞేనతుమతిఃక్షిప్తాహన్యాద్గర్భగతానపి॥

అనుక్రమంబుననశుక్రుండు మంత్రబలముచేతయ దేవతలం
జయించుటంజేశి మంత్రప్రయత్నమంత్రగోపనంబులనే మరకప్ర
వర్తింపు జేయందగుననుట.. .. ... ౫౧

శ్లో॥ మనోదృశానిర్మలయావిలోకితం। ఫలాయకర్మోద్యమమాస్థితఃపరం। నకాలహీనంచకదాచిదాచరేత్ ఫలశ్చకాలేనియతంప్రదస్యతి॥.....౫౨

నిర్మలంబగుమనోనేత్రముచే నెద్దేశంబున నేకాలంబుననే
ది ఫలింతంబగునట్లు దెలియంబడునట్టిదానివిచారించిప్రయోగిం

పండగుగాని కాలదేశ విపరీతంబులను ప్రయత్నంబులు ఫలియిం పంజాలవనుట.. .. ... ... .. ౫౨

ఉపసంహారము.

శ్లో॥ ప్రభావాన్వితానాంశ్రుతశౌర్యశాలినాంయథావదా
లోకితమార్గచారిణాం। చిరాయదైవీద్యుతిసన్నతా
త్మనాంభుజేషుదీర్ఘేషుమహీహిలంబతే॥ ... ౫౩

ప్రభావవంతులును మంత్రనిశ్చయజ్ఞులును దైవబలసంపన్నులును పద్ధాక్రమశాలులును - మంత్రనిశ్చితమార్గ సంచారులును నగువారిభుజంబులం జిరకాలము భూమియుండుననుట .. ౫౩

శ్లో॥ సముదితనరసంపన్నూరి సంపన్నసస్యేవిగతసలిల
పంకేకాలఉద్యుక్తశక్తి। కుసుమితసహకారశ్రీజ్వ
లత్కానవనే వానరపతిరరిభూమిం సాధుగచ్ఛేజ్జ
యాయ॥... .. ... ... ౫౪

ఉక్తలక్షణలక్షితంబులగు మంత్రప్రభూత్సాహ శక్తులుగల వాడగుచు తనకు సైన్యబలాదులుగలయడ శరత్కాల్యమున నేనియు దండయాత్ర వెడలందగుననుట... ... ... ౫౪

శ్లో॥ ఇతినరపతిగామీంతాదరః పరమభియోజ్యసతఃస
ముత్పతేత్।ఇతివిధివిషయోపసేవనాత్ నియతమ
రాతిరుపైతిగోచరం॥.. .. .. ౫౫

ఇందుబలుకంబడిన విధి క్రమంబున యాత్రనారంభించు విజిగీషునకు శత్రుండుసులభసాధ్యుండగుననుట... ... ౫౬

ఇట్లుయాత్రావిభాగముపదియారవసర్గముసంపూర్ణము



సప్తదశ సర్గప్రారంభః.



శ్లో॥ శత్రోఃపురాభ్యాసభూతిస్థలేవై సాధుసంహతే। స్కం
ధావారనివేశజ్ఞఃస్కంధావారంనివేశయేత్ ౧

పూర్వసర్గంబున యాత్రావిధానమువిధింపంబడియెంగావున

నట్లు వెడలి శత్రుపట్టణప్రాంతంబున విడియు శిబిరవిధానమీసర్గం బున వక్ష్యమాణంబులగుటవలన శిల్పశాస్త్రవిధిజ్ఞులగు స్కంధావారవిదులచే మంచిభూమిని దండునిలుచుటకై పటకుటీరంబులనగా డేరాలు నిర్మించుట కాజ్ఞాపింపవలయుననుట. యీవిషయము కేవల రాజదండయాత్రా విషయంబయ్యున్నను విశేషజనంబులతోడ యాత్రాదులొనర్చువారలకును దిఙ్మాత్రంబుప యోగంబుగలిగియుండుననివిచారింపవలయు... ౧

శ్లో॥ శృంగాటకార్ధచంద్రం వా దీర్ఘమండలమేవ వా।
భూమిప్రదేశసమతాచాకారముపకల్పయేత్॥ ౨

త్రికోణాకారంబుగనేనియు - అర్ధచంద్రునికరణినేనియు. దీర్ఘచతురశ్రంబుగనేనియు : నప్పుడ మిక్రమమును ననుసరించి మరి యెద్దియేనియు నొకయాకారంబుగనేనియు నిర్మింపదగు ననుట... ... ... ... .. ౨

శ్లో॥ వివిక్తైశ్చ విభక్తైశ్చ శృంగైరన్వితసాధనైః। గుప్త
కక్షపతాకాద్యైర్హ్యర్మ్యసౌమార్గసమన్వితం॥ .. ౩

విశాలంబులగుచు విడబడియుండెడు కలశంబులచేతయు నానావిధానంబులచేతయు ఝండాలచేతయు నొప్పిననాల్గు పెద్దద్వారంబులుగలదియు.. ... ...౩

శ్లో॥ ప్రాకారపరిఘాక్షీణం ద్వారగోపురసంయుతం।
సుగుప్తం వివిధైర్యోధైః పాతాళమివపన్నగైః॥ ౪

లోతగు నగడ్తచేతయు - ప్రాకారముచేతయు- తోరణంబులచేతయు. గోపురద్వారంబులచేతయు- నొప్పినదియు నానావిధాయుధపాణులచే రక్షింపబడునదియు.గావలయుననుట. ౪

శ్లో॥ తస్యమధ్యే మనోహ్లాది మహాన్మాలబలాన్వితం।
అంతఃకోశ గృహోపేతం కారయేద్రాజమందిరం॥ ... ... ... ..

అట్టిస్కంధావారమధ్యంబున నత్యంతాహ్లాద జనకంబును

బొక్కస నివేశములోనం గలిపియు నగు రాజగృహంబునడుమ నిర్మించదగు... .. ... ...

శ్లో॥ మూలంభృతం శ్రేణిబలం సుహృద్బలమథాటవం ।
రాజహర్మ్యాం సమావృత్య క్రమేణవినివేశయేత్ ॥౬

రాజమందిరంబు నకుచుట్టును దొలుత మూలబలంబును- దాని చుట్టుకై జీతంబులవారును- పైశ్రేణులబలంబులును - నాచుట్టును స్నేహితసైన్యంబులును- సామంతమంత్రిపరివారబలంబులును నాచుట్టు ఆటవికులగు బోయసైన్యంబులును. విడియుటకుందగు నడియాలంబులుగల పటకుటీరంబులు నిలుపందగుననుట.. ౬

శ్లో॥ ఆశ్వినోలబ్ధనామానస్తురంగాశ్చ మనోజవాః ।
గృహోపకంఠే రాజ్ఞస్తునివసేయుస్సచారణాః ॥ ౭

ప్రసిద్ధులగు ఆశ్వికులు వేగంబులగు గుఱ్ఱంబులం బన్ని చారణులతోడ రాజగృహంబునకు సమీపంబుననుండం దగుననుట.. ౭

శ్లో॥ యామవృత్త్యాసుసంబద్ధం రాత్రిందివముదాయుధం । అంతర్వంశికసైన్యంచ తిష్ఠేద్రాజ్ఞోభిగుప్తయే॥ ... .. ... .. ౮

కాలనిర్ణీతంబుగలవారలగుచు పారాజనంబులు రాత్రిబగళ్లు రాజగృహంబు గాపాడు చుండవలయుననుట.. . ... ౮

శ్లో॥ యుద్ధయోగ్యో మహాదంతీసన్నద్ధస్సాధ్వధిష్టితః।
తిష్ఠేన్నరపతే ద్వారి వేగవంతస్తురంగమాః॥...౯

యుద్ధము జేయంజాలిన గొప్పయేనుంగు సన్నద్ధంబగు మహామాత్రాధిష్టితంబయి యుండుటయేగాక వేగవంతంబులగు గుఱ్ఱంబులును గొలిచియుండందగుననుట... .. ...౯

శ్లో॥ సైన్యైకదేశస్సంరబ్ధః సేనాపతిపురస్సరః॥ ప్రయత్నవాన్ప్రవిచరేన్మండలేనబహిర్నిశి॥ ... ౧౦

కొంతసైన్యముతోడ సేనాపతియు రాత్రికాలంబుల నతిజాగ్రతతోడ స్కంధావారముచుట్టును గస్తుతిరుగుచుండవలయుననుట... .. ... ... ..౧౧

శ్లో॥ పరసైన్యప్రచారంచ సంవృద్ధ్యాగ్న్యాశుపాతినః।
వార్తాన్వికాపి జానీయు ద్దూరాత్సీమాంత చారిణః॥ ... ... .. ..౧౧

అతిబలంబును వేగంబునుగల టపాలుగుఱ్ఱంబులు దూరంబున దిరుగుచు శత్రుసైన్యప్రచారంబుల నెరుంగుచుండవలయును. ౧౧

శ్లో॥ అచ్ఛతోరణయంత్రాసుయఃత్రవత్సపతాకిషు। ద్వారేషుపరమాంగుప్తింకారయేదాప్తకారిభిః॥ .. ౧౨

ద్వారంబులయందును ధ్వజంబులయందును నానావిధయంత్రంబులయందును పరుల ప్రచారంబు లేకుండునట్లు ఆప్తులగువారు కాచియుండందగుననుట.. ... ... ౧౨

శ్లో॥ నిర్గచ్ఛేత్ప్రవిశేచ్చైవసర్వ ఏవోపలక్షితః। తిష్ఠేయుః పరమాతాశ్చ రాజశాసనగోచరాః॥ ౧౩

వచ్చుచుండెడు పోవుచుండెడు వారంతయు వదీమీద శోధితులగుచు రాకపోకలు గలిగియుండందగుననియు శత్రుపక్షీయులగు హరకారాలును యజమానుని యాజ్ఞమీదలోపలనుండందగుననియునను శాసనము... ... .. ౧౩

శ్లో॥ వృథాకోలాహలా ద్ద్యూతాత్పానాచ్చప్రతివారితాః సజ్జోపకరణాస్తిష్ఠేత్సర్వః కార్యోన్ముఖో జనః॥ ౧౪

కారణములేక యరచుచుండుటయు - గత్తరి జేయుటయు జూదంబాడుటయు- సారాయిద్రావుటయు - నిషేధింపంబడి సకలకాలంబులందును తమతమపనులయడ సన్నద్ధులగుచు నుండునటుల నందరికిని యాజ్ఞాపించుచుండవలయుననుట... ౧౪

శ్లో॥ బహిః ఖాతాస్స్వసంజ్ఞాతాం ముక్త్వాసంచార మాయతం। పరసైన్యవిఘాతార్థం సర్వాంభూమింవినాశయేత్॥

స్కంధావారమునకుంగలయగడ్తచుట్టును తనసంబంధంబగు సామగ్రులుదక్క తక్కిన వంటలు మొదలగు సస్యములుకాలగ ప

దార్థంబులును శత్రునిబంధంబునకై పాడు జేయుచుండవల
యుననుట                                        ౧౫

శ్లో॥ క్వచిత్కాశశరావాపైః క్వచిత్ఛన్నైస్సదారుకైః।
దూషయేత్పరితోభూమిం ప్రచ్ఛన్నైర్వివిధైశ్శరైః॥ ౧౬

రెల్లుకట్టెలచే జేయంబడిన బాణంబులచేతయు కొరత మా
కులచేతయు - మరియు నానావిధంబులగు ప్రచ్ఛన్న యంత్రముల
చేతయు శత్రువుల సంచారమునకు విరోధంబగు నట్లు భూమి
యంతయు దూషితం బొనర్పంగుననుట.        ...        ..౧౬

శ్లో॥ నిర్వృక్షగుల్మశ్చ పథశ్శ్వభ్రస్థానవల్మీకనిర్ఘణైః॥ కా
రయేత్కారణైశ్చిత్రైస్సైన్యవ్యాయామ మన్వ
హం॥        ..        ...        ...        ౧౭

చెట్టుపుట్టగుట్టమిట్ట పల్లము లేని చదరంబగు విశాలభూమిని నా
నావిధచిత్రంబులగు వ్యూహాదిరచనాసాధనవిశేషంబులచే నెల్లప్పు
డు సైన్యంబులకవాయతులు జేయించుచుండవలయుననుట ..   ౧౭

శ్లో॥ యస్మిన్దేశే యథాకామం సైన్యవ్యాయామభూ
మయః। పరస్య విపరీతా నిష్కృతో దేశస్స ఉత్తమః॥ ౧౮

శత్రుజనములకు అగమ్యంబును తమకుం సుగమంబును నగునట్లు
కవాయతు జేయుస్థలంబుల నిర్ణయించుటయుత్తమంబగుననుట ౧౮

శ్లో॥ ఆత్మనశ్చ పరేషాంచ తుల్యవ్యాయామభూమయః।
సమధ్యమస్సముద్దిష్టో దేశశ్శాస్త్రవిచింతకైః॥ ౧౯

శత్రుబలంబులకును తనబలంబులకును సుగమంబగు కవాయతు
నేల మధ్యమంబుగ శాస్త్రవేత్తలుబలికిరనుట        . ౧౯

శ్లో॥ అరాతిసైన్యవ్యాయామసుపర్యాప్తమహీతలః॥ ఆ
త్మనోవిపరీతశ్చయస్స దేశోధమస్మృతః॥     ౨౦

శత్రుబలంబులకు నెమ్మదియగు నదియు తమకు దుర్గమంబ
గు నదియునగు ప్రదేశము కవాయతునకధమంబనంబడియె. ౨౦

శ్లో॥ నిత్యముత్తమమాక్రాంతుత్తదభావేతు మధ్యమం।
జఘన్యోక్రాంతచ త్వామర్షీం న్నోపవేశేతనిగ్రహో॥ ౨౧

పైనొడివినమూడువిధంబులగు కవాయతు జేయుటకుండగి నభూములలోననుత్తమంబుప్రశస్తంబుగావుననది యొగ్గోరుచుండున దియ యబ్బనియెడమధ్యమభూమియైనంప్రశస్తంబగుగాని అధమ భూమిసుతరాము యోగ్యముగాదనుట... .. ...౨౧

పరాభవసూచకంబులు.

శ్లో॥ ఉద్ఘాతరోరుషైర్వైరైకకామాచ్ఛపలోత్థితః॥ప
రస్పరభవద్ద్రోహోనతథా తూర్యనిస్వనః। ఆ
క్రాంతఇవకేనాపిరోగానీకైరభిద్రుతః। అకస్మాద్భ
వదుద్వేగోరాజాసీహారసంవృతః। ఉత్పాత్రేక్షితభ
యత్రాసోనిఘూర్ణతోలంకపిభీషితః। ఉద్ధూమప్ర
జ్వలచ్ఛస్త్రోవిదక్షిణశివారుతః॥ప్రజ్వలంతి చశ
స్త్రాణివిదక్షిణశిఖోనలః। మండలైఃకాకగృధ్రాణా
మాక్రీర్ణోయాతువాసినాం। ముహురత్యుగ్రతాదీప్త
స్సంసిక్తోరక్తవృష్టిభిః॥అకాశాత్పతితాభిశ్చజైయా
ఔత్పాతకోదయాః॥ పరితరాజ నక్షత్రైః క్రూరై
రౌత్పాతికైగ్రహైః। సూర్యేందృష్టకబంధాదిర
కస్మాన్మాథవాహనః॥.. .. ... ౨౭

సైన్యంబునంగల సరదారులలో నొకరితోనొకరు పరుషంబులుబలుకుటయు - నిష్కారణంబున చపలస్వభావులగుటయు- ఒకరియందొకరికి ద్రోహబుద్ధిబుట్టుటయు- తూర్యంబుల పశ్శబ్దంబులుగ మొరయుటయు- ఎద్దియేనియు నొకరోగముచే పీడితుండయున్నట్లుండుటయు - నిష్కారణంబుగ జడుపుబుట్టుటయు - కావురుచే గప్పంబడియుండుటయు - భయంబును దిగులునుగలుగుటయు - పిడుగులుబడుటయు - కొరువ్వులురాలుటయు - మంటలు పొగతోడగలశియుండుటయు - యెడమపక్కన కక్కలు గూయుటయు- ఆయుధంబులు మండుటయు - అగ్నులు అపసవ్యంబులగు మంటలుదిరుగుటయు - కాకులుగద్దలు బొరువులు మొనలగునవి మూగుటయు - అత్యుగ్రతగలుగుటయు - నెత్తురువానగురియుట

యు - ఆకాశంబు పలువర్ణంబులుగ గన్పట్టుటయు - క్రూరంబులగు శని రాహ్వంగారకులచే రాజనక్షత్రం బాక్రమింపంబడుటయు సూర్యునియందు మొండెంబులు గనుపడుటయు నశుభ సూచకంబులనుట... ... ... .. .. ౩౨

శుభ సూచకంబులు.

శ్లో॥ ప్రహృష్టనరనారీకః ప్రశస్తస్వనదుందుభిః । గంభీర
హేషితహయః ప్రాజితో బృంహితద్విపః ॥ పుణ్యా
హబ్రహ్మఘోషాఢ్యో నృత్తగీతసమాకులః । నిగా
ఢోత్తమహోత్సాహ ఆకాంక్షితజయోదయః ॥ వి
రజస్కోఽభివృష్టశ్చ ప్రాదక్షిణ్యస్థితగ్రహః । దివ్యాం
తరిక్షైరుత్పాతైః పార్థివక్షోభవర్జితః । ప్రశస్త
కూజితహయః ప్రదక్షిణశివారుతః । నీచైః ప్రవృత్తా
నులోమమారుతస్తు ప్రశస్యతే । హృష్టపుష్టబల
స్సాధు సుగంధిజ్వలితాననః । ఆమత్తమాద్యన్మా
తంగ ఆసారాభ్యుదయాన్వితః । ఇత్యాదిలక్షణో
పేతస్స్కంధావారః ప్రశస్యతే । శస్తైతస్మాద్విషాం
సంగో అశస్తైయద్విపర్యయః ॥ .. ... ౩౩

శిబిరంబునందు స్త్రీపురుషులు సంతోషంబుగ నుండుటయు దుందుభుల మంచిశబ్దంబులు బలుకుటయు గుర్రంబులు గంభీరంబులగు హేషారవంబు లొనర్చుటయు - ఏనుంగులు గంభీరబృంహితంబులు జేయుటయు - పుణ్యాహ వాచనరూపంబులగు వేదశబ్దంబులు వినుపించుటయు - నృత్యంబులు గానంబులు వినంబడుటయు - అత్యుత్సాహము గలిగియుండుటయు - జయప్రదంబులగు పలుకులు వినంబడుటయు దుమ్ములేక వానగురియుటయు - గ్రహంబులు వక్రతలు లేకుండుటయు - రాజనక్షత్రంబులు క్రూరనక్షత్రగ్రహములం గలయకుండుటయు - కుడివైపున నక్కలు గూయుటయు - ప్రదక్షిణాగ్ని జ్వాలాశిఖలు గలుగుటయు వాసనగాలి వీతెంచుటయునను శుభోదయంబులు వృద్ధికరంబులనుట. ౩౩

శ్లో॥ శుభాశుభేష తేయస్మాద్రాజాసముపలక్షయేత్ ।
సాధ్యసిద్ధిస్తి మిత్తానియతశ్చం సంతికర్మణాన్నా ।
వింద్యాదాత్మ హితాకాంక్షీతస్మా దేతానితత్వతః।
ప్రశస్తేన నిమిత్తేన విశుద్ధేనాంత రాత్మ నా యుద్ధ
మారభ్యమాణంహిసిద్ధిఁయాంతిమహీభుజాం॥౩౫౪

శుభాభశుభరూపంబులగు ఫలంబుల యడియాలంబులగ్రసుం
గొనితనకుహితంబుగోరు రాజగువాడు పరిశుద్ధస్వభావముతో
డనాలోచించి యుద్ధారంభముజేయ కార్యసిద్ధియగుననుట॥౩౫

శ్లో॥ సదాసంపత్తివిజ్ఞానః సత్వంశ్రైవానుకూలతా । ఉ
ద్యోగోవ్యవసాయశ్చయస్యైతేతస్యసిద్ధయః॥౩౬౪

మంచివిజ్ఞానంబును- బలంబును దైవానుకూలతయు - యత్నం
బును- ప్రయత్నచింతయు- గలవానికి కార్యసిద్ధిగలుగుననుట. ౩౬౪

శ్లో॥ తన్మూలత్వాత్ప్రజానాంతు రాజాస్కంధ ఇతిస్మృ
తః । ఆవారో నాస్తదండాదివృత్తిరావారఉచ్యతే।
భూతా నాంభూతినియతే రావా రేణమహీయసా।
అతఆవారితస్కంధఃస్కంధావారఇతిస్మృతః॥౩౭౪

రాజంతటికిమూలంబు గావుననుమంత్ర్యాదులుశాఖాతుల్యు
లుగావునను వాటినిరక్షించు సహాయసంపదగల యదిస్కంధా
వారంబనంబడియెననుట.. ... ... ... ౩౭౪

శ్లో॥ సమవస్కంధయాసాతువీవధాసారనిగ్రహం। ప
తేత్ప్రయత్నతోరక్ష్యోఃస్కంధావారస్యమృత్యవః॥. ౩౮౪

ధాన్యజల ఆయుధాది సంగ్రహంబులు వికలంబులగుటవలన
దండు జీవించంజాలదుగాన శిబిరంబతిప్రయత్నంబున రక్షింప
దగుననుట.. ... ... ... ... ౩౯౪

శ్లో॥ ఇత్యుక్తయత్నేననివేశయేద్బలం శుభాశుభంచా
స్యతథోపలక్షయేత్। పరస్య సైన్యంనిపుణంవిలోక
యేత్సమారభేతాశు భహీనదర్శనాత్॥ ..౪౦౪

చెప్పంబడినవిధానంబున విడిశిశుభాశుభంబులంబరీక్షించి

శత్రునకుంగల యనిష్టకాలంబున యుద్ధంబునకుం దొడరవలయు నని ఫలితార్థము... .. .. .. ౮౦౪

ఇట్లు కామందకము పదియేడవసర్గముగిసెను.



పదునెనిమిదియావ సర్గప్రారంభము.



శ్లో॥ మహాప్రజ్ఞానసంపన్నస్సత్వ దైవోపబృంహితః।
ఉద్యోగాధ్యవసాయాభ్యా ముపాయాన్నిత్యి పె
త్ప రే॥... ... ... .. ౧

పూర్వసర్గోక్తవిధినిముత్తడి వేశియు సాహసంబునయుద్ధా భము జేయక ఉక్తలక్షణలక్షితంబగు వివేకంబును బలంబును దైవానుకూలంబునుంగలిగియున్నను శత్రునిగూర్చి సామాది ఉపాయంబుల ప్రయోగించం దగుననుట... ... .. ౧

శ్లో॥ చతురంగబలంముక్త్వా కోశో మంత్రశ్చయుజ్యతే।
తత్రాప్యధ్యమంశో మంత్రేణకో శేనచజయోఽరీణ॥... ౨

చతురంగబలంబులచేజేయు యుద్ధంబునకన్న ద్రవ్యదానము చేస్వాధీనంబొనర్చుటయు- మంత్రనిశ్చితంబులగుశస్త్రరసాదిప్ర యోగములచేతయుమరియును... ... .. ...

శ్లో॥ సామందానంచ భేదశ్చ దండశ్చేతిచతుష్టయం।
మాయోపేక్షేంద్రజాలంచ సప్తోపాయాః ప్రకీర్తితాః॥

అను ఉపాయసప్తకంబులచే జయించుటకు యత్నించదగున నుట... ... ... .. ... ౨

సామభేదంబులు.

శ్లో॥ ప్రణిపాతస్తు సర్వేషాం సత్కర్మణ గుణ కీర్త నం। పూర్వ సంబంధ కథనం స్వసంబంధ ప్రక ల్పనం। పరస్పరోపకారాణాం దర్శనం గుణ కీర్తనం। సంబంధస్యసమాఖ్యానమాయ తెస్సంప్ర

దర్శనం। త్వమస్మాకం పితా భ్రాతా భవతీతి చతు
ర్థకం। సామయా వా స్వైశలయాత్వాహ మితి
చార్పణం। ఇతి సామప్రయోగజ్ఞైస్సామం పంచ వి

ధంస్మృతం .. ... ... .... ౨౪

అన్యోన్యనమస్కరణంబును పరస్పరగుణస్తోత్రంబులునుము
నుపు నిప్పుడును నొండొరులకు గలసంబంధ ప్రకటనంబును సా
మాన్యధర్మంబులనంబడు - నీవు నేనిట్టియుపకారము జేయుదుననియు- నీవు నాకిట్టియుపకారము జేయవలయు ననియు పలుకుటయు ౧-
కులస్థానపౌరుషాదులగు గుణంబుల నెన్నుటయు ౨. ఒండొరులబంధుత్వ ప్రకటనంబును ౩ - ఇప్పుడిట్లొనర్చిన కడకిట్లు పరిణమించునని
బలుకుటయు ౪- మంచిమాటలు బలుకుటయునను నదిసామ వి
ధంబులు...... ... .. ... ౨౪

దాన భేదంబులు.

శ్లో॥ సంప్రాప్తః ప్రథమః ఖ్యాతః ద్వితీయోత్సర్గ ఉచ్యతే।
సారతో వాసుసంప్రాప్తధనోత్సర్గ స్తృతీయకః।
ద్రవ్యదానపపూర్వం చ స్వయం గ్రాహ ప్రవర్తనం।
దేయస్య ప్రతిమోక్షశ్చ దానం పంచవిధం స్మృతం॥ ౭౪

తనవద్దనుండు దానినొసంగుటయు ౧- తీసుకొనక విడుచుటయు ౨- మర్యాదతోటి తాను గొనిన దానిమరలనర్పించుటయు ౩
నీచే దీసుకొనందగిన దాని నేనంగీకరించితిగాన దానిమరలనిచ్చె
దననుట ౪- ప్రతిసంవత్సరముగొను కప్పము వదులుటయునను నై
దువిధంబులనుట... .. ...... ..... ౭౪

భేదభేదంబులు.

శ్లో॥ స్నేహరాగాపనయనం సాదరోత్థాసనం తథా।
సంతర్జనం చ భేదజ్ఞైర్భేదస్త్రివిధ స్మృతః॥ ౭౫

స్నేహితులకన్యోన్యము కోపము గల్పించుటయు ౧ - అన్నదమ్ములకు కోపము గలుగ జేయుటయు - ఒకని నెరుంగక నొకని బెదిరించుటయు ౩ - నను భేదంబులు మూడు దెరంగులనుట. ౭౫

## దండభేదంబులు.

శ్లో॥ వధోఽర్థహరణంచైవ పరిక్లేశ స్తథైవచ। ఇతిదం డవిధానజ్ఞై ర్దండస్త్రివిధస్స్మృతః॥ ... ౯౪

చంపుటయు - ద్రవ్యముకొల్లబెట్టుటయు - రాజ్యపరికరాదుల జెరుచుటయు - ననుదండము మూడుదెరంగులనట.. ౯౪

శ్లో॥ ప్రకాశశ్చాప్రకాశశ్చ దండోఽద్విపిధఉచ్యతే। ప్రకాశదండ్యాః కుర్వీత లోకద్విష్టా స్తథారిపూః॥ .. .. .. ౧౦౪

ప్రకాశదండంబన నందరకు దెలియునట్లొనర్చుటయు ప్రకాశంబు రహస్యముననొనర్చు నుపాంశు ప్రయోగంబులు- అనురెండువిధంబులైయుండు అందులోకద్వేషులును శత్రులునునగువారి ప్రకాశదండం బొనర్పందగుననుట... .. .. ౧౦౪

శ్లో॥ ఉద్వేజనాదిభిర్లోకో స్త్వైచన్నృపవల్లభాః। వ్యథంతేభ్యధికంతేషు .తేషూపాంశుః ప్రశస్యతే విశేషణాపనిర్యోగైశ్చ స్త్రోదోద్వర్తనేనవా। తేషూపాంశునయేద్దండం యథాన్యోనవిభావయేత్ । బ్రాంహ్మ ణోజాతిమాత్రోపిధార్మికోవాంఙ్మితోపివా । ధర్మావిలోపతోవాపి పరంధర్మోగ్నినాయథా । ఉపేక్షావానహంతవ్యో తేషూపాంశుః ప్రశస్యతే । ఉపేక్షావాపినిపుణః ప్రత్యక్షంపరివర్తయేత్ ... .. .. ౧౮౪

రాజునకుప్రియులగుచుండి రాజద్రోహంబొనర్చునట్టియు లంచంబులకాశబడి రాజ్యనాశంబొనర్చునట్టియు మొదలగువారి విషప్రయోగమంత్రప్రయోగ సౌష్ఠికములు మొదలగువాటినే న్నృతినొందింపందగుననుట... ... .. ౧౮౪

## సామప్రయోగవిధానము.

శ్లో॥ ప్రలపన్నపలోక్యైతద్దృష్ట్వాసాధుః పిబన్నివ। ప్రపన్నివామృతంసామప్రయుంజాత్ప్రత్యయంవచః। వాగ

నుద్వేగజననీ సామేతిపరికీర్త్యతే । సామస్యా
త్మ్యోన్యతాసాంత్వా ప్రియసోత్రేచకీర్త్యతే॥ ౧౬॥

దుఃఖముగల్పించని పలుకులు బలుకుటయు - నిజము బలుకుట
యు - దుఃఖోపశమనము జేయుటయు - కోపముచల్లార్చుటయు
పొగడుటయుననువాంటికన్నిటికిసామంబని పేరుగావుననట్టి పలు
కులు ప్రీతితోడ అమృతంబులు చిలుకునట్లుబలుకుచు ప్రియంబులు
బలుకునేత్రంబులంజూచుచు ప్రయోగింపందగుననుట.. ౧౬॥

దానప్రయోగ కారణములు.

శ్లో॥ సామేననశమంయాంతందానేన ప్రశమంనయేత్।
ఇంద్రోపచారేశుక్రస్యదానేనశమమేయివాన్॥ ౧౭॥

సామోపాయముచే చల్లంబడని వానిదానముచే శమింపం
జేయందగుననుట - శుక్రుండింద్రునిచే నెన్నియంది మాటలు బలు
కంబడియు మృతసంజీవినీమంత్రంబుపదేశింపకున్నెడ కచునిశిష్యు
నిగనర్పించియతని మెప్పించి యావిద్య గ్రహియించెనని భారత
ము వలన దెలియునది. .... .. ౧౭॥

శ్లో॥ అపరాధేనమహితః కుపితే భృగునందనే । వృష
పర్వాదానవేంద్రో దానేనమహితుస్స్వయి॥ ౧౮॥

శుక్రునిపుత్రియగు దేవయానివిషయంబున తనకూతురగు
శర్మిష్ఠచే జేయంబడిన యపరాధంబునకై కుపితుండగు శుక్రుని
నాశర్మిష్ఠను దేవయానికి దాసిగనిచ్చుటవలన వృషపర్వుండను
రాక్షసరాజు సుఖంబందెనని భారతమువలన దెలియందగు. ౧౮॥

శ్లో॥ ఉపచ్ఛందోపిదాతవ్యం బలినేశాంతిమిచ్ఛతా।స
మూలపనగాంధార్యోయప్రయచ్ఛన్ క్షయంగతః॥ ౧౯॥

తనకన్నబలిష్టుండగువానితో విరోధముప్రకృతంబగునెడ న
తనియనువర్తించి యతనియిష్టపూరణంబొనర్చియైనను తన్ను
గాపాడుకొనందగుననుట. అట్లొనర్పని దుర్యోధనుండు సమూ
లనాశంబందెనుట భారతప్రసిద్ధము..... ..... ౧౯॥

భేదవిభాగము

శ్లో॥ కించిత్ప్రియచ్ఛాన్ భూయస్యాత్తృష్ణయావిప్రలంభ
యెత్ । భింద్యాచ్చతుర్విధాన్ భేద్యాన్ ప్రవి
శ్యైభయవేతనైః॥ .... ... ౨౦౫

కొంచమొసంగి మిక్కుటంబుగ నిత్తునను నాస గలుగం జేసి క్రుద్ధుండును - లుబ్ధుండును - భీతుండును - అవమానితుండు ను ననునాల్గు విధంబుల భిన్నంబులగు వారల భేదింపం దగు ననుట. ౨౦౫

శ్లో॥ అలబ్ధవేతనో లుబ్ధో మానీ చాప్యవమానితః। క్రుద్ధ
శ్చ కోపితోకస్మాత్తథా భీతశ్చ భాషితః। యథాప్రియ
స్సాహసిక ఆత్మసంభావిత స్తథా। విభిన్న ధర్మకా
మార్థః క్రుద్ధో మానీ విమానితః। భీరుస్స్వదోష వి
ప్రస్తకృత వైరోభిసందితః। అతుల్యైనసహోదిష్టః అ
ల్పమాననిరాకృతః। హృతద్రవ్యకళత్రశ్చ మహా
భోగాభికాంక్షుకః। పరిక్షీణో బహిర్బంధు బహి
ర్ద్రవ్యో బహిష్కృతః। ఇతి భేదాన్సమాఖ్యా
తాభింద్యాదేతాన్ పరాశ్రితాన్। ఆగతాన్పూజ
యేత్కామం నిజాంశ్చ ప్రశమం నయెత్... ౨౧౫

సంబళము పొందని వాడును ౧ - ద్రవ్యలోభము గలవాడును ౨ - స్వాభిమానము గలవాడును ౩ - శత్రువుచే నవమానంబందిన వాడును ౪ - నిష్కారణము కోపించిన వాడును ౫ - నిష్కారణంబున కోపింపబడిన వాడును ౬ - భీతుండును ౭ - వదరుపోతును ౮ - యుద్ధము జేయ నేరని వాడును - సోమారియు ౯ - అతిసాహసియు ౧౦ - తన్నుందా నపొగడికొను వాడును ౧౧ - ధర్మ అర్థ కామంబుల వి

డిచి కేవలభోగప్రియుండగువాఁడును౧౨ - గౌరవముచేతయును ధర్మముచేతయు నవమానింపంబడినవాఁడును౧౩- పంధయు౧౪ తనతప్పునకు జడియువాఁడును౧౫- మొదట వైరము బన్నిపశ్చాత్తాపియగువాఁడును౧౬- తనకుసమానుడు గానివానితోడ జేర్పబడినవాఁడును౧౭- తనకుండగని హీనకృత్యంబునని యుక్తుండగువాఁడును౧౮- తనకుండగిన గౌరవంబందకని రాకరింపంబడినవాఁడును౧౯- ద్రవ్యంబునుహరింపంబడినవాఁడును౨౦ - భార్యనపహరింపంబడినవాఁడును౨౧- మిక్కిలిభోగంబులనాశించువాఁడును౨౨ క్షీణించినవాఁడును౨౩- వెలపటబంధుజనంబులుగలవాఁడును౨౪- వెలపటఆస్త్రిద్రవ్యంబుగలవాఁడును౨౫-బహిష్కరింపంబడినవాఁడును౨౬- ననుభేదంబులుగలజనంబులు దానమానంబులకు లోబడుదురుగాన నట్టివారిరప్పింది మన్నించితమువారలనుపశమింపంజేయందగుననుట.. ... ... ౨౫

ఉపాయంబులు.

శ్లో॥ సామత్యాస్త్రాను సంధానమత్యుగ్రభయదర్శనం।
ప్రధానమానదానంచ భేదోపాయాః ప్రకీర్తితాః॥ ౨౬

ఉక్తలక్షణక్షితంబగు పంచవిధసామంబును- ఏదటివానికేవిషయంబునందాసగలిగియుండు దానింబూరించుటయు మిక్కిలి భయంబు జూపుటయు మిక్కిలిగౌరవించుటయు - ననునది భేదోపాయంబులనుట... ... .. ... ౨౬

శ్లో॥ భేదంకుర్వీతమతిమాన్ విగృహీతో బలీయసా। చం
డామార్కాసురైర్భిత్వా బలవంతౌ పరాజితౌ॥ ౨౭

బలిష్ఠుండగు వానితో పగగలుగు నెడమేధావి యగువాఁడు భేదంబొనర్పందగుననుట — పూర్వంబున శుక్రశిష్యులగుచండామార్కులను వారిరువురును సర్వశాస్త్రంబుల సమర్థులగుచు అగ్నిస్తంభన మోహనమారణాదులచే దేవతులం బీడించుచుండుట రాక్షసులువారి బలంబున నభేద్యులగుట బృహ

ఉత్సాహములేని సోమారిని- యుద్ధంబుననలశినవానిని౨- వి హితంబులగు నుపాయంబులు వెదకువానిని౩- తుయించుటయు చచ్చుటయు దేశాంతరంబుల నలజడిబడుటయునను సంకటంబులచే దుఃఖించువానిని౪- యుద్ధంబున నోడి పరువెత్తువానిని౫ భయమందినవానిని౬- నీతి శాస్త్రపరిచయములేనివానిని౭ స్నేహితునిని౮- పిల్లకాయను౯- హింసాభీరుత్వముగల ధర్మాత్మునిని౧౦- దుర్మార్గుని ౧౧- పశుస్వభావముగలవానిని౧౨- స్నేహముగోరువానిని౧౩- మంగళకరంబులగు తాత్పర్యముగల వానిని౧౪-మంచిమాటలచేతనస్వాధీనపరిచికొనందగుననుట౩౨

దానోపాయము.

శ్లో॥ లుబ్ధంక్షీణంప్రదానేన సత్కృత్యవశమానయేత్ ॥౩౩

ద్రవ్యలోభముగలవానినియు-దరిద్రునినియు౨-ద్రవ్యదానము చేసిమన్నించి స్వాధీనపరచికొనందగుననుట... ... ... ౩౩

దండవిషయము.

శ్లో॥ అన్యోన్యశంకయాభింద్యాద్దుష్టాన్ సర్వాన్దండదర్శనాత్ ॥ .. .... ... ౩౩౪

దుర్మార్గులగు వారలను నొకరికొకరి భయంబులంగను పరిచి భేదించి నశింపంజేయందగుననుట .. .. ౩౩౪

ఉపసంహారము.

శ్లో॥ అవశ్యమాయాంతి వశంవిపశ్చితాముపాయసర్వం శబలేనసంపదః। భవత్యుదారంవిధివత్ప్రయోజితం కాలంహిరాజ్ఞాంక్వచిదర్థసిద్ధయే॥ ౩౮౪

ఉపాయనీతి బలంబులుగలవారలకుసర్వకాలంబును నైశ్వర్యంబులు ఫలియించుననియు సాహసంబునయూ దృచ్ఛికఫలంబుగలుగుననియు నీతివేదులమతంబులుగాన నుపాయంబుల వశ్యంబును ప్రయోగింపందగుననుట.. ... ... ౩౮౪

ఇట్లు ఉద్యోగవిషయము పదునెనిమిదియవసర్గముముగిసెను.



కామందకం౧౯దో - సర్గప్రారంభము.



శ్లో॥ సామాదీనాముపాయానాంత్రయాణాం విఫలేన
యే । వినయేన్నయముద్యుక్తోదండం ద్వేష్యనితిష్ఠేత్॥ ... ... ... ౧

పూర్వసర్గోక్తంబులగు సామాదియుపాయంబులుమూడును నీతిచాతుర్యంబునుఫలించనియెడనీతిశాస్త్రానుసారంబున శత్రుని విషయంబున తగుదండయాత్ర జేయుటకుపక్రమింపందగు. ... ౧

అట్టిసమయంబునపూర్వాచరణవిధి.

శ్లో॥ దేవానభ్యర్చ్యవిప్రాంశ్చప్రశస్తగ్రహతారకం।షు
డ్విధంతుబలంవ్యూహ్యద్విషతోభిముఖంనయేత్॥౨

దేవతాపూజలును - కాత్యాయనాదులగు బ్రాహ్మణ పూజలును నొనర్చి ప్రశస్తంబులగుయుద్ధయాత్రాప్రశస్తగ్రహ చంద్ర తారాబలతిధివారనక్షత్రాదులుగల శుభ ముహూర్తంబున వక్ష్యమాణలక్షితంబగునారువిధంబులగు బలంబులను - వక్ష్యమాణ సర్గోక్తలక్షణ లక్షితంబులగు దండాది వ్యూహ భేదంబులచే మోహరించి శత్రునింగూర్చి యభిముఖంబుగ దండయాత్ర జేయందగుననుట.. .. .. .. ౨

బలస్వరూపంబును దానితారతమ్యంబులు.

శ్లో॥ మౌలంభృతంశ్రేణిసుహృద్విషదాటవికంబలం।పూ
ర్వపూర్వంగరీయస్తుబలానాంవ్యసనంతథా॥... ౩

పితృపితామహక్రమాయాతంబగుమూలబలంబును ౧ సంబళంబులొసంగియుంచికొనుబలంబులును౨పట్టణంబున రాజ్యంబునంగలసమర్థులగుజనంబులుస్వకీయ సామర్థ్యప్రకటనంబునకై గుమిగూడిరాజసహాయమొనర్చు శ్రేణిబలంబును ౩ విజిగీషునకు మిత్రులగురాజులసైన్యంబులును ౪ శత్రువులజయించి వారల సైన్యంబులతనకుస్వాధీనంబొనర్చుటచేనలరుద్విషద్బలంబును౫

తనరాజ్యంబునంగలశియు డేడునడవులందుం డేడు బోయలు మొదలగు నాటకవికజనంబులగనియును ౬ నను నారుబలంబులయందును తుదనుండి క్రమంబున నొండొంటికి శ్రేష్ఠంబులగుటనట్టియారుబలంబులును బలంబులకుంగల ఉత్కృష్టగుణలక్షితంబులగు వ్యసనంబులునుగరీయంబులు గావుననట్టి వ్యసనంబులు లేనియట్లు ఉపధాశోధితులగు బలంబులగూర్చుండగుననుట... .. 3

తారతమ్యనిరూపణము.

శ్లో॥ సత్కారాదనురాగాచ్చ సహాసంకథనాసనాత్।
త్యంతత్స్వావభావిత్వాత్ మౌలంభృతబలాద్గురు॥ ४

ఉత్కృష్టగుణలక్షితంబగు మౌలబలంబు సంక్రమాయాతంబగుట క్రంబున రాజుచే మన్నింపంబడుట చేతయు ప్రీతిగలిగియుండుటచేతయు - నర్మాలాపంబు లొనర్చుటచేతయు. ఎల్లప్పుడుం గూడియుండుటచేతయు. సుఖదుఃఖంబులనైక్యతగలిగియుండుటచేతయు స్వాతంత్ర్యంబధికంబగుటంజేశి రెండవదియగు భృతకబలంబులకన్న మౌలబలంబుగుణవంతంబనుట... ... ४

శ్లో॥ సన్నికృష్టతయానిత్యంతు ప్రోత్థానతయాతథా।
వృత్తేశ్చస్వామ్యధీనత్వాత్ భృతంశ్రేణిబలాద్గురు॥ ౫

సంబళంబులు గొనుటవలనను నెల్లప్పుడు రాజాశ్రయంబుగలుగుటవలనను. నట్టిస్వామ్యధీనతనొందనియడ వృత్తిశూన్యంబగుననుభయంబుగలుగుటచే ననువర్తించియాజ్ఞాపారతంత్ర్యంబందుటయావశ్యంబగుటను తృతీయంబగు శ్రేణిబలంబున కన్నద్వితీయంబగు భృతబలంబు గుణశ్రేష్ఠంబనుట.. ... ౫

శ్లో॥ తుల్యసంహర్షణామర్షాత్సుఖలాభాత్తథైవచ।
బలాజ్జానపదత్వాచ్చమిత్రాచ్ఛ్రేణీబలంగురు॥ ౬

విజిగీషుని నగరంబునను రాజ్యంబుననునికిగలుగుటచేతయు రాజరాజ్యంబులకుంగలయన్యోన్యసంబంధము వలన రాజునకుంగల సుఖదుఃఖంబులు శ్రేణీజనంబులంజెందుంగావున దూరం

బురనుండెడుమిత్రబలంబుకన్న శ్రేణీబలంబున గుణం బెక్కుడ
గుననుట.. ... ... .. ... ... ౬

శ్లో॥ సంఖ్యాత దేశ కాలత్వా దేకార్థోపగమా త్తథా।
బలాత్స్నేహానయోగాచ్చ శత్రోర్మిత్రబలంగురు॥ ౭

దేశ,కాలంబులు దెలిసియుండుటవలనను- స్నేహాధిక్యత వలననేక కార్యంబునందు ఆసక్తులగుచు వెడలుటవలనను బలవత్తరంబగు మైత్రికారణంబునను శత్రుబలంబుకన్న మిత్రబలంబు గుణవంతంబగుననుట.. ... .... .... ౭

శ్లో॥ ప్రాకృతాధార్మికాలుబ్ధాల నార్యాస్సత్యభేదినః। త
స్మాదారణ్యకతయా తేభ్యశ్శత్రుబలంగురు॥ ౮

అరవవిధంబగు నాటవికజనంబులు- అల్పబుద్ధులును - పాపము జేయువారును - ద్రవ్యమునందులోభంబు నొందువారును- గుణహీనులును - నిజముబలుకనివారును-నగుటనట్టివీరలకన్నను శత్రుబలంబులుయుద్ధకౌశలాదు లెరుంగుట వలననువిజిగీష్వధీనంబగు వృత్తిగలవారలగుటనుగుణాధికులనుట... .. ౮

శ్లో॥ ఉభయంత ద్విలోపార్థం కాలాపేక్షమవ్యవ
స్థితం। విలోప్యవ్యపనేచ్చైవప్రాప్య తేరిజయోధ్రువః॥ ౯

పైయుకహరించిన శత్రుబలాటవికబలంబులు రెండును విజిగీషునికి ప్రభుత్వోత్సాహశక్తులు జాగ్రతగలిగియుండునంతకు విధేయులైయుందురుగాని వాటికిలోపముగలయెడ శత్రుపక్షీయులగుటవలనశత్రునకుంజయంబు గలుగజేయుదురుగాననట్టి వారల నమ్మియుండందగదనుట... ... ... ... ౯

శ్లో॥ ఉపజాపకృతాత్త్రస్యేష్య యాదాభ్యాం విశేష
తః। పరస్పరంహ్యుపజపేత్ ఉపజాపాద్ధ్రువో
జయః॥.. ... .. ... ౧౦

శత్రుపక్షంబుప్రబలంబగు నెడభీతులగుచువారలం గలయుటకుసమ్మించుటచేశత్రువునకు జయముధ్రువంబగుటవారల నమ్మందగనిపూర్వసంబంధము... ... .. ౧౦

శ్లో॥ స్ఫీతసారానురక్తేనమౌలెనోపచితఃపరః। తత్తు
ల్యేనైవయాతవ్యఃతుయవ్యయసహిష్ణునా॥ ౧౧

శత్రుబలంబులకుందుల్యంబగుబలంబుగలినదియు దుఃఖంబు
లనోర్చఁదగినదియునగు మౌలభృత్యశ్రేణీమిత్రబలంబులంగల
శియుద్ధయాత్రజేయందగుననుట.... ... ... ౧౧

శ్లో॥ ప్రకృష్టధ్వజికాలేవాగచ్ఛేన్మౌలైస్సమాహితైః। మౌ
లాస్తుదీర్ఘకాలత్వాత్ తుయవ్యయసహిష్ణవః॥ ౧౨

నానావిధంబులగుబలంబులు చిరకాలంబును బడలుబడుటచే
భేదంబునొందుటవలనను- మూలబలంబులు చిరకాలపరిచితులగుట
కష్టంబులకోర్చువారలగుటంజేసియు- మూలబలంబులు పుంజీభ
వించియుండు నెడ దండయాత్రజేయందగుననుట... ... ౧౨

శ్లో॥ వస్తుష్వేతేషుధామౌలీభృతాదీనివివర్జయేత్। దీ
ర్ఘాధ్వకాలభిన్నేషుతేషుభేదభయంభవేత్॥ ౧౩

ఇట్లుదీర్ఘకాలయాత్రజేయునెడనానావిధబలంబులుగలయ
డపరస్పరము భేదంబులుగలుగుట భేదభయంబునొందగుటవలననట్టి
భృతాదులగు నైదువిధబలంబులు విసర్జించి మౌలబలంబుగోని
యాత్రజేయందగుననుట... ... ... ౧౩

శ్లో॥ బహుత్వాదేవసైన్యానాందీర్ఘకాలాధ్వఖేదతః।
నిత్యప్రవాసాయాసాభ్యాం భేదోవశ్యంహిజాయతే॥౧౪

సైన్యంబులువిరళంబులగుటవలనను చాలాకాలము నిరంతర
ముదారినడుచుటచేతయు- యుద్ధంబులశ్రమచేతయు- భేదంబవ
శ్యంబుగలుగుననుట... ... ... ... ౧౪

భృతబలసంగ్రహణహేతుమాహ.

శ్లో॥ ప్రభూతంమేభృతబలంమౌలమల్పమసారవత్। అ
రేరల్పంవిరక్తంవామౌలంప్రాయోల్పసారవత్।ప్రా
యోమంత్రేణయోద్ధవ్యమల్పోయాసోనవైతిహి।అ
ల్పోదేశస్తుకాలోవా ప్రభూతౌచక్షయవ్యయౌ

శాంతోపజాప్యవిశ్వస్తం సైన్యమస్తీతి వారిపోః। అ
ల్పప్రసారో మంతవ్య ఇత్యుపేయాద్భృతై ర్బలైః॥ ౧౭

విజిగీషునకు భృత్యబలంబు లధికంబులగుచు మౌలబలంబు
న్యూనంబులై యుండినయెడ మంత్రులతోడ స్వకీయబలంబులిట్టి
వనియు• శత్రునకుంగల బలస్వరూపంబులిట్టివనియు దేశస్వరూ
పంబిట్టిదనియు కాలంబిట్టిదనియు నాలోచించి శత్రుబంబుల వి
షయంబు అల్పంబగునేడ భృత బలంబులతోడ యాత్ర జేయం
దగుననుట.. ... ... ... .. ౧౭

శ్రేణీబలగ్రహణ హేతుమాహ.

శ్లో॥ స్ఫీతం శ్రేణిబలం శక్యమాధాతుం యానవస్తుని।ప్ర
స్వో ప్రవాసవ్యాయామాయది భావి సముత్పతేత్॥౧౮

ప్రవాసంబొనర్చుటయు శ్రమంబును విశేషంబు లేమిదెని
యునేడ శ్రేణీబలంబులతోడ దండయాత్ర జేయందగుననుట౧౮

సుహృద్బలగ్రహణమాహ.

శ్లో॥ సుప్రభూతం సుహృత్సైన్యం సమ్యగాధాతుమాత్మ
ని। అల్పప్రవాసో మంత్రాచ్చభూయో వ్యాయా
మయోధిని। మిత్రసాధారణేకార్యే మిత్రాయత్తే
ఫలోదయె। అనుగ్రాహ్యేచపీడ్యే చమిత్రేణైవ
సమంవ్రజేత్॥ .. ... .. ౨౦

విహితులబలంబులు మెండగుచు తనకు సహాయంబొనర్చు
టకుయత్నించునేడనుం ప్రయాసంబును దేశాంతర సంచారంబు
ను మిక్కుముగాక సులభసాధ్యంబగు నట్లుమంత్రనిర్ణీతంబగు
నేడను - మిత్రునికిని విజిగీషునకును శత్రునిజయించుట యందు
సమానతాత్పర్యముగలయెడను స్వకీయఫలంబేనియు - జయం
బేనియు ఓటమియేనియు మిత్రునియందుండునేడను మిత్రబలం
బుగ్రాహ్యంబొనర్చి మిత్రునితోడన దండయాత్ర జేయందగ
ననుట... ... .. .. ... ౨౧

రిపుబలగ్రహణంతత్కర్తవ్యతాంచాహ.

శ్లో॥ ప్రభూతేనారిసైన్యేనయోధయేన్మహతోరిపూన్।
శ్వసూకరవధాపేక్షీ నయశ్చండాలవన్నయేత్।
అంత్యార్జితం కోపభయాదభ్యాశేతురిపోర్బ
లం। నాశయేత్కర్శయేచ్చైవమర్గకంటకమ
ర్దనాత్॥ ... .. ... ౨౩

పూర్వోక్తలక్షణలక్షితంబగు శత్రుబలంబులు మిక్కుటంబుగనుండునెడ నాసైన్యంబులతోడ దండయాత్ర వెడలునెడ వేటకుగొనిపోవు కుక్కలంబలెనతిక ర్కశహృదయుండగుచు వారల దూరంబుననునుచుటవలన శత్రునిచే భేదింపంబడుదురను భయంబుగలిగి తనయొద్దనయునిచికొని కఠినంబులగు దోర్మియుద్ధంబులకుం బంపుటచేతయు - కోటలుబగల్చుట అగర్తలుబూడ్చుట మొదలగు కఠినకృత్యంబులని యోగించుచు వారల నలజడినొందింపంజేయుచుండం దగుననుట... ... .. ...

ఆటవికబల సంగ్రహః.

శ్లో॥ నిత్యమాటవికంసైన్యం మర్గకంటకశోధనే। ప
రదేశప్రవేశేచ పురస్కుర్వీతపండితః॥ ..౨౩

మార్గంబులంగల సంకటంబులని వర్జింపంజేయుట కైయన్య దేశంబునం బ్రవేశించునెడ అడవులవిషయంబులనను భవపరుల గుటనట్టి యాటవికబలంబుల తనదండునకన్నముందు నడుచునట్లొర్పందగు..... · ... ... ... ౨౩

శ్లో॥ ఏతన్మాలాదివద్భేదంచతురంగం బలంస్మృతం। ష
డంగమంత్రకోశాభ్యాం పదాత్యశ్వరథద్విపైః॥౨౮

ఇట్లుమూలబలాదులగు నారు దెరంగులు- గజ-రథ-తురగపదాతులనునాల్గును మంత్రకోశంబులతోడం గూడషడంగబలంబులగుననుట..... ..... ... ..... ౨౮

శ్లో॥ ఇతిషడ్విధమేతద్ధి యథాయోగంబలంబలీ। సుని

చ్ఛిద్రం ప్రతివ్యూహ్యాయాయాత్పరబలం ప్రతి ౨౫
ఇట్లు ఆరువిధబలంబుల విధిప్రకారంబున మోహరించి శత్రువుమీఁదదండయాత్రవెడలందగుననుట..... ..... ౨౫
శ్లో॥ యోగమస్య విజానీయాత్స్వయం యత్నాదినా నృపః
కృతాకృతప్రచారంచ సమ్యక్సేనాపతే స్తథా. ౨౬
పూర్వోక్తలక్షణలక్షితంబగు సేనాపతిచేఁ గర్తవ్యంబులయన్యోన్యమైత్ర్యాదులును ప్రచారంబులును వీరలకుంగమి కాఁడగు సేనాపతి బాహ్యాభ్యంతర ప్రచారకృత్యంబులును నానాయత్నములచే దెలియందగుననుట... ... ... ౨౬

సేనాపతిలక్షణమాహ.

శ్లో॥ కులోద్గతం జానపదం మంత్రజ్ఞం మంత్రిసమ్మతం।
దండనీతిప్రయోక్తార మధ్యేతారం వతత్త్వతః। స
త్యసత్త్వక్షమాదైర్య మాధుర్యాద్యగుణాన్వితం।
ప్రభావోత్సాహసంపన్న మాజీవ్యమనుజీవినాం।
మిత్రవంతముదారాఢ్యం బహుస్వజనబాంధవం।
వ్యవహారిణమక్షుద్రం పౌరప్రకృతిసమ్మతం। వి
ద్యాకారణవైరాణా మకర్తారమనావిలం। శు
భానుబంధికర్మాణ మప్వామిత్రంబహుశ్రుతం। అ
మోఘవ్యాయతంశూరం త్యాగినం కాలవేదినం।
కల్యాణాకృతిసంపన్నం సత్త్వం భావ్యపరాక్రమం।
గజాశ్వరథచర్యాసు శిక్షితారంజితశ్రమం। ఖడ్గ
యుద్ధనియుద్ధేషు శీఘ్రసంక్రమణక్షమం। యుద్ధ
భూమివిభాగజ్ఞం సింహవద్గృధవిక్రమం। అదీర్ఘ
సూత్రంనిస్తంద్ర మనుద్ధతమమత్సరిణం। హస్త్య
శ్వరథశస్త్రాణాం సమ్యగ్లక్షణవేదినం। నరాంత
రవివేకజ్ఞం కృతజ్ఞమనుకంపకం। ధర్మార్థకామస
మాయోగ కుశలం కుశలానుగం। సర్వయుద్ధక్రి
యోపేతం శక్తంతత్పారికర్మణి। స్వభావదిత్త

జ్ఞతయాయుక్తమశ్వనృదంతినాం। తన్నామ్నాం చాపివక్తారం తద్విధానోపపాదకం। దేశభాషా స్వభావజ్ఞం లిపిజ్ఞంసుదృఢస్మృతిం। నిశాప్రచారకుశలం సంజ్ఞానగతినిశ్చితం। ఉదయాస్తమయజ్ఞంచ నక్షత్రాణాంగ్రహైస్సహ। దిగ్దేశమార్గవిజ్ఞానసంపన్నంతజ్ఞసేవితం। క్షుత్పిపాసాప్రకృష్టార్థ శీతవాతోష్ణవృష్టిభిః। అనాహతంభయగ్లాని సముద్ధానభయాప్రదం। భర్తారంపరసైన్యానాం దుస్సాధ్యాహితనిశ్చయం। భిన్నానాంచ స్వసైన్యానాంసమ్యగ్విష్టంభనక్షమం। అవస్కందాభిమంతారం వేత్తారంసైన్యకర్మణాం। పరదూతప్రచారజ్ఞం మహారంభఫలోపగం। శశ్వత్సంసిద్ధికర్మాణాం సిద్ధికర్మనిషేవిణం। పరాభవేష్వనిర్విణ్ణంశ్రీమద్రాజార్థతత్పరం। ఇత్యాదిలక్షణోపేతం కుర్వీతధ్వజినీపతిం॥ ... ... ౪౨

కులీనుండును ౧ తనదేశంబునంబుట్టినవాఁడును ౨ ఆలోచన నేర్చువాఁడును ౩ మంత్రులకు సమ్మతియగువాఁడును ౪ దండనీతి కుశలుండును ౫ ఆన్వీక్షిక్యాదివిద్యలనధ్యయనంబొనర్చినవాఁడును ౬ సత్యంబునుబలంబునుఓర్పును ధైర్యంబునుమంచిమాటలాడుటయు పాపములేనినడతయుననుగుణంబులుగలవాఁడును ౭ ప్రభుత్వోత్సాహశక్తులంగూడినవాఁడును ౮ నమ్మినవారి నేలినవాఁడును ౯ విహితసమూహముగలవాఁడును ౧౦ దాతృత్వసంపన్నుండును ౧౧ బంధువులగమిమెండుగగలవాఁడును ౧౨ వ్యవహారంబు లెఱింగినవాఁడును ౧౩ క్రూరత్వములేని వాఁడును ౧౪ పట్నమునంగలవారలకు సమ్మతుండును ౧౫ నిష్కారణంబులగు పగలుజేయనివాఁడును ౧౬ దుఃఖింగానివాఁడును ౧౭ మంగళకరంబులగు క్రియలొనర్చువాఁడును ౧౮ శత్రువులుకొంచముగ గలవాఁడును ౧౯

శాస్త్రంబులవినికి మెండుగగలవాఁడును ౨౦ మెండగు కసరతుగల
వాఁడును ౨౧ పరాక్రమశాలియు ౨౨ ద్రవ్య క్రయంబులు జేయు
సమయంబున నలుబ్ధుండును ౨౩ కాలదేశస్వభావంబులెఱుంగు
వాఁడును ౨౪ రూపవంతుండును ౨౫ పెద్దలచేశ్లాఘనీయంబగుపరా
క్రమముగలవాఁడును ౨౬ గజంబులతురగంబులనడిపించుట దక్షుం
డును ౨౭ కసరతుగలవాఁడును ౨౮ కత్తిమొదలగు యుద్ధంబు
లందలివగలవాఁడును ౨౯ యుద్ధభూవిభాగంబు లెఱింగినవాఁడును
౩౦ ధృఢపరాక్రమియు ౩౧ దీర్ఘసూత్రత లేనివాఁడును ౩౨ తో
ట్రుబాటులేనివాఁడును ౩౩ ఈర్ష్యాసూయలు లేనివాఁడును ౩౪
పనుంగులుగుఱ్ఱంబులు ఆయుధంబులు మొదలగుయుద్ధసామగ్రులప
రీక్ష లెఱింగినవాఁడును ౩౫ అన్యజనంబుల విమర్శించందగు ప్రతి
భగలవాఁడును ౩౬ ఒరులొనర్చినయుపకార స్వరూపంబెఱింగిన
వాఁడును ౩౭ దయాశాలియు ౩౮ ధర్మిష్టంబులగుకృత్యంబు లెఱిం
గి ప్రయోగించు నేర్పు గలవాఁడును ౩౯ వివేకిజన వేష్టితుండును
౪౦ అన్నివిధంబులగుయుద్ధంబులు నేర్చువాఁడును ౪౧ అశ్వగజ
పత్త్యాదుల చూచినంతన భావంబు లెఱింగిన వాఁడును దానియడి
యాలంబులు గనువాఁడును ౪౨ దేశభాషలను వ్రాయుటకుం
జదువుటకుం ధరించుటకుం దగువాఁడును ౪౩ రాత్రియుద్ధంబు
లందును అడియాలంబులు దెలియునందును సమర్థుండును ౪౪
జ్యోతిషపండితుండును ౪౫ దిక్కులు దేశంబులు కాలంబులు త్రో
వలు దెలిసినవాఁడును నట్టివారింగూడినవాఁడును ౪౬ ఆకలిదప్పిభ
యములలజడిపరువెత్తుట చలి యెండ గాలి మొదలగువాటినో
ర్చువాఁడును ౪౭ శత్రునిసైన్యంబులగూల్చువాఁడును ౪౮ పరులకు
సాధింపందగనినిశ్చయముగలవాఁడును ౪౯ తనసైన్యంబులు వైక
ల్యంబునొందునెడ మోహారముక్కదలకుండ రక్షించునుపాయ ప
రాక్రమంబులుగలవాఁడును ౫౦ డేరాలుస్కంధావారములు
మొదలగుసేనాకృత్యంబులు దెలియువాఁడును ౫౧ శత్రుపక్షీయుల
గుహాకారలగనిపెట్టువాఁడును ౫౨ మహాఫలప్రదంబులగుకార్యం

బులనారంభించువాడును ౫౩ సిద్ధిప్రదంబులగుకృత్యంబుల నారంభించు వాడును ౫౪ అవమానముగలుగు నెడవికలతఁనొందనివాడును౫౫ రాజునకుమంగళకరంబులగు కార్యంబుల నొనర్చు వాడును ౫౬ నగునిట్టిలక్షణంబులుగలవాని సేనానాయకునిగనొనర్పందగుననుట.. ... .. .. ... ౪౬

సేనాపతికృత్యానాహ.

శ్లో॥ నద్యద్రివనదుర్గేషు యత్రయత్ర భయంభవేత్।
ధ్వజినీంతు సదోద్యుక్తస్సర్వోపాయైర్దివానిశం।
సేనాపతిస్తత్రతత్రగఛేద్వ్యూహీకృతైర్బలైః॥౪౭

ఱేలుపగళ్లులుదండునడిపించు నెడ నదులునుకొండలును కఠినమార్గంబులును అడవులును మొదలగుభయంబులుగల ప్రదేశంబులసైన్యంబుల మోహరించి వక్ష్యమాణలక్షణ లక్షితంబులగువ్యూహరచనంబులొనర్చి నడిపింపందగుననుట... ..౪౭

గమనస్థాననిరూపణం.

శ్లో॥ నాయకఃపురతోయాయాత్ప్ర వీరపురుషావృతః।
మధ్యేకళత్రంస్వామీచకోశంఫల్గుచయద్బలం। పా
ర్శ్వయోరుభయోరశ్వా అశ్వానాం పార్శ్వ
యోరథాః। రథానాంపార్శ్వయోర్నాగానాగా
నాంచాటవీబలం।పశ్చాత్సేనాపతిస్సర్వంపురస్కృ
త్యకృతీ స్వయం। యాయాత్సన్నద్ధసైన్యౌఘుఃఖి
న్నానాశ్వాసయఞ్శనైః॥... .. ... ౫౦

పరాక్రమశాలులగు సైన్యముతోడనొక యక్షోహిణీనాయకుండు అనగా(పటాలముకర్నలనుట)అతండుముందరనడువవలయు నడుమరాజును రాజభార్యలును బొక్కసంబును ధైర్యముసాహసము లేదవయగు సైన్యంబులునడువవలయు - నట్టిరాజునకు రెండుప్రక్కలను గుఱ్ఱపుదళంబును వాటిప్రక్కలరథంబులునువాటిప్రక్కలనేనుంగులును వాటివెంబడి అడవిజాడలెరుంగు బోయ

లు మొదలగు నడవిసైనికులును నడువవలయు - అందునకు వెనక అన్నిటిని ముందరనడపించుచు దాను సన్నద్ధుడగుచు అలశిన వారల నోదార్చుచు సేనాపతియనగా జన్నులునడవలయున నుట. .. ... .. ... ౫౦౫

గమనే వ్యూహభేదానాహ.

శ్లో॥ యాయాదన్వ్యూహేన పహ సామకరేణపురోభయె। స్యేనేనోభ్వ్రత్తసయేణ సూచ్యావాపీరవత్తి యాం। పశ్చాద్భయేతుశకటం పార్శ్వయో ర్వజ్ఞసంజ్ఞికం। సర్వతస్సర్వతోభద్రంభయే వ్యూహం ప్రకల్పయేత్॥ .. .. ...౫౭౫

ఎదుటిభయంబుగలుగు నెడ మకరవ్యూహమేనియు స్యేన వ్యూహమేనియు. సూచీవ్యూహంబేనియు గట్టవలయుననియు వెనకభయంబుగునెడను-ప్రక్కలభయంబుగు నెడనుశకటవ్యూహంబును అంతటభయంబుగలయెడ సర్వతో భద్రంబను వ్యూహంబులంబన్ని దండునడపింపవలెనునట.... ...౫౭౫

శ్లో॥ కందరే శైలగహనని మ్నగావనసంకటే।దీర్ఘాధ్వ నిపరిశ్రాంతం క్షుత్పిపాసాహితశ్రమం। వ్యాధిదుర్భిక్షమారీక పీడితం దస్యువిద్రుతం। పంకపాంసుజలక్లిన్నం వ్యస్తంపుంజీకృతంపథి। అసుప్తంభోజనవ్యగ్రమభూమిష్టమసంజ్ఞితం। ఘోరాగ్నిభయవిత్రసంవృష్టి పాతసమాహతం। ఏవమాదిషుజాతేషు వ్యసనేషుస్వమాకులం। స్వసైన్యంసాధుసంరక్షేత్ పరసైన్యంచ ఘాతయేత్ ...౫౮౫

పర్వతశిఖరంబులందును - అడవులందునుపణుకులయందును వనములయందును ఆకలిదప్పులచే నొచ్చి నట్టియురోగము కరువుమశూచకామలగువ్యాధులు దొంగలు బురదదుమ్ము నీళ్లుదొమ్మి నిదురలేకునికి భోజనవైకల్యము కార్చిచ్చుదగవాన చేగొట్టుబడుటయును నిటివంసనంబులచే వాడినతనసైన్యంబులరక్షించుటయు

నిట్టిదశలశత్రుసైన్యంబులనురుము చేయుటయుందగు...... ౫౬

శ్లో॥ విశిష్టోదేశకాలాభ్యాభిన్నారిప్రకృతిర్బలీ। కుర్యా
త్ప్రకాశయుద్ధంతు కూటయుద్ధంవిపర్యయే॥ ౫౭

శత్రుప్రకృత్యాదులు భిన్నంబగునెడనుతనకుదేశకాలంబుల
ను కూలించియుండునెడను ప్రకాశయుద్ధమొనర్పుటయునియున
విపర్యాసంబులగు నెడమోసయుద్ధంబులనగా వెనుకకరిగిన
ట్లుసోపంజేసి సమయంబున నిర్మూలించుట మొదలగు కృత్యంబు
లొనర్పందగు.. ... .. ... ౫౭

కూటయుద్ధవిధమూహా.

శ్లో॥ సాధ్వవస్కందకాలేషు పరంహన్యాత్సమాకులం।
అభూమిష్ఠంస్వభూమిష్ఠం తంభూమౌచోపజాపతః॥ ౫౮

తన బలంబులుసన్నద్ధంబులగుచుశత్రుబలంబులాకులపాటొం
దు నవసరంబున మోసంబులు మొదలగు కూటక్రియలచేజెరు
పందగు.. ... ... .. .. ౫౮

శ్లో॥ ప్రకృతిప్రగ్రహోకృష్టంపాశైర్వనచరాదిభిః। హ
న్యాత్ప్రవీరపురుషైర్భంగదానాపకర్షణైః।
పురస్తాద్దర్శనందత్వాతల్లక్ష్యకృతినిశ్చయః। హ
న్యాత్పశ్చాత్ప్రవీరేణబలేనాప్లుత్యవేగనా। పశ్చా
ద్వాసంకులీకృత్యహన్యాత్సారేణపూర్వతః।
ఆభ్యాంపార్శ్వాభిఘాతౌతువ్యాఖ్యాతౌకూటయో
ధనే॥ ... ... ... ౬౧

ప్రకృతివ్యసనంబులచేనాక్రమించంబడిన శత్రునిత్రాళ్లచేత
యు అటవికసైన్యముచేతయు పరాక్రమవంతులచేతయు నవ
మానించుటయు లంచమ్ములిచ్చుటచేతయు దోచికొనుటచేతయు
సాధనవైకల్యంబులొనర్చిముందరగనంబడుచుండి వెనుకనుండిబ
లవంతంబగుసైన్యముచే జంపుటయు వెనుకపార్శ్వంబున పూ
ర్వోక్తవిధియొనర్చి ముందుకడనుండి నాశంబొనర్చుటయు ప్ర
కటలనునిట్లువైకల్యంబొనర్చుటయుననునివికూటయుద్ధభేదంబులు

శ్లో॥ పురస్తాద్విషమే దేశేహన్యాత్పశ్చాత్ప్రవేగవాన్
పురఃపశ్చాచ్చవిషమేపవమేతుపార్శ్వయోః॥౫౮॥

విషమంబునలగా పణుకులు కనములుఅడవులు యిట్టియెడ లశత్రుసైన్యంబులుం చిక్కినయడముందరనేసియు వెనుకనేసియు చుట్లనేసియు దొమ్మిగూడి వేగవంతంబులగు సైన్యంబులచే జంప వలయుననుట.. ... ... ... ౫౮॥

శ్లో॥ ప్రథమందూష్యయిత్వాతు దూష్యమిత్రాటవీబలైః।
శ్రాంతంతెమందంనిరాక్రందంహన్యాదశ్రాంతవాహనః॥౫౯॥

పూర్వోక్తలక్షణలక్షితంబగు అటవిక- శత్రు- మిత్రబలంబులు దూష్యంబులుగాన వాటిచే యుద్ధంబొనర్చునట్లొనర్చిమూలభృతకాదులగు బలంబుల నలజడిలేకుండునట్లొనర్చి శత్రుబలంబులుఅలసటనొందు నెడ వీటిచేజంపందగుననుట... ..౫౯॥

శ్లో॥ దూష్యామిత్రబలైర్వాపిభంగందత్వా ప్రయత్నవాన్। జితమిత్యేవవిశ్వస్తంహన్యాత్పత్వవ్యపాశ్రయః॥... ... .. ౬౦॥

దూష్యంబగుశత్రుబలంబులచేనైనను నవమానంబొనర్పంబడియదిభంగంబగునెడ జయించితినను సంతసముచేనేమరుపాటొందినశత్రునిబలవత్తరంబగుమూలబలముచేజంపందగు౬౦॥

శ్లో॥ స్కంధావారపురగ్రామసస్యసార్థప్రజాదిషు। విలోక్యచపరానీకమప్రమత్తోవినాశయేత్॥ ౬౧॥

శిబిరంబులు విడిశినయడను పట్టణంబులను గ్రామంబులను ధాన్యంబులుండునెడను- పల్లెలయందును వర్తకులసమీపంబునను శత్రుబలంబులు విస్రబ్ధులగుచుసంచరించునెడ యేమరియుండ్రుగానన ట్టిసమయంబులజాగరూకంబగు సైన్యముతోడ శత్రుసేనలజంపందగుననుట.. ... ... ...౬౧॥

శ్లో॥ ఫల్గుసైన్యప్రతీభవన్కృత్వావాసారవద్బలం। మందయత్నవిలోపీనహన్యాదుత్ప్లుత్యసింహవత్॥౬౨॥

దుర్బలంబులగు సైన్యంబులచుట్టనుంచి నడుమ మంచిబలంబులమోహరించి దుర్బలసైన్యంబను భ్రమంబు శత్రునకుంగలుగంజేసిజాగ్రతతోడసింహముకరణిపరాక్రమింపందగుననుట౬౪

శ్లో॥ మృగయాసంప్రసక్తంవాహన్యాత్సత్త్వమపాశ్రయం।
అథవాగోగ్రహాకృష్టా త్తల్లక్ష్యంమార్గబంధనాత్॥ ౬౫

వేటలాడుసమయంబులనైనను ఆవులఁజూచుటకరుగునెడనుతదాసక్తచిత్తుండగునతనివంచించి మార్గనిరోధంబొనర్చి జంపందగుననుట ... ... ... .. ౬౫

శ్లో॥ అవస్కందభయాద్రాత్రిప్రజాగరకృతశ్రమం।
దివాప్రసుప్తంవాహన్యాన్నిద్రావ్యాకులసైనికం॥
అహస్సన్నాహసంక్రాంతమపర్హ్ణేహివినాశయేత్॥౬౬

రాత్రులవిజిగీషులాక్రమింతురనుభయముచేరాత్రులుమేల్కనియుండుటవలన పవలునిదురించునట్టియునిద్రమబ్బుగలయట్టియుశత్రుబలంబుల పవలునజంపందగుననియు మరలసన్నాహముజే యనుద్యుక్తులగు తత్పరతంత్రతచే నేమరియుండువారల అపరాహ్ణంబున జంపందగుననియు దెలియునది.. .. ౬౬

సౌప్తికం.

శ్లో॥ నిశివిస్రబ్ధసుప్తంవాతత్సౌప్తికవిధానవిత్। సపాదకోశావరణైర్నాగైఃకుర్యాత్తుసౌప్తికం॥ అశ్వైశ్చరతిజవోపేతైర్నరైర్వాశస్త్రపాణిభిః॥ ౬౭

రాత్రులందేమరిపరుండుసైన్యంబును అతివేగంబులగుచునడియాలంబులుగంటలులేకరహస్యంబుననేనుంగులంద్రోలిదొక్కించియైనను అతివేగంబులగుగుర్రంపుదళంబుచేనైనను పదాతిబలంబులచేనైననురాత్రియందుసౌప్తికమారణముజేయందగుననుట౬౭

శ్లో॥ ప్రతిసూర్యమహావాతంహన్యాత్సంమీలితేక్షణం।
ఇత్యేవంకూటయుద్ధేనహన్యాచ్ఛత్రుంలఘూత్థితః॥ ౬౮

పండకెదురు నడుచునెడను దుమ్ముగాలికెదురేగునెడను కన్నులుమూసుకొనుటసంభవించుంగావుననట్టియెడను జంపంద

గునసుట— ఇట్టిమోస యుద్ధంబులంనంతయు సంభవించువిధిసి సమయానూ గుణంబు లగు క్రియలచే శత్రుని రసనము జేయం దగు.. .. ... .. ... ౬౭

శ్లో॥ నీహార స్తిమిరంగావః శ్వభ్రాగ్ని వనసిమ్నాగాః॥
వదంతిశత్రుమిత్రాదిభత్రభన్మప్రకీర్తితం॥ .. ౬౮

మంచును చీకటియు - పశుగణంబులును - కలుగులును - చిచ్చును - అడవియేళ్లును - నివియంతయు విజిగీషునకుసహాయం బౌనద్చునీనియు శత్రునకు సంకటంబుగలుగంజేయుననియు అందువలన నన్యాగమనాముల నాచ్ఛాదించుటవలన గొడుగు సామ్యమునందినదియనియు నభిధానము .. ...౬౮

శ్లో॥ పునరావర్తమానస్య నిరాశస్యతుజీవితే। అనారోగ్యజాయతేనేహ అతిభగ్నంనపీడయేత్॥౬౯

ప్రాణంబులనాశించక మరలువానింజంపుటచే పాపాప్తుం డగుంగాన పలాయన పరాయణంబగుచు మిక్కిలియుంజెడినవారిం జంపందగదనుట.. .. ... ...౬౯

శ్లో॥అల్పాంగతాతివ్యయతా తుయోవృద్ధిర్విపర్యయో॥
సమాయవ్యయితాస్థానంకర్మ సుజ్ఞేయమాత్మనః॥ ౭౦

సప్తాంగంబులల్పంబులగుటయు కోశముమిక్కిలియు వ్యయంబగుటయు తనకుగలహానివృద్ధులును ఆదాయవ్యయ భేదంబులును దేశకాలంబులును ననవరతంబును గనిపెట్టియుండ వలయు ననుట... .. ... ... .. ...౭౦

శ్లో॥ ద్వావపిప్రసుప్తౌవధ్యప్రమత్తౌవ్యవసాయవాన్॥౭౧

చంపదగినవాడును వ్యలసులు ననుద్వివిధులును విషయాభూతులుగాన యత్నపరుండగుచుండ వలయునసుట... ... ౭౧

శ్లో॥ సాధ్వప్రమత్తో వ్యవసాయవర్తీయేన ప్రకారేణ రిపుంనిహన్యాత్। చరైస్సమావేదితతత్వచారస్సంకేతితేనైవతతోప్రమత్తః॥ ... .. ౭౨

శత్రువుస్వాధీనుండగుటకుందగిన యన్నివిషయంబులును చారులవలనం దెలిసికొనుచు జాగ్రతకలిగి సంకేతములు మొదలగు వాటిచే కార్యంబు నిర్వహించ దగుననుట... ... ౭౨

శ్లో॥ నియతము పనిహన్యాత్కూటయుద్ధేనశత్రూన్న
హిభవతిహి ధర్మః ఛద్మనా శత్రునాశః। అచకితమి
వసుప్తం పాండవానామనీకం నిశిసుని శితశస్త్రో
ద్రోణసూనుర్జఘాన.. ... ...౭౩

పాండవసైన్యంబులు స్కంధావారంబుననే పరుండియుండు నెడ యశ్వత్థామ సౌప్తికరూపంబగు కూటయుద్ధముచే జంపుట ప్రసిద్ధంబుగాన నట్టియుద్ధంబుల శత్రునిరసనంబొనర్చుటచే ధర్మలోపంబుజెందదని యుపసంహారము.. .. ..

ఇతి కామందకీయే ఏకోనవింశస్సర్గః॥



కామందకవింశతిసర్గప్రారంభః.



పూర్వసర్గంబున సైన్యరూపంబులును గ్రాహ్యాగ్రాహ్యంబులును సేనాపతిస్వరూపంబును అతనికృత్యంబులును దండువెడలుటయు నడచుటయు వ్యసనరక్షణంబులును కూటయుద్ధం విషయంబులునుం దెలుపంబడియెం గావున నింక చతురంగ బలప్రయోజనంబులును యుద్ధంబుల విధులును వ్యూహరచనలును క్రమంబున దెలుపబడియెడు... ... ... .. ..

గజానాంకర్మాణ్యాహ.

శ్లో॥ ప్రయాణేపూర్వయాయిత్వం వనదుర్గప్రవేశనం।
అకృతానాంచమార్గాణాం కృతానాంచప్రవర్తనం। తోయావతారసంచారా వేకాంగవిజయస్తథా। అభిన్నానామనీకానాం భేదనంభిన్నసంగ్రహః। విభీషికాభిఘాతశ్చ ప్రాకారద్వారభంజనం।
కోశనీతిభయత్రాణం హస్తికర్మప్రచక్షతే॥...౩

దోవనడుచు నెడ ముంగలనడుగుటయు కనమలు అడవులు మొదలగు నెడల దూరుటయు - కొత్తత్రోవలం గలిగించుటయు పాతత్రోవల విశదీకరించుటయు నీటిజాడ లెరుంగుటయు - శత్రువులనిర్జించుటయు పరసైన్యంబుల బడలుపడం జేయుటయు - తనసైన్యంబు లలసినయెడ నిర్వహించుటయు భయప్రదంబులగు శత్రుకృత విభీషికాయంత్రాదులవిరుచుటయు. కోటలుపగల్చుట యు అగడ్తలంబూడ్చుటయు సప్తాంగంబులను బొక్కసంబునుం గాచుటయునను నివియన్నియు ఏనుంగులకృత్యంబులనుట..   ౩

రథకర్మాణి.

శ్లో॥ చతురంగస్య సైన్యస్య ని షేధో బలరక్షణం। అభే
ద్య భేదనం భిన్నసంధానం రథకర్మతత్॥   ... ౪

శత్రువిషయంబులగు చతురంగబలంబుల నిలుపుటయు బలంబుల రక్షించుటయు. భేదింపంబడని దానింపగల్చుటయు-పగిలిననిజ సైన్యంబులగాచుటయు. రథకర్మంబులగు..   ..   ౪

తురగకర్మాణి.

శ్లో॥ వనదిఙ్మార్గవిజ్ఞానం వీవధాసారరక్షణం। అనుయా
నాపసరణే శీఘ్రకార్యోపపాదనం। దిశానుసరణం
ఘాతః కోటీనాం జఘనస్య చ। ఇత్యశ్వకర్మాణి పత్తే
శ్శస్త్రధారణం॥   ..   ..   ౬

అడవిదారులు దెలియుటయు జాడలుబట్టుటయు ధాన్యంబులు మొదలగు వస్తువులం గాచియుండుటయు దిక్కులంగనిపెట్టి యుండుటయు శత్రుసైన్యంబులంగలచుటయు ననువదిగు ప్రవృత్తంబులపనియనియు కాల్బలంబుల కెల్లప్పుడును ఆయుధము ధరియించియుండుటయుననుట..   ...   ..   ... ౬

విష్టికర్మాణి.

శ్లో॥ శోధనం శిబిరస్య మార్గాణాం శిబిరస్య
చ। యవసాదిచ యత్కించిద్విజ్ఞేయం విష్టికర్మ
తత్   .....   ....   ...

గుంటలు బావులు మొదలగువాని నరయుటయు ద్రోవలుచక్కఁజేయుటయు పటకుటీరంబులనగా డేరాలనిర్మించుటయు ధాన్యంబులు మొదలగుదాని మోయుటయు మొదలగునవి భారవాహులగు జనంబులనగా ఖలాసీలుపై నీరుపటాలజనులు మొదలగువారికృత్యంబులనుట... ... ... ... ౭

శ్లో॥ జాతిస్థానంవయస్స్థానంప్రాంశికపూఁపివేకితా। తేజశ్శిల్పముదగ్రత్వం స్థైర్యంసాధుపిధేయతా।సువ్యంజనాచారతేతిపత్త్యశ్వరథదంతినాం।ఇతిలక్షణమేతేనయుక్తంకర్మసుయోజయేత్ ... ...౯

మనుష్యులయు గుఱ్ఱాదిజాతులును - గుఱ్ఱంబుల దుసుదేశజత్వంబులాదిగనులడునదియును - రథంబులగట్టికొయ్యలు మొదలగు పరికరాలదు చేస్మితంబులగునది మొదలగునదియు - ఏనుగులభద్రాదిజాతిభేదంబులును వయోవిలాసంబులన యౌవ్వనాదివయఃపరిణామంబులును బలసత్వభేదంబులును - నానా క్రియాచాతుర్యంబులును గౌరవతయుస్థిరతయు పెద్దల యడనడకువయు మంచినడతలునునను భేదంబుల దెలిశి ఆయాయి కృత్యంబులనియోగింపందగు... ..... ..... ..... ౯

నివేశభూలక్షణమాహ.

శ్లో॥ సస్థూలస్థాణువల్మీకవృక్షగుల్మా పకంటకా।సాపసారాపదాతీనాంభూ ర్నాతివిషమామతా॥... ...౧౦

పెద్దరాళ్లును చెట్లును పొదరింళ్లనుపుట్టలును నీరును-గలిగి ముండ్లు లేక మిక్కిలియుమిర్రుపల్లంబులు లేనిభూమి పదాతి సైన్యంబులువిడియుటకుందగిన భూమియగు... ... ౧౦

శ్లో॥ అల్పవృక్షోపలాక్ష్మిప్రలంఘునేఁబిధురాస్థిగా। నిశ్శర్కరావిపంకాచసాపస్సారాచవాజిభూః॥ ౧౧

చెట్లునురాళ్లును మిత్తమైయుండునదియు దాటునేడ నొర్చునదియు యిసుకయు బురదయు లేనిదియు నీరుగలదియు నగుపుడమిగుఱ్ఱంబులు విడియుటకుందగియుండు... ..... ౧౧

శ్లో॥ స్థాణుసికతాపంకసర్వల్మీకోపలాసమా। కేదారవ్రతతిశ్వభ్రవృక్షగుల్మవివర్జితా। నిరుద్ధాతానిద్ధురణాఖురచంక్రమణక్షమా। స్థిరాచక్రసహాచైవ రథభూస్సంప్రకీర్తితా॥ ... ....౧౩

మోడుచెట్లునుయిసుకయు బురుదయు రాళ్లను పుట్టలును పయిలుర్లను తీవియలునుబొరియలును పాదరిండ్లును లేనిదియు నుమ్ము ఎగరకుండునదియు - గుఱ్ఱపుగట్టెలదెబ్బల కోర్చునదియు - గట్టిదియుచక్రంబులరాయిడిసహించునదియునగు పుడమి యరదంబులుండుటకుండగినదనుట... ..... ౧౩

శ్లో॥ రథానాంశస్యతేభూమిర్భర్తవస్సర్వాస్తుహస్తినాం। మర్దనీయతరుచ్ఛేద్యవ్రతతీపంకవర్జితా॥...౧౪

విరువందగుచెట్లుగలదయుబురుదయుగుల్మంబులును పుట్టలును లేనిదగుపుడమిరథంబులకునుగజంబులకుందగుననుట... ౧౪

శ్లో॥ నిర్దరాగమ్యశైలాచ విషమా గజమేదినీ। నాగమ్యానామభూరేషా తేననాగాస్మృతాబుధైః॥౧౫

చరులును దరులును పర్వతంబులును ఒరగడ్డంబులునగు పుడమిగజంబులకందగునదిగయు నీయేనుగల కగమ్యంబగు పుడమి లేమింజేసినాగంబలనంబడియె... ... .. ౧౬

శ్లో॥ తస్మాదేతాభువోత్యర్థంనాగానాం సంప్రకీర్తితా। తురగాదీనిభిన్నానిప్రతిగృహ్ణాతియత్బలం॥౧౬

గుఱ్ఱములుమొదలగు శేషాంగంబులు మూడునువై కల్యంబందినను గజబలంబులునిగ్రహించి కాపాడుగాన నేనుంగులంగాపాడుటయవశ్యంబు... .. .. ... ౧౬

శ్లో॥ బలప్రతిగ్రహాఇతిఖ్యాతః కార్యభరతర్షభః। ద్వే శతేధనుషాంగత్వా రాజాతిష్ఠేత్ప్రతిగ్రహే॥౧౭॥ భిన్నసాధారణస్తస్మాత్ నబుద్ధ్యేతా ప్రతిగ్రహః॥ తేనశూన్యస్తుయోవ్యూహస్సశూన్య ఇవలక్ష్యతే। తస్మాద్విద్వాన్జయాకాంక్షీ నబుద్ధ్యేతా ప్రతిగ

హః। విజయార్థీతుయ స్తిష్ఠేస్సారంగత్వా ప్రతిగ్ర
హః। భిన్నంచ ప్రతిగృహ్ణీయా న్నహియుద్ధ్యేతతం
వినా॥... ... ... ... ..౧౯౫

రాజుశిబిరంబున లేనియెడ శిబిరంబుశూన్యంబగుం గావున జ
యాపేక్షగలరాజు బలంబుల నుత్సాహంబు కొఱకును భిన్నంబగు
సైన్యంబుల నుత్సాహంబొనర్చు కొఱకును శిబిర సమీపంబున నిన్నూ
ఱుధనుఃపాత ప్రమాణంబులనుండఁదగుననుట... .. ౧౯౫

శ్లో॥ గజేష్వారోపిత స్స్వాధుశీఘ్రయా నైరధిష్ఠితః। య
త్రరాజా తత్రకోశః కోశాధీనోహి రాజతా॥ ౨౦౫

రాజుండు వెడనతి వేగవంతంబులగు నేనుంగులపై బొక్క
సము వెంబడించియుండవలయుననుట.. .... ౨౦౫

శ్లో॥ ప్రత్యగ్రకర్మణి కృతే శ్లాఘమానః కృతాదరః।
యోధేభ్యస్తుతతో దద్యాత్ కోహిదాతుర్నయు
ధ్యతే॥ .. ... ... .. ౨౧౫

దాతృత్వము గలరాజునకై జనంబులు తమప్రాణంబుల కా
సింపక యుద్ధంబొనర్తురు గాన ప్రబల సాహసంబు లొనర్చినవా
రిం బొగడి వసధనంబు లొసంగవలయు... .. ... ౨౧౫

శ్లో॥ దద్యాత్ప్రహృష్టో నియుతం పర్వాణాం రాజఘాతి
నే। తదర్ధంతత్సుతవధే సేనాపతివధే తథా। ప్ర
వీరాణాంతుముఖ్యస్య శతంశతగుణం వధే। తద
ర్ధంకుంజరవధే ప్రధానస్యందనస్యచ। సహస్రో
శ్వవధే దేయః పత్తిముఖ్యవధే తథా। భోగంచద్వి
గుణంకుర్యాత్ సువర్ణం కుల్యమేవచ। యుగ్యం
హేమచరూప్యం చయోయోజ్జయతితస్యతత్।
దద్యాద్వస్త్వనురూపంవా హృష్టోయోధాన్ప్ర
హర్షయన్॥ ... ... ... ౨౨౫

రాజుం జంపినవానికి లక్షయు- రాజపుత్రునిం దునిమినను
సేనాపతిం జంపినను నర్ధంబును వీరాగ్రేసరునిం జంపిన పది

వేలును- పదుంగునుంజంపిన రథంబులగుగమికానిందునిమినను నై
ము వేలును - గుఱ్ఱంబుంజంపినను కాల్బలంబుల గమికానిం జంపిన
ను వేయిని - సంబళంబుల రెట్టించుటయు - విస్తారంబగు స్వర్ణం
బులిచ్చుటయు- నుంగాక నానాయూయిసర దాగుండు జయించి
న రథాదిసాధనంబులును - ద్రవ్యంబులువానికి య యొసంగుట
యు మఱియు నానాయాయి వస్తువులకుం దగినట్లొసంగియు త్సా
హముగలుగ జేయుటయు రాజకృత్యను... ... ... ౨౫౪

వ్యూహరచనారంభః

తత్రబలసంస్థానం

శ్లో॥ పంచారత్నిర్ధనుస్తస్మిన్ధన్వినంస్థాపయేన్నృధి।
త్రిగుణేశ్వంగజరథౌ యోజ్యౌపంచ సుపంచసు। శ
మాంతరంచపురుషస్తురగస్త్రిశమాంతరః। కుంజర
స్స్యందనశ్చైవస్మృతౌపంచశమాంతరౌ। తథా
చఖలు యుధ్యేరన్ పత్య శ్వరథదంతినః। యథా
భవేదసంబాధో వ్యాయామవినివర్తనే। అసంక
రేణయుధ్యేరన్ సంశ్రయేరన్ పరస్పరం॥... ౨౯

యుద్ధకాలంబున చతురంగబలంబులుదొమ్మి జెందక యుద్ధం
బొనర్చుటకై యొకరొకరికి అంతరముగల్పించువిధియెట్లన- నీవి
షయంబున అరత్నియనునది మూరయనియు శమంబనపనునా
ల్గంగుళంబులనియు ధనుః ప్రమాణంబన నైదరత్నులనియునంత
ట దెలియనది——ధనుర్ధరులగువారలకొకరి కొకరి కంతర
బొక ధనుః ప్రమాణంబుండవలయుననియు గుఱ్ఱంబులకు నొం
డొంటికి మూడుధనవు లుండవలయుననియు రథంబులకును గజం
బులకును నైదుధనువులుండవలయుననియు- రెండవపక్షంబునప
దాతులకు పదునాల్గంగుళంబుల యంతరంబును గుఱ్ఱంబులకు న
లుబది రెండంగుళంబులును రథంబులకును గజంబులకును డె
బ్బదియంగుళంబులు నుండవలయుననియు నిట్లంతరంబులుండు నె

డదొమ్మిజెండకయు నొకరికొకరు సహాయులయ్యును యుద్ధము జేయుట శిష్టగుననుట.. ... ... ... ... ౨౯

సహాయాదీని.

శ్లో॥ అశ్వస్యప్రతియోద్ధారో భవేయుఃపురుషాస్త్రయః। ఇతికల్ప్యాస్తుపంచానాం విధేయాః కుంజరస్యచ।పా దగోపాస్తుతావంతఃపురుషాదశ పంచచ। విధాన మేతన్నాగస్య కథితంస్యందనస్యచ॥... ...౩౧

గుఱ్ఱమునకు సహాయులుముగ్గురునుఏనుంగునకైదుగురు ను పాదరక్షకులు పదియైదుగురును రథంబునకుం చక్రరక్షకులు పదియైదుగురుననుట.. .. .. .. ౩౧

శ్లో॥ అనీకమితివిజ్ఞేయమితికల్ప్యేనవద్విపాః। అనీక స్యచరంధ్రం తు పంచచాపం ప్రచక్షతే। ఇత్యనీ విభాగేన స్థాపయేద్వ్యూహసంపదః॥... ౩౨

తొలుతబలికినవిధిని బన్నిన నేనుంగులు తొమ్మిదియు నరదం బులుతొమ్మిదియు గుఱ్ఱంబులు యిరువదేడును పదాతులు నలు బదియైదునుంగలది అనీకినియనగా నిప్పుడు వ్యవహరింపం బడు చుండినియనీకిలక్షణము - దెలియునదియిట్టియనీకినులొండొం టికిన్నై దుధనుఃప్రమాణంబులుండవలయుననియమము - ఈగణి తవిధానంబునవ్యూహరచనజేయందగుననుట... ... ౩౨

వ్యూహస్వరూపమాహ.

శ్లో॥ శిరఃకంఠశ్చవక్షశ్చతుల్యానేతాఃప్రచక్షతే।ఉరః పక్షౌచమధ్యంచ పృష్ఠశ్చైవప్రతిగ్రహాః। కోటీచ వ్యూహశాస్త్రజ్ఞైస్సప్తాంగోవ్యూహఉచ్యతే। ఉ రస్యకక్షపక్షౌస్తువ్యూహోయం ప్రతివిగ్రహః। గురవేపంచశుక్రస్యపక్షౌభ్యాంపరివర్జితః॥ ౩౩

సామాన్యంబుగవ్యూహంబులకన్నింటికిని రొమ్మును-౧- రె క్కలును ౩- నడుమును ౪- పృష్ఠంబును ౫- ప్రతిగ్రహంబును ౬- కో టియును నేడంగంబులుండవలయుననుట—ఇదిగురుమతంబగియు

శు క్రమతంబున రెండు రెక్కలుదక్క తక్కిన పంచాంగబవ్యూహం
బని నా భేదము దెలియవలయు.. .. .. ౩౭

శ్లో॥ అభేద్యాః కులజా మౌలా బలవన్తః ప్రహారిణః। సే
నాంగపతయః కార్యా యుద్ధోత్సృష్టపరాక్రియాః। ప్రవీ
రైః పురుషైః సైన్యం స్థాపయేత్పరివారితాః॥ అభే
ద్యేనైవ యుధ్యేత గత్వా యుద్ధపరస్పరం। ఛిన్న
సైన్యం చ యత్కించిత్ భిన్నవ్యూహస్య తద్భవే
త్। యుద్ధవస్తు వయత్కించిత్ త్యాజ్యం యుద్ధగుణసే
భవేత్॥ ... ... ... ... ౩౮

సైన్యంబునందల్ప బలులగు వారిన్వ్యూహము నడుమనునుయు
గసాధనంబులగు నరదాముల వ్యూహము వెనుకను నుంచునట్లును
నియోగించి సమర్థులను శత్రులచేత భేద్య పరాక్రములును
పూర్వోక్తలక్షణ లక్షితులగు మౌలబలంబును మరియుంగలన
రదాలులను మొగ్గరంబు చుట్టునుం బన్నియుండొరులకు స
హాయులగుచు భేదబుద్ధి సక్కయుండునట్లొనర్చి వ్యూహముబన్న
వలయుననుట.. .. .. ... ... ... ౩౮

శ్లో॥ యుద్ధార్థం యుద్ధకుశలో ముండానీకం ప్రయోజ
యేత్। యుద్ధం హినాయకః ప్రాణం హన్యతే తద
నాయకం॥ .. ... ... ౩౯

ఛత్రచామరాది చిహ్నములు లేక బలము మాత్రము బన్నియుం
డునది ముండానీకంబనంబడుం గావునను రాజలక్షణములకొర
కు వక్ష్యమాణాంతరంబున బన్నియుండవలయుననుట.. ౩౯

ప్రధానవ్యూహాః

శ్లో॥ శ్యేనస్సూచీచ వజ్రశ్చ శకటం మకరః ధ్వజః॥ ఇత్యే
వమాదయో వ్యూహాశ్శాస్త్రజ్ఞైస్సముదాహృతాః॥౪౦

శ్యేనవ్యూహంబును ౧- సూచివ్యూహంబును ౨- వజ్రవ్యూ
హంబును ౩- శకటవ్యూహంబును ౪- మకరవ్యూహంబును ౫- ధ్వజ
వ్యూహంబును ౬- మొదలగునవి... .. ... ౪౦

శ్లో॥ వ్యూహోనుపృష్టమచలం పత్త్యశ్వరథదంతిభిః।
తథాప్రతిహతో జ్ఞేయో పత్త్యశ్వరథదంతిభిః॥ ౪౧

కాల్బలంబుల వెనుక గుఱ్ఱపుదళంబులును నా వెనుకనరదంబులును నా వెనుక గజంబులునుండునట్లు బన్నిననభేద్యంబగుననుట... .. .. ... ... .. ౪౧

శ్లో॥ ఉరసిస్థాపయేన్నాగాన్ ప్రచండాన్ కక్షయోరథాన్। హయాంశ్చపక్షయోర్వ్యూహే స్మధ్యభేదః ప్రకీర్తితః॥ ... .. ... ౪౨

పదాతిబలంబులేనియెడ ఉరస్సున నేనుంగులును కక్షంబులనరదంబులును రెక్కలగుఱ్ఱంబులునుంబన్ననేడ మధ్యభేదియనంబడు.. ... ... .. ... ... ... ౪౨

శ్లో॥ మధ్యదేశే హయానీకం రథానీకంతుకక్షయోః। పక్షయోస్తుగజానీకం వ్యూహ్యో త్తదభితస్మృతః॥ .. ... .. ... ... ... ౪౩

నడమగుఱ్ఱంబులును చంకలన రథంబులును రెక్కలనేనుంగులునుంబన్నిన అభీతివ్యూహంబగు... .. ... ...౪౩

శ్లో॥ రథస్థానే హయాన్దద్యాత్ పదాతీంశ్చహయాశ్రయే। రథాభావేతుమతిమాన్ నాగానేవ ప్రకల్పయేత్॥ ... .. .. ... ... ౪౪

అరదంబులు లేనియెడ అరదంబులకు గుఱ్ఱంబులును గుఱ్ఱంబులయెడ కాల్బలంబులంబన్ని తక్కినయెడకు నేనుంగులుబన్నందగు.. .. ... ... ... .. ... .. ..౪౪

శ్లో॥ విభజ్యప్రకృతిం పెమ్యూహ్యే హ్యేపత్త్యశ్వరథకుంజరాన్। యదిస్యాద్దండబాహుళ్యం సచాపాపః ప్రకీర్తితః॥౪౫

చతురంగంబు లధికంబులుగనుండునేడ బలవిభాగంబుల చతురంబులువిభజించి మోహరించందగు... .. ... ౪౫

ప్రకృతివ్యూహో నాహ.

శ్లో॥ మణ్డలోసంహతోభోగో దండశ్చేతిమనీషిభిః।
చత్వారఃప్రకృతివ్యూహో భేదాస్తేషాంప్రకీ ర్తితాః॥ ४౬

మండలవ్యూహము ౧- సంహతవ్యూహము ౨- భోగవ్యూహము ३- దండవ్యూహము ४- నను నీనాల్గును స్వతంత్రంబు లగుచు నొండొంటి సాంకర్యంబొందకుండుననుట... .. ...४౬

శ్లో॥ ప్రకల్పితే భుజే వ్యూహేయదంకమధికంతతః। తిర్యగ్వృత్తిస్తుదండస్స్యాద్భోగోవావృత్తిరేవచ।
మండలస్సర్వతోవృత్తిః పృథువృత్తిరసంహతః॥४७५

అడ్డముగనడచు స్వభావముగలది దండవ్యూహమనియు-నిలకడగలది భోగవ్యూహమనియు- గుండ్రముగనుండు నదిమండలవ్యూహమనియు- నిండిన స్వభావముగల యదియసంహత వ్యూహంబనియు- జెప్పంబడుననుట... .. .. ४७

దండభేదాః

శ్లో॥ ప్రదరోదృఢకేశశ్చశ్వావస్తత్కుక్షిరేవచ। ప్రతిష్ఠస్సుప్రతిష్ఠశ్చశ్యేనోవిజయసంజయా। విశాలో విజయస్సూచీస్థూణా కర్ణశ్చమూముఖః। రధాస్యో వలయశ్చైవదండభేదాస్సుదుర్జయాః॥४౯५

ప్రదరంబు మొదలగు పదియారు భేదంబులు దండంబునందు త్పన్నవ్యూహంబు లనుట... .. ... ४౯५

శ్లో॥ అతిక్రాంతః ప్రతిక్రాంతఃపక్షాభ్యాంవతుకక్షితః।అతిక్రాంతేశ్చపక్షాభ్యాంత్రయోన్యేతువిపర్యయే।పక్షోరస్యైరతిక్రాంతః ప్రవిష్టోన్యే విపర్యయేస్థూణాపక్షోధనుఃపక్షోద్విస్థూణోదండ ఊర్ధ్వగః।
ద్విగుణాత్తదస్యతిక్రాంతాపక్షోన్యోస్య విపర్య

యో॥ ద్విచతుర్దండ ఇత్యేతే జ్ఞేయాస్సర్వే క్షత్వతః క్రమాత్ ॥... .. ... .. .. ౫౨౫

ఇట్టివ్యూహవిభాగంబుల విన్యాసంబులు యుద్ధశాస్త్రంబు ననుండుటవలనను నాశాస్త్రంబియ్యెడ నసంభావితంబగుటవలన నుశికాలంబున దీనికింబ్రయోజనాభావంబగుటనునియ్యెడత త్స్వరూపంబులనినిర్ణయించుటకనుకూలంబుగాదయ్యె .. ౫౨౫

భోగభేదాః.

శ్లో॥ గోమూత్రికాభిసారీచ శకటో మకర స్తథా । భోగభేదాస్సమాఖ్యాతా స్తథో పరిపతంతకః॥ .. ౫౩౫

గోమూత్రకాదులగునైదు భేదంబులుగల వ్యూహంబులు భోగవ్యూహంబునంబొడమెననుట... ... ... ... ...

శ్లో॥ దండపక్షే చ గోరస్యః శకటస్త్వద్విపర్యయే । మకరోవ్యవకీర్ణశ్చ శేషఃకుంజరవాజిభిః॥ ౫౪౫

దండపక్షంబున గోరస్యంబునునదియు - దానివ్యత్యయము శకటంబనియు - విశాలంబయిన యదిమకరంబనియు - గుఱ్ఱములతోడను నేనుంగులతోడనుం గూడినయది శేషవ్యూహంబనియు నామములనుట... ... ..... .. ౫౪

మండలభేదాః

శ్లో॥ మండలవ్యూహభేదే చ సర్వతోభద్రసంజ్ఞయా॥ అష్టానీకో ద్వితీయస్తు ప్రథమస్సర్వతోముఖః । అర్ధచంద్రక శృంగాటౌ వజ్రో భేదాస్త్వయం హితే । తథా కర్కటశృంగారీ కాకపాదీ చ గోధికా॥ త్రిచతుః పంచసైన్యానాం జ్ఞేయాః కారవి భేదకాః॥... .. ౫౭

సర్వతోభద్రామలగు నీయెనిమిది వ్యూహంబులును మండలవ్యూహమునంగల భేదంబులనుట.. .. ... ౫౭

శ్లో॥ ఇతి వ్యూహాస్సమాఖ్యాతా వ్యూహభేదప్రయోక్తృ
భిః। ఏతేసప్తదశ ప్రోక్తాస్తదా వ్యూహాస్తుభేదతః।
తథా వ్యూహాభియుక్తైవ మండలస్య ప్రవ
క్తృభిః॥.. ... ... ... ... ౫౮

ఇట్లు వ్యూహభేదంబులు దెలుపంబడియెననుట.......౫౮

శ్లో॥ అసంహతాస్తు వద్వ్యూహాః భోగవ్యూహాస్తు పంచ
ధా। వ్యూహజ్ఞైస్తైః ప్రయోజ్యాస్యుర్యథాకాలముపస్థి
తే। పదాతీనాం తథైకేన హత్వాశేషైః పరిక్షిపే
త్। ఉరస్యా వా సమాహత్య కోటిభ్యాం తత్ర వేష్ట
యేత్। పరకోటీస్సమాక్రమ్య పక్షాభ్యాం సపరిగ్ర
హం। కోటిభ్యాం జఘనం హన్యాత్ ఉరసా చ ప్రపీ
డయేత్। ఏవం వ్యూహప్రయత్నేన యత్నవాన్
పృథివీపతిః। విదారయేద్వ్యూహకృతైర్బలైర్విద్వి
షతో బలం॥... .. ... .. ..౬౨

ఇట్టి వ్యూహంబులచే మోహింపించి జాగరూకుండగుచు శ
త్రుసైన్యంబులజయించవలెననుట.. ... ... ౬౨

శ్లో॥ యతః ఫల్గుయతో భూయః తత్ర వ్యూహైరధిష్ఠి
తం। తత్రో రిపుబలం హన్యాదాత్మనశ్శ్రే పబృంహ
యేత్॥ .. ... ... ... ౬౩

. బలంబులయధికాల్పవిషయంబులనెరింగి తగునట్లు మోహ
రించియుద్ధంబొనర్పంపగుననుట.. ... .. ౬౩

శ్లో॥ సారం ద్విగుణసారేణ ఫల్గుసారేణ ఫల్గుచ। సంహ
తంచగజానీకైః ప్రచండైరవదారయేత్। దుర్జ
యస్యరిణస్త్రైన్యే పశ్యసి క్తైర్మహాగజైః। అహ
వే కరిణీనాం వా సమూహైస్సాధ్వధిష్ఠితైః॥...౬౫

బలముగల సైన్యంబుల నిబ్బడిబలముచేతయు-అల్పసైన్యము
నల్పసైన్యముచేతయు • గమిగూడియుండుదానిగజంబుల చేతయు-

నాడయేనుంగులగముల మదగజంబులగములచేతయు జయించం దగుననుట... .. ... .. ... ... ౬౫

ఉపసంహారః.

శ్లో॥సలోహజాలైఃపృథుబంద్ధదంతైస్సుకల్పితైరూర్జిత
పాదరక్షైః॥ప్రవీర ఘోరైరపరాదమనీవార్యైరహా
ర్యాగ్రజేంద్రైఃద్విషతామనీకం॥.. .. ౬౬
శ్లో॥ ఏకోపివారణపతిద్విషతామనీకంవ్యక్తంనిహం
తిమదసత్వగుణోపపన్నః। నాగేషు హీక్షితి భు
జాంవిజయోనిబద్ధస్తస్మాద్గజాధికబలోన్నపతి స్తు
జీయాత్॥.. .. ... ...౬౭

చతురంగబలంబులయందును ముఖ్యంబగునదియేనుంగులగు టంజేసి యట్టియేనుంగులగములుగల విజిగీషుండు సకల శత్రు సైన్యంబులంజయించి సకల రాజ్యంబులను - నేలునని ఫలి తార్థము... .. .. .. ... ౬౮

ఇతికామందకాఖ్యే నీతిసారే రాజనీతి సంగ్రహోనామ

సర్వమపివింశ్సర్గస్సమాప్తః.



ఇట్లు కామందకమిర్వది సర్గంబులునుముగిసెను.

సర్వేషాంశుభంభవతు.

